# ఉపోద్ఘాతము.

"ఉపనిషత్తు" అనునది వేదాంతము, వేదసారము, బ్రహ్మవిద్య, అని పెక్కునామములతో వ్యవహరింపఁబడును. ఇయ్యది శ్రీమన్నారాయణాంశసంభూతుఁడగు వేదవ్యాసమహామునిచే ఋగ్యజుస్సామాథర్వములను నాల్గువేదములందుఁగల జ్ఞానకాండమును ఉపనిషత్తులనుపేరితోఁ బ్రత్యేకముగా విభజింపఁబడియె. ఈయుపనిషత్తులు నూటయెనిమిది యని వ్యవహరింపఁబడుచున్నప్పటికిని,యింకను పెక్కు ఉపనిషత్తులు ప్రచారమునందున్నవి.

పైనిచెప్పిన నూటయెనిమిది యుపనిషత్తులలో మిక్కిలి ప్రసిద్ధములైనవి దశోపనిషత్తులు—అవి వరుసగా 1. ఈశ, 2. కేన, 3. కఠ, 4. ప్రశ్న, 5. ముండక, 6. మాండూక్య, 7. తైత్తిరీయ, 8. ఐతరేయ, 9. ఛాందోగ్య, 10. బృహదారణ్యకము అనునవి.

ప్రస్థానత్రయ మనఁబడు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు అనునీమూఁటికిని భాష్యములను రచియించిన శ్రీమదాదిశంకరాచార్యస్వాములవారు "శ్వేతాశ్వతరోపనిషత్తు, నృసింహతాపిన్యుపనిషత్తు" అనునీరెంటికిని భాష్యమును రచియించియున్నారు.

కావున, మేము ప్రకృతకాలానుసారము ననుసరించి సకలజనులకును వేదాంతవిద్యయం దభిరుచి కలుగఁజేయవలయు ననుతలంపుతో శ్రీమచ్ఛంకరాచార్యస్వాములవారి భాష్యమునకు విరోధములేక సులువుగా బోధకమగువిధమున మాతండ్రిగారిచేఁ దెనుఁగువచనరచన కావింపఁబడ్డదానిని ప్రకటించితిమి. ఇటీవల బ్రహ్మసూత్రార్థచంద్రికను ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ ఉపనిషత్తులు తెనుగుటీకాతాత్పర్యముతో ప్రచురించితిమి. బృహదారణ్యఛాందోగ్యోపనిషత్తులు అచ్చగుచున్నవి.

కంపేయార్పేట, చెన్నపురి.

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# ఉపనిషద్వివరణము.

| క్రమ సంఖ్య. | ఉపనిషత్తుల పేర్లు | ఏ వేదమునకు సంబంధించినది. | శాంతిమంత్రాని. |
|---|---|---|---|
| 1 | ఈశావాస్యోపనిషత్తు | శుక్లయజుర్వేదము | పూర్ణమదఇతి |
| 2 | కేనోపనిషత్తు | సామవేదము | ఆప్యాయన్త్వితి |
| 3 | కఠోపనిషత్తు | కృష్ణయజుర్వేదము | సహనావవత్వితి |
| 4 | ప్రశ్నోపనిషత్తు | అధర్వవేదము | భద్రంకర్ణేభిరితి |
| 5 | ముండకోపనిషత్తు | ,, | ,, |
| 6 | మాండూక్యోపనిషత్తు | ,, | ,, |
| 7 | తైత్తిరీయోపనిషత్తు | కృష్ణయజుర్వేదము | సహనావవత్వితి |
| 8 | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము | వాఙ్మేమనసీతి |
| 9 | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము | ఆప్యాయన్త్వితి |
| 10 | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదము | పూర్ణమదఇతి |
| 11 | శ్వేతాశ్వతరోపనిషత్తు | కృష్ణయజుర్వేదము | సహనావవత్వితి |
| 12 | నృసింహతాపిన్యుప,, | అధర్వవేదము | భద్రంకర్ణేభిరితి |

యజుర్వేదముమాత్రము శుక్లయజుస్సనియు, కృష్ణయజుస్సనియు రెండు విధములు. ఈ శుక్లయజుస్సునకు కాణ్వశాఖ యనియు, వాజసనేయశాఖ యనియుఁ బేర్లు కలవు.

ఈశావాస్యోపనిషత్తునకు ఈశోపనిషత్తనియు, సంహితోపనిషత్తనియు, వాజసనేయసంహితోపనిషత్తనియుఁ బేర్లు కలవు.

కేనోపనిషత్తునకు తలవకారోపనిషత్తని పేరుకలదు.

బృహదారణ్యకోపనిషత్తునకు బ్రాహ్మణోపనిషత్తని పేరుకలదు.

అష్టోత్తరశతోపనిషత్తు లనఁబడు 108ఉపనిషత్తులలో శ్వేతాశ్వతరోపనిషత్తు 14 వదిగను, నృసింహతాపిన్యుపనిషత్తు 27 వదిగను నున్నది.

కృష్ణయజుర్వేదమునందు 3 వ సంఖ్యగల కఠోపనిషత్తు ఒకటియు, ఆవేదమునందే 83 వ సంఖ్యగల కఠోపనిషత్తు వేఱొకటియుఁ గలదు. అయినను, మూఁడవసంఖ్యగలదియే దశోపనిషత్తులలోఁ జేరినదని తెలియఁదగినది.

ఇంతియగాక, ఉపనిషత్తులను ఉపక్రమించునపుడును ఉపసంహరించునపుడును, మంగళార్థమై (గురుశిష్యుల క్షేమార్థమై) ఆయావేదములకుఁ దగిన శాంతిమంత్రములుగలవు. ఇయ్యవి, కేవలాంధ్రభాషగా నుండినను, శాంతిమంత్రముతో దానిభాషాంతరీకరణ మత్యావశ్యకమని భావించి, యట్లొనర్చితిని. మఱియు నొక్కొక్క వేదమునకును శాంతిమంత్రములు వేర్వేఱుండఁగా, తైత్తిరీయోపనిషత్తునకుమాత్రము, దాని ప్రథమానువాకమే, శాంతిమంత్రమని కొందఱందురు. ఈ ప్రథమానువాకమును ఉత్తరశాంతియని మఱికొందఱు చెప్పెదరు.

ఈ "ద్వాదశోపనిషత్తులు" చతుర్వేదములందును జేరినవిగా నుండుటంబట్టి, ఇందు వ్రాయఁబడిన శాంతిమంత్రములును (వాని భాషాంతరీకరణమును) సకలోపనిషత్తులకును బ్రయోజనకారులగును.

---

# శాంతిమంత్రములు.

## 1. ఋగ్వేదాంతర్గతమైన ఉపనిషత్తులయొక్క శాంతిమంత్రము.

ఓమ్, వాఙ్మేమనసి ప్రతిష్ఠితా, మనో మే వాచి ప్రతిష్ఠితం, ఆవిరావీర్మ ఏధి, వేదస్య మ ఆణీస్థః, శ్రుతం మే మా ప్రహాసీః, అనేనాధీతేనాహోరాత్రాన్ సందధామి, ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి, తన్మామవతు, తద్వక్తారమవతు, అవతుమాం, అవతువక్తారం అవతువక్తారమ్,

ఓమ్. శాన్తిః శాన్తిః శాన్తిః, హరిః ఓమ్.

తా. నాయొక్క (ఈయుపనిషదధ్యయనమునందు ప్రవర్తించిన) వాక్కు నిరంతరము మనస్సునందు స్థిరమగునుగాక. నామనస్సు వాక్కునందు నిలకొని యున్నది (వాక్కును మనస్సును పరస్పరము సహాయముగ నుండునుగాక యని ప్రార్థన) ఓ జ్యోతిస్స్వరూపమైన పరమాత్మా! నాయజ్ఞత్వమును పోఁగొట్టి ప్రకాశము కలుగునట్లనుగ్రహింపుము. ఓ మనోవాక్కులారా! నాకు వేదము నుపాహరింపఁజాలు

గ్రంథము నొసంగుటకు సమర్థులగుదురుగాక. నాచే వినఁబడిన గ్రంథమును దాని యర్థమును మఱపునబడకుండునుగాక. అధ్యయనముచేసి మఱపక యుండు గ్రంథమును నేను రేయింబగలును అనుసంధానము చేయుదునుగాక. (అధ్యయనము చేయఁబడిన గ్రంథమునందు) యథార్థవస్తువును (పరమాత్మను) అనుభవించెదను. నీవే సత్యము. (మనస్సుచే వాస్తవపదార్థమును విచారించి వాక్కుచేత సత్యమును జెప్పెదను.) మీఁదఁ జెప్పిన బ్రహ్మము నన్నును నాగురువును రక్షించునుగాక.

ఈశాంతిమంత్రము ఇందలి ఐతరేయోపనిషత్తు గ్రంథప్రారంభమునందును గ్రంథాంతమునందును పఠించునది.

2. ౧ శుక్లయజుర్వేదాంతర్గతమైన ఉపనిషత్తులయొక్క శాంతి మంత్రము.

ఓమ్, పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవావశిష్యతే.

ఓమ్. శాన్తిః శాన్తిః శాన్తిః, హరిః ఓమ్.

తా. ఓమ్, అది (బ్రహ్మము) పూర్ణము (ఆకాశమువలె సర్వత్ర వ్యాపించినది) ఇదియును (ఉపాధులతోఁ గూడినదియును, వ్యవహారములకు లోఁబడినదియును, కార్యాత్మకమై యుండునదియును అగు జీవాత్మయు) పూర్ణము. ఆపూర్ణవస్తువునుండి యీపూర్ణవస్తువు కలిగినది. ఈపూర్ణవస్తువు (జీవుఁడు) విద్యచేత పూర్వత్వమును గ్రహించినయెడల పూర్ణమైన పరమాత్మగా శేషించును. (అనఁగా పరమార్థరూపవస్తువు నుండి వేఱువస్తువువలె కనఁబడు జీవుని, అపూర్ణమైనపరబ్రహ్మమని తెలిసికొని, అవిద్యచేఁ గలిగిననామరూపాదులను నివర్తిచేసి, "నేనే బ్రహ్మము" అని తెలిసికొనినచో అప్పుడు తానే బ్రహ్మమగుచున్నాఁడు.)

ఈశాంతిమంత్రము "ఈశావాస్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు" అను వీనిని ప్రారంభించునపుడును, ముగించునపుడును పఠింపవలయును.

2. ౨ కృష్ణయజుర్వేదాంతర్గతమైన ఉపనిషత్తులయొక్క శాంతి మంత్రము.

ఓమ్, సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై,
తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై.

ఓమ్. శాన్తిః శాన్తిః శాన్తిః, హరిః ఓమ్.

తా. మమ్ము (గురుశిష్యులను) రక్షించుగాక. (పరమాత్మ) మాకు పోషణము కలుగఁజేయుఁగాక. మాకు విద్యావిషయమునందు సామర్థ్యము కలుగుఁగాక. తేజస్సుగల మాకు బ్రహ్మవిద్య తెలియఁబడినదగుగాక. మాలో పరస్పరము ద్వేషము లేకుండుఁగాక.

ఈశాంతిమంత్రమును "కఠోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు, శ్వేతాశ్వతరోపనిషత్తు" అనువీని ప్రారంభమునందును, పఠనానంతర మునందును పఠింపవలయును.

3. సామవేదాంతర్గతమైన ఉపనిషత్తులయొక్క శాంతిమంత్రము.

ఓమ్, ఆప్యాయన్తు మమాఙ్గాని, వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమిన్ద్రియాణి చ సర్వాణి, సర్వం బ్రహ్మోపనిషదం, మాహం బ్రహ్మనిరాకుర్యాం, మామా బ్రహ్మనిరాకరోత్, అనిరాకరణమస్త్వనిరాకరణం మే అస్తు తదాత్మనిరతే, య ఉపనిషత్సు ధర్మాస్తే మయిసన్తు తే మయిసన్తు.

ఓమ్. శాన్తిః శాన్తిః శాన్తిః, హరిః ఓమ్.

తా. ఉపనిషత్తుచే ప్రతిపాదింపఁబడిన బ్రహ్మము నాయొక్క అంగములు, వాక్కు, నేత్రము, ప్రాణము, కర్ణము, బలము, ఇంద్రియములు మొదలగువానిని తృప్తిపఱచునుగాక. బ్రహ్మము నన్ను నిరాదరణ చేయకుండును గాక. నేను బ్రహ్మమును నిరాదరణచేయక యుండునట్లను గ్రహించునుగాక. నావిషయమునందు ఆదరము కలుగునుగాక. ఆత్మ నెఱింగినమీఁద ఉపనిషత్తులలో చెప్పఁబడినధర్మములు నాయందు నెలకొని యుండునుగాక.

ఈమంత్రమును "కేనోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు" అను వీనిని ప్రారంభించునపుడును, ముగించునపుడును పఠింపవలయును.

4. అథర్వవేదాంతర్గతమైన ఉపనిషత్తులయొక్క శాంతిమంత్రము.

ఓమ్, భద్రంకర్ణేభిశ్శృణుయామదేవాః, భద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః, స్థిరైరఙ్గైస్తుష్టువాగ్ంసస్తనూభిః, వ్యశేమదేవహితం యదాయుః, స్వస్తినఇన్ద్రోవృద్ధశ్రవాః, స్వస్తినఃపూషా విశ్వవేదాః, స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః, స్వస్తినో బృహస్పతిర్దధాతు.

ఓమ్. శాన్తిః శాన్తిః శాన్తిః, హరిః ఓమ్.

తా. మనము దేవతలుగా (ప్రకాశముగలవారుగా) నుండి మంగళమును చెవులతో వినుదుముగాక. యజనశీలురమై యుండి కళ్యాణమును కనులతోఁ జూతుముగాక. అంగములతోఁగూడిన మన్త్రములచేత దేవతలను స్తుతించి (సకలసుఖములను) పొందు

దుముగాక. ఈ యుపనిషత్తునందు ప్రస్తావింపఁబడువస్తువును (దేవతను) స్తోత్రము చేయుటకుఁ దగినఆయుస్సును పొందుదుముగాక.

బృహస్పతియొద్దనుండి గ్రహించినఇంద్రుఁడు మనకు స్వస్తిని (నాశములేనిఆయువును) అనుగ్రహించునుగాక. సకలదేవతాస్వరూపి యగుసూర్యుఁడు మనకు స్వస్తిని (ఉపాసనయందలిప్రధానమును) అను గ్రహించునుగాక. వజ్రాయుధముచేఁ గొట్టఁబడని గరుత్మంతుఁడు మనకు స్వస్తిని (పూజించుటయందు యోగ్యతను) ప్రసాదించునుగాక. బృహస్పతి భగవంతుఁడు మనకు స్వస్తిని (శుభమును) ఇచ్చునుగాక.

"ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః"

అని ముమ్మారుపఠించుట ఉపనిషదనుష్ఠానమునందు (బ్రహ్మానుష్ఠానము యందు) విఘ్నములుగలుగకయుండునిమిత్తమని తెలియునది.

ఈమంత్రమును "ప్రశ్నోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు, నృసింహతాపిన్యుపనిషత్తు" అను వీనిని పఠించుటకుప్రారంభించునపుడును, పఠనానంతరమునందును పారాయణముచేయఁదగును.

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు.

హరిః ఓమ్.

# ద్వాదశోపనిషత్తులు

## 1. ఈశావాస్యోపనిషత్తు.

ఓం పూర్ణమద ఇతిశాంతిః.

1. ఈ ప్రపంచమునందు ఏయేవస్తువులున్నవో ఆవస్తువులన్నియు పరమాత్మచే నావరింపఁబడియున్నవి. (అనఁగా ఒక్కొక్కదానియందును అతఁడున్నాఁడు. అతఁడు లేనిది యేదియు లేదు.) దానిని (ఆ ప్రపంచోపాధిని) త్యజించి ఆతనిని మాత్రము భజింపుము. అట్లు త్యజించిన నీవు ఇతరులయొక్క ధనమునందు (నీదిగానున్నను పరులదిగానున్నను) అపేక్ష నుంపకుము.

2. (ఆత్మజ్ఞానము లేనివాఁడు) ఇచ్చట నూఱేండ్లు (ఆయుష్కాలమంతయు) విహితకర్మము లాచరించుచు జీవించియుండుటను ఇచ్ఛయించియుండునుగాక. నరుఁడవగు నీకు ఈకర్మానుష్ఠానము కంటెను నిన్ను దుష్కర్మము ఆశ్రయింపకయుండునట్లు చేయఁదగినమార్గము వేఱొద్దియును లేదు.

3. ఆత్మజ్ఞానము లేనిజనులు అజ్ఞానాంధకారముచే నావరింపఁబడియున్నారు. ఎవరు ఆత్మహత్యచేయువారో (ఆత్మను మఱచిపోవుదురో) వారు (శరీరమును విడిచి) స్థావరమువఱకుఁగల ఇతరశరీరములను పొంది (సంసారమునందు) ప్రవేశించెదరు.

4. (బ్రహ్మాత్మతత్త్వ మెట్టిదనఁగా) చలింపనిది (ఏకరూపమైనది, వికారము లేనిది). ఒక్కటైనది మనస్సుకంటెను అధికమైనవేగము గలది. (ఒకవిషయమునందు మనస్సు ప్రవేశించుటకుముందు ఆత్మతత్త్వము ముందుగా పరుగిడుచున్నది.) దీనిని ఇంద్రియములు పొందుటలేదు. (ఇంద్రియముల చేత తెలిసికొనఁబడునది కాదు) అనాదిగానుండునది. (ఆకాశమువలె ఎప్పుడును ఎచ్చోటను వ్యాపించియున్నది) అతి శీఘ్రముగాఁ బోదగిన

యింద్రియాదులను దాఁటుకొని ముందుగా పోవునట్టిదిగానున్నది. తాను మాఱుబాటొందకయున్నది. దానిసన్నిధియందు వాయువులు కర్మములను చేయుచున్నవి (దానివలన ప్రాణాదివాయువులు తమతమకార్యములను చేయుచున్నవి).

5. అది చలించుచున్నది, చలింపకయునున్నది. అది (ఆత్మజ్ఞానము లేనివారికి) దూరముగను (జ్ఞానముగలవారికి) సమీపముగను నున్నది. అది ఈసకలప్రపంచములలోపలను వెలుపలను నున్నది.

6. ఎవఁడు ఆత్మయందు సకలభూతములను, సకలభూతములయందు ఆత్మను జూచునో వాఁడు జుగుప్స నొందుటలేదు. (జుగుప్స, దయ, మొదలగుపాశములు వీని నంటుటలేదు.)

7. ఆత్మజ్ఞానికి ఏకాలమునందు సమస్తభూతములును తానని తోఁచునో, అప్పుడు ఏకమనిచూచెడునతనికి ఆశయును శోకమును లేదు.

8. ఆయాత్మ ఎచ్చోటను వ్యాపించియుండునది. తేజస్సుగలది. శరీరము (సూక్ష్మశరీరము) లేనిది. వ్రణము లేనిది. స్నాయువు (స్థూలశరీరము) లేనిది. శుద్ధమైనది. పుణ్యముతోపూర్ణమైనది. కవి. (మనోహరమైన దృష్టికలది.) బుద్ధిగలది. (మనస్సును ఆజ్ఞయం దుంచియుండునది.) అన్నిటికంటెను శ్రేష్ఠమైనది. స్వయముగాఁగలిగినది. నిత్యులైన ప్రజాపతులకొఱకు ఆయాభూతముల కర్మఫలములకుఁ దగినట్లు చేయవలసిన అర్థములను నియమించునది.

9. ఎవరు అవిద్యను (కర్మను) ఉపాసించెదరో వారు ఘోరమైన అజ్ఞానమునందు ప్రవేశించెదరు. ఎవరు విద్యయందు (దేవతాజ్ఞానము నందు) ప్రేమగల్లవారో, వారు అధికమయినతమస్సునందు ప్రవేశించెదరు. (ఇందువలన కేవలము కర్మానుష్ఠానమునుగాని,కర్మనుసంపూర్ణముగా త్యజించి కేవలము దేవతాజ్ఞానమునుగాని అవలంబింపరాదనితాత్పర్యము).

10. ఏమహాత్ములు మనకు (కర్మమును జ్ఞానమునుగూర్చి) విస్తరముగాఁ జెప్పియున్నారో, వారియొక్క (వాక్కులనెడి) "విద్యచేత (లభ్యమైనఫలము) వేఱనియును అవిద్యచేత (లభ్యమైనఫలము) వేఱనియును" మనము వినియున్నాము.

11. ఎవఁడు విద్య, అవిద్య, అనునీరెంటినిఁగూర్చి తెలిసికొనుచున్నాఁడో (అనుష్ఠించుచున్నాఁడో) వాఁడు అవిద్యవలన మృత్యువును

(జ్ఞానము, కర్మము అనునీరెంటిని) దాఁటి విద్యవలన అమృతత్వమును (దేవతాత్మ భావమును) పొందుచున్నాఁడు.

12. ఎవరు అసంభూతిని(అవ్యాకృతమనెడి ప్రకృతిని కార్యముకాని రూపమొందనిమూలప్రకృతిని)ఉపాసించెదరో, వారుఅంధతమస్సు(అజ్ఞానము)నందు ప్రవేశింతురు. ఎవరు సంభూతిని (బ్రహ్మమొదలగు కార్యబ్రహ్మమునందు) ప్రేమలేనివారై యుందురో, వారు, వారు మిక్కిలియు చీకటియందు ప్రవేశింతురు. (ఇందువలన, కేవలముప్రకృతినిగాని, కేవలముకార్యబ్రహ్మమునుగాని ఉపాసింపఁగూడదని తెలియఁదగినది.)

13. విజ్ఞానులు మనకు (ప్రకృతినిగూర్చియు, కార్యబ్రహ్మమును గూర్చియు) విస్తరముగాఁ జెప్పుచున్నారో,వారియొక్క (వచనమైన)సంభూతిచేత (పొందఁదగినఫలము) వేఱనియును, అసంభూతిచేత(పొందఁదగినఫలము) వేఱనియును మనము వినియున్నాము.

14. ఎవఁడు సంభూతి,అసంభూతి అనునీరెంటియొక్క ప్రయోజనమిట్టిదని తెలిసికొనుచున్నాఁడో, వాఁడు వినాశము (అసంభూతి) చేత మృత్యువును (అధర్మము, కామాదిదోషములు అనువీనివలనఁ గలిగినదానిని)దాఁటిసంభూతిచేత(అణిమాద్యైశ్వర్యఫలమును)పొందుచున్నాఁడు.

15. (అమృతత్వమునుపొందుటకు మార్గమేదనఁగా సూర్యప్రార్థనము) హేపూషన్! (సూర్యుఁడా!) జ్యోతిర్మయమైనమఱుఁగుచేత బ్రహ్మముయొక్కముఖము (అచ్చోటికిబోయెడిమార్గము) మూయఁబడియున్నది. కాఁబట్టి,దానిని, నీవు, సత్యధర్ముఁడనగు నేను చూచునిమిత్తమై (పొందుటకొఱకు) తెఱవ (తీయ) వలయును.

16. హేపూషా! (పోషించువాఁడా!) ఏకర్షీ! యముఁడా! (సర్వమును తనయందులయింపఁజేసికొనువాఁడా!)సూర్యుఁడా! (ప్రాణములను రసములను గ్రహించుకొనువాఁడా!) ప్రాజాపత్యా! (బ్రహ్మముయొక్క పుత్త్రుఁడా!) నీయొక్క కిరణములను (నాయందుండి) మఱల్చుకొనుము. (గ్రహింపుము.) నీయొక్కమహాజ్యోతిర్మయమైన మంగళస్వరూపమునుజూచుచున్నాఁడను. ఆపురుషుఁడే (సూర్యమండలాంతర్గతుఁడగు బ్రహ్మము) నేను.

17. (మృతిఁజెందెడినాయొక్క) ప్రాణము, అనిలమగు అమృతత్వమును (సర్వాత్మకమగుసూత్రాత్మను) పొందునుగాక. తర్వాత, ఈ శరి

రము భస్మమగునుగాక. హే క్రతూ! (జీవాత్మ=సంకల్పాత్మ) ఓం పరమాత్మను స్మరింపుము.(అనఁగా ప్రణవజపము చేయుము.) (ఇంతవరకు చేయఁబడియుండు) కర్మమును స్మరింపుము. హే క్రతూ! ఓంకారమును, కర్మమును స్మరింపుము.

18. హే అగ్నీ! (పరమాత్మా!) హే దేవా! సర్వ [illegible]ములను, ప్రజ్ఞానములను ఎఱిఁగిన వాఁడవు. మమ్ము కర్మఫలభోగమునకు [illegible] సన్మార్గమునందు ప్రవేశింపఁజేయుము. [illegible] మా యొక్క [illegible] పాపములను నాశము చేయుము. నీకు మేము అనేకనమస్కారములను లొనర్చెదము.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

ఓం పూర్ణమదః ఇతి శాన్తిః.

ఈశావాస్యోపనిషత్ సమాప్తము.

---

# 2. కేనోపనిషత్తు

ఆప్యాయన్త్వితి శాన్తిః.

1. ఖండము.

1. ఎవరిచేతఁ గోరఁబడి, ప్రేరింపఁబడినదై మనస్సు (స్వవిషయమునందు) పడుచున్నది (ప్రవేశించుచున్నది?) ప్రాణము, మొదట నెవరిచేత ప్రేరింపఁబడి (తనవ్యాపారమును చేయుటకు) పోవుచున్నది (ప్రవేశించుచున్నది.) ఎవరిచే చెప్పఁబడిన వాక్కును (లోకమందుగలవారు) చెప్పుచున్నారు? ఏ దేవుఁడు కనులను చెవులను (వానివానిపనులను) చేయునట్లు ప్రేరించుచున్నాఁడు.

2. (ఏది నీచేత ప్రశ్నింపఁబడినదో) అది చెవికి చెవిగను (చెవికి వినునట్టి శక్తిని ఇచ్చునట్టిదిగను), మనస్సునకు మనస్సుగను (మనస్సునకు జ్ఞాపకశక్తిని ఇచ్చునట్టిదిగను), వాక్కునకు వాక్కుగను (మాటలాడుశక్తిని ఇచ్చునదిగను), ప్రాణమునకు ప్రాణముగను (వ్యాపారశక్తిని ఇచ్చునదిగను), నేత్రమునకు నేత్రముగను (చూచునట్టిశక్తిని ఇచ్చునదిగను) ఉండుటవలన, (దానిని తెలిసికొని [illegible] ఆత్మభావనను [illegible]) త్యజించినబుద్ధిమంతులు, (ఈ శరీరమును విడిచి) అమృతత్వమును పొందుచున్నారు.

3. ఆబ్రహ్మము నొద్దకు కన్నుపోదు (కనులకుఁ దెలియదు), వాక్కుపోదు (వాక్కునకందదు) మనస్సుపోదు (మనస్సు తెలిసికొనదు),అది (ఇట్టిదని) మనకుఁదెలియదు. దానిని ఏరీతిగాఁ (శిష్యునకు), దెలియఁజేయవచ్చునో తెలియలేదు. (అనఁగాఁ గనఁబడువస్తువు లన్నియు వికారములు. అది కనఁబడుచుండెడి వికారమైన ప్రపంచముకాదు. అది ప్రత్యేకమైనది) (తెలియఁబడినది అవ్యాకృతమైనమాయ; దానికి వేఱైనది. అదే బ్రహ్మము) మనకంటెపూర్వులగు దృష్ట విజ్ఞానులు మనకొఱకు ఇట్టివచనములను చక్కఁగాఁజెప్పియున్నారో, వారి(ఇట్టి)వచనములను వినుచున్నాము. (అనఁగా బ్రహ్మము గోచరముకానివస్తువు. అది వేదము, గురువు, ఉపదేశము అను వీనికిమాత్రము గోచరమైనది. అనఁగా వీనిచేతనే యెఱుఁగఁదగును).

4. ఏది వాక్కుచేత చెప్పుటకు సాధ్యముకానిదో, దేనిచేత వాక్కు ప్రకాశింపఁజేయఁబడుచున్నదో(మాటలాడుశక్తినిపొందుచున్నదో), అదే బ్రహ్మమని యెఱుంగుము. ఏది, ఇది అనినిర్దేశించి జనులు ఉపాసించెదరో అది బ్రహ్మముకాదు. (అనఁగా, ఉపాధితోఁగూడిన సగుణమూర్తులను అనాత్మవస్తువులను బ్రహ్మమనఁదగదు).

5. ఏది మనస్సుచే నెఱుంగుటకు సాధ్యము కానిదో, దేనిచేత మనస్సు ఎఱుంగఁబడుచున్నదో (విషయీకరింపఁబడుచున్నదో) అదే బ్రహ్మమని యెఱుంగుము. తక్కినది బ్రహ్మముకాదు.

6. ఏది నేత్రముతోఁ జూచుటకుఁగాదో, దేనిచేత నేత్రము చూడఁబడుచున్నదో, (విషయీకరింపఁబడుచున్నదో) అదే బ్రహ్మము. ఇతరము బ్రహ్మముకాదు.

7. ఏది చెవిచే వినబడదో, దేనిచేత చెవి వినఁబడుచున్నదో (విషయీకరింపఁబడుచున్నదో) అదే బ్రహ్మమని తెలిసికొనుము. తక్కినది బ్రహ్మము కాదు.

8. ఏదిఘ్రాణము (ముక్కు)చేత మూర్కొనుటకు (తెలిసికొనుటకు) సాధ్యముకానిదో, దేనిచేత ఘ్రాణము మూర్కొనఁబడుచున్నదో (విషయీకరింపఁబడుచున్నదో) అది బ్రహ్మమనియెఱుంగుము. తక్కినది బ్రహ్మముకాదు.

ఈమంత్రమునందు ప్రాణము అని మూలమునందున్నది, అయి నను శ్రీశంకరాచార్యులు భాష్యమునందు ఘ్రాణము అని అర్థముచేసి యున్నారు.

2. ఖండము.

9. (నీవు) బ్రహ్మమును చక్కఁగాఁ దెలిసికొంటి ననితలంతువేని, (నీవు) ఈబ్రహ్మస్వరూపమును మిక్కిలి అల్పముగా తలంచియున్నా వను టయందుమాత్రము సందేహము లేదు. (అనఁగా మనుష్యశరీరమునందు దహరాకాశమునందు అధ్యాత్మోపాధిపరిచ్ఛిన్నమై యుండు ఆత్మనుమాత్రము నీవు తెలిసికొని యుందువు.) ఏబ్రహ్మము దేవతలయం దున్నదో, దానిని నీవు తెలిసికొనియున్నావనుటయందు సంశయము లేదు (అనఁగా అధి దేవతోపాధిపరిచ్ఛిన్నమై యుండుఆత్మనుమాత్రము నీవెఱింగియుం దువు). (ఇట్లనుటవలన సర్వోపాధిరహితమైయుండుఅద్వైతబ్రహ్మమును ఇంకను నీవు తెలిసికొనలేదు.) కాఁబట్టి, నీవు తెలిసికొన్నట్లు చెప్పఁబడెడి బ్రహ్మమునుగూర్చి యింకను విచారింపవలసినదిగానున్నది. (అని గురుపు చెప్పెను.) (అనఁగా బ్రహ్మమును తెలిసికొంటిననిచెప్పుట తగదు. నీవువేఱ నియును, తెలియఁబడువస్తువు వేఱనియును ఏర్పడుచున్నది. సర్వమును ఒక్కటే అనుజ్ఞానమును కలుగవలయును.)

10. శిష్యుఁ డిట్లనుచున్నాఁడు:-- బ్రహ్మమును చక్కఁగా నెఱింగితి నని నేను తలంపలేదు. నేను తెలిసికొనలేదనియును తలంపను. తెలిసి కొంటిననుటయుగాదు. మాలోపల (బ్రహ్మచారులలోపల) ఎవఁడు దానిని "నోనవేదేతి వేదచ" అని నాచేత చెప్పఁబడినదానిని ఎఱుంగునో వాఁడు బ్రహ్మమును ఎఱుంగుచున్నాఁడు.

ఇట్లు గురుశిష్యులు వాదింపఁగా శ్రుతి బోధించున దేమనఁగా:—

11. ఎవనికి బ్రహ్మము ఎఱుంగఁబడలేదో వానికి (అది తెలియఁ బడని వస్తువనెడి తలంపుగలవానికి) అది యెఱుంగఁబడినది. ఎవనికి తెలియఁ బడినదో (నేను బ్రహ్మమును ఎఱింగితి నని తలంచువానికి) వాఁడు ఆ బ్రహ్మము నెఱింగినవాఁడు కాఁడు. బ్రహ్మము, తెలిసికొన్నవారికి తెలియఁ బడనిది. తెలిసికొననివాఁడు బ్రహ్మము నెఱింగినవాఁడు. (అనఁగా బ్రహ్మ మును తెలిసికొన్నవారు, ఇంద్రియములకు గోచరముకాని అఖండ స్వరూపమనియును, తెలియనివారు ఇంద్రియములకు గోచరమైయుండు

ఖండస్వరూపమనియును తలంచెదరు. ఇచ్చట తెలియనివారనఁగా మూఢులని యర్థముకాదు. కొంచెము జ్ఞానముగలవారని యభిప్రాయము.

12. బ్రహ్మము ఒక్కొక్క బోధమునందును తెలియఁబడునట్టి వస్తువని తెలియవలయును (బోధమనఁగా, విశ్వాసము. దేనిని బ్రహ్మమనెడి విశ్వాసముతోఁ జూచుచున్నాఁడో, అది ఆప్రకారముగానే తోఁచును. ఏలన, ఆ బ్రహ్మము సర్వవ్యాపియై విశ్వాసముగలవారికి తెలియఁబడువస్తువై యున్నది.)

దీనిచేత లాభమేమి? మోక్షలాభమే. ఆత్మచేత (స్వస్వరూపముచే) మోక్షమును పొందఁదగిన సామర్థ్యమును పొందుచున్నాఁడు. (ఆత్మవిషయమైన) విద్యచేత మోక్షమును బొందుచున్నాఁడు.

13. (ఒకఁడు ఈమనుష్యజన్మమునందు) ఇచ్చట బ్రహ్మమును పైని చెప్పినట్లు తెలిసికొన్నయెడల (వానికి) సత్యము (అవినాశము, సద్భావము) కలదు. తెలియనియెడల మహానష్టము (కలుగును.) బుద్ధిమంతులు ఒక్కొకభూతమునందును బ్రహ్మమును దెలిసికొని ఈలోకమునుండి పోయి అమృతత్వమును పొందెదరు.

## 3. ఖండము.

14. బ్రహ్మమే దేవతలకొఱకు (దేవాసురయుద్ధమునందు) జయమును బడసెను. ఆ బ్రహ్మముయొక్క జయవిషయమునందు దేవతలు అహంకరించి, ఈ జయము మాది, ఈ ప్రభావము మాయది, అని గ్రహించిరి (తలంచిరి.)

15. వీరి అహంభావమును బ్రహ్మము తెలిసికొని, వారికొఱకు (యక్షరూపమును దాల్చి) ప్రత్యక్షమాయెను. కాని, దేవత లాయక్షరూపమును కనుగొనరైరి. ఇది యక్షమా? ఏమి? (అని సంశయచిత్తులైరి.)

16 అప్పుడా దేవతలు అగ్నినిఁ జూచి, "ఓజాతవేదా! ఈ యక్షమెట్టిదో తెలిసికొనుము." అగ్ని - "అట్లే తెలిసికొనెద" అనిచెప్పెను. (పిమ్మట అగ్నిదేవుఁడు)

17. యక్షమును సమీపించెను, యక్షము-"నీ వెవఁడవు!" అనఁగా అగ్ని-"నేను అగ్నియనువాఁడను మఱియు జాతవేదుఁడను."

18. యక్షము అగ్నినిజూచి-"నీకు ఎట్టిసామర్థ్యముకలదు?

చెప్పుము." అగ్ని-"భూమియందుఁగల సమస్తమును భస్మము చేయు దును" అనెను.

19. యక్షము-"దీనిని కాల్చివేయుము" అని ఒకతృణమును అగ్ని యెదుట వైచెను. అగ్నితనశక్తినంతయును వినియోగించి, ఆతృణమును దహించుటకు ప్రయత్నించెను. దహింపసాధ్యము గాక, దేవతలయొద్దకుఁ బోయి, "ఆయక్షము ఇట్టిదని తెలిసికొనుటకు నాకు సాధ్యము కాకున్నది" అనెను.

20. పిమ్మట, ఆదేవతలు వాయువునుజూచి-"నీవుపోయి ఆ యక్ష మును కనుఁగొనిరమ్ము" అనిరి.

21. వాయువు యక్షునికడ కేఁగెను. యక్షము వాయువునుజూచి. "నీవెవఁడవు?" అనఁగా వాయువు-"నేను వాయుదేవుఁడను. ప్రపంచము లోని సర్వమును ఎగురఁగొట్టుశక్తికలవాఁడను" అనఁగా యక్షుఁడుఇట్లనియె.

22. ఓవాయుదేవుఁడా! నీవు "నీయెదుటనుండు తృణమును నీశక్తి చేత కదిలింపుము" అని చెప్పెను.

23. అంత, వాయుదేవుఁడు తనశక్తినంతయును వినియోగించి, తృణ మును కదలించెను. అదియెంతయును కదలనందున, మరలివచ్చి దేవతలను జూచి-"నాశక్తి ప్రయోజనపడలేదు, ఆభూతమిట్టిదని తెలిసికొనుటకు నాకు సామర్థ్యము లేదు" అనెను.

24. తర్వాత, దేవతలు ఇంద్రునిఁజూచి-"ఓమఘవానుఁడా! ఆయ క్షము నిట్టిదని తెలిసికొనుము" అనఁగా, ఇంద్రుఁడాయక్షము కడకుఁ బోయెను. వెంటనే ఆయక్షము అదృశ్యమైపోయెను.

25. (ఆయక్షము ఆకాశమునందు మఱుఁగిపోయెను.) ఇంద్రుఁడు ఆకాశమునందు మహాకాంతితోఁగూడినదియును, ఉమ అను పేరుగలది యును, హిమవంతుని పుత్త్రికయును, స్త్రీరూపధారిణియును అగు దేవినిఁ జూచి, ఆమెయొద్దకుఁబోయి, "ఆయక్షముయొక్క స్వరూపమేది?" అని యడిగెను.

26. (ఉమ ఇంద్రునకిట్లనియె) అది బ్రహ్మము. ఆబ్రహ్మముయొక్క జయమువలననే మీరు మహిమను పొందియున్నారు. అని చెప్పఁగా, ఇంద్రుఁడు దానిని బ్రహ్మమని తెలిసికొనెను.

27. దేనిచేత అగ్ని, వాయువు, ఇంద్రుఁడు, అనువీరు సమీపమందున్న బ్రహ్మమును సంపాదించిరో, ప్రధానదేవతలుగా దానిని బ్రహ్మమని తెలిసికొనిరో, ఆకారణముచేత, ఈ మువ్వురుదేవతలును ఇతరదేవతల కంటెను శ్రేష్ఠులైరి.

28. దేనిచేత ఇంద్రుఁడు సమీపమందున్న బ్రహ్మమును సంపాదించెనో, ప్రధానదేవుఁడుగా ఆబ్రహ్మమును తెలిసికొనెనో, ఆకారణముచేత ఇంద్రుఁడు తక్కినదేవతలకంటె శ్రేష్ఠుఁడైనాఁడు.

29. బ్రహ్మమునకు ఇది ఆదేశము (ఉపదేశము, లేక గుర్తు) మెఱుముయొక్క తీగెవలెను,కంటియొక్క తెప్పపాటువలెను (ఉండును.) ఇది అధిదైవతమైన ఉపదేశము (అనఁగా, మెఱుముతీగె యెట్లుప్రకాశించి మఱుఁగై పోవుచున్నదో, కన్నెట్లుమూసి వెంటనే తెఱచుకొనుచున్నదో, అట్లు అతిశీఘ్రముగా ప్రకాశించి మఱుఁగైపోవునట్టిది బ్రహ్మము. లేక, మెఱుముతీగెలేనిది మెఱుముటలేదు. మెఱుములేనిది మెఱుముతీగలేదు. ఈరెంటికిని పరస్పరము భేదములేదు. అట్లే బ్రహ్మమును శక్తియు నొకటిగా నున్నది. కంటితెప్పయు నదేవిధముగా నున్నది.)

30. ఇఁక అధ్యాత్మోపదేశము చెప్పఁబడుచున్నది. బ్రహ్మమును మనస్సు విషయీకరించుచున్నది. (అనఁగా) మనస్సుచేత (ఒకఁడు) మిక్కిలి స్మరించుచున్నాఁడు. సంకల్పము (కలుగుచున్నది) ఆప్రకారమే యున్నది. (మనస్సుయొక్క నమ్మికచేత బ్రహ్మము విశదమగుచున్నది. అనఁగా బ్రహ్మము మనస్సుయొక్క తలంపుప్రకారమే తోఁచుచున్నది.)

31. ఆబ్రహ్మము 'తద్వనమ్' అని చెప్పఁబడుచున్నది. (తస్య-ప్రాణిజాతస్య వనమ్, తద్వనమ్, ప్రాణిసమూహముయొక్క వననమై, భజనీయమైయుండునట్టిది. లేక వనమ్-అడవి. వృక్షసమూహము అడవి. అట్లు ప్రాణిసమూహము బ్రహ్మము. వృక్షసమూహములేనిది వనముకాదు' అట్లే ప్రాణిసమూహములేనిది బ్రహ్మముకాదు.) తద్వనమ్-ఆ బ్రహ్మము ఉపాసింపఁదగినది. ఎవ్వఁ డిట్లు తెలిసికొని ఆ బ్రహ్మమును ఉపాసించుచున్నాఁడో, వానిని సకలభూతములును ప్రార్థించుచున్నవి. (శుశ్రూష చేయుచున్నవి.)

32. శిష్యుఁ డిట్లనుచున్నాఁడు:—ఓభగవంతుఁడా! (నాకు) ఉప

నిషత్తులను జెప్పుము. గురువు:—నీకు (ముందే) ఉపనిషత్తులను ఉప దేశించితిని. (ఇపుడు) పరమాత్మ సంబంధమైన ఉపనిషత్తును జెప్పెదను.

33. ఉపనిషత్తు (బ్రహ్మవిద్య) కొఱకు, తపస్సు (బ్రహ్మమునందు ఏకాగ్రచిత్తము), దమము (ఇంద్రియనిగ్రహము), కర్మము (కర్మాచరణము) మొదలగునవి (ఉపాయములై యున్నవి). వేదములును వేదాంగములును (బ్రహ్మము నెఱుంగుటకు) ఆధారములు. సత్యము (బ్రహ్మవిద్యకు) స్థానము (అనఁగా సత్యము అన్నిటికంటె ముఖ్యమైనది).

34. ఎవఁడు ఈ బ్రహ్మవిద్యను ఈ (పై నిచెప్పఁబడిన) ప్రకారము తెలిసికొనునో, వాఁడు పాపవిముక్తుఁడై అనంతమును, అన్నిటికంట శ్రేష్ఠమునగు స్వర్గమునందు (బ్రహ్మమునందు) వసించును. అనఁగా, బ్రహ్మమునందు సాయుజ్యమును (మోక్షమును) బొందును.

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః.

ఓమ్ ఆప్యాయన్తిత్వితి శాన్తిః.

కేనోపనిషత్తు సమాప్తము.

---

# 3. కఠోపనిషత్తు

సహనావవత్వితి శాన్తిః.

## ప్రథమాధ్యాయము.

### 1. వల్లి.

1 *వాజశ్రవస్సు (అనుఋషి విశ్వజిద్యాగమొనర్చి, ఆయాగ ఫలమును బొందుటకు ఇచ్ఛయించి,) సమస్తవస్తువులను దానముచేసెను. అతనికి నచికేతస్సు అనుపుత్త్రుఁ డొకఁడుండెను.

2. (ఆవాజశ్రవస్సు) దక్షిణలనిచ్చునపుడు బాలుఁడైన నచికేతస్సునకు ఒకశ్రద్ధ కలిగెను. (అనఁగా, సన్మార్గమునందు బుద్ధికలిగినది. దిగువఁ జెప్పఁబోవురీతిగా వాఁడు తలంచెను.)

3. "జలమును త్రాగియు, పూరి(పచ్చిక) మేసియు, పాలను పిదికియు, ఇఁక నీనుటకుఁ దగనిపశువులను దానముచేయువాఁడు సుఖము

---

* వాజశ్రవస్సునకు గౌతముఁడు, ఔద్దాలకి, ఆరుణి అనియుఁ బేర్లుకలవు.

లేనిలోకములను బొందుచున్నాఁడు." అని (అనఁగా, తనతండ్రి మంచి (పశువులను) దానము చేయలేదు, కావున, తానుగోరినఫలము లభింపదు. తన్ను దానము నిచ్చినయెడల ఫలమును (సద్గతిని)పొందునుగాక యని మంచి మనస్సుతోఁ దలంచినాఁడు).

4. "ఓతండ్రీ! నన్నెవరికి దానమిచ్చెదవు?" అని తండ్రినిఁజూచి నచికేతసుఁ డడిగెను. (బాలుఁ డేమియు తెలియక అడుగుచున్నాఁ డని తలంచి యూరకుండెను). మరల నడిగెను. (తండ్రి మౌనముగానుండెను). మూఁడవసారియు నడిగెను. (తండ్రి కోపముతో) "నిన్ను యమున కీయఁబోయెదను." అనెను.

5. ఇట్లు తండ్రి చెప్పఁగా పుత్త్రుఁ డిట్లు చింతింపఁదొడంగెను. (నా తండ్రికిఁగలపుత్త్రులు, లేక,శిష్యులు పెక్కండ్రున్నారు.) నేనువారందఱిలో పెద్దవాఁడను (ఉత్తముఁడను) లేక మధ్యముఁడనై యుందును, (అధముఁ డనుగాను. అటులుండఁగా, నన్ను యమున కిచ్చినాఁడుగదా). యమున కు నావలనఁ బ్రయోజన మేమి? (కోపము చేత నట్లు చెప్పియుండును. అయినను వారిమాట అబద్ధము కాఁగూడదు అని ఆలోచించి పశ్చాత్తప్తుఁడై యుండు తండ్రినిఁజూచి (మరల నచికేతుఁడు) ఇట్లనియె).

6. "(మన) పూర్వుల (స్థితిని) ఆలోచింపుఁడు. (ఇప్పటి) ఇతరుల (స్థితిని) ఆలోచించి చూడుఁడు. మనుష్యుఁడు పైరువలె నశించుచున్నాఁడు, మరల పైరువలె కలుగుచున్నాఁడు. (సత్యము శ్రేష్ఠమైనది. వ్యసనపడనలదు, నన్ను యమున కిచ్చుటకు సంశయ మొందకుఁడు అని ధైర్యము చెప్పెను.)

7. ఇట్లు చెప్పగా తండ్రి సంతోషించి, పుత్త్రుని యమునికడకుఁ బంపెను. నచికేతుఁడు యముని మందిరమునకుఁబోయి మూఁడుదినము లుండెను. అపుడు యముఁడు నిదురించుచుండెను. అపుడు మంత్రులు యముని లేపి యిట్లనిరి. "అతిథిగావచ్చినవిప్రుఁ డోకఁడు అగ్నివలె గృహములందుఁ బ్రవేశించుచున్నాఁడు. అతనికి శాంతిని (సమాధానము లేక, ఉపచారము పెద్దలు) చేయుచున్నారుగ. (అట్లు నీయింటికి అతిథిగా వచ్చియుండునచికేతునకు నీవు ఉపచరించుటకొఱకుఅర్ఘ్యపాద్యములకు) ఓయముఁడా! జలమును తెత్తు" అని.

8. "ఎవరియింట అతిథిభుజింపక వసించునో, ఆస్వల్పబుద్ధిగలపురుషునియొక్క (ఆయింటియజమానునియొక్క) ఆశయు, ఇష్టప్రాప్తిని యెదురుచూచుటయును, సత్సంకల్పఫలమును, మంచివాక్కులచేఁ గలిగినఫలమును యాగఫలమును ఆశ్రమమునకుఁ దగినధర్మమువలనఁ గలిగిన ఫలమును, సకలపుత్త్రులును, పశువులును సర్వమును నశించును.

9. ఇట్లు (మంత్రులు) చెప్పఁగా యముఁడు (నిద్రనుండి) లేచి నచికేతునకు మర్యాదచేసి యిట్లనియె:—"ఓబ్రాహ్మణుఁడా ! అతిథిగను, నమస్కారమునకు తగినవాఁడవుగను నుండు నీవు నా గృహమునందు మూఁడుదినములుగా భుజింపకయున్నావు. నీకు నమస్కారము. నాకు మంగళమగుఁగాక. కావున నీవు మూఁడువరముల నడుగుము" అని.

10. నచికేతుఁ డిట్లనియె:—"(నాతండ్రి) గౌతముఁడు నన్నుఁ గూర్చి వ్యసనములేనివాఁడుగను, సంతుష్టహృదయుఁడుగను, (నాయెడ) కోపములేనివాఁడుగను, ఉండునట్లుగను నీయొద్దనుండి మరలి చనెడినన్ను (అలక్ష్యముచేయక, వీఁడు నాకుమారుఁడు అని) పూర్వజ్ఞాపకముగలవాడై నాతో మాటలాడునట్లును(నీవు కృపచేయవలయును)అనిమూఁడు వరములను ఒక్కటిగాఁజేర్చి అడుగుచున్నాఁడను." అని.

11. యముఁ డిట్లనుచున్నాఁడు:—నీతండ్రి ఔద్దాలకి, ఆరుణి, అనుపేర్లుగలవాఁడు. నీయందు యథాప్రకారము ప్రీతిగలవాఁడుగను, పూర్వజ్ఞాపకముగలవాఁడుగను, రాత్రులందు సుఖముగా నిద్రపోవువాఁడుగను, (విచారము లేక చింత గలవారికి నిద్రరాదు. ఇఁక నీతండ్రికి చింత(వ్యసనము) లేదని భావము). కోపములేనివాఁడుగను ఉండును. మృత్యువు నొద్దనుండి మరలిచనెడినిన్నుఁ జూడఁగలఁడు అని.

12. నచికేతుఁ డిట్లనియె:—"స్వర్గలోకమునం దేభయమును లేదు. అచ్చట నీవు లేవు. (నీవలన భయములేదనితాత్పర్యము) బాధ్యక్యమువలన (ఒకనికి) భయములేదు. ఆకఁలి, దప్పి అను నీరెంటినిదాఁటి, శోకమునుండివీడి సంతోషమునుబొందుచున్నాఁడు." అని

13. "ఓయముఁడా! (అట్టి) స్వర్గమునిచ్చునట్లుగను, అమృతత్వమునుపొందునట్లుగను, చేయునట్టిఅగ్నిని నీవుస్మరించి, స్వర్గమునందిచ్ఛగలనన్నుఁగూర్చి అతనితోఁజెప్పుము. (స్వర్గములభించునట్లు చేయుము). దీనిని రెండవవరముగా అడుగుచున్నాఁడను." అని.

14. యమునివాక్యము:—"ఓనచికేతుఁడా! అట్టి స్వర్గమునిచ్చు అగ్నిని తెలిసికొన్నవాఁడను, అని(నేను)నీకుఁజెప్పెదను.ఏది నీచేతఁ గోరఁ బడినదో, అది నావచనమని యెఱుంగుము.(అనఁగా నీవడిగినవరము నిచ్చి నాఁడను.) ఈఅగ్నిని స్వర్గలోకప్రాప్తికొఱకు సాధనముగా (జగమునకు) ఆశ్రయముగా (విద్వాంసులయొక్క) బుద్ధియం దుంచఁబడియున్న దని నీ వెఱుంగుము." అని

15. (యముఁడు) లోకాధిపతియగు అగ్నియొద్ద వీనిని (నచికేత స్సును) గూర్చిచెప్పెను. మఱియు (అగ్నిచయనమునకు) ఎట్టిఇటుకలు, ఎన్నిఇటుకలు (కావలయునో దానినిగుఱించియు) ఎట్లు ఆయాగము చేయవలసినదో దానినిగూర్చియు నచికేతస్సునకుఁజెప్పెను. నచికేతస్సు, తనకుఁదెలిసినది అనుదానిని తెలియఁజేయుటకు మృత్యువు (యముని) చేత చెప్పఁబడినదానిని క్రమముగా (యమునకు) మరలఁ జెప్పెను. ఇట్లుచెప్పఁగా యముఁడు సంతసించినవాఁడై,మరలచెప్పనుపక్రమించెను.

16. ప్రీతిగలవాఁడుగను, మహాత్ముఁడుగను నుండుయముఁడు, "మరల నీకు(నాలవ)వరమిచ్చెదను"అనియును; "విచిత్రమైనట్టి ఈమాలి కను గ్రహింపుము"అనియును,నచికేతస్సునకుఁజెప్పెను. (లేక,కర్మమయమై యుండుగతిని గ్రహింపుము అనఁగా కర్మము నవలంబింపుము అనెను.)

17. మరల కర్మమును స్తుతించుచున్నాఁడు.—"ముమ్మాఱు అగ్ని చయనమును జేసినవాఁడును, (మాతా, పితా, గురు) ఈముగ్గురి యొక్కమాటను వినువాఁడును (యాగము, అధ్యయనము, దానము) ఈమూఁడుకార్యములను చేయువాఁడును జననమరణరహితుఁడగు చున్నాఁడు. సర్వజ్ఞుఁడుగను, స్తుతింపఁదగినవాఁడుగను నుండు[అగ్ని] దేవుని తెలిసికొని, ఈశాంతిని [విరాట్ సంబంధమైన పదమును-సద్గతిని] పొందుచున్నాఁడు."

18. "ఏవిద్వాంసుఁడు పైనచెప్పినమూఁటిని తెలిసి, అగ్నిచయ నమును ముమ్మాఱుచేయుచున్నాఁడో, వాఁడు మొదట మృత్యుపాశము లను నివృత్తిచేసికొని, శోకమునుండి దాఁటినవాఁడై, స్వర్గలోకమునందు సంతోషించును."

19. "ఓనచికేతుఁడా! నీవు రెండవవరముచేత అడిగినట్టి స్వర్గమందలి [ఆ] అగ్నిని నీకిచ్చినాఁడను. ఈఅగ్నిని నీపేరుతో జనులు పేర్కొందురు. మూఁడవవర మడుగుము."

20. నచికేతుఁ డడుగుచున్నాఁడు:—"మృతినొందిన మనుజుని యొక్క ఆత్మ, వేఱేశరీరముల బొందుచున్నదని కొందఱును, అట్లు కాదని కొందఱును చెప్పెదరు. ఈసందేహమును నివర్తింపుము. ఇదే మూఁడవవరము."

21. యముఁడిట్లనుచున్నాఁడు:—ఈవిషయమును దేవతలకుఁగూడ పూర్వము సంశయముకలదు. చక్కఁగాఁ దెలియఁదగినది కాదు. ఈ [ఆత్మవిషయ] ధర్మము మిక్కిలిసూక్ష్మమైనది. ఓనచికేతుఁడా! వేఱొక వరము నడుగుము. నన్ను తొందరపెట్టకుము; నాకొఱకు ఈవరమును వదలిపెట్టుము.

22. నచికేతుఁ డిట్లనుచున్నాఁడు:— "ఇది దేవతలకుఁగూడ సంశయమైనదిగదా? చక్కఁగాఁ దెలియఁబడనిది, అని నీవును జెప్పెదవు. దీనినిఁ జెప్పుటకు నీకంటె మఱియెవ్వరును చెప్పఁదగినవాఁడుండరు. ఈవరముతోఁ దుల్యమైనవరము వేఱేదియును లేదు."

23. యముఁడిట్లనుచున్నాఁడు:—"శతాయువులుగలపుత్త్ర పౌత్త్రాదుల నడుగుము, పెక్కుపశువులను, ఏనుఁగులను, బంగారమును, గుఱ్ఱములను [అడుగుము]. రాజ్యము నడుగుము, ఎంతకాలము బ్రతుకయుండవలయునని నీకిచ్ఛగలదో అంతకాలము నీవును జీవించియుండుము."

24. "ఇంకను దీనికిసమానమైనవరము నీవు తలంచితివో దాని నడుగుము; ధనమును, చిరంజీవిత్వమును అడుగుము; భూమియందు [రాజవుగా] వర్ధిల్లుచుండుము. కోరికగలవారియొక్క కోర్కుల నొసంగువానినిగా [మహాదాతగా] నిన్ను చేయఁగలను."

25. "మనుష్యలోకమునందు ఏయేకోర్కులు దుర్లభములై యున్నవో వానినంతయు నీయిష్టప్రకారము అడుగుము. ఇదిగో వీరు అప్సరస్త్రీలు, రథములతోను వాద్యములతోను ఉన్నారు. ఇట్టిస్త్రీలు మనుష్యులకు దుర్లభులు. వీరు నీకు సకలశుశ్రూషలును చేయుదురు; ఓనచికేతుఁడా! మరణవిషయమునుగూర్చిమాత్రము అడుగవలదు."

26. నచికేతుఁడు ట్లనుచున్నాఁడు:—రేపు ఉదయమునందు ఉండునో లేదో అని సందేహింపఁదగినవై యుండు [అనిత్యమైన యీ కామములు] సర్వేంద్రియములయొక్క తేజస్సును నాశమైపోవుచున్నవి; సకలజీవితమును అల్పమైనది, రథాదివాహనములును, నృత్యగీతములును నీయొద్దనే యుండనిమ్ము. [నాకు వలదు, నే నడిగినవరమును మాత్రము ఇయ్యవలయును].

27. "మనుష్యుఁడు ధనము చేత తృప్తిఁబొందుట లేదు. నిన్నుఁజూచి నంతమాత్రముననే సంపద [ధనము] గలవారమగుదుము. ఎంతకాలము [ఇచ్చుటకు నీవు శక్తిగలవాఁడవై యుందువో [అంతకాలము] జీవితులమై యుందుము. [అయినప్పటికిని] నేఁడిగినవర మీ అనుగ్రహింపవలయును."

28. "జరా [ముదిమి వర్జితులైన దేవతలకడకుఁ జని [ఆత్మభావము నెఱింగినవాఁడుగను, భూమియందుఁగలవాఁడుగను, జరగలవాఁడుగను, మనుష్యుఁడుగను, [శరీర] వర్ణముచేతను రతిచేతను సంతోషమునొసంగెడిఅప్సరసస్త్రీలను [తుచ్ఛమని] ఎఱింగినవాఁడై యుండువాఁడెవఁడు [ఏ వివేకి]దీర్ఘాయువును అభిలషించును.' [అని నచికేతుఁడనియె. మఱియు]

29. "ఓయముఁడా! ఏ ప్రేతవిషయమునందు ఈసంతోషమును పొందుచున్నారో, మహాప్రయోజనకరమైన పరలోకవిషయమునందు ఏది [ఏఆత్మజ్ఞానము] కలదో, దానిని మాకుఁజెప్పుము." అని.

ఈవరము అతిరహస్యమైనది; అందుప్రవేశించినవాఁడై నందున నచికేతస్సు వేఱువరమును అడుగుట లేదని దృఢముగాఁ జెప్పెను.

## 2. వల్లి.

1. యమునివాక్యము:—శ్రేయస్సు (నిరాశ, మోక్షము) అనునది వేఱు; ప్రేయస్సు (ఆశ, సంసారము) అనునది వేఱు; ఈరెండును పలువిధములగుభిన్నార్థములు కలవి. ఈరెండును మనుష్యులను బంధమునకు లోఁబఱచుచున్నవి. వీనిలో శ్రేయస్సును గైకొన్న వారికి శుభము చేకూరును. ప్రేయస్సును గైకొన్న వాఁడు పరమార్థమునుండి జాఱుచున్నాఁడు.

2. శ్రేయస్సును ప్రేయస్సును మనుష్యునిఁ బొందుచున్నవి. వివేకియైనవాఁడు ఈరెంటిని తెలిసికొని విభజించుచున్నాఁడు. ప్రేయస్సునుండి (విభజించి) శ్రేయస్సును గ్రహించుచున్నాఁడు. మందబుద్ధిగల

వాఁడు యోగక్షేమములయొక్క ఆశచేత ప్రేయస్సును గోరుచున్నాఁడు (గ్రహించుచున్నాఁడు).

3. అట్టినీవు ప్రియులను (పుత్రపౌత్రాదులను) ప్రియరూపములను అప్సరసలు మొదలగువారిని కోరికలను విమర్శించి (పరిశీలించి) తెలిసికొని నిగ్రహించితివి. ఏవిషయమునందు అనేకులుమగ్నులైయున్నారో ఆవిషయమునందును (అనఁగా ఇహలోకసుఖవిషయములందును), విత్తమును (సంపదను)ఇచ్చునట్టిదియును అగు ఈమాలికను నీవు పొంద(కోర)లేదు.

4. విద్యకును అవిద్యకును సంబంధములేదు. ఒకదానికొకటి చాలదూరము. ఆరెండును పరస్పరము విరోధములుకలవి. భిన్నఫలములనిచ్చునవి. నీవు విద్యనుగోరియున్నాఁడవని తెలిసికొంటిని. ఏలన, అనేకములగు కామములునిన్ను పొందలేదు. (అనఁగా నీవు కామ్యాదివస్తువులను గోరలేదు).

5. అవిద్యయందు ప్రవేశించియుండువారు (తాము) బుద్ధిమంతులమనియుఁ పండితులమనియు, తలంచెదరు. (వారు) కుమార్గమునందు ప్రవేశించినవారు, మూఢులు, గ్రుడ్డివానిచే దారిచూపఁబడిన గ్రుడ్డివారివలె నున్నారు.

6. సంసారధర్మమునందాసక్తిగలవాఁడును, విత్తముచేతను మోహముచేతను మూఢుఁడైయుండెడు అవివేకికి పరలోకసాధనమైన బ్రహ్మవిద్య బోధముకాదు. ఇదే (కనఁబడునట్టిదే) జగత్తు. పరలోకమనునది అట్టివానికి లేదు. అని తలంచుచున్నాఁడు. మఱియు మరల మరల మృత్యువగు (యముఁడనగు) నావశమును పొందుచున్నాఁడు. అనఁగా జననమరణములను బొందుచున్నాఁడు.

7. ఏయాత్మ అనేకవిధములగు ప్రశ్నలచేతను పొందుటకు (తెలిసికొనుటకు) సాధ్యముకాదో, దేనినిగూర్చి పలువురు వినినప్పటికిని తెలిసికొనుటకు సాధ్యముకాదో, అట్టిఆత్మనుగూర్చి చెప్పఁగలిగెడువాఁడు కనఁబడఁడు. అట్టిగురువునొద్ద విని(ఆత్మను) తెలిసికొన్నవాఁడును (శిష్యుఁడును) కనఁబడుట లేదు.

8. అల్పజ్ఞానముగలవానియొద్ద నుపదేశము పొందినను ఆత్మస్వరూపము బోధముకాదు. దీనిని అనేకవిధములుగా ఆలోచింపవలయును. అది (ఆత్మ) అణువుకంటెను అణువు. తర్కించుట కవకాశ

మొసంగనిది. బ్రహ్మజ్ఞానముగలవానిచే బోధింపఁబడినయెడల సంశయమున కవకాశముండదు.

9. ఓ ఉత్తముఁడైన నచికేతుఁడా! ఈ బ్రహ్మజ్ఞానబుద్ధి, తర్కముచేఁ దెలిసికొనుటకు సాధ్యముకాదు; నిగ్రహించుటకునుగాదు; బ్రహ్మజ్ఞానిచే నుపదేశించినచో స్పష్టముగా (ఆత్మ) బోధమగును. అట్టి బుద్ధిని నీవుపొందియున్నావు. సత్యధైర్యముగలవాఁడవై యున్నాఁడవు. నీవలె వినునట్టివాడెవఁడున్నాఁడు? (నీవే అడుగుటకుఁ దగినవాఁడవు.)

10. నీతి అనిత్యమని నాకుఁదెలియును. అనిత్యవస్తువులవలన నిత్యవస్తువు లభించదు. అగ్నియాగము అనిత్యవస్తువులచేఁ చేయఁబడినది. అందువలన (పుణ్య ముండునంతదాఁక) నిత్యమైన యమాధికారమును (ఈస్వర్గపదవిని) పొందియున్నాఁడను.

11. ఓనచికేతా! కామముయొక్క అంత్యముగను, జగత్తుయొక్క ప్రతిష్ఠగాను, యాగముయొక్కఫలముగను, అభయస్థానముగను, స్తుతింపఁదగినదిగను, మహత్తుగను, విస్తీర్ణగతిగలదిగను నుండు స్థితిని (బ్రహ్మలోకాదిపదమును) నీవు ధైర్యముతో నిగ్రహించితివి.

12. ప్రయాసచేతఁ గనుఁగొనఁబడువాఁడును, అతిరహస్యమై యుండువాఁడును, (ప్రతివస్తువునందును) ప్రవేశించియుండువాఁడును బుద్ధియందుండువాఁడును, పురాణపురుషుఁడునుఅగు పరమాత్మను అధ్యాత్మయోగముచేత (విషయనిగ్రహముచేసి ఆత్మను ధ్యానించుటచేత) వివేకియైనవాఁడు పర్యాలోచనచేసి, సంతోషమును, వ్యసనమును (ద్వంద్వమును) నిగ్రహించుచున్నాఁడు.

13. దీనిని (నేనుజెప్పఁబోవుబ్రహ్మవిద్యను) విని, గ్రహించి, (శరీరాది) ధర్మములను నిగ్రహించి, ఈసంతోషమైనఆత్మను పొంది, మనుష్యుఁ డానంద మొందుచున్నాఁడు. నచికేతునకొఱకు (మోక్ష) స్థానము తెఱచి యుంచఁబడియున్నదని తలంచెదను.

14. నచికేతుఁ డిట్లనుచున్నాఁడు:—"ధర్మముకంటెను, అధర్మముకంటెను, కార్యముకంటెను, కారణముకంటెను, ఉన్నదానికంటెను, ఉండఁబోవుదానికంటెను వేఱైనది. ఈ ప్రకారముండునది యని దేనిని, నీవు తెలిసికొనియున్నావో దానిని నాకుఁ జెప్పుము."

15. యముఁ డిట్లనియె:—"దేనినిగూర్చి సకల వేదములును చాటుచున్నవో, దేనిని సకలతపస్సులును జెప్పుచున్నవో, దేనినికోరి బ్రహ్మచర్యమును అనుష్ఠించుచున్నారో, దానిని నీకు సంగ్రహముగాఁ జెప్పెదను. అదే 'ఓమ్' (అను అక్షరము)."

16. "ఈయక్షరమే బ్రహ్మము, ఇదే పరవస్తువు, ఈయక్షరమును నెఱింగి యెవ్వరు దేనిని గోరెదరో, అది వారికిలభించును."

17. "ఈయాలంబనము (పట్టు) శ్రేష్ఠమైనది, ఈయాలంబనము పర (శ్రేష్ఠ) మైనది, ఈయాలంబనము నెఱింగినవాఁడు బ్రహ్మలోకమునందు మహిమను పొందును."

18. ఈయాత్మ యెట్టివాఁడు? జననమరణములు లేనివాఁడు, సర్వజ్ఞుఁడు, దేనినుండియు ఇతఁడు గలుగలేదు, ఇతనివలనను ఏమియును కలుగలేదు, అజుఁడు, నిత్యుఁడు, శాశ్వతుఁడు, పురాణపురుషుఁడు, హింసింపఁబడుశరీరములోనుండియు హింసింపఁబడనివాఁడు. (అనఁగా హింసనొందుశరీరమునం దుండనివాఁ డనిభావము.)

19. చంపువాఁడు చంపుదునని తలంచుచున్నాఁడేని, (అనఁగా నేను చంపఁగలననెడియహంకారము నొందుచున్నాఁడు), చంపఁబడువాఁడు (తాను) చంపఁబడుదునని తలంచుచున్నాఁడేని; వీరియిర్వురును తెలియనివారు; వాఁడు చంపెడివాఁడును కాఁడు. వీఁడు చంపఁబడువాఁడును కాఁడు.

20. ఆత్మ అణువుకంటెనుచిన్నది, మహత్తుకంటెనుమహత్తైనది, ప్రాణులహృదయములో నుండునది, కామము (కోరిక) లేనివాఁడు పరమాత్మను జూచుచున్నాఁడు, శోకములేనివాఁ డగుచున్నాఁడు, (మనస్సు మొదలగు) కరణములయొక్క ప్రసాదమువలన ఆత్మమహిమను (జూచుచున్నాఁడు.)

21. "ఆయాత్మ కూర్చున్నచోటనేయుండి దూరమునకుఁబోవుచున్నది. పరుండియే సర్వస్థలములకును బోవుచున్నది, అట్టివృద్ధధర్మముఁగల దేవుని (పరమాత్మను) నన్నుఁదప్ప, నావంటివాఁడును గాకయుండునట్టి వాఁ డెట్లెఱుఁగును!" (అనఁగా దేవతలుమాత్ర మెఱుఁగుదురని యభిప్రాయము.)

22. శరీరములందు శరీరములేనివాఁడుగను, అనిత్యవస్తువుల

యందు నిత్యవస్తువుగను, మహాత్ముఁడుగను, విభువుగనునుండు ఆత్మను, వివేకి తెలిసికొని శోకముసుపొందఁడు.

23. ఈయాత్మ వేదాభ్యాసముచేతను, చనిపిసదానిని మఱుపక యుండు బుద్ధిచేతను, విస్తారముగ వినుటచేతను పొందఁదగినవాఁడు కాఁడు. ఈసాధకుఁడు దేనిని (తన యాత్మను) ప్రార్థించుచున్నాఁడో, దానిచేత (స్వాత్మచేత) తెలియఁబడుచున్నాఁడు. (అనఁగా పరమాత్మను తనయాత్మ చేతనే తెలియఁదగినది) ఆస్వాత్మయొక్క యథార్థమైన స్వరూపమును పరమాత్మ ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

24. దుర్మార్గమునందు ప్రవేశించినవాఁడును, ఇంద్రియనిగ్రహము చేయనివాఁడును, ఏకాగ్రచిత్తములేనివాఁడును, లయమొందనిమనస్సు గలవాఁడును, ఈయాత్మను పొందఁడు. ప్రజ్ఞానముచేత మాత్రము పొందనగును.

25. ఏయాత్మను పుణ్యపాపములు రెండును భుజించెడి అన్నమై యున్నవో, మరణమే దానికి ఊరుఁగాయవలెనున్నదో, ఈప్రకారము ఎవరియందు ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడే ఆత్మ.

3. వల్లి.

1. యముఁడు చెప్పుచున్నాఁడు:—జీవాత్మపరమాత్మ లిద్దరును శరీరమునందు కర్మమునుండి గలుగు ఫలమును అవశ్యము అనుభవింప వలసినవారు; ఎండయు నీడయువలె (పరస్పరము విరుద్ధస్వభావముగల వారుగను)ఉన్నారు. బుద్ధియందు ప్రవేశించినవారు; పరమైయుండుహృద యాకాశమునందు ప్రవేశించినవారు; పంచాగ్నిగల గృహస్థులును, ముమ్మాఱు అగ్నిచయనము చేసినవారును, బ్రహ్మవాదులును ఈదిగువ ప్రకారము చెప్పుచున్నారు.

2. కర్మానుష్ఠానపరులకు ఏది సేతువు (గట్టు) గానున్నదో, ఆనాచి కేతాగ్నిని తెలిసికొనుటకు శక్తిగలవారై యున్నారము. ఏది అక్షరమై, పరమై, అభయమై (సంసారసాగరమును) దాఁటుటకు ఇచ్ఛగలవారికి సేతువై యున్నదో ఆ బ్రహ్మమును ఎఱుఁగుటకును శక్తిగలవారమై యున్నారము.

3. జీవాత్మను రథమందుండు యజమానునిగను, శరీరమును రథముగను, బుద్ధిని సారథిగను, మనస్సును కళ్లెముగను ఎఱుంగుము.

4. ఇంద్రియములు (అరథమునకు) గుఱ్ఱములనియును, వాని యొక్క (రూపాదులు) విషయములు (ఆగుఱ్ఱములుపోవునట్టి) మార్గములనియును, శరీరము, ఇంద్రియము, మనస్సు అను నీమూఁడును చేరి యుండు ఆత్మ సంసారియనియును (జీవాత్మా భోక్తా) వివేకులు చెప్పుచున్నారు.

5. ఎవఁడు అవివేకియై ఎప్పుడును నిరోధించుటకు సాధ్యముకాని మనస్సుతో (కళ్లెముతో) నున్నాఁడో వానికి ఇంద్రియములు సారధికి దుష్టగుఱ్ఱములవలె స్వాధీనములు కావు.

6. ఎవఁడు వివేకిగానుండి ఎల్లప్పుడును నిరోధింపఁబడిన మనస్సుతో నున్నాఁడో, వానికి ఇంద్రియములు సారథికి మంచి గుఱ్ఱములవలె స్వాధీనములగును.

7. ఏయాత్మయగు రథమునందున్న వాఁడు, అవివేకియై ఎల్లప్పుడును నిరోధింపఁ బడనిమనస్సుతోఁ గూడినవాఁడుగను, అశుచిగను ఉండునో, వాఁడు (తనసారథిద్వారముగా) ఆపరమపదమును (బ్రహ్మమును) పొందఁడు, అనఁగా జననమరణములను బొందుచుండును.

8. ఎవఁడు వివేకియై ఎప్పుడును నిరోధింపఁ బడినమనస్సుతోఁ గూడినవాఁడుగను, శుచిగలవాఁడుగను నుండునో వాఁడు దేనివలనను భయములేక యుండుపదమును (ఆబ్రహ్మమును) పొందుచున్నాఁడు.

9. ఏవివేకియగు సారథి, నిరోధింపఁబడిన మనస్సుగలవాఁడై యుండునో, వాఁడు సంసార గతియగు మార్గము యొక్క అంత్యమును (విష్ణుస్థానమును = పరమాత్మస్థితిని) పొందుచున్నాఁడు.

10. ఇంద్రియములకంటెను వాని యర్థములు (విషయములు) శ్రేష్ఠమైనవి; అర్థములకంటెను మనస్సు శ్రేష్ఠమైనది; మనస్సుకంటెను బుద్ధి శ్రేష్ఠమైనది; బుద్ధికంటెను మహాత్ముఁడైన ఆత్మ (మహాతత్త్వము, ఈశ్వరతత్త్వము, సూత్రాత్మ) శ్రేష్ఠమైనది.

11. మహాత్తత్త్వముకంటెను అవ్యక్త తత్త్వము (మాయ, ప్రకృతి) శ్రేష్ఠమైనది; అవ్యక్తతత్త్వముకంటెను పరమాత్మ (పరమపురుషుఁడు) శ్రేష్ఠమైనది; పరమాత్మకంటె శ్రేష్ఠమైనది వేఱేదియు లేదు. ఇదే (పొందఁ దగినదిక్కు) స్థానము; ఇదే పరమగతి (మోక్షము).

12. ఈ యాత్మ సకలభూతములయందును మఱుఁగై యున్నది. ప్రకాశించుటలేదు. సూక్ష్మదృష్టిగలవారి (వివేకుల) చేత సూక్ష్మముగను, ఏకాగ్రముగను నుండుబుద్ధిచేత తెలియఁబడుచున్నాఁడు.

13. వివేకియైనవాఁడు వాగాదీంద్రియములను మనస్సునందు లయింపఁజేయవలయును. మనస్సు బుద్ధ్యాత్మయందు లయింపఁజేయవలయును;ఆబుద్ధ్యాత్మను మహదాత్మయందు(మహత్తత్త్వము,ఈశ్వరతత్త్వము, మున్నుగలిగినవిజ్ఞానము)లయమొందింపవలయును. ఆమహదాత్మను శాంతాత్మ (పరమాత్మ) యందు లయమగునట్లు చేయవలయును.

14. (ఓప్రాణులారా!) ఆత్మజ్ఞానమునుబొందుటకు లెండు! (అజ్ఞాననిద్రనుండి) మేల్కొనుఁడు! సద్గురువు నాశ్రయించి (ఆత్మను) తెలిసికొనుఁడు; ఈమార్గము(తత్త్వజ్ఞానలక్షణము)కత్తియొక్కవాదర; వాఁడిగలది; సులువుగాఁ బ్రవేశించుటకుతగనిది; పొందుటకు కష్టమైనమార్గము.

15. ఏది (యాత్మ) అశబ్దమో, అస్పర్శమో, అరూపమో, అవ్యయమో, అరసమో, నిత్యమో, వాసనారహితమో, ఆద్యంతరహితమో, మహత్తత్త్వాతీతమో, శాశ్వతమో, దానిని తెలిసికొని మృత్యువునుండి విడివడుచున్నాఁడు. (అనఁగా పునర్జన్మము నొందఁడు).

16. యమునిచే నుపదేశింపఁబడినదియును, పురాతనమైనదియును అగునాచికేతోపాఖ్యానమును చెప్పినను, వినినను, వివేకి బ్రహ్మలోకమునందు (పరమాత్మయొద్ద) మహిమనొందుచున్నాఁడు.

17. ఎవఁడు పరిశుద్ధుఁడై పరమును, రహస్యమునగు (ఈగ్రంథమును) బ్రాహ్మణసభయందును, శ్రాద్ధకాలమునందును విను నట్లొనరించునో అది (వానికి) అపరిమితఫలము నొసంగును.

ద్వితీయాధ్యాయము

4. వల్లి.

1. స్వయంభు (పరమాత్మ) స్వవిషయపరములైనయింద్రియములను దండించుచున్నాఁడు; (అనఁగా ఆత్మజ్ఞానముచేతమాత్రము ఇంద్రియములను స్వాధీనముచేసికొనుటకు సాధ్యమగును). కాఁబట్టి (లోకులు) సాధారణముగా అనాత్మభూతములను చూచుచున్నారేగాని, అంతరాత్మను (పరమాత్మను) జూచుటలేదు; ఎవఁడేని యొకధీరుఁడు (వివేకి)

అమృతత్వమును కోరినవాఁడుగను, చక్షురాదీంద్రియములను నిగ్రహించినవాఁడుగను నుండి ప్రత్యగాత్మను (పరమాత్మను) జూచుచున్నాఁడు.

2. అవివేకులు అనాత్మభూతములై యుండువిషయముల ననుసరించుచున్నారు; (కావున) వారు సర్వత్ర వ్యాపించియున్న మృత్యువు పాశమునకు లోనయ్యెదరు. కాఁబట్టి ధీరులు శాశ్వతమైన అమృతత్వమును (బ్రహ్మమును) తెలిసికొని, అనిత్యవస్తువులను గోరుటలేదు.

3. ఏలయనఁగా, మిథునవిమిశ్రములుగా (సుఖదుఃఖముల నొసంగునట్టివిగా)నుండు రూప, రస, గంధ, శబ్ద, స్పర్శము లగువిషయములను మనుష్యుఁడు దీనిచేతనే (పరమాత్మచేతనే, విజ్ఞానముచేతనే) చూచుచున్నాఁడు. ఇచ్చట తెలిసికొనఁదగినది వేఱేమియున్నది? అనఁగా ఏదియు లేదు. సమస్తమును బ్రహ్మము తెలిసికొనియున్నది; ఇదే అది. అనఁగా, నచికేతస్సు అడిగినవస్తు విదియే యని తాత్పర్యము.

4. ఒకఁడు స్వప్నమధ్యమును (స్వప్నమునందుఁ దెలిసికొనినదియును), జాగ్రన్మధ్యమును (జాగ్రదవస్థయందుఁ దెలిసికొనఁబడునదియును), దేనిచే చూచుచున్నాఁడో, ఆమహాత్ముఁడును, విభువును అగు ఆత్మను దెలిసికొని, వివేకియైనవాఁడు వ్యసనము నొందుటలేదు.

5. కర్మఫలము ననుభవించువాఁడును, కాలత్రయమున కధిపతిగా నుండువాఁడును అగుజీవాత్మను ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడు తర్వాత (తెలిసికొన్నతర్వాత) జీవుని సంరక్షించుకొనుటకు ఇచ్ఛయింపఁడు; ఇదే అది. ఈజీవాత్మయును ఆబ్రహ్మమే యని తెలియునది.

6. (ఎవఁడు ఏబ్రహ్మ, హిరణ్యగర్భుఁడు) ఆదియందు విజ్ఞానమునుండి(పరమాత్మ యందుండి) భూతములతోఁ బుట్టినవో శరీరాదులను సృష్టించిన తర్వాత ప్రాణులయొక్క హృదయమునందుఁ బ్రవేశించి వసించుచున్నాఁడో, అతనిని ఎవఁడు భూతములతోఁగూడఁ దెలిసికొనునో, వాఁడు బ్రహ్మమును తెలిసికొనుచున్నాఁడు. ఇదే అది ఈ హిరణ్యగర్భుఁడును బ్రహ్మమే.

7. ఏది (ఎవతె) సర్వదేవాత్మకగను, శబ్దాదివిషయములను అనుభవించునదిగను, పరబ్రహ్మమునుండి హిరణ్యగర్భరూపముగా కలిగినదో. ఏది భూతములతోఁగూడఁ బుట్టినదియో, హృదయమునందుఁ బ్రవేశించి

వసించునదియునైన మాయను, ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడే పరబ్రహ్మమును దెలిసినవాఁడు, ఇదే అది. ఈమాయయు అపరబ్రహ్మమే.

8. గర్భిణిస్త్రీలచేత గర్భము చక్కఁగా కాపాడఁబడియుండునట్లు, అరణికాష్ఠములచేత కాపాడఁబడినదిగను, జాగ్రత్తగలవారును, హవిస్సు మొదలగునవిగలవారును, అగు మనుష్యులచేత ప్రతిదినమును స్తుతింపఁబడునదియు నగు ఏ యగ్ని కలదో, ఇదియును అదే. ఈఅగ్నియు పరబ్రహ్మమే.

9. ఏఆత్మయందుండి సూర్యుఁడు ఉదయ మగుచున్నాఁడో, దేనియందు అస్తమయమును బొందుచున్నాఁడో, అందు సకలదేవతలును ప్రవేశించుచున్నారు. దానియందే లయమైయున్నారు, దానికంటె వేఱైన దేదియు లేదు, ఇదే అది. ఈసూర్యుఁడును బ్రహ్మమే.

10. ఏది యిచ్చట (ఈలోకమునందు) కార్యకారణరూపముగా ప్రకాశించుచున్నదో అదే అచ్చటనుండునట్టిది. పరమపదమునందు స్వచ్ఛముగానుండు బ్రహ్మము. అచ్చటనుండునట్టిదే ఇచ్చటను నుండునట్టిది. ఇచ్చట బ్రహ్మము భిన్నరూపమని యెవ్వఁడు తలంచుచున్నాఁడో! వాఁడు క్రమముగా జననమరణములను బొందుచుండును.

11. ఇది (బ్రహ్మము) మనస్సుచేత (సంస్కరింపఁబడినమనస్సుచేత) పొందఁదగినది; ఇచ్చట అానికి (ఆబ్రహ్మమునకు) భిన్నమైనది యేదియు లేదు. ఎవఁడు భిన్నమని భేదముగా తలంచుచున్నాఁడో వాఁడు జననమరణములను బొందుచుండును.

12. ఆత్మ అంగుష్ఠప్రమాణముగల పురుషుఁడుగా మధ్యయందు (హృదయకమలమధ్యరంధ్రమునందు) ఉన్నది; ఉన్నాఁడు. ఇదివఱకు కలిగినదానికిని, ఇంక కలుగఁబోవుదానికిని ఈశానుఁడు కర్తగానున్నాఁడు. దీనిని తెలిసికొన్న యెడల అట్టివాఁడు దానియెడల సంకోచ మొందఁడు. (అనఁగా దానియందే సంబంధించి యుండును) ఇదియును అదియే. ఈ జీవాత్మయు బ్రహ్మమే.

13. అంగుష్ఠ ప్రమాణముగల పురుషుఁడు, పొగలేని జ్యోతిస్స్వరూపము అనఁగా కర్మసంబంధము లేనివాఁడు; కలిగిన దానికిని, కలుగఁబోవుదానికిని ఈశానుఁడు; తేపు నుండు వాఁడు(నిత్యుఁడు, కూటస్థుఁడు); ఇదియును అదే; హృదయమునందు సాక్షిభూతుఁడై యుండుపరమాత్మయు బ్రహ్మమే.

14. ఎగుడు దిగుడు ప్రదేశములయందును, పర్వతములయందును పడునట్టిజలము ఎట్లు చెదరి పలురూపములుగా పడుచున్నదో, అట్లే ఆత్మయొక్క ధర్మములు ప్రత్యేక ప్రత్యేకమని యెవఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడు అటువంటి నానారూప శరీరమును బొందుచున్నాఁడు. (జననమరణములను బొందుచుండును)

15. ఓగౌతమా (నచికేతుఁడా) ఎట్లు పరిశుద్ధజలమునందు, శుద్ధమైనజలము (ఏకరసముగా చెదరిపోక ఒకేధారగా) ఉన్నదో, ఇట్లెఱింగిన మునియొక్క (యోగియొక్క) ఆత్మ, ఇట్లే అగుచున్నది. (బ్రహ్మమే అగును).

## 5. వల్లి.

1. జననము లేనివాఁడును, వక్రము లేనివిజ్ఞానము గలవాఁడునైయుండువానికి (బ్రహ్మమునకు), ఒకపట్టణము కలదు; అది శరీరము; ఆపట్టణమునకు పదునొకండు ద్వారములు; (ముఖమునందుండునవి 7, నాభితోఁగూడ దిగువనుండునవి 3, శిరస్సున బ్రహ్మరంధ్రము1, మొత్తము 11.) ఇట్టివస్తువును ఒకఁడు ధ్యానముచేసినయెడల అవిద్యనుండి విడివడినవాఁడై దుఃఖమునొందఁడు. వానికి జనన మరణములు లేవు. ఇదే అది. ఈపట్టణముగలవాఁడును బ్రహ్మమే.

2. అది (బ్రహ్మము) గమనముగలది; స్వర్గమునందు సూర్యాదిరూపముగా నుండునట్టిది; సమస్తమైనవారిని వసించునట్లు చేయఁదగినది; అంతరిక్షమునందు వాయురూపముగా నుండునట్టిది; భూమియందుండునది. అతిథిరూపముగా ప్రతిగృహమునకును బోవునట్టిది; మనుష్యునియొద్ద నుండునట్టిది; దేవతలయొద్దనుండునది; సత్యమునందు (యజ్ఞమునందు) ఉండునది; ఆకాశమునందుండునట్టిది; భూమియందుండి కలుగునట్టి పైరు మొదలగునవిగా ఉండునది; జలజంతువులుగాను, యజ్ఞమునందుండునవిగా నుండునది; పర్వతమునుండి కలిగిన నదులు మొదలగునవిగా నుండునట్టిది; సత్యవస్తువు; మిక్కిలి గొప్పది.

3. ఏది (ఏబ్రహ్మము) హృదయమునకు మీఁద ప్రాణవాయువును పైకిలేపుచున్నదో, అపానవాయువును దిగువకు త్రోసివేయుచున్నదో, (హృదయపుండరీకాకాశమున) మధ్యయందున్నదో, భజించుటకుఁ దగినది

గానున్నదో, దానిని సకలదేవతలును (చక్షుస్సు మొదలగు ఇంద్రియములు) ఉపాసించుచున్నారు. దానికిభయ మొంది తమతమకార్యములను వేగముగా చేయుచున్నవి.

4. దేహముగలవాఁడును, శరీరమునందుండువాఁడును, తర్వాత జాఱిపోవువాఁడును, దేహమును విడిచిపోవువాఁడును, అగునతనికి ఈ ఆత్మకు ఇచ్చట(దేహమునందు)మిగిలియుండునదేది? అనఁగా ఏదియు లేదు. (అనఁగా, ఆత్మ శరీరమునందుండి వీడినతర్వాత సకలతత్త్వములును వెన్నంటుచున్నవి.) ఇదే అది; ఈదేహియు ఆబ్రహ్మమే.

5. ఏమనుష్యుఁడును, ప్రాణవాయువుచేనైనను,అపానవాయువుచేనైనను, బ్రదికియుండుటలేదు; దేనియందు ఈరెండును ఆశ్రితములైయున్నవో, దానిచేత (ఆత్మచేత) బ్రదికియున్నాఁడు.

6. ఓనచికేతుఁడా! రహస్యమును, నిత్యవస్తువు నగు ఈబ్రహ్మమునుగూర్చియును, ఆత్మఅవిజ్ఞానముచేత మరణమునుబొంది ఆతర్వాత ఎట్లగుచున్నాఁడో దానినిగూర్చియును, నీకుఁ జెప్పెదను; (ఆవిషయమును గూర్చిచెప్పుటయును, తెలిసికొనుటయు,) మిక్కిలి కష్టము.

7. (అవిద్యాసహిత) దేహులు, మరణానంతరము వేఱేశరీరమునుబొందుటకై (శుక్లబీజముతోఁజేరి) యోనిద్వారమును పొందెదరు; (వీరికంటె అధములు)ఇతరులు స్థావరత్వమును (శిలలు మొదలగునవిగా) పొందుచున్నారు. వారివారికర్మానుసారముగను,విచార (వేదాంతశ్రవణ) మునకుఁదగినట్లును ఇట్లగుచున్నది.

8. ఈపురుషుఁడు (ఆత్మ) ప్రాణాదితత్త్వములు నిద్రించునపుడు అవిద్యాసంబంధముచేత మరల మరల కోర్కెలనువృద్ధిచేసికొని మేల్కొనియుండునో, వాఁడే శుద్ధవస్తువు; అదే బ్రహ్మము; అదే అమృతము; అని చెప్పఁబడుచున్నది. దానియందు సకలజనులును ఆశ్రితులైయున్నారు; దానిని ఏదియు దాఁటుటలేదు; (అందే అణఁగియున్నది); ఇదే అది. ఇట్టి ఆత్మయు ఆపరబ్రహ్మమే.

9. ఎట్లు ఒకేఅగ్ని భువనమందు ప్రవేశించి (దహింపఁబడు) వస్తువుయొక్కరూపమునకుఁ దగినప్రతిరూపమగుచున్నదో, అట్లుఏకమైయుండు ఆత్మ, సర్వభూతములయందుండి, దానిదానిరూపము (ఆకారము) ప్రకా

రము ప్రతిరూపముగను, బయటను (వికారరహితమైన స్వరూపముగలది గను) ఉన్నది.

10. ఎట్లు ఒకేవాయువు భువనమందు ప్రవేశించి ఆయావస్తువు యొక్కరూపమునకుదగినట్లు ప్రతిరూపమొందుచున్నదో, అట్లే ఏకమైన ఆత్మయు సర్వభూతములలోనుండి,దానిదానిస్వరూపప్రకారము ప్రతిరూపముగను బైటనుఉన్నది.

11. ఎట్లు లోకమునకు నేత్రమైయుండు సూర్యుడు జనులయొక్క నేత్రదృష్టియందుగలిగిన(మూత్రపురీషాదిదృష్టి చేగలిగిన) బాహ్యదోషములతో సంబంధించుటలేదో, అట్లు ఏకమై, సర్వభూతాంతరాత్మయై (విపరీతబుద్ధియొక్కఅధ్యాసనకు) బాహ్యమైయుండునట్టి ఆపరమాత్మ, ప్రపంచదుఃఖముతో సంబంధపడుటలేదు.

12. ఒక్కడేపురుషుడు, అందఱను వశముచేసికొనువాడు, సకలభూతములలోనుండుఆత్మ ఏకమైయుండు తన్ను, పలువిధములుగా ఎవడుభావించుచున్నాడో, వానిని,ఆత్మస్థుడగు వానిని, ఏధీరులు కనుగొందురో, వారికిమాత్రమే శాశ్వతసుఖము కలుగును. ఇతరులకు లేదు.

13. ఎవడు అనిత్యవస్తువైయుండువాడో, చేతనముగలవారికి చేతనము నిచ్చువాడో, ఒక్కడుగనుండి పెక్కండ్రకు (వారివారికి దగినట్లు) కోర్కులనొసంగుచున్నాడో, అట్టి ఆత్మస్థుని ఏధీరులు అనుసరించి కనుగొందురో, వారికి శాశ్వతమైన శాంతికలదు. (సంసారనివృత్తి కలదు.) ఇతరులకు లేదు.

14. గుర్తించుటకు సాధ్యముకానిదియును, పరమైనదియును, సుఖరూపమైనదియునగు (బ్రహ్మమును) "అదేఇది" అని (గుర్తించిచూపి పెద్దలు) భావించెదరు. ఎట్లు దానిని తెలిసికొనవచ్చును? ఏది ప్రకాశించుచున్నది? ఏదిస్పష్టముగా గోచరించుచున్నది?

15. దానియందు సూర్యుడు ప్రకాశించుటలేదు; అట్లే చంద్రుడును, నక్షత్రములును, మెఱపును ప్రకాశించుటలేదు. ఈఅగ్ని మాత్రము ఎట్లు ప్రకాశించును? సమస్తమును దానిని (ఆత్మను) అనుసరించియే ప్రకాశించుచున్నది. ఆపరమాత్మప్రకాశముచేతనే ప్రపంచమంతయు ప్రకాశించుచున్నది.

## తృతీయాధ్యాయము

### 6. వల్లి.

1. ఈ(సంసారవృక్షము)అశ్వత్థము అనుపేరుగలది. (అనఁగా,నాశ మొందనిస్వభావముగలది; దీనికి వేళ్లు ఊర్ధ్వముగ (మీఁదుగ) నుండును; (అనఁగా బ్రహ్మము); రెమ్మలు(స్వర్గనరకాదులు) దిగువనుండును;చాలకాల ముండును; ఆ(వేఱు)శుద్ధవస్తువు; అదే బ్రహ్మము; అదే అమృతమని చెప్పఁ బడుచున్నది; దానియందు సకలలోకములును ఆశ్రయించియున్నవి. ఎవ్వరికిని దానినిదాఁటుటకు శక్తిలేదు. ఇదే అది.

2. పరబ్రహ్మము ఉండునప్పుడు ఈప్రపంచమందలిసమస్తవస్తువు లును చలించుచున్నవి(దానిదానివ్యాపారము జరుగుచున్నది); అందుండి సర్వమును బయలుపడినది; అది గొప్పభయము; వజ్రాయుధమును చేతఁ దాల్చినది;ఎవరు దీనిని తెలిసికొనుచున్నారో, వారు మరణములేనివా రయ్యెదరు.

3. అందుండి కలిగినభయముచేతనే అగ్ని కాల్చుచున్నది. సూర్యుఁడు కాల్చుచున్నాఁడు, ఇంద్రుఁడును, వాయువును, అయిదవ దగుమృత్యువును పరుగిడుచున్నారు. (వారివారికార్యములను ప్రయత్న ముతోఁ జేయుచున్నారు.)

4. (బ్రహ్మమును) తెలిసికొనుటకు ఇచ్చటనే ప్రాణముండునపుడే శక్తిగలవాఁడై యుండినయెడల శరీరము పడిపోవుటకుముందే సంసార బంధమునుండి విడివడుచున్నాఁడు;(అట్లు శక్తిలేనియెడల) తెలియమిచేతనే ప్రాణులయందును, పృథివిమొదలగులోకములయందును శరీరమును గైకొనుటకుఁ దగినవాఁడగుచున్నాఁడు. (మరల జననమరణములను బొందుచున్నాఁడు.) కాఁబట్టి దానినిపొందుట కిప్పుడే ప్రయత్నింప వలయును. దానినిపొందుట కష్టము. అదెట్లనఁగా.

5. అద్దమునందెట్లు ప్రతిబింబముకనఁబడుచున్నదో, అట్లువివిక్త మై ఆత్మయందు (స్వాత్మయందు) తోఁచును; ఎట్లు స్వప్నమందు కనఁబడు చున్నదో, అట్లుఅవ్యక్తమై పితృలోకమునందు కనఁబడును; ఎట్లుజలము నందు ప్రతిబింబముకనఁబడుచున్నదో, అట్లుఅవ్యక్తమై గంధర్వలోకము నందు కనఁబడును; ఎండయు నీడయువలె వివిక్త బ్రహ్మలోకమునందు

కనంబడును; (ఇట్లు బ్రహ్మలోకమునందు స్పష్టముగాఁ గానంబడినప్పటికిని, ఆలోకమునుబొందుట మిక్కిలి కష్టము; అనేకకష్టములుచేయవలసి యున్నది; మీఁదఁజెప్పినలోకములయందు స్పష్టముగాఁ దోఁచుటలేదు. కావున ఆత్మయందు పరబ్రహ్మమునుజూచుటకు ప్రయత్నముచేయ వలయును.)

6. దానిదాని కారణమైన ఆకాశాదిస్థలములయందుండి ప్రత్యేక మైన (శ్రోత్రాది) ఇంద్రియములయొక్క పృథగ్భావమును, వానియొక్క ఉత్పత్తినాశములును తెలిసికొని వివేకియైనవాఁడు దుఃఖమునుబొందుట లేదు.

7. ఇంద్రియములకంటెను మనస్సు గొప్పది; మనస్సుకంటెను బుద్ధి గొప్పది; బుద్ధికంటెను మహత్తత్త్వము గొప్పది; మహత్తత్త్వముకంటెను అవ్యక్తతత్త్వము (పృథివి) గొప్పది.

8. పృథ్వికంటెను వ్యాపకుఁడై, లింగరహితుఁడై యుండుపురుషుఁడు (బ్రహ్మము) గొప్పవాఁడు; దేనినితెలిసికొని ప్రాణి (సంసారబద్ధుఁడగు జీవుఁడు)విడివడుచున్నాఁడో, అమృతత్వమునుబొందుచున్నాఁడో, (అది బ్రహ్మము).

9. ఆబ్రహ్మముయొక్కరూపము దృష్టికి గోచరముకాదు; నేత్రాదీంద్రియములచేతఁ దెలియఁబడువాఁడు కాఁడు; అది హృదయమునందుండుబుద్ధిచేతను సంకల్పవికల్పములులేని శాంతమైన మనస్సుచేతను (మంచి మనస్సుచేతను) పొందఁ దగినది; ఎవరు దీనినెఱుంగుదురో వారు అమృతు (సుఖదుఃఖరహితు) లగుదురు.

10. ఎప్పుడు పంచజ్ఞానేంద్రియములును మనస్సును శాంతమై యుండునో, బుద్ధియు నిర్వ్యాపారమైయుండునో; అప్పుడు దానిని అయవస్థను పరమగతియని పెద్దలు చెప్పుదురు.

11. స్థిరముగను, ఇంద్రియధారణముగలదిగను నుండు ఈయవస్థను యోగమని భావించెదరు; అప్పుడు(యోగవృత్తికాలమునందు, యోగి) ప్రమాదమును పొందనివాఁడగుచున్నాఁడు. (ఇంద్రియములను ఇష్టానుసారముగా వినియోగించుటవలనఁ గలుగుఅనర్థమును పొందనివాఁడగుచున్నాఁడు) ఏలన, యోగమనఁగా ఉత్పత్తినాశములు కలవి (అనఁగా,

ఇంద్రియములు తమతమవ్యాపారములను జేయుటకుప్రారంభించి,వెంటనే వానిని నిగ్రహించుటలేదా?)

12. (ఆత్మ) వాక్కుచేతను, మనస్సుచేతను, చక్షురాదీంద్రియ ములచేతను పొందఁదగినదికాదు. "ఉన్నది" అని చెప్పెడివానికంటె అది (ఆత్మ) ఇతరులయొద్ద ఎట్లులభించును? (అనఁగా ఆత్మ లేదనెడి నాస్తికులకు తెలియదని తాత్పర్యము)

13. (ఆత్మ) "ఉన్నది"అని తలంచి యథార్థస్వరూపమును బొందఁ దగినది; (అస్తి-నాస్తి) అను నీరెంటియందు 'అస్తి' అనియే భావించిన ఆత్మకు (జీవునకు) తత్త్వభావము సిద్ధించుచున్నది.

14. (జ్ఞానోదయముకలుగుటకు మునుపు) బుద్ధిని ఆశ్రయించి యున్నసకలకామములును ఎప్పుడు చెదరిపోవుచున్నవో అప్పుడు మను ష్యుఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు. ఇచ్చటనే బ్రహ్మమును బొందుచున్నాఁడు (బ్రహ్మ మేయగుచున్నాఁడు).

15. కామము లెట్లు నశించుననఁగా, ఇచ్చట బుద్ధియందలి బంధ ములు (అవిద్యవలనఁ గలిగిన నేను, నాశరీరము, నాధనము అనునివి మొదలగు అహంభావములు) సమస్తమును ఎప్పుడు వీడిపోవుచున్నవో, అప్పుడు కామములు నశించును. మనుష్యుఁడు అమృతత్వము నొందు చున్నాఁడు. ఇంతదనుక ఉపదేశము. (ఈయుపదేశము చాలును.)

16. (మంద బ్రహ్మవేత్తలకై చెప్పఁబడుచున్నది) హృదయమునకు (హృదయమునుండి వెలువడిన) నూఱును (అనేకమును), ఒక్కటియును (ముఖ్యమైనది ఒక్కటియును)నాడులుకలవు.వానిలో ముఖ్యమైన ఆయొ క్కనాడి మూర్ధమునుండి (బ్రహ్మరంధ్రమును ఛేదించికొని) వెలువడినట్టిది (అది సుషుమ్నానాడియనఁబడును); దానిచేత ఊర్ధ్వగమనమార్గముగా (బ్రహ్మలోకము మొదలగులోకములనుబొంది, అచ్చటనుండి అంతము నందు) అమృతత్వమును బొందుచున్నాఁడు; తక్కిననాడులు పలుగతులు గలవి; మరణమునకు (జననమరణములకు) నిమిత్తములైనవి.

17. ఈయుపనిషత్సారమెయ్యదియనఁగా పురుషుఁడు (బ్రహ్మము) అంగుష్ఠ ప్రమాణముగలవాఁడు హృదయము నందుండువాఁడు; అంత రాత్మసదా సర్వప్రాణులహృదయమున నుండువాఁడు; అట్టి (ఆత్మను) తన శరీరములోనుండి ధైర్యముతో ముంజదర్భమధ్యలోనుండు సన్నని

యీానను గ్రహించునట్లు గ్రహించి బయలుపఱచవలయును. పరిశుద్ధుఁడై అమృతస్వరూపుఁడై యుండువానిని (ఆత్మను) తెలిసికొనవలయును. ఆయాత్మ నెఱుంగవలయును.

18. తర్వాత, (ఉపదేశానంతరము) యమునిచే బోధింపఁబడిన మీఁద ఈ (బ్రహ్మ) విద్యను, సకల యోగవిధులను తెలిసికొని నచికేతుఁడు ధర్మాధర్మములను కామాదులను త్యజించినవాఁడై బ్రహ్మమును పొందిన వాఁడయ్యెను. ఇట్లు ఎవ్వఁడు అధ్యాత్మమును (ఆత్మభావమును) తెలిసికొనుచున్నాఁడో వాఁడును ఇట్టిస్థితినిఁ బొందును.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

సహానావవ త్వితి శాన్తి

కఠోపనిషత్తు సమాప్తము.

# 4. ప్రశ్నోపనిషత్తు

భద్రం కర్ణేభి రితి శాన్తిః.

1. ౧ భరద్వాజ ఋషికుమారుఁడు సుకేశఋషియును, ౨ శిబి ఋషిపుత్త్రుఁడు సత్యకామఋషియును, 3 సౌర్యనిసూనుఁడు సౌర్యాయణిఋషియును, ౪ గర్గగోత్రస్థుఁడైన ఆశ్వలాయనుని తనయుఁడు కౌశల్యఋషియును, ౫ విదర్భఋషికొడుకు భార్గవఋషియును, ౬ కత్యాయన ఋషిసంతతివాఁడగు కబంధిఋషియును, (నీయాఱ్వురును కర్మతులై) బ్రహ్మము నెఱుంగ నిచ్ఛగలవారై, పిప్పలాదఋషి సర్వమును బోధించునని నిశ్చయించి సమిత్పాణులై పిప్పలాదఋషికడకుఁ జనిరి.

2. పిప్పలాదఋషి వారిని జూచి యిట్లనిరి:—"మరల మీరు తపస్సుతో (ఇంద్రియనిగ్రహముతో) శ్రద్ధగల బ్రహ్మచర్యవ్రతులై ఒకసంవత్సరము (గురుశుశ్రూష చేయుచు) ఉండవలయును. పిదప మీ యిష్టప్రకారము అడిగినయెడల చెప్పెదను; సమస్తమును జెప్పెదను" అనిః

3. తర్వాత (ఒకసంవత్సరము నకు తర్వాత) కబంధియు కాత్యాయనుఁడునువచ్చి, (పిప్పలాదుని జూచి) "భగవంతుఁడా! ఈప్రజలు దేని నుండి పుట్టుచున్నారు?" అని యడిగెను.

4. పిప్పలాదుఁ డనియె:— ప్రజాపతి (పరమాత్మ) ప్రజలను సృష్టి చేయుటకిచ్ఛయించి(అట్లగుఁగాకయని) తపస్సుచేసెను(అనఁగా తలంచెను) ఇట్లుతపస్సుచేసి అన్నము,ప్రాణము(చంద్రుఁడు,సూర్యుఁడు)అగు నీమిథునమువాని వివిధములైన ప్రజలనుసృష్టిచేయఁగలవని(తలంచి)సృష్టించెను.

5. ప్రాణమనఁగా సూర్యుఁడు (అగ్ని, భక్షించువాఁడు); అన్నమనఁగా చంద్రుఁడు(అన్నము, దాహ్యవస్తువు);ఏదేదిస్థూలముగను సూక్ష్మముగనున్నదో అదియంతయు (ప్రపంచమంతయు) మూర్తమైయున్నది.

6. సూర్యుఁడు ఉదయమై (ఏప్రకాశముచేత) తూర్పుదిక్కును ప్రకాశింపఁజేయుచున్నాఁడో, ఆప్రకాశముచేత ఆదిక్కులోనుండు ప్రాణులను తనకిరణములచేత ప్రాణమునిచ్చుచున్నాఁడు. అట్లే దక్షిణము, పడమర, ఉత్తరము,దిగువ, మీఁద,మూల అనునీదిక్కులలోనుండువారికిని ఇంకనుగల ప్రదేశములోనుండు సకలప్రాణులకును ఇచ్చుచున్నాఁడు.

7. ఇతఁడే (సూర్యుఁడే) సర్వాత్మ, విశ్వరూపుఁడు, ప్రాణము, అగ్నిస్వరూపముతో మీఁది కెగయుచున్నాఁడు.

8. సూర్యుని విశ్వరూపుఁడుగను, కిరణముగలవాఁడుగను, జ్ఞానముగలవాఁడుగను, సకలప్రాణులకును అశ్రయుఁడుగను, జ్యోతిస్సుగను, అద్వితీయుఁడుగను (జ్ఞానులు) తెలిసికొనెదరు. (ఇతఁడు) అనేకకిరణములు గలవాఁడు, పలురూపములుగనుండువాఁడు, ప్రాణము, ప్రజలకొఱకు ఉదయించువాఁడు.

9. (ఆమిథునమే) సంవత్సరము, ప్రజాపతి (కాలాత్మ, బ్రహ్మము), దానికి రెండుఅయనములు(మార్గములు), ఒకటి దక్షిణాయనము, వేఱొకటి ఉత్తరాయనము. ఎవరు దానిని అగ్నిహోత్రము, తపస్సు, సత్యము, దేవపూజ, అతిథిపూజ, వైశ్వదేవము మొదలగుఇష్టములను, వాపీకూపతటాకాదిప్రతిష్ఠలు, దేవాలయనిర్మాణము, అన్నదానము మొదలగుపూర్తములనుచేయుచు ఉపాసించెదరో వారు చంద్రలోకమును బొందుదురు; వారు మరల జననమొందుదురు. కావున ఈఋషులు ప్రజాకాములై దక్షిణాయనమును (చంద్రుని) పొందుదురు. ఈచంద్రుఁడే పితృయానము (పితృలోకమార్గము).

10. తర్వాత ఉత్తరాయణముచేత (ఉత్తరాయణమునందు) తపస్సుచేతను, బ్రహ్మచర్యము చేతను, శ్రద్ధచేతను, ఆత్మవిద్యచేతను,

సూర్యుని భజించుచున్నారు; ఈసూర్యుఁడే సకలప్రాణులకును స్థానము; ఇదే అమృతము, అభయము, పరాయణము, ఇచ్చటనుండి మరల జనన మొందరు; దీనిని అవిద్వాంసులుపొందరు (అనఁగా బ్రహ్మజ్ఞానులు మాత్రమే పొందుదురు).

11. ఐదుపాదములుగలవాఁడును, (ఆఱుఋతువులలో హేమంత శిశిరఋతువులు రెండునుచేరి యొక్కటిగాలెక్కించిన అయిదగును. 1వసంతము,2 గ్రీష్మము, 3 వర్షము, 4 శరత్తు,5 హేమంతశిశిరములు, ఇవి ఏను 5 పాదములు) పండ్రెండువిధములగు ఆకృతులు (అవయవములు) గల వాఁడును, (అందఱను సృష్టించుటవలన) పితయైనవాఁడును, జలముగల వాఁడును, (కాలాత్మను) దేవలోకమునకు మీఁదనుండుపగమాత్మను సమస్తమునకును మీఁదనుండునట్లు కాలము నెఱింగినవారు కొందఱు చెప్పెదరు. మఱికొందఱు సర్వజ్ఞుఁడై యుండువానిని ఆఱు అరములు(ఆకులు) గల వానిగను, (ఆఱుఋతువులు ఆఱు అరములు) ఏడుగుఱ్ఱములుగట్టిన (రథమునందు) చక్రమునందుండువస్తువుగను, (ఆదిత్యుఁ డనుపేరుగల కాలాత్మగా) చెప్పెదరు. (బ్రహ్మమై, ప్రజాపతియై, కాలాత్మయై, సూర్య చంద్రమిథునమైయుండువస్తువే ప్రపంచమునకు కారణమని ఆప్రశ్నకు త్తరము).

12. మాసమే ప్రజాపతి (కాలాత్మ, ఆదిత్యుఁడు, బ్రహ్మము); దానియొక్కకృష్ణపక్షము అన్నము (చంద్రుఁడు); శుక్లపక్షము ప్రాణము (సూర్యుఁడు) కాఁబట్టి ఈఋషులు శుక్లపక్షమునందుముఖ్యముగా యాగమును చేయుచున్నారు; ఇతరులు ఇతరపక్షమునందు చేయుచున్నారు.

13. పగలును రాత్రియును గలదినమును ప్రజాపతియే; పగలు ప్రాణము (అనఁగా అన్నమును భక్షించెడి అగ్నిస్వరూపుఁడగు సూర్యుఁడు); రాత్రియేఅన్నము (అనఁగా అన్నస్వరూపుఁడగుచంద్రుఁడు); ఎవరు పగటియందు రతికారణమైనస్త్రీతో సంయోగము చేయుదురో వారు తమప్రాణమును నశింపఁ జేసికొనెదరు (అల్పాయుష్కులగుదురు); ఎవరు రాత్రియందు (గృహస్థధర్మముప్రకారము) సంభోగముచేయుదురో వారికి బ్రహ్మచర్యమును జ్ఞానమును లభించును. (అనఁగా గృహస్థుఁడు నియమమునననుసరించిచేయు సంయోగము బ్రహ్మచర్యవ్రతమువంటిదని యభిప్రాయము).

14. అన్నమే ప్రజాపతి; అన్నమునుండియే రేతస్సు కలుగు చున్నది; ఆ రేతస్సునుండి ఈ ప్రజలు కలుగుచున్నారు.

15. ఏగృహస్థులు ఆ ప్రజాపతి వ్రతమును (ఋతుకాలమెఱింగి సృష్టిసాధనమైనధర్మపత్నీసంభోగమును) చేయుచున్నారో, వారు మిథునమును (పుత్త్రీపుత్త్రులను) సృష్టించెదరు. ఎవరు తపస్సును, బ్రహ్మచర్యమును, సత్యమును అవలంబించియుందురో వారు పితృయానద్వారముగా చంద్రసంబంధమైన బ్రహ్మలోకమును బొందుదురు.

16. ఎవరియొద్ద కుటిలభావము, అబద్ధము, వంచన, ఇవి లేకుండునో వారు శుద్ధమైన బ్రహ్మలోకమును (దేవాయనము, లేక సూర్యలోకమును) పొందుదురు.

(కేవలకర్మఠులకు చంద్రలోకమును, జ్ఞానముతోఁగూడి కర్మము చేయువారికి సూర్యలోకమును గలుగును.)

---

## ద్వితీయ ప్రశ్నము

1. అనంతరము, భార్గవుఁడనుఋషి, పిప్పలాదఋషినిఁజూచి:— ఓభగవంతుఁడా! శరీరధారులై యుండు ప్రజలను ఎందఱు దేవతలుధరించుచున్నారు (ఆదరించెదరు)? ఏదేవతలు ఈశరీరమును ప్రకాశింపఁజేయుచున్నారు? ఈ దేవతలలో శ్రేష్ఠుఁడెవఁడు ?

2. పిప్పలాదఋషియిట్లనియె:—ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి ఈమహాభూతము లైదును, వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియములైదును, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను జ్ఞానేంద్రియములైదును, మనోబుద్ధిచిత్తాహంకారములను అంతఃకరణచతుష్టయమును, అనునీపందొమ్మిదిగురు దేవతలు (తత్త్వములు) శరీరమునుధరించుచున్నారు; వీరిలో పంచభూతములుతక్క తక్కిన 14 తత్త్వములు ప్రకాశించుచు చెప్పునది యేమనఁగా:—మేము ఈశరీరమును జాగ్రత్తగాపట్టుకొని ధరించుచున్నాము.

3. ఇట్లు అహంకరించిన వీరినిఁజూచి, శ్రేష్ఠుఁడైనప్రాణము (వాయువు) చెప్పిన దేమనఁగా:—మీ రిట్లు తెలియక మాటలాడవలదు; నేనే నన్ను అయిదువిధములుగావిభజించికొని ఈశరీరమునుబట్టుకొని ధరించుచున్నాను.

4. ఇట్లు వాయువు చెప్పినదానిని వీరు అలక్ష్యముచేసిరి. ప్రాణము వారియందుండు అభిమానముచేత (శరీరమునుండి) పైకి వెడలిపోయి నట్లు నటించెను; అట్లుచేయఁగా తక్కినవన్నియు (తక్కినతత్త్వములు) మీఁదికి వెడలిపోయినవి. ప్రాణము మరలివచ్చి శరీరమునందు ప్రవేశింపఁగానే తక్కిన తత్త్వములును వచ్చి ప్రవేశించెను. ఇదియెట్లున్నదనఁగా, తేనెటీఁగలు,తమయజమానుఁడు (పుష్పమునుండి) బయలువెడలునపుడు అన్నియు వెన్నంటిచనుచున్నవి; మరల (ఆయజమానుఁడు) వచ్చినపుడు తక్కినయీఁగలును వచ్చి చేరుచున్నవి (ఇట్లు వాయువు తనమహిమను దెలియఁజేసినమీఁద, తక్కినపదునాలుగు ఇంద్రియములును వాయుప్రభావము నెఱింగినవి.) పదునాలుగుతత్త్వములును విశ్వాసముగలవారై ప్రాణమును స్తుతించుచున్నారు.

5. "ఈప్రాణమే అగ్ని, సంతాపముచేయువాఁడు. సూర్యుఁడు, మేఘము, ఇంద్రుఁడు, వాయువు, పృథివి, చంద్రుఁడు, రూపమును కనఁబడువస్తువు, కనఁబడనివస్తువు" అయియున్నది. (అనఁగా, చక్షురాదీంద్రియములు ప్రాణమును స్తుతించుచున్నవి ; ఈప్రాణము అగ్నియై తపింపఁజేయుచున్నది; సూర్యుఁడై ప్రకాశించుచున్నది ; మేఘుఁడై (పర్జన్యుఁడై ) వర్షించుచున్నది; ఇంద్రుఁడై ప్రజలను పాలించుచున్నది; వాయువై మేఘమండలములను జ్యోతిర్మండలములను వహించుచున్నది; భూమియై సమస్తమును ధరించుచున్నది; చంద్రుఁడై సర్వమును వృద్ధిపొందించుచున్నది.)

6. "చక్రముయొక్కకంటియందుండు అరములవలె[చక్రముయొక్క పట్టాకును నాభికిని మధ్య నుండు ఆకులు (కోయ్యలు) అరము లనఁబడును] ప్రాణమునందు సర్వము నుంచఁబడియున్నది. ఇతఁడే (ప్రాణమే) ఋగ్యజుస్సామవేదములు; ప్రాణమే యజ్ఞము (పూజ); క్షత్రము (యాగము) బ్రహ్మము."

7. "ఓప్రాణమా! నీవే ప్రజాపతివి; గర్భమునందుండువాఁడవు; ప్రతిగావచ్చిజన్మించువాఁడవు; ఈప్రజలు నీకు బలిని(ఇంద్రియములద్వారముగా) తెచ్చియిచ్చుచున్నారు; ప్రాణములతోఁగూడ ఇంద్రియములతోఁగూడ) నున్నాఁడవు."

8. "ఓప్రాణమా! దేవతలకు ఉత్తమాగ్నిగను (అగ్నిముఖము మూలముగా దేవతలు హవిస్సును గ్రహించెదరు), పితృదేవతలకు (ముందు స్వీకరించెడి అన్నమైన) స్వధాగను, ఋషులకు (ఇంద్రియాదులకు) తమతమవ్యాపారములు చేయునట్లుగను, అథర్వవేదమునకు సత్యముగను (అథర్వవేదముగను) ఉన్నావు."

9. "ఓప్రాణమా! తేజస్సుచేత నీవే ఇంద్రుఁడవు; నీవే రుద్రుఁడవు; నీవే రక్షకుఁడవు; నీవే జ్యోతిస్సుల కధిపతివైనసూర్యుఁడవై ఆకాశమునందు సంచరించుచున్నాఁడవు."

10 "ఓప్రాణమా! ఎప్పుడు నీవు వర్షించెదవో, అప్పుడు నీప్రజలు ఆనందస్వరూపులయ్యెదరు; వారియొక్క ఇష్టముప్రకారము అన్నము లభించుచున్నది."

11. "ఓప్రాణమా! నీవు పరిశుద్ధుఁడవు(అథర్వవేదములకు ప్రసిద్ధమైయుండు)ఏకఋషివి;భుజించువాఁడవు(అగ్నివి); జగమునకుసత్పతివి; మేము నీకు భక్షించుటకుఁ దగినవస్తువును (హవిస్సును)ఇచ్చెడివారము; నీవు మాకు తండ్రివై యున్నాఁడవు."

12. "వాక్కునందు(అపానరూపముగను), శ్రోత్రమునందు(వ్యానరూపముగను), నేత్రమునందు(ప్రాణరూపముగను),మనస్సునందు(సమానరూపముగను) నీశరీరము ప్రతిష్ఠింపఁబడియున్నది. అట్టి నీదివ్యశరీరమును మంగళకరముగాఁజేయుము; మీఁదికెగసి (లేచి) పోవలదు."

13. "ఈప్రపంచమంతయును దేవలోకమునందుండు దేవతలు సైతము ప్రాణముయొక్క స్వాధీనమునందున్నది; తల్లి తనపుత్త్రులనెట్లు రక్షించునో అట్లు (మమ్ము) రక్షింపుము; సంపదను, జ్ఞానమును మాకొసంగుము."

---

## తృతీయప్రశ్నము

1. అనంతరము ఆశ్వలాయనునికుమారుఁడు కౌశల్యుఁడనుఋషి, పిప్పలాదఋషినిఁ జూచి:—"ఓపూజ్యుఁడా! ఈప్రాణముఎట్లు కలిగెను? ఈశరీరమునం దెట్లు ప్రవేశించుచున్నాఁడు? తనస్వరూపమును ఎట్లు విభాగించికొని యున్నాఁడు? దేనిచేత మీఁదికెగసిపోవుచున్నాఁడు? ఏ ప్రకారముగా(అధిభూతము, అధిదైవతము,అధ్యాత్మము)బాహ్యమును

ధరించుచున్నాడు? అధ్యాత్మమును (జీవుని) ఎట్లు పొందియున్నాడు? అను నీయాఱు ప్రశ్నముల నడిగెను.

2. పిప్పలాదుఁ డిట్లనియె:——నీవు అధికముగా ప్రశ్న లడిగెదవు? బ్రహ్మవేత్తవైయున్నావు; కాఁబట్టి నీకు జెప్పెదను. (గురువును అతిప్రశ్న లడుగరాదని తాత్పర్యము)

3. ఈప్రాణము ఆత్మ(బ్రహ్మము) నుండి కలుగుచున్నాఁడు; పురుషునియందు నీడవలె కలుగుచున్నాఁడు. బ్రహ్మమునందు ఇది (ప్రాణమను పేరుగలనీడ యనెడి కల్పితస్వరూపము.) ఉంచఁబడియున్నది; మనోవ్యాపారముచేత (సంకల్పము, ఇచ్ఛ అనువీనిచేఁగలిగిన కర్మనిమిత్తముచేత) ఈశరీరమునందు ప్రవేశించుచున్నాఁడు.

4. రాజు, తనకులోఁబడిన అధికారులను, ఈ యీగ్రామములలో వసించి అధికారములను జేయుచుండుఁడని నియమించునట్లు, ఈప్రాణము తక్కినప్రాణములను (చక్షురాదీంద్రియములను) ప్రత్యేకప్రత్యేకముగా నియోగించుచున్నాఁడు.

5. పాయువు ఉపస్థము అను వీనియందు అపానవాయువును, కన్నులు చెవులు నోరుఅను వీనియందు తానే స్వయముగా ప్రాణవాయువును, నాభియందు సమానవాయువును ఉంచఁబడి యున్నవి; సమానవాయువు భుజించిన అన్నమును సమానము (జీర్ణము) చేయుచున్నది, కావున నేత్రాది సప్తేంద్రియములను సప్తప్రకాశములుగా (సప్తజ్వాలలుగా) అగుచున్నవి. (నేత్రములు రెండు, శ్రోత్రములు రెండు, నాసికలు రెండు రసనమను ముఖము ఒకటి, అనునీయేడును సప్తజ్వాలలు.)

6. హృదయమునందు (ప్రాణాపానములనడుమ పద్మాకారమై యుండు మాంసపిండమునందు) ఈయాత్మ (లింగాత్మ, జీవాత్మ) ఉన్నది. ఈహృదయమునందు నూటఒక్క 101 ప్రధాననాడులు గలవు; వానిలో నొక్కొక్కనాడియందుండి నూఱు 100 నూఱు 100 (అనఁగా నూఱేసి) శాఖానాడులు పుట్టియున్నవి. వీనియందుండి (శాఖానాడులయందుండి వేర్వేఱుగా డెబ్బదిరెండువేలు 72000 డెబ్బది రెండువేలు 72000 ప్రతిశాఖానాడులు పుట్టియున్నవి; (ఇవియన్నియు చేరి 72,72,10,201 నాడులు అగుచున్నవి). ఈనాడులన్నిటిలో వ్యానవా

యువు సంచరించుచున్నది. ముఖ్యప్రాణవాయు భేదమగు వ్యానవాయువు సర్వత్ర వ్యాపించియున్నది.

7. ఈ నాడులలో ముఖ్యమైన సుషుమ్నానాడీమార్గముగా ఉదానవాయువు(మీఁదికి లేచెడు వాయువు)సంచరించుచున్నది; పుణ్యము చేసినవారిని పుణ్యలోకమునందును, పాపము చేసినవారిని నరకలోకము నందును (తిర్యగ్జంతు రూపముగను) పుణ్యపాపములు రెండును సమముగాఁ జేసినవారిని మనుష్యలోకమునందును (మనుష్యరూపముగను) ఈ ఉదానవాయువు చేర్చుచున్నది.

8. సూర్యుఁడు (అగ్నిమండలము) వెలువడినప్రాణము; ప్రాణముల యొక్క అధిదైవతము చెప్పఁబడుచున్నది:— మీఁది కెగయుచున్నాఁడు; చక్షుస్సంబంధమైన (ఆధ్యాత్మమైన) ప్రాణమును (దృష్టి మొదలగు శక్తుల నిచ్చి) అనుగ్రహించుచున్నాఁడు; భూదేవత (భూమండలము) అపానవాయువు; శరీరమందుండు అపానవాయువును (దిగువపడకుండను మీఁది కెగయకుండ మనుష్యుని పట్టి లాగి) అనుగ్రహించుచున్నది; అంతరిక్షము (బయలు) సమానవాయువు; శరీరమందుండు సమానవాయువును అనుగ్రహించుచున్నది; వాయు శరీరములోనుండు వ్యానవాయువును సర్వత్ర ప్రవేశించునట్లు అనుగ్రహించుచున్నది.

9. తేజస్సు (నక్షత్రము, మెఱుము మొదలగు తేజస్సులు)ఉదాన వాయువు; శరీరమందుండు ఉదానవాయువును అనుగ్రహించుచున్నది; ఉదానవాయువు పోయినమీఁద తేజస్సుపోవుచున్నది (ఉదానవాయువు పోయినమీఁద ప్రేతమైపోవుచున్నది); ఈ తేజస్సే మనస్సునందు ప్రవేశించియున్న వాగాదీంద్రియములతోఁగూడ మరల పుట్టుచున్నది.

10. మరణకాలమునందు ఏసంకల్పముతో ప్రాణమును విడుచుచున్నాఁడో,ఆసంకల్పప్రకారము ముఖ్యప్రాణవృత్తితోఁ గూడుచున్నాఁడు (ప్రాణవాయువునందు లీనమైయున్నాఁడు); ఆప్రాణవాయువు తేజస్సు (ఉదానవాయువు) తోఁగూడి మహాత్మచే నియమింపఁబడిన లోకమును (అనఁగా మరణకాలమునందు తానుకోరినదానికిఁ దగిన లోకమును) పొందుచున్నాఁడు.

11. ప్రాణమును ఈరీతిగాఁ దెలిసికొన్నవానియొక్క సంతానము నాశముకాదు; అమృతమునొందును; ఈవిషయమునందు (దిగువఁ జెప్పఁబడిన) ఈమంత్రములు కలవు.

2. ఎవఁడు, ప్రాణముయొక్క ఉత్పత్తిని, మనస్సంకల్పముచేత (అనఁగా పుణ్యపాపములచేత) మరల శరీరమునుపొందుటయును,చక్షురాది స్వరూపములయొక్క స్థానమును (వానివాని వ్యాపారములచేఁ గలిగిన అధికారమును), అయిదువిధములుగా (ఆదిత్య, పృథివీ దేవత, ఆకాశ, వాయు, తేజస్సు అని) విభజింపఁబడియుండుటయును, అధ్యాత్మత్వమును తెలిసికొనునో, వాఁడు అమృతత్వమును (మరణ రహిత స్థితిని) పొందుచున్నాఁడు.

## చతుర్థప్రశ్నము

1. తర్వాత, సౌర్యాయణియనుఋషి పిప్పలాదఋషినిఁ జూచి ఓభగవంతుఁడా! ఈపురుషునియందు ఎవి నిద్రించుచున్నవి? ఎవి మేల్కొనియున్నవి? ఏదేవుఁడు స్వప్నమునుజూచుచున్నాఁడు? ఎవనికి (సుషుప్తి) సుఖము ఉన్నది? ఎవనియందు సమస్తమును ప్రతిష్ఠింపఁబడియున్నది? (అను అయిదు ప్రశ్నలను) అని యడిగెను.

2. పిప్పలాదుఁ డిట్లనియె:—ఎట్లు అస్తమయమునుపొందెడి సూర్యునియొక్కకిరణములు ఏకమై సూర్యమండలమును పొందుచున్నవో ఎట్లు సూర్యోదయమగునపుడు మరల కిరణములు వ్యాపించుచున్నవో, అట్లు దశేంద్రియములును ఉత్కృష్టమైన మనస్సునందు ఒక్కటైచేయుచున్నవి. కావున ఈపురుషుఁడు వినుటలేదు, మాటలాడుటలేదు, మూర్కొనుటలేదు, రుచిచూచుటలేదు, తాఁకుటలేదు, మాటాడుటలేదు, తీసికొనుటలేదు, ఆనందించుటలేదు, దిగువవిడుచుటలేదు, నడుచుటలేదు, అప్పుడు (ఇట్టిసమయమునందు లోకులు) నిద్రించుచున్నాఁడని చెప్పెదరు.

3. ఈపట్టణమునందు (నవద్వారములు గలశరీరమునందు) ప్రాణాగ్నులు(అగ్నులవంటిపంచవాయువులు) మేలుకొనుచున్నవి(నిద్రించునప్పుడునుప్రాణములుతమతమవ్యాపారములనుచేయుచున్నవి). అపానవాయువునకు గార్హపత్యాగ్నియనిపేరు, ఈఅగ్నియాగమునందు యజమానుని సమీపమునందుండునది. ఎట్లుయాగమునందు గార్హపత్యాగ్నినుండి ఆహ

వనీయాగ్ని గ్రహింపఁబడుచున్నదో అట్లు అపానవాయువునుండి లేచి ప్రాణవాయువైన ఆహవనీయాగ్ని వాక్కు ఘ్రాణము అను వీనిద్వార ముగా సంచరించుటవలన ప్రాణమునకు ఆహవనీయాగ్ని యని పేరు. వ్యానవాయువు హృదయమునకు కుడివైపునుండురంధ్రము ద్వార ముగా సర్వత్ర నిండియున్నది; కాఁబట్టియే వ్యానవాయువు దక్షిణాగ్ని యని యాగమునందు కుడిప్రక్కనుంచెడిఅగ్ని యని) పేరు.

4. ఉచ్ఛ్వాసనిశ్వాసములను నీరెండుఆహుతులను సమముగా నయించుటచేత సమాన వాయువు (యాగమునందు) హోతగా నున్నాఁడు; మనస్సు(యాగమునందు)యజమానుఁడు; ఉదానవాయువు యాగఫలము; ఇదియజమానుని (మనస్సును) ప్రతిదినమును బ్రహ్మము నొద్ద (సుషుప్తికాలమునందు) చేర్చుచున్నది; (అనఁగా నిద్రించునపుడు పంచప్రాణములను, మనస్సునుమాత్రముతమవ్యాపారములనుచేయును. అనఁగా, ఉదానవాయువు, స్వర్గకాముఁడై యాగముచేసినవానిని మర ణానంతరము స్వర్గలోకమును జేర్చును. ఆప్రకారముగానే యీ ఉదా నవాయువు ఏవిధమైన యాగముచేతను పొందనలవిగాని పరబ్రహ్మ స్వరూపమును ప్రతిదినమునుసుషుప్తికాలమునందు పొందించుచున్నది.)

5. నీరిలోపల ఈదేవుఁడు (మనస్సు) స్వప్నమునందు మహిమను అనుభవించుచున్నది; ఇదివఱకుఁ జూచినదానిని చూచుచున్నది; వినినదా నిని వినుచున్నది; ఏయేచోటులందును ఏయేదిక్కులందును ఏదేది అను భవింపఁబడినదో దానిని అనుభవించుచున్నది. మఱియు, చూచినదానిని చూడనిదానిని, అనుభవింపఁబడినదానిని, అనుభవింపఁబడనిదానిని, సమ స్తమును స్వప్నమునందు (మనస్సు) చూచుచున్నది.

6. ఎప్పుడు మనస్సనెడి దేవుఁడు (చిద్రూపబ్రహ్మము, లేక విజ్ఞాన స్వరూపము అనెడి) తేజస్సుచేత (శరీరమంతయు) వ్యాపించునో, అప్పు డు సుషుప్తిసమయము కావున, స్వప్నమును జూచుట లేదు. అనఁగా, అప్పుడు ఈశరీరమునందు సుఖము (సుషుప్తి సుఖము) కలుగు చున్నది.

7. ఎట్లు, పక్షులు వసించుటకై వృక్షమును గూర్చిపోవునో,అట్లు (ఇఁక చెప్పఁబోవు) సమస్తమును పరమాత్మను గూర్చి పోవుచున్నది. (అనఁగా పరమాత్మను పొందును.)

8. (మీఁదఁజెప్పిన సమస్తమును అనఁగా నేమేమి?) పృథివ్యప్తేజోవాయ్వాకాశాది పంచభూతములును, శబ్దస్పర్శరూపరసగంధములను పంచతన్మాత్రలును (తన్మాత్రలనఁగా సూక్ష్మభూతములు), త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను జ్ఞానేంద్రియపంచకమును, వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియపంచకమును, కర్మేంద్రియ జ్ఞానేంద్రియ విషయదశకమును, మనోబుద్ధిచిత్తాహంకారములను అంతఃకరణ చతుష్టయమును, అంతఃకరణవిషయములును, తేజస్సును (శరీరోష్ణభావము) తేజోవిషయమును, ప్రాణమును, ప్రాణవిషయమును, సమస్తమును(కార్యకారణసంఘాతమంతయు జీవాత్మను పొందుచున్నది.)

9. ఈ (జీవుఁడే) పురుషుఁడే చూచువాఁడు, వినువాఁడు, మూర్కొనువాఁడు, రుచిచూచువాఁడు, తలంచువాఁడు, తెలిసికొనువాఁడు, చేయువాఁడు, విజ్ఞానాత్మ(జీవాత్మ); ఈపురుషుఁడే పరముగను అక్షరముగనునుండు పరబ్రహ్మమును పొందుచున్నాఁడు.

10. ఎవఁడు (పరబ్రహ్మమును) అజ్ఞానరహితుఁడుగను,అశరీరిగను, గుణరహితుఁడుగను, పరిశుద్ధుఁడుగను, నాశరహితుఁడుగను ఉండునట్లు తెలిసికొనుచున్నాఁడో, వాఁడు పరబ్రహ్మమును పొందుచున్నాఁడు; వాఁడు (పరబ్రహ్మలక్షణము నెఱింగినవాఁడు) సర్వజ్ఞుఁడున్నై యున్నాఁడు; మఱియు, సర్వస్వరూపమై (సమస్తమై) యున్నాఁడు; ఈవిషయమునం దీదిగువ నుదాహరించిన మంత్రము కలదు.

11. విజ్ఞానాత్మ (జీవాత్మ) సకల దేవతలతోఁడను (చక్షురభిమానులైన అగ్న్యాదిదేవతలతోఁడను) ప్రాణములును, భూతములును దేనియందుంచఁబడియున్నదో దానిని అక్షరమైనబ్రహ్మమని యెవఁ డెఱుఁగునో, వాఁడేసర్వజ్ఞుఁడు; సమస్తమునందును ప్రవేశించుచున్నాఁడు.



## పంచమప్రశ్నము

1. తర్వాత శిబిపుత్త్రుఁడైన సత్యకాముఁడనుఋషి పిప్పలాద ఋషినిఁజూచి:—"ఓపూజ్యుఁడా! మనుష్యులలో ఎవఁడు ఆయుః పర్యంతము ఓంకారధ్యానము చేయునో, వాఁడు ఏలోకమును బొందును"అనియడిగెను.

2. పిప్పలాదుఁడు సత్యకామఋషి కిట్లనియె:—సత్యకామా! ఏకారణముచేత ఓంకారము పరబ్రహ్మస్వరూపముగను, అపరబ్రహ్మ (జీవాత్మ) స్వరూపముగను నున్నదో, ఆకారణముచేత ఈప్రణవమును ధ్యానించువాఁడు పరాపరములలో నొక్క దానిని పొందును.

3. ఆప్రణవోపాసకుఁడు ఏకమాత్రగల ఓంకారమును (అనఁగా అకారమును, ఋగ్వేదమును) ధ్యానించువాఁడు దానిచేతనే బోధింపఁబడినవాఁడై, మనుష్యలోకమునందు పుట్టుచున్నాఁడు (అనఁగా ఉత్తమ మనుష్యజన్మమును బొందును)

4. రెండవమాత్రయగు ఓంకారమును (అనఁగా ఉకారమును, యజుర్వేదమును) ధ్యానించువాఁడు అంతరిక్షమగు చంద్రలోకమును బొందుచున్నాఁడు.

5. ఎవఁడు ఓంకారమును అకార ఉకార మకారములను మూఁడుమాత్రలతోఁగూడినట్టిసూర్యమండలాంతర్వర్తియగు పరమాత్మ స్వరూపముగా ధ్యానించునో, వాఁడు సూర్యతేజస్సంపన్నుఁడై సర్పము తోలు దోఁచునట్లు, పాపవిముక్తుఁడై సామవేదప్రభావముచేత (అ-ఉ-మ- ఓం. ఇదిసామవేదము) బ్రహ్మలోకమును పొందుచున్నాఁడు. ఇట్లు బ్రహ్మ (హిరణ్యగర్భ) లోకమును పొందినవాఁడు సర్వశరీరముల యందును ప్రవేశించియున్న పరమపురుషస్వరూపమైన పరమాత్మను చూచుచున్నాఁడు.

6. ఓంకారముయొక్క అకారఉకారమకారములనుమూఁడుమాత్రలును మృత్యువుతోఁ గూడినవి. అట్టిమృత్యువుగలమాత్రలను బ్రహ్మదృష్టిచేత ఏకము (ఓం) కావించిపరమాత్మధ్యానమునందుప్రయోగింపఁబడినయెడల మృత్యుదోషములేని అమృతత్వమగుచున్నది. ఏయోగి మాత్రాత్రయమును చక్కఁగానెఱుఁగునో అతఁడుజాగ్రత్స్వప్నసుషుప్తి కాలములయందు చలింపకుండును.

7. ఋగ్వేదముచేత మనుష్యలోకమును, యజుర్వేదముచేత అంతరిక్ష (చంద్ర)లోకమును, సామవేదముచేత బ్రహ్మలోకమును పొందించునట్టి ప్రణవ (ఓంకార) స్వరూపమును ఏవిద్వాంసుఁడు తెలిసికొనుచున్నాఁడో, అట్టివాఁడు జాగ్రదాద్యవస్థలును భయమును జరయును

మరణమును లేని శాశ్వతమును సత్యస్వరూపమును అమృతరయమ్ము నగు పరబ్రహ్మమును పొందుచున్నాఁడు.

---

## షష్ఠప్రశ్నము.

1. తర్వాత, భారద్వాజునికుమారుఁడు సుకేశఋషి పిప్పలాద ఋషినిఁజూచియిట్లనియె:—"ఓమహాత్మా! మున్నొకప్పుడు కోసల దేశాధిపతియైన హిరణ్యనాభుఁ డను రాజపుత్త్రుఁడు నాయొద్దకువచ్చి, 'పదు నాఱుకలలుగల పురుషుని నీవెఱుఁగుదువా?' యనినన్నడిగినాఁడు. నేను ఆరాజకుమారునిఁ జూచి "నాకుఁదెలియదు; తెలిసియుండినయెడల నేను చెప్పకుందునా? మఱియు, ఎవఁడు తెలిసిన దానిని తెలియదనియును, తెలియనిదానిని తెలియుననియును చెప్పుచున్నాఁడో వాఁడు సమూలముగా ఉభయలోకములందును భ్రష్టుఁడగుచున్నాఁడు. కావున నేను అబద్ధము చెప్పను." అనఁగానే, అతఁడు మాటాడకతనతేరినెక్కిచనెను. ఇప్పుడదే ప్రశ్నమును నేను నిన్నడుగుచున్నాఁడను. ఆపురుషుఁడు (పదునాఱుకలలుగలవాఁడు) ఎచ్చటనున్నాఁడు?" అని యడిగెను.

2. పిప్పలాదఋషి యిట్లనియె:—ఏపురుషునియొద్ద (ఇఁక చెప్పఁబోవు) ఈ పదునాఱుకలలును గలిగినవో, ఆపురుషుఁడు ఈశరీరమునందే యున్నాఁడు.

3. (ఎవరిని కర్తగానుంచుకొని ఏదేహమునందుండి) మనము మీఁదికెగయుచున్నామో, లేక మీఁదికెగరఁబోవు చున్నామో, ఏశరీరమునందు ప్రతిష్ఠితమైయున్నామో, అని ఆపురుషుఁడు (హిరణ్యగర్భుఁడు) ఆలోచించెను.

4. ఆహిరణ్యగర్భుఁడు ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి, ఇంద్రియము (దశేంద్రియములు), మనస్సు, అన్నము, బలము, తపస్సు, వేదములు, కర్మము, కర్మఫలముగుస్వర్గాది లోకములు, ప్రాణులనామములు అను నీపదునాఱుకలలను సృజించెను.

5. ఎట్లు సముద్రమునుండి ఉత్పత్తియైననదులు ప్రవహించుచు (గంగా) నామరూపములను బొందియుండి, మరల ఎట్లు సముద్రమును పొంది (చేరి) నామరూపరహితములై సముద్రమనియే వ్యవహరింపఁబడుచున్నవో, అట్లు పురుషునియొద్దనుండి కల్గినపదునాఱుకలలును

మరల పురుషునిఁబొంది దానిదాని నామరూపములను త్యజించికొని యెప్పటియట్లు పురుషుఁడనియే చెప్పఁబడుచున్నవి. అట్టి యీపురుషుఁడు ప్రాణాదికలలు లేనివాఁడుగను, మరణము లేనివాఁడుగనుఅగుచున్నాఁడు. ఆవిషయ మీాదిగువ చెప్పఁబడుచున్నది.

6. రథచక్రమునందలి అరములవలె ఈకలలు ఏపురుషునియొద్ద నుంచఁబడియున్నవో, అట్టి వేద్యుఁడగు పురుషుని (ఆత్మను) పొందుఁడు; మిమ్ము మృత్యువు (మరణము) బాధింపక యుండునుగాక !

7. పిప్పలాదఋషి (తనకడకువచ్చిన) సుకేశాదులగు ఆర్వురు ఋషులకును జెప్పినదేమనగా;..."ఇప్పుడు మీాకు నేనుచెప్పినంతమాత్రమే ఆపర బ్రహ్మమును గూర్చి యెఱుంగుదును; ఇంతకంటె వేఱేమియు లేదు" అనిచెప్పెను.

8. సుకేశాదులు పిప్పలాదఋషినిఁ జూచి యిట్లనిరి.- ఏమహా పురుషుఁడు అవిద్యనుండి తరింపఁజేసి మోక్షమార్గమునందు ప్రవేశింపఁ జేసినాఁడో, అట్టి పితయగు నీకు నమస్కారము. (నీవేతండ్రివి; మోక్ష విద్యోపదేశకుఁడు పితయగును.) బ్రహ్మఋషులకొఱకు నమస్కారము! బ్రహ్మఋషులకొఱకు నమస్కారము.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.
ఓమ్ భద్రం కర్ణేభి రితి శాన్తిః.
ప్రశ్నోపనిషత్తు సమాప్తము.

---

# 5. ముండకోపనిషత్తు.

భద్రం కర్ణేభి రితి శాన్తిః.

## ప్రథమముండకము.

### 1. ఖండము.

1. (ఇంద్రాది) దేవతలకంటె మొదటివాఁడు బ్రహ్మదేవుఁడు; అతఁడు జగమునంతయు సృజించెను; అతఁడు లోకరక్షకుఁడు ; అతఁడు సకల విద్యలకును స్థానమైనవాఁడు. అతఁడు తన జ్యేష్ఠపుత్త్రుఁడగు అథర్వుఁడనువానికొఱకు బ్రహ్మవిద్యను బోధించెను.

2. ఇట్లు బ్రహ్మదేవుఁడు అథర్వునికొఱకు ఉపదేశించిన బ్రహ్మవిద్యను అథర్వుఁడు అంగిరునకును, అంగిరుఁడు భారద్వాజునకును, భారద్వాజుఁడు అంగిరసునకును, పరంపరగా నుపదేశించిరి.

3. శౌనకుఁడనుఋషి బ్రహ్మవేత్తయగు అంగిరసునియొద్దకుఁబోయి "దేనిఁ దెలిసికొన్నతర్వాత ఈజగమంతయు తెలిసికొన్నట్లగును;" అనియడిగెను.

3. అంగిరస్సు శౌనకఋషి కిట్లనియె.—'పరా' అనియు, 'అపరా' అనియు రెండు విద్యలుగలవు ('పరా'అనఁగా బ్రహ్మమును గూర్చిన ఉపనిషత్తు; 'అపరా' అనఁగా స్వర్గాదిఫలము నిచ్చు కర్మకాండము.)

5. అందు అపరావిద్య యనఁగా:—ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, శిక్ష (అక్షరోత్పత్తిశాస్త్రము), కల్పము (కర్మవిధులు), వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము అనునివియన్నియు బ్రహ్మమును పొందించుటకు సాధకములైనవిగాన, 'అపరా' యనఁబడును. ఏది బ్రహ్మమును సాక్షాత్తుగా పొందించునో అది 'పరా' అనఁబడును.

6. బ్రహ్మము, లేక అక్షర మనునది యేదియనగా:—ఏది చూడఁబడనిదో (జ్ఞానేంద్రియముల కందనిదో), గ్రహింపఁబడనిదో (కర్మేంద్రియముల కందనిదో), గోత్రము (మూలము) లేనిదో, వర్ణము (గుణము) లేనిదో, నేత్రాదులు (జ్ఞానేంద్రియములు) లేనిదో, కరచరణాదులు(కర్మేంద్రియములు) లేనిదో, నిత్యవస్తువైనదో, విభువైనదో, సర్వత్రపూర్ణమైనదో, అతిసూక్ష్మవస్తువైనదో, నాశము లేనిదో, భూతములకు కారణమైనదో, దానిని వివేకులు సర్వత్ర చూచుచున్నారు.

7. ఎట్లు పట్టుపురుగు నూలిని సృష్టించి మరల గ్రహించి కొనుచున్నదో, ఎట్లు భూమిలో ఓషధులు పుట్టుచున్నవో, ఎట్లు జీవితుఁడైయుండు పురుషుని శరీరమునందు రోమములు మొలచుచున్నవో అట్లు అక్షరబ్రహ్మమునొద్దనుండి యీప్రపంచము కలుగుచున్నది.

8. ఆబ్రహ్మమునకు ప్రపంచమును సృష్టిచేయవలయునని యిచ్ఛ కల్గెను (అనఁగా నిర్గుణబ్రహ్మము సగుణబ్రహ్మమైనది). ఆబ్రహ్మమునొద్దనుండి అవ్యాకృతతత్త్వము (అన్నము - మాయ-శక్తి) కల్గెను; అవ్యాకృతమునుండి హిరణ్యగర్భుఁడు(ప్రాణము) కల్గెను; హిరణ్యగర్భుని

యొద్దనుండి సత్యము అనుపంచభూతములు కలిగెను; ఆభూతములనుండి భూలోకాదిలోకములు గల్గెను; వానిలో (మనుష్యులకుఁదగిన) కర్మములు కల్గెను; వానియందుండి (స్వర్గాదిఫలమైన) అమృతము కలిగెను.

౧. ఏబ్రహ్మము సమస్తము నెఱింగినవాఁడో, ఇంకను విశేషముగాఁ దెలిసికొన్నవాఁడో, ఎవనితపస్సు జ్ఞానమయమైనదో, అతని యొద్దనుండి హిరణ్యగర్భుఁడును, (దేవదత్తాది) నామములును, (వ్రీహియవాది) రూపములును, అన్నమును కలిగెను.

## 2. ఖండము

1. (ఇఁకచెప్పఁబడునది) సత్యమైనది. ఏకర్మములు వేదవిహితములైనవో, ఏకర్మములు వివేకజ్ఞులచే ననుష్ఠింపఁబడుచున్నవో, ఎవి హోతా, అధ్వర్యు, ఉద్గాత అను మువ్వురు అధికారులయొద్దనుండి అనేకవిధములుగా ప్రవర్తిల్లుచున్నవో, ఆకర్మములను సత్యమైన ఫలాభిలాషగల వారలై నియతము (నిత్యము) గాచేయుఁడు. పుణ్యఫలమును (సత్కర్మాచరణఫలమును) బొందుట కిదియేమార్గము.

2. చక్కఁగా ప్రజ్వలింపఁజేసినఅగ్నియందు ఎప్పుడు శిఖలతోఁగూడి వెలుంగుచున్నదో, అప్పుడు విధిప్రకారము ఆజ్యాహుతుల నర్పింపవలయును, (అనఁగా హోమము చేయవలయును.)

3. ఎవనియొక్క అగ్నిహోత్రము అమావాస్య, పూర్ణిమ, చాతుర్మాస్యము, శరదాదికాలము (అనునీకాలములయందు అగ్నిహోత్రకర్మము) చేయకయును, అతిథివర్జితముగను విధిప్రకారముగను చేయఁబడక యుండునో, అట్టివానికి భూలోకము మొదలు ఏడు లోకముల (సత్యలోకము) వఱకును (వాఁడాచరించిన కర్మఫలము) నశించుచున్నది (అనఁగా అట్టివానికి ఏడులోకములందును ప్రతిబంధముకల్గును. మఱియును, పూర్వులైన పితృపితామహప్రపితామహులను, అనంతర పుత్త్రపౌత్త్రప్రపౌత్త్రులనువానితోఁగూడ నేడ్వురు పురుషులను నశింపఁజేయును. అని కొందఱ యభిప్రాయము.)

4. అగ్నికి ఏడునాలుకలు (జ్వాలలు) కలవు. అవి కాళి, కరాళి, మనోజవ, సులోహిత, సుధూమ్రవర్ణ, స్ఫులింగిని, విశ్వరూప అనునివి.

5. ఈఏడుజ్వాలలును జ్వలించుచుండునపుడు కాలమతిక్రమింపక చేయునట్టి అగ్నిహోత్రకర్మముయొక్క ఆహుతులు సూర్యకిరణములై

యజమానుని గ్రహించి (ఎత్తికొని) ఇంద్రుఁడుండు స్వర్గలోకమునందుఁ జేర్చును.

6. చక్కఁగా ప్రకాశించు ఆహుతులు ఆయజమానుని రమ్ము! రమ్ము! అని పిలిచి పూజించి సూర్యకిరణములద్వారముగా మంచిమాటలచే గౌరవించి, ఇది మీరు కావించిన సత్కర్మపుణ్యఫలమని చెప్పుచు బ్రహ్మలోకమును (స్వర్గలోకమును) జేర్చుచున్నవి.

7. యజ్ఞరూపములైన యీకర్మములు నాశశీలములైనవి; పదునెనమండ్రుగురు (ఋత్విక్కులు పదునాఱుగురు, యజమానుఁడొకఁడు, యజమానునిపత్ని యొకర్తు అను వీరుపదునెనమండ్రుగురు) చేరి చేయు యాగము శ్లాఘ్యమైనది కాదు. అనఁగా జ్ఞానమే శ్లాఘ్యమనిభావము; ఈయాగము (కర్మము) శ్రేష్ఠమని యేమూఢులు తలంచెదరో వారుజననమరణమును బొందుచుందురు.

8. అవిద్యామధ్యమునందుండు వారును, పండితులమని తమకుఁదామే పొగడికొనుచుండువారునుఅగు, మూఢులు గ్రుడ్డివానికి గ్రుడ్డివాఁడు దారిచూపునట్లు (చచ్చుచు పుట్టుచు) చరించుచుందురు.

9. అవిద్యయందు నానాప్రకారములుగా (దేవమనుష్యాదిరూపములతో పలుతెఱఁగులుగా) ప్రవర్తించుచుండువారును, తాము కృతార్థులమైతిమని తలంచికొని యుండువారును, కర్మమును వదలకయుండువారును అగు అజ్ఞానులు దుఃఖితులై, కర్మఫలహీనులై స్వర్గలోకమునుండి మరల జాఱిపడిపోవుచున్నారు.

10. శ్రౌతస్మార్తకర్మలు మాత్రమే శ్లాఘ్యములనియు, వేఱేదియు శ్లాఘ్యముకాదనియు తలంచెడిమూఢులు స్వర్గలోకమునుండి పుణ్యక్షయానంతరము భూలోకమునకు మరలుచున్నారు.

11. ఏజ్ఞానులు వనవాసులై, శాంతులై, భిక్షాటనపరులై (అనఁగా వానప్రస్థ సన్న్యాసాశ్రమధర్మము నవలంబించినవారై) యుందురో, వారు సూర్య (అర్చిరాది) మార్గముగా, పుణ్యపాపములులేనివారై, అమృతమయుఁడును, అవ్యయాత్ముఁడు నైనపురుషునియొద్దకుఁ (బ్రహ్మలోకమునకు) బోవుచున్నారు.

12. బ్రాహ్మణుఁడు (బ్రహ్మజ్ఞాని) కర్మముచేఁ గలుగులోకములయొక్క తారతమ్యమును పరీక్షించి తెలిసికొని, ఈసంసారమునందలి

సర్వపదార్థములును ప్రయోజనములేనివని గ్రహించి, వైరాగ్యమును బొంది. బ్రహ్మము నెఱుంగుటకై సమిత్పాణియై శ్రోత్రియుఁడును, బ్రహ్మనిష్ఠుఁడు నగు గురువును ఆశ్రయింపవలయును.

13. ఇట్లు చనినవాఁ డగు శాంతశమదమాది సద్గుణములుగల శిష్యునకు, ఆగురువు అక్షరమును, సత్యమును, పరమాత్మను దెలిసికొనుటకు సాధనము నగు బ్రహ్మవిద్యను ఉపదేశింపవలయును.

---

## ద్వితీయముండకము.

### 1. ఖండము.

1. ఆ బ్రహ్మవస్తువు సత్యము; ఎట్లు మిక్కిలిజ్వాలగల అగ్నియందుండి అనేకములగు స్ఫులింగములు (మిణుగురులు) లేచుచున్నవో, అట్లు అక్షర బ్రహ్మమునుండి అనేకవిధములగు జీవులు కలిగి యందే యణఁగుచున్నవి (బ్రహ్మవస్తువు తక్క తక్కినవన్నియు అసత్యమని యర్థము).

2. ఆ పురుషుఁడు దివ్యుఁడు, ఆకారములేనివాఁడు, బాహ్యాభ్యంతరములయందు నుండువాఁడు, ప్రాణములేనివాఁడు, మనస్సులేనివాఁడు, పరిశుద్ధుఁడు, అక్షరుఁడు, అవ్యాకృతమునకంటె అధికుఁడు.

3. ఈమహాపురుషునియొద్దనుండి ప్రాణము, సకలేంద్రియములు, పృథివ్యప్తేజో వాయ్వాకాశాదిపంచభూతములు, అను నివియన్నియుఁ గల్గెను.

4. ఈపురుషునకు శిరస్సు అగ్ని; నేత్రములు చద్రసూర్యులు; చెవులు దిక్కులు; వాక్కు వేదములు; ప్రాణము వాయువు; హృదయము ప్రపంచము; పాదములు పృథివి (అనఁగా, అగ్న్యాదులు ఆయాస్థానములందుండి పుట్టినవి); ఇతఁడు సర్వభూతాంతరాత్మ.

5. ఆపురుషునియొద్దనుండి అగ్ని కలిగెను; ఆయగ్నికి సమిత్తులు సూర్యుఁడు; ఆయగ్ని (ద్యులోకాగ్ని) వలన చంద్రుఁడు కల్గెను; ఆచంద్రునివలన మేఘముకల్గెను; మేఘమువలన భూమియందుండు ఓషధులు కల్గెను; ఓషధులవలన పురుషునిరేతస్సు కల్గెను. ఆరేతస్సు స్త్రీరజస్సుతోఁ గూడి అనేక ప్రజలు పుట్టిరి! ఇట్లు ఆపురుషుని (పరమాత్మ) వలన ప్రజలు కలుగుచున్నారు.

6. ఆపరమాత్మ వలన ఋగ్యజుస్సామములను వేదత్రయమును, యజ్ఞములును (అగ్నిహోత్రాదులును), యాగములును, దక్షిణలును, సంవత్సరాదికాలములును, యజమానుఁడును, సూర్యచంద్రాదిలోకములును కలిగెను.

7. ఆబ్రహ్మమువలన దేవతలును, సాధ్యులును, మనుష్యులును, మృగములును, పక్షులును, ప్రాణాపానములును, వ్రీహి (వడ్లు) యవ-(గోధుమ)ములును, తపస్సును, శ్రద్ధయును, సత్యమును, బ్రహ్మచర్యమును, విధులును, అగు నివి యన్నియును పుట్టెను.

8. ఆ పరవస్తువువలన సప్తప్రాణములును (అనఁగా చెవులు 2, కన్నులు 2, ముక్కుపుటములు 2, నోరు 1,), ఈసప్తప్రాణములను ప్రకాశింపఁజేసెడి కాళీకరాళీ మొదలగు సప్తజ్వాలలును, సప్తసమిధలును (అనఁగా విషయములును), సప్తహోమములును (అనఁగా విషయజ్ఞానములును), సప్తలోకములును కల్గెను. అవి హృదయమునందు ఏడేసి యేడేసిగా ఉంచఁబడినవి.

9. పరమపురుషునివలన సముద్రములు, పర్వతములు, నదులు, ఓషధులు, రుచి (రసము) ఇవియన్నియుఁ గలిగెను. రసముతోఁగూడిన అంతరాత్మ (జీవాత్మ) పృథివ్యాదిపంచభూతములచే నావరింపఁబడి గోచరించుచున్నాఁడు.

10 జగత్తు, కర్మము, తపస్సు, బ్రహ్మము, పరమామృతము అను నివియన్నియును ఆపరమాత్మయే. అట్టిపరమాత్మయే (మనుష్యుని) హృదయమునందు నున్నాఁడని యెవ్వఁడు తెలిసికొనునో, వాఁడు ఇచ్చటనే అవిద్యాబంధమునుండి విముక్తుఁడగును (అనఁగా బ్రహ్మస్వరూపిరైు జీవన్ముక్తుఁ డగునని భావము).

## 2. ఖండము.

1. ఆబ్రహ్మమే జ్యోతిస్సు; హృదయమునం దుండునట్టిది; గుహాచరుఁడను (బుద్ధిగుహాయిం దుండువాఁడని) పేరొందినది; మహత్పదము (సర్వస్థానమైనది), ఈజగమంతము (ఆమహాత్పదమునందు దానియందు) ఉంచఁబడియున్నది; అదే చలించునట్టిపక్షులు; అదే ప్రాణులు; అదే తెప్పపాట్లు; అదియే ఆకారముగలది; అదే ఆకారములేనిది; అదే శ్లాఘనీయ

మైనది ; అదే ప్రజలవిజ్ఞానముకంటెను శ్రేష్ఠమైనది ; అదే పరమోత్కృష్టమైనది; ఇట్టివస్తువును తెలిసికొనుఁడు.

2. ఏది కాంతిగలదియో, ఏది అణువుకంటెను అణువైనదో, దేనియందు ప్రపంచమును ప్రజలును ఉంచఁబడియున్నారో, అది అక్షరమైనపరబ్రహ్మము. ప్రాణము, వాక్కు, మనస్సు, సత్యము, అమృతము అనునవి యన్నియును అపరబ్రహ్మమే. అపరబ్రహ్మమును మనస్సుచేతనే తెలిసికొనవలయును.

3. ఔపనిషదమగుధనస్సును చేఁబూని, ఉపాసనచేవాఁడిగాఁ జేయఁబడినబాణమును సంధించి, బ్రహ్మభావన మను తెలివిచేలాగి, ఆయక్షర(పరమాత్మ)స్వరూపము గురిగాఁ జేసి భేదింపవలయును.

4. పైనిచెప్పఁబడినధనుస్సు ప్రణవము, బాణము ఆత్మ(జీవుఁడు), లక్ష్యము బ్రహ్మము; ఏకాగ్రచిత్తముచేత (లక్ష్యభూతమైనపరబ్రహ్మమును) వేధింపవలయును. బాణమువలె ఆత్మ లక్ష్యమైపోవును.

5. దేనియందు స్వర్గము, పృథివి, అంతరిక్షము, సకలప్రాణములతోఁగూడినమనస్సు, ఇవి గ్రుచ్చఁబడియున్నవో, (అట్టి) ఆయేకమైన ఆత్మను తెలిసికొనుఁడు. తక్కినవాక్యములను నిగ్రహింపుఁడు. ఇది అమృతమును పొందుటకు సేతువు.

6. దేనియందు నాడులు చక్రారములవలె (బండిఆకులవలె) లగ్నములయియున్నవో, అదిఅనేకవిధములుగానేర్పడి (సుఖదుఃఖస్వభావములనుబొంది) హృదయమునందు సంచరించుచున్నది. ఆయాత్మను 'ఓం' అనిధ్యానింపుఁడు; అందువలన, మీరు అజ్ఞానాంధకారమునుండి దాఁటుదురు. మీకు శుభము కల్గునుగాక.

7. ఎవఁడు సమస్తమునుసామాన్యముగా నెఱింగిన వాఁడో, ఎవఁడుసర్వమును విశేషముగాఁ దెలిసికొనువాఁడో, ఎవనికి భూమియందు మహిమయున్నదో, అట్టివాఁడు దివ్యమైన బ్రహ్మపుర మను మనస్సునందుదహరాకాశమునందు ప్రతిష్ఠింపఁబడియున్నాఁడు. అతఁడు మనోమయుఁడు, ప్రాణమును శరీరమును నడుపువాఁడు, అన్నమునందుండువాఁడు; అట్టియాత్మను బుద్ధిమంతులు (జ్ఞానులు) హృత్పద్మరంధ్రమునందు స్థాపించి, సర్వత్ర వ్యాపించియున్నాఁడని తెలిసికొనుచున్నారు (వివేకులు,సర్వమును బ్రహ్మానందమయముగాభావించుచున్నారని తా॥).

8. (కారణస్వరూపముచే హెచ్చుగను, కార్యస్వరూపముచే తగ్గుగను నుండు) ఆపరాపరవస్తువును దర్శించినంతనే హృదయగ్రంథి భేదనమగును. సకలసంశయములు నివృత్తియగును. కర్మములునశించును.

9. జ్యోతిర్మయమైన హృదయగుహాయందుండువాఁడును, అవిద్యాదిదోషరహితుఁడును, నిరవయవుఁడును, పరిశుద్ధుఁడును, జ్యోతిస్సులకంటె జ్యోతియును, అగు పరబ్రహ్మమును ఎవ్వరు దర్శింతురో వారు ఆత్మవేత్త లయ్యెదరు.

10. ఆపరబ్రహ్మమునందు సూర్యుఁడు ప్రకాశింపఁడు, అట్లే చంద్రుఁడు, నక్షత్రములు, మెఱుము, అగ్ని అనునివియన్నియు ప్రకాశించుటలేదు. పైనిచెప్పిన సూర్యుఁడు మొదలగునవియన్నియు ఆ పరమాత్మవలననే ప్రకాశించుచున్నవి. ఈప్రపంచమంతయు ఆపరబ్రహ్మము వలననే ప్రకాశించుచున్నది.

11. ఈజగమంతయు బ్రహ్మము, ఆబ్రహ్మము కుడియెడమలను, ముందువెనుకలను, క్రిందుమీఁదులను, వ్యాపించియున్నది. ఈవిశ్వమును బ్రహ్మము. అదేశ్రేష్ఠమైనది. (అనఁగా సర్వము బ్రహ్మమయమునిభావము.)

---

## తృతీయముండకము.

### 1. ఖండము.

1. రెండుపక్షులు మంచిగమనముగలవి యొకటినొకటి యెడఁబాయకయుండును (అవి జీవాత్మ పరమాత్మ లను పేరుగలవి). ఆరెండును సమానఖ్యాతిగలవి; ఆరెండును ఒకేవృక్షమును (శరీరమును) ఆశ్రయించుకొని యుండును. వానిలోనొకటి (జీవుఁడు), (పుణ్యపాప) ఫలమును రుచితోఁగూడ భుజించును; వేఱొకటి ఊరక (దేనినిభుజింపక) చూచుచునుండును.

2. సమానవృక్షమునందు (జీవేశ్వరులకు సమానమైన శరీరమునందు) ప్రవేశించిన జీవుఁడు మాయచేత మోహమునుబొంది దుఃఖపడుచున్నాఁడు; ఎప్పుడు వేఱొకపరమాత్మను జూచుచున్నాఁడో, అప్పుడు దుఃఖరహితుఁడై మహిమ నొందుచున్నాఁడు.

3. ఎప్పుడు పరబ్రహ్మస్వరూపమును జూచుచున్నసాధకుఁడు (యోగి)జ్యోతిర్మయుఁడును, జగత్కర్తయును, యీశ్వరుఁడును, బ్రహ్మ

యోనియునుఅగు పరమాత్మను జూచుచున్నాఁడో, అప్పుడు ఆజ్ఞాని (యోగి) పుణ్యపాపములను తిరస్కరించి,నిర్లేపుఁడై (దేనినంటనివాఁడై) పరమసామ్యమును (అద్వైతమును) బొందుచున్నాఁడు.

4. ఎవఁడు భూతమయములై తేజరిల్లుచున్నాఁడో, అతఁడే ప్రాణము.ఇట్లుసకలభూతములలోనుండుప్రాణస్వరూపియగు పరమాత్మను దెలిసికొన్నవాఁడు దాని నతిక్రమింపఁడు. అందే (ఆపరమాత్మయందే క్రీడించుచుండును); దానియందే ప్రేమగలిగి యుండును; వాఁడు ఆత్మవ్యాపారము (చింతనము) నందే యుండును; వాఁడు బ్రహ్మవేత్తలకంటె శ్రేష్ఠుఁడు.

5. (ఆత్మస్వరూపమును పొందుటకు మిక్కిలి ప్రయత్నించుచుండు సన్న్యాసులు ఏపరమాత్మసర్వరూపమును జూచెదరో,) అట్టి ఈ ఆత్మను సత్యముచేతను, తపస్సుచేతను, జ్ఞానముచేతను, బ్రహ్మచర్యముచేతను పొందనగును. ఏయాత్మను పుణ్యాత్ములగు యతులు చూచెదరో, ఆయాత్మ శరీరమునడుమ (హృదయాకాశమున) జ్యోతిర్మయమును పరిశుద్ధమునై యున్నది.

6. సత్యమేజయించుచున్నది;అసత్యముజయించుటలేదు; సత్యము నకుస్థానమైన ఆశారహితులగుఋషులు ఏమార్గము (దేవయానము)చేత (మోక్షమునకు)పోవుచున్నారో, ఆమార్గము నిత్యముచేత విస్తృతము చేయఁబడినది.

7. ఆబ్రహ్మము మిక్కిలిగొప్పది; స్వయంప్రకాశమైనది; చింతింప నలవికానిది; అతిసూక్ష్మమైనది; అజ్ఞానులకు దూరమైయుండునది; జ్ఞానులకు సమీపమునందుండునది; వివేకులకు ఈదేహమందే (బుద్ధిగుహయందే) యున్నది.

8. నేత్రముచేఁగాని, వాక్కుచేఁగాని, ఇంద్రియముచేఁగాని, తపస్సుచేఁగాని, కర్మముచేఁగాని, (ఆబ్రహ్మము) గ్రహింపసాధ్యముకానిది. శుద్ధాంతఃకరణముతో ధ్యానించువాఁడు మాత్రమే ఆనిరవయవ మగు బ్రహ్మమును జూచుచున్నాఁడు.

9. ఈఆత్మ అణుస్వరూపము; దేనియందు ప్రాణము (ప్రాణాపానవ్యానఉదానసమానములను) అయిదువిధములుగా ప్రవేశించుచున్నదో, ఆశరీరమునందు ఆత్మస్వరూపమును విశుద్ధజ్ఞానముచేతను, (క్లేశరహిత)

చిత్తముచేతను తెలిసికొనఁదగినది. ఆత్మస్వరూపమును స్వకీయముగా పొందుటకుసాధనమైన చిత్తము. ప్రజలయొక్క అంతఃకరణమంతయు ఇంద్రియములచే వ్యాప్తమైయున్నది.

10. పరిశుద్ధాంతఃకరణముఁగలవాఁడు, మనస్సుచే ఏయే లోకములను సంకల్పించుచున్నాఁడో, ఆయాలోకములను కామనులను జయించుచున్నాఁడు (అనఁగా పొందుచున్నాఁడు). కాఁబట్టి ఐశ్వర్యమును గోరువాఁడు ఆత్మజ్ఞుని పూజింపవలయును.

2. ఖండము.

1. పరబ్రహ్మము ఎల్లకోర్కెలకును స్థానము; అతనియందు విశ్వమంతయునున్నది; పరిశుద్ధుఁడై యుండువాఁడు; పరబ్రహ్మమును అపరబ్రహ్మము నెఱింగినవానిని, కోర్కెలులేనివానిని, ఎవరు ఉపాసింతురో, వారు జననముఁబొందరు (అనఁగా నిత్యసుఖమునొంది జననమరణవర్జితు లగుదురు).

2. ఎవఁడు, ఏయేకోర్కెలను (ఇష్టవిషయములను) తలంచికొనునో, వాఁడుఆయాకోర్కెలనుమఱుజన్మమునఁబొందును. సకలమైనకోర్కెలను గోరినప్పటికిని, యీజన్మమునందే ఆత్మజ్ఞాను కలిగినయెడల ఆసకలమైన కోర్కెలును ఇచ్చటనే నశించుచున్నవి.

3. ఆత్మస్వరూపము వేదశాస్త్రాధ్యయనముచేతను, ధారణాశక్తిచేతను, శ్రవణముచేతను, పొందఁదగినదికాదు; ఏవిద్వాంసుఁడు పరమాత్మను బొందవలయునని కోరుచున్నాఁడో, వాఁడు ఆత్మజ్ఞానముచేతనే పొందఁదగినది; వేఱే యుపాయము లేదు; ఆత్మదర్శనేచ్ఛగలవానికి మాత్రము ఆయాత్మతత్త్వస్వరూపము గోచరించును.

4. ఈయాత్మ, జ్ఞానదార్ఢ్యము లేనివానిచేతను, ప్రమాదము (విషయాసక్తి) చేతను, సర్వకర్మసన్న్యాసములేని జ్ఞానముచేతను పొందనలవికానిది. ఎవఁడు జ్ఞానదార్ఢ్యముతోడను, విషయాసక్తినిగ్రహముతోడను, సర్వకర్మపరిత్యాగసన్న్యాసముతోడను ప్రయత్నముచేయునో, వాఁడు తనహృదయపుండరీకమునందు ఆత్మను దర్శించును.

5. జ్ఞానసంతుష్టిగలవారును, ఆత్మమయులైనవారును, ఆశారహితులైనవారును, ఇంద్రియనిగ్రహము చేసినవారును, ధీరులును, ఆత్మారాములునుఅగు ఋషులు చక్కఁగా ఆత్మనుదర్శించి సర్వస్థలములందును

వ్యాపించియుండు పరబ్రహ్మవస్తువును సర్వత్ర పొంది, అన్నిటియందును ప్రవేశించెదరు.

6. వేదాంతవిజ్ఞానముచేఁ గలిగినఆత్మను నిశ్చయముగా నెఱిఁగినవారును, సన్న్యాసులును శుద్ధజ్ఞానముగలవారునుఅగు వీరందఱును అంత్యకాలమునందు సకలకర్మవిముక్తులై పరబ్రహ్మములో నైక్యమయ్యెదరు.

7. మోక్షకాలమునందు పదునైదుకళలును దానిదానిస్థానమును (కారణమును) పొందుచున్నవి; సకలేంద్రియములును దానిదేవతకడకుఁబోయి చేరుచున్నవి ; కర్మములును జీవుఁడును పరబ్రహ్మముతో నైక్యమగుచున్నవి (కళలనుగూర్చి ప్రశ్నోపనిషత్తులో ఆఱవప్రశ్నమున జూడఁదగును).

8. ప్రవహించునదులు నామరూపములను విసర్జించి ఎట్లు సముద్రమును జేరుచున్నవో,అట్లు జ్ఞాని మోక్షకాలమునందు నామరూపవర్జితుఁడై పరాత్పరుఁడగుదివ్యపురుషుని (పరమాత్మను) బొందుచున్నాఁడు.

9. ఎవఁడు ఆబ్రహ్మమును పొందుచున్నాఁడో వాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడు. వానికుటుంబమునందు అజ్ఞాని యెవఁడు నుండఁడు. శోకమునుండి తరించుచున్నాఁడు. పాపములేనివాఁ డగుచున్నాఁడు. ఆశాపాశరహితుఁ డగుచున్నాఁడు. పరబ్రహ్మస్వరూపి యగుచున్నాఁడు.

10. ఈవిషయము శ్రుతిసమ్మతమైనది. కర్మానుష్ఠానముగలవారికిని, వేదాధ్యయనపరులకును, బ్రహ్మనిష్ఠులకును, శ్రద్ధగలవారికిని, ఏకఋషియనుపేరుగలఅగ్నినిగూర్చిహోమముచేయువారికినివిధిప్రకారముఅథర్వవేదవ్రత(శిరోవ్రత)మాచరించువారికిని,బ్రహ్మవిద్యనుబోధింపవలయును.

11. ఆబ్రహ్మమే సత్యము; ఇట్లు అంగిరస్సనుమహాఋషి పూర్వము విధిప్రకారము వచ్చి పూజించినశౌనకమహర్షికిఁ జెప్పెను. వేదవ్రతానుష్ఠానపరుఁడుగానివాఁడు ఈబ్రహ్మవిద్యను అధ్యయనము చేయఁదగదు. బ్రహ్మఋషులకు నమస్కారము, నమస్కారము.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

భద్రం కర్ణేభి రితి శాన్తిః.

ముండకోపనిషత్తు సమాప్తము.

# 6. మాండూక్యోపనిషత్తు.

భద్రం కర్ణేభి రితి శాన్తిః.

## 1. ఖండము.

1. దృష్టికిఁగనఁబడు సమస్తపదార్థములును ప్రణవము (ఓం) అనుఅక్షరము; ఓంకారము నాశరహితబ్రహ్మస్వరూపము; భూతభవిష్యద్వర్తమానములన్నియును ఓంకారము; త్రికాలములను దాఁటియుండున దిఓంకారము (అనఁగా అవ్యక్తమును ప్రకృతియును ఓంకారమే. ఓం అనునాదము బ్రహ్మశరీరము, అందలిజ్యోతిస్సు బ్రహ్మము, సకలశబ్దములును ప్రణవమునందుండి కల్గెను.)

2. ఓంకార మనిచెప్పఁబడిన ఈసమస్తమును బ్రహ్మమే ; ఈఆత్మయు (జీవుఁడును) బ్రహ్మమే; అట్టి ఈఓంకారము (ఆత్మ) నాలుగుపాదములు గలది.

## 2. ఖండము.

1. జాగ్రద్దశయం దుండువాఁడు; నాత్మకంటె వేఱుగా బయలనుండువిషయములయందు ప్రజ్ఞగలవాఁడు; సప్తాంగములు గలవాఁడు; (1 స్వర్గము-శిరస్సు, 2 సూర్యుఁడు - నేత్రము, 3 వాయువు-ప్రాణము, 4 ఆకాశము - శరీరము, 5 అన్నమును - జలమును-మూత్రస్థానము, 6 భూమి-పాదము, 7 ఆహవనీయాగ్ని-ముఖము.)పందొమ్మిదిముఖములు గలవాఁడు; (దశేంద్రియములు, పంచప్రాణములు, అంతఃకరణచతుష్టయము అను నివి పందొమ్మిది.) శబ్దాదిస్థూలవిషయములను అనుభవించువాఁడు; వైశ్వానరుఁడను పేరుగలవాఁడు; (సకలనరులను, లేక, సకలజీవులను పొందించువాఁడు) ఇది ప్రథమపాదము.

2. స్వప్నావస్థయందుండువాఁడు ; అంతఃప్రజ్ఞ (లోపలితెలివి) గలవాఁడు; సప్తాంగములుఁగలవాఁడు; పందొమ్మిదిముఖములుగలవాఁడు; (పైనిచెప్పఁబడినప్రకారమని తెలియునది.) సూక్ష్మవిషయములను అనుభవించువాఁడు; తైజసుఁడు (తేజస్సంబంధముగలవాఁడు); ఇది రెండవ పాదము.

3. (ఆత్మ)ఏస్థానమునందు నిద్రనుపొంది ఏకోరికనుకోరక ఏస్వప్న మును జూడకయుండునో అదియే సుషుప్తిస్థానము. జాగ్రత్స్వప్నస్థాన ములయందలి ప్రజ్ఞలన్నియు ఏకీభవించియుండునవి; (కనుక) ఆనందమ యుఁడు;ఆనందానుభవముకలవాఁడు;చిత్తమునుముఖముగాఁగలవాఁడు; (అనఁగా చిత్తముద్వారముగా స్వప్నము, జాగ్రము అను నీరెండవస్థ లను దెలిసికొనువాఁడు) ప్రాజ్ఞుఁడు; ఇది తృతీయపాదము.

4. (ఈఆత్మయే) సర్వేశ్వరుఁడు; సర్వజ్ఞుఁడు; అంతర్యామి; సకల భూతములయొక్క ఉత్పత్తినాశవిషయములయం దన్నిటికిని కారణ భూతుఁడు.

5. తైజసుఁడునుకాఁడు; విశ్వుఁడునుకాఁడు; ఈయిర్వురకును నడు మనుండువాఁడునుకాఁడు; ప్రాజ్ఞుఁడునుకాఁడు; ప్రజ్ఞుఁడునుకాఁడు; అప్ర జ్ఞుఁడునుకాఁడు; అయిన నెట్టివాఁడనఁగా—అదృశ్యుఁడు; వ్యవహరింప రానివాఁడు (వాక్కున కందనివాఁడు); కర్మేంద్రియమునకు అందని వాఁడు; చిహ్నములేనివాఁడు; తలంచుటకు సాధ్యముకానివాఁడు; ఇట్టి దని నిర్ణయించిచెప్పుటకు సాధ్యముకానివాఁడు; ఏకాత్మయనెడివిశ్వాస మును సారమునుగలవాఁడు; లోకవ్యాపారములేనివాఁడు; శాంతుఁడు; మంగళకరుఁడు; ఏకమైయుండువాఁడు; ఈయాత్మయే తెలిసికొనుటకుఁ దగినవాఁడు; ఇది నాలవపాదము.

3. ఖండము.

1. అట్టి ఆత్మ అక్షరముచేతచెప్పఁబడువాఁడు;ఆయక్షరము ఓంకా రము; అది మాత్రలు(పాదములు) గలది; (ఆమాత్రలు) అకారఉకారమ కారములు అనునవి.

2. జాగ్రదవస్థగలవాఁడు వైశ్వానరుఁడు, అకారము; ఇది మొదటి మాత్ర (మొదటిపాదము); వ్యాప్తమైయుండుటవలన(అకారము సమస్త వాక్కును, విశ్వుఁడు సకలజగత్తును, వ్యాప్తమై యుండుటవలన) లేక, ప్రథానమువలన (అకారము సకలాక్షరములకును, విశ్వుఁడు సకలసృష్టికిని ప్రధానమైనందువలన) అని తెలియునది. ఇట్లివ్వఁ డెఱుఁగుచున్నాఁడో వాఁడు సకలాభీష్టములను పొందుచున్నాఁడు; (మహాత్ములలో) శ్రేష్ఠుఁ డగుచున్నాఁడు.

3. స్వప్నావస్థగలవాఁడు తైజసుఁడు; ఉకారము; రెండవమాత్ర (రెండవపాదము); ఉత్కృష్టమైనదిగావున (అకారముకంటె ఉకారమును, విశ్వునికంటె తైజసుఁడును శ్రేష్ఠము); లేక, అకారమునకును మకారమునకును మధ్యనుండునది గావునను, విశ్వునకును ప్రాజ్ఞునకును నడుమనుండువాఁడగుటవలనను శ్రేష్ఠుఁడు. దీనిని (ఇట్టిమహిమగలదానిని) ఎవ్వఁడెఱుఁగునో వాఁడు జ్ఞానాధికుఁడగును; అందఱును మిత్త్రుఁడుగనుండును (శత్త్రు వెవఁడు నుండఁడు). ఇట్టివానికులమునందు జన్మించువారెల్లరును బ్రహ్మజ్ఞానులై యుందురు.

4. సుషుప్త్యవస్థగలవాఁడు ప్రాజ్ఞుఁడు; మకారము; మూఁడవమాత్ర (తృతీయపాదము); ప్రణవమునుపలుకుఁటు ఉచ్చరించునపుడు అంత్యాక్షరమగు మకారమునుండియే మరల అకారఉకారములు ఆవిర్భవించుచున్నవి. అంతియగాక, అకారఉకారములు మకారమునందు లయమగుచున్నవి. అట్లే విశ్వతైజసు లిర్వురును ప్రాజ్ఞునియందు లయమగుదురు. ఈరహస్యమును ఎవ్వరెఱుంగుదురో వారు ఈప్రపంచమునంతయు నెఱుంగుదురు (అనఁగా, జగత్కారణాత్మగా అగుచున్నారు).

4. ఖండము.

1. (ఇదివఱకు మూఁడుమాత్రలు అనఁగా మూఁడుపాదములు 'అ ఉ-మ' చెప్పఁబడినవి.) నాలవపాదమై 'ఆత్మ' మాత్రలేనివాఁడు; అవ్యవహార్యుఁడు; ప్రపంచలయ (శాంతి) స్థానము; శుభకరుఁడు; ఏకమైనవాఁడు (అద్వైతము); ఇట్టి ఓంకారస్వరూపుని తెలిసి యుపాసించువాఁడు జననమరణరహితుఁడగును. ఆత్మైక్యమునొందును.

2. ఓంకారానుసంధానముచేయువాఁడు సమస్తద్వైతమునుండి విడివడి కృతార్థుఁడగును; ఈప్రణవము బ్రహ్మస్వరూపము; ఓంకారమును నిరంతరమును ధ్యానించువానికి జననమరభయము లేదు.

3. ఓంకారము పరస్వరూపమైన పరబ్రహ్మము; ఈఓంకారమునకు కారణమైన దేదియు లేదు; నాశరహితమైనది; పరబ్రహ్మాభిన్నమై పరిపూర్ణమైన బ్రహ్మముగా నున్నది.

4. ఓంకారము సమస్తమునకును కారణమైనది; సృష్టిస్థితిసంహారములకు కారణమైనది; ఈప్రణవమును తెలిసికొనినవాఁడు పరమాత్మస్వరూపమును బొందుచున్నాఁడు.

5. ఈప్రణవమును సకలప్రాణులహృదయములలో నుండునట్టి ఈశ్వరునిగా నెఱుంగవలయును. ఓంకారమును దెలిసికొనిన జ్ఞాని శోకింపఁడు.

6. ఓంకారమును అకారాదిమాత్రలును, విశ్వాదిపాదములును లేని సమస్తద్వైతోపశాంతిగలమంగళస్వరూపముగాఁ దెలిసికొనినవాఁడే తత్త్వవేత్త; యోగి; ఇతరుఁడు కాఁడు.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

భద్రం కర్ణేభి రితి శాన్తిః.

మాండూక్యోపనిషత్తు సమాప్తము.

# 7. తైత్తిరీయోపనిషత్తు

సహనా వవ త్వితి శాన్తిః.

## శిక్షావల్లి అను ప్రథమాధ్యాయము

### 1. అనువాకము.

విద్యార్థియగు శిష్యుఁ డిట్లు అనర్థనివృత్తికొఱకు ప్రార్థించు చున్నాఁడు:—(నాగురువునకును నాకును) ప్రాణవృత్తికిని పగటికిని అభిమానదేవతగా నుండు సూర్యునకు నమస్కారము. అపానవృత్తికిని రాత్రికిని అభిమానదేవతగానుండు వరుణునకు నమస్కారము. నేత్రమునకును ఆదిత్యమండలమునకు అభిమానదేవతగానుండు అర్యముఁడనుసూర్యునకు నమస్కారము. ఫలమున కభిమానదేవతయగు ఇంద్రునకు నమస్కారము. వాక్కునకును బుద్ధికిని అభిమానదేవతయగు బృహస్పతికి నమస్కారము. పాదాభిమానదేవతయు సర్వవ్యాపియునగు విష్ణువునకు సుఖముకొఱకు నమస్కారము. బ్రహ్మమునకు నమస్కారము. ప్రత్యక్షబ్రహ్మమైన వాయుదేవునకు నమస్కారము. ఓవాయుదేవుఁడా! నీవే ఋజు(శాస్త్రక్రమమైన) మార్గమవు. నీవే సత్యవస్తువవు. సర్వాత్మక బ్రహ్మవగు నీవు నన్నును నాగురువును రక్షింపవలయును.

(ఇచ్చట శాన్తి యని ముమ్మా రుచ్చరించుటేల? అనఁగా విద్యా ప్రాప్తికిని; ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములగు విఘ్నములను పోఁగొట్టుటకని తెలియునది.)

2. అనువాకము.

ఇఁక శిక్షాధ్యాయము (ఉపనిషత్తులకు అర్థజ్ఞానము ప్రధాన మగుటవలన దానిని తెలిసికొనుటకై వర్ణాద్యుచ్చారణలక్షణశాస్త్రము.) చెప్పఁబడుచున్నది.

1 అక్షరము, 2 స్వరము, 3 మాత్ర, 4 బలము, 5 సమత, 6 సంహిత అను నీయాఱును అవశ్య మెఱుఁగఁదగును.

3. అనువాకము.

ఇప్పుడు సంహితోపనిషత్తు చెప్పఁబడుచున్నది. సంహితయనఁగా అక్షరసముదాయము, అనఁగా శబ్దములు. ఈ యుపనిషత్తులోనిశబ్ద ములు అర్థజ్ఞానవిషయమునందు గ్రంథభావము నెఱుంగఁదగినబుద్ధి సులభ సాధ్యము కానందున, అర్థవిచారణకు పూర్వమే శబ్దములను ఉపాసిం చినయెడల దానికి ఫలము కలదని ఆయాశబ్దోపాసనాక్రమము చెప్పఁ బడుచున్నది. సంహితోపనిషత్సంబంధమైన యశస్సును తేజస్సును మాకు కల్గునుగాక! అని శిష్యుఁడు ప్రార్థించుచున్నాఁడు.

1-3. సంహితావిషయమైన దర్శనమును గూర్చి చెప్పెదము. జ్ఞానవిషయమై అయిదాశ్రమములు కలవు. వానికి అధికరణములని పేరు. (ఒకవిగ్రహమును విష్ణువుగా భావించి, మనముదర్శించునట్లు అక్షరముల యందు ఇఁక చెప్పఁబోవురీతిగా ఐదుస్థూలపదార్థములచేత విశేషింపఁ బడిన, అనఁగా ఆ పదార్థములయొక్క విషయమైన జ్ఞానమున్నదని భావించి ఉపాసింపవలయును.)

పైనిచెప్పిన అధికరణములైదు ఏవియనఁగా:—1 అధిలోకము 2 అధిజ్యోతిషము, 3 అధివిద్యము, 4 అధిప్రజము, 5 అధ్యాత్మము. అను 5 ను మహాసంహిత యనఁబడును.

ఇఁక వీనివివరణము చెప్పఁబడుచున్నది.

1. అధిలోకము—పూర్వరూపము - పృథ్వి, ఉత్తరరూపము - స్వర్గలోకము, అంతరిక్షము-సంధి, సంతానము-వాయువు.

2. అధిజ్యోతిషము—పూర్వరూపము-అగ్ని, ఉత్తరరూపము-ఆదిత్యుఁడు, సంధి-జలము, సంతానము-మెఱుపు.

3. అధివిద్య—పూర్వరూపము - గురువు, ఉత్తరరూపము - శిష్యుఁడు, సంధి - విద్య, సంతాపము - ఉపదేశము.

4. అధిప్రజ—పూర్వరూపము మాత, ఉత్తరరూపము - పిత, సంధి - ప్రజ, సంతానము-జన్మము.

5. అధ్యాత్మము—పూర్వరూపము - అధరోష్ఠము, ఉత్తరరూపము-ఊర్ధ్వోష్ఠము, సంధి-వాక్కు, సంతానము-జిహ్వ.

ఇట్లు తెలిసికొనినవానికి ప్రజలు, పశువులు, బ్రహ్మతేజస్సు, అన్నము, స్వర్గము, సద్గతి అను నివి కలుగును (అనఁగా ఫలమునుగోరి ఉపాసించువానికి పైనిచెప్పినవన్నియుఁగల్గును. ఫలాభిలాష లేక ఉపాసించువానికి బ్రహ్మజ్ఞానము కలుగును).

4. అనువాకము.

సంపదలను గోరువానికిని, జ్ఞానమును గోరువానికిని జప, హోమ, కర్మములు చెప్పఁబడుచున్నవి:—

1. మేధాకాముఁడు (జ్ఞానార్థి) చేయవలసిన జపమేది? అనఁగా, "ఏది వేదములకెల్ల శ్రేష్ఠమైయున్నదో, సర్వరూపమైయున్నదో, వేదములకెల్ల వేదమైన అమృతమునుండి పుట్టినదో, సర్వకామముల నొసంగునదియో అగు అట్టి ఓంకారము నాకు జ్ఞానము నొసంగునుగాక! ఓ దేవా? అమృతత్వమునకు హేతువైన బ్రహ్మజ్ఞానమునొందినవాఁడ నగుదునుగాక! నాశరీరము అట్టిజ్ఞానమును గ్రహించుటకు యోగ్యమగును గాక! నాజిహ్వ మధురవాక్కుల నుచ్చరించునది యగుఁగాక! నా చెవులు విశేషార్థములను వినునుగాక! ఓప్రణవమా! నీవు బ్రహ్మమునకు ప్రతినిధిగా ఉన్నావు; లౌకికప్రజ్ఞచే మఱుఁగైయున్నావు. ఆత్మజ్ఞానార్థమై నేను కోరినదానిని అనుగ్రహింపుము.

2. సంపత్కాముఁడు చేయు హోమ మేదియనఁగా, "ఏసంపద (శ్రీ)నాకు వస్త్రములను, గోవులను, అన్నపానాదులను, శీఘ్రముగా నొసంగుచున్నదో, విస్తారముగా నిచ్చుచున్నదో, ఆశ్రీని పశ్వాదులతోఁ గూడ నా కొసంగుము."

ఇది "స్వాహా" అని హోమము చేయునప్పుడు పఠించవలయును.

"బ్రహ్మచారులు (బ్రహ్మవేత్తలు)నన్నాశ్రయింతురుగాక!(అనఁగా బ్రహ్మజ్ఞానులదర్శనము నాకుగలుగనిమ్ము.) వారు విశేషముగావత్తురుగాక! వారు పెక్కండ్రు వత్తురుగాక! (అనఁగా అనేకజ్ఞానులను నేను దర్శింతును గాక!) నాకు దమము (బహిరింద్రియనిగ్రహము)కలుగునట్లు చేయుదురు గాక! శమము (అంతరింద్రియనిగ్రహము)కలుగునట్లు చేయుదురుగాక!"

3. "నేను ప్రజలలో కీర్తిమంతుఁడ నగుదునుగాక! మహైశ్వర్యవంతుఁడ నగుదునుగాక! నిన్నాశ్రయించెదను; నీవు నాయందు ప్రవేశింపుము; మిక్కిలి భేదముగలనీవల్ల నాపాపములను పరిత్యజించికొనియెదను; ఎట్లు పల్లముగలచోట నీళ్లుపోయిచేరునో, ఎట్లు జనులను జరకు లోనగునట్లుకావించి కాలముపోవుచున్నదో, అట్లు నలుదిక్కులనుండి బ్రహ్మవేత్తలు నాయొద్దకు వత్తురుగాక! సకలదుఃఖములను సకలపాపములను నాశముచేయు స్థానమైయున్నావు; కావున నన్ను ప్రకాశించునట్లు చేయుము! నాయొద్దనుండుము; నన్ననుగ్రహింపుము."

5. అనువాకము.

నాలవఅనువాకమునందు బ్రహ్మముయొక్క ప్రణవశరీరము చెప్పఁబడినది.ఇప్పుడు హిరణ్యగర్భమనువ్యాహృతిశరీరము చెప్పఁబడుచున్నది. అనఁగా వ్యాహృతి ఆత్మయైనబ్రహ్మముయొక్క ఆంతరోపాసనము చెప్పఁబడుచున్నది.

1-3. భూః-భూలోకము, భువః-అంతరిక్షము, సువః-స్వర్గలోకము. ఈమూఁడును వ్యాహృతులు. మహః-నాలవవ్యాహృతి; అనఁగా బ్రహ్మము. బ్రహ్మము లేక, ఆత్మకు మూఁడువ్యాహృతులును శరీరముగానున్నది. నాలవవ్యాహృతియైనఆత్మ సర్వవ్యాప్తిగలది. దీనిని మహాచమస్యుఁడనుఋషి యెఱింగియున్నాఁడు(ఉపాసనకొఱకు ఋషిస్మరణము చేయఁబడెను).

భూః-ఈభూలోకము, భువః-అంతరిక్షము, సువః-స్వర్గలోకము, మహః-ఆదిత్యుఁడు. ఆదిత్యునివలన సకలలోకములును మహిమనుపొందుచున్నవి (అనఁగా మఃల్లోకములకంటెను ఆదిత్యుఁడు గొప్పవాఁడు).

భూః - ఋగ్వేదము, భువః-సామవేదము, సువః-యజుర్వేదము, మహః-ప్రణవము. ప్రణవమువలన సకలవేదములును మహిమగలవగుచున్నవి.

భూః- ప్రాణవాయువు, భువః-అపానవాయువు, సువః-వ్యానవాయువు, మహః-అన్నము. అన్నమువలన సకలప్రాణములును మహిమను పొందుచున్నవి.

ఇవియే నాలుగువ్యాహృతులు. వీనినెఱింగినవాఁడు బ్రహ్మము నెఱింగినవాఁడగును. వీఁడు మోక్షము నొందినవాఁడు. ఇట్టివానికి దేవతలు కానుకలొసంగి సత్కరింతురు. అనఁగా వీఁడు కోరినవాని నెల్ల దేవత లొసంగుదురు.

## 6. అనువాకము.

బ్రహ్మము ఏస్థానమునుండి ప్రత్యక్షమగుచున్నదో, ఆహృదయాది స్థానమును, బ్రహ్మోపాసనమును ఇచ్చట చెప్పఁబడుచున్నది. సాలగ్రామశిలయం దెట్లు విష్ణువును ధ్యానించుచున్నామో, అట్లు హృదయస్థానమునందు బ్రహ్మము నుపాసింపవలయును.

1-2. అంతరహృదయమునం దాకాశమున్నది; పద్మాకారమైన మాంసపిండము శరీరమునందున్నది; అది ప్రాణమునకు స్థానము; అనేకనాడులతోఁగూడిన ద్వారముతోనున్నది; దానినాళము ఊర్ధ్వముగనున్నది; ముఖము దిగువనున్నది; ఆయాకాశమునందు మనోమయుఁడైన (విజ్ఞానమయుఁడైన) పురుషుఁడు (సకలలోకములందును వ్యాపించియుండువాఁడు) ఉన్నాఁడు. అతనికి మరణము లేదు; ప్రకాశముగలవాఁడు. ఇట్టి బ్రహ్మస్వరూపము నెఱింగినవిద్వాంసుని స్వరూపప్రతిపత్తిమార్గము చెప్పఁబడుచున్నది:—ఆహృదయమునకుమీఁద సుషుమ్నానాడిపోవుచున్నది. రెండుదౌలువులకునడుమ స్తనాకారముగ మాంసపిండము వ్రేలాడుచున్నది (అదే కొండనాలుక). దానికి మీఁద కేశాంతము మూర్ధము (ఉచ్చి). విద్వాంసునియొక్క జీవము హృదయమునుండి మును చెప్పిన నాడి, కొండనాలుక, వీనిమార్గముగాపోయి మూర్ధమునుపొంది, అచ్చటనుండి కపాలమును భేదించికొని వెలువడుచున్నది. ఇదే బ్రహ్మస్వరూపప్రతిపత్తిమార్గము. ఇట్లు విద్వాంసుఁడు వెలువడి, భూః అనువ్యాహృతిరూపమైన అగ్నినిఁ బొందుచున్నాఁడు; తర్వాత భువః-అను వ్యాహృతిరూపమైనవాయువును చేరుచున్నాఁడు; అనంతరముసువః-అను వ్యాహృతిరూపమైన ఆదిత్యుని పొందుచున్నాఁడు. పిదప మహః-అను వ్యాహృతిరూపమైనబ్రహ్మముతో నైక్యమగుచున్నాఁడు; అప్పుడు స్వారాజ్యమును

బొందినవాఁ డగుచున్నాఁడు; మనస్సునకు పతియైన బ్రహ్మము పొందిన వాఁడగుచున్నాఁడు. వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము, విజ్ఞానమువీని కెల్ల పతియగుచున్నాఁడు. అనఁగా సర్వము నెఱింగినవాఁడగుచున్నాఁడు; ఆకాశమువంటి సూక్ష్మశరీరముగల బ్రహ్మమే యగుచున్నాఁడు; వాఁడు ప్రపంచమునంతయు బ్రహ్మముగాఁ జూచుచున్నాఁడు; సకలప్రాణులయందును క్రీడించువాఁడగును; హృదయానందమును, చిత్తశాంతియును గలవాఁడగును; జననమరణరహితుండగును; ఇట్టి బ్రహ్మమును నీవు ఉపాసించుము.

7. అనువాకము.

ఇదివఱకు వ్యాహృత్యాత్మక బ్రహ్మము, ఉపాస్యమని బోధింపఁబడినది. ఇప్పుడు ఆ బ్రహ్మమునకే పృథివ్యాదిపాంక్తోపాసనము చెప్పఁబడుచున్నది; పాంక్తమనఁగా:— అయిదువిధములుగలది. ఎట్లన, యజ్ఞము పాంక్తకర్మము. ఆ యజ్ఞమునకు - పత్ని, యజమానుఁడు, దైవము, మనుష్యులు, ధనము అను నీయైదును ముఖ్యములైనవి. ఇట్లనియుఁ దెలియఁదగును.

1. భూమి, అంతరిక్షము, ఆకాశము, దిక్కులు, విదిక్కులు ఈఅయిదును లోకపాంక్తములు. అగ్ని, వాయువు, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు -ఈఐదును దేవతాపాంక్తములు. జలము, లతలు, వృక్షములు, ఆకాశము, ఆత్మ (విరాట్స్వరూపి)-ఈయైదును భూతపాంక్తములు. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము ఇవి అయిదును వాయుపాంక్తములు. నేత్రము, శ్రోత్రము, మనస్సు, వాక్కు, త్వక్కు ఇవిఐదును ఇంద్రియపాంక్తములు. చర్మము, మాంసము, స్నాయువు, అస్థి, మజ్జ -ఈయైదును ధాతుపాంక్తములు. ఇట్లు కనఁబడు ఐదేసివిభాగములలో కడపటి మూఁడుపాంక్తములు మాత్రము అధ్యాత్మసంబంధమని తెలియునది. అధ్యాత్మపాంక్తముతో తక్కినపాంక్తములు కలిసి అధిభూతపాంక్త మగుచున్నది. ఇట్లు పరబ్రహ్మము పాంక్తస్వరూపమై యున్నదని యెఱుంగువాఁడు బ్రహ్మగా అగుచున్నాఁడు.

8. అనువాకము.

ఇప్పుడు పరబ్రహ్మమునుఓంకారమని భావించి యుపాసింపవలయుననియును, అది(ఓం) పరాపరబ్రహ్మమును పొందుటకు సాధన మనియును బోధింపఁబడుచున్నది.

1. ఓం అను శబ్దరూపమును బ్రహ్మ మని భావించి ధ్యానింపవలయును. ఈజగమంతయు ఓంకారస్వరూపము; మఱియు అది అనుకృతి. (ఎవనినైనసంబోధించి యేదేనికార్యము చేయునట్లు ఆజ్ఞాపించినచో 'ఓం'అని అంగీకరించు చున్నాఁడు.)ఒకనిసంబోధించిన 'ఓం' అని అడుగుచున్నాఁడు. సామమును 'ఓం' అని ఆరంభించి గానముచేయుచున్నాఁడు. ఋగ్వేదమంత్రములు 'ఓం' అని ఆరంభింపఁబడుచున్నవి. యాగమునందు అధ్వర్యుఁడు' ఓం' అని ప్రతిశంసనము నుచ్చరించుచున్నాఁడు. బ్రహ్మాయనుఋత్విక్కును 'ఓం' అని యుచ్చరించుచు తనకార్యము నుపక్రమించుచున్నాఁడు. 'ఓం' అనియే అగ్నిహోత్రము చేయుచున్నారు. బ్రాహ్మణుఁడు 'ఓం' అనియే వేదాధ్యయనము నారంభించుచున్నాఁడు. ఓంకారముచేత బ్రహ్మాముసు పొందవచ్చునని తలంచువాఁడు అలాగే బ్రహ్మాముసు పొందుచున్నాఁడు (సకలక్రియలను ఓంకారపూర్వకముగా ప్రారంభింపవలయుననియును, ఓంకారమును బ్రహ్మాముగా నుపాసింపవలయుననియును తెలియఁదగినది).

9. అనువాకము.

విజ్ఞానముచేతనే స్వారాజ్యము సిద్ధించుటవలన, శ్రౌతస్మార్తకర్మలు వ్యర్థములని తలంపకూడ దనియును, ఆకర్మలు పురుషార్థసాధనములని యును నిరూపింపఁబడుచున్నది.

1. ఋతము (శాస్త్రోక్తముగా వర్తించునట్టి ఋజుమార్గము), వేదాధ్యయనము (అర్థజ్ఞానముతో వేదాధ్యయనముచేయుట), ప్రవచనము (మఱువకుండుటకును, ధర్మవృద్ధికొఱకును అధ్యయనముచేయుట) ఈమూఁటిని అనుష్ఠించవలయును. సత్యము (సత్యప్రవర్తనము), తపస్సు (కృచ్ఛ్రాదులు), దమము (బాహ్యేంద్రియనిగ్రహము), శమము (అంతరింద్రియనిగ్రహము), అగ్నులు (అగ్నిహోత్రక్రియలు) అను వీనిని అనుష్ఠింపవలయును. అతిథులను పూజింపవలయును. వ్యవహారము అనఁగా వివాహాదికార్యములు చేయవలయును. ఋతుకాలమునందు భార్యా సంయోగము చేయవలయును. ప్రజోత్పత్తి చేయవలయును. పుత్త్రునకు వివాహముచేయవలయును. సత్యమును (అన్నిటియందును) గ్రహింపవలయునని రాథీతరుఁ డుపదేశించియున్నాఁడు. తపస్సు చేయ

వలయునని పౌరుశిష్టి బోధించియున్నాఁడు. స్వాధ్యాయప్రవచనములను అనుష్ఠింపవలయుననియును అదే తపస్సనియును మౌద్గల్యుఁడుపదేశించెను.

## 10. అనువాకము.

ఇప్పుడు వచింపఁబోవుజపము బ్రహ్మవిద్యోత్పత్తినిమిత్తము అధ్యయనము చేయఁదగినది.

1. "నేను సంసారవృక్షమున అంతర్యామినై యున్నాఁడను; ఒకపర్వతశిఖరమువలె నాకీర్తి ప్రసిద్ధమైయున్నది; పరిశుద్ధమైనజ్ఞానమును (బ్రహ్మమును) ముఖ్యకారణముగాఁగలవాఁడనై యున్నాఁడను; సూర్యాంతర్గతమైన అమృతమయఆత్మతత్త్వమువలె నేను ఆత్మతత్త్వమై యున్నాఁడను; శుభమైన బుద్ధిగలవాఁడనై యున్నాఁడను; మరణధర్మము లేనివాఁడుగను, కొఱతలేనివాఁడుగను ఉన్నాఁడను" అని బ్రహ్మజ్ఞాని యగు 'త్రిశంకు' ఋషి వేదానువచనము. (ఈమంత్రమును బ్రహ్మవిద్యార్థులు ఆత్మ ఏకమని తెలిసికొనునిమిత్తము జపముచేయవలయును.)

## 11. అనువాకము.

ఇపుడు వేదాధ్యయనానంతరము శిష్యునకు గురువు ఉపదేశించుక్రమము చెప్పఁబడుచున్నది. బ్రహ్మవిజ్ఞానమునకు పూర్వము శ్రౌతస్మార్త కర్మములు జేయవలయునని ఇదివరకు బోధింపఁబడినది. కర్మముల వలన సంస్కరింపఁబడిన విశుద్ధసత్త్వముగల వానికే ఆత్మజ్ఞానము కలుగును. ఇపుడు జ్ఞానోత్పత్తినిమిత్తము చేయవలసిన నియమము చెప్పఁబడుచున్నది.

1. వేదాధ్యయనానంతరము గురువు శిష్యున కిట్లు బోధించుచున్నాఁడు.—సత్యము-చెప్పుము; ధర్మమార్గమునందు ప్రవర్తింపుము; అధ్యయనము (తప్పక) చేయుచుండుము; గురువునకు దక్షిణ నిచ్చి అతనియొద్ద సెలవుపొందినతర్వాత గృహస్థధర్మము నవలంబింపుము (వివాహితుఁడవగుము); సత్యమునుండియు, ధర్మమార్గమునుండియు, ఆత్మరక్షణమునుండియు, ఐశ్వర్యమునుండియు, స్వాధ్యాయప్రవచనములనుండియు మరలకుము.

2. దేవ, పితృకర్మములనుండి ప్రమాదమునుబొందకుము; తల్లి, తండ్రి, గురువు, అతిథి అను నీనలుగురను దైవములుతో సమానులుగాఁదలంచి పూజింపుము; త్యజింపఁదగనికర్మములను తప్పక చేయుచుం

డుము; శిష్టధర్మములైన సకలకర్మములను ఆచరించుచుండుము; ఇతర కర్మములను చేయకుము; సత్కార్యముల నొనర్పుము.

3. ఎవరు మనలో శ్రేష్ఠులైన బ్రాహ్మణులో వారికి వలయు ఉప చారముల నొనర్పుము; వారి కిచ్చుదానిని శ్రద్ధతో నిమ్ము; అశ్రద్ధగా నీయకుము; ధనముతోను లజ్జతోను నొసంగుము; భయముతోను ప్రేమ తోను ఇమ్ము.

4. ఏవృత్తియందుఁగాని, ఏకర్మమునందుఁగాని, నీకు సందేహము కలిగెనేని, నీదేశమునం దాసమయమునం దెవ్వరు బుద్ధిశాలులగుద్విజులు ఎట్లాచరించుచున్నారో, ఆప్రకారము నీవాచరించుము. నీవు చేసినకర్మ మునం దేదేని దోషము సంభవించి యుండెనేని పెద్దల నడిగి తెలిసికొని వారుచెప్పినట్లు చేయుము. ఇదే ఉపదేశము; ఇదియే వేదోపనిషత్తు (రహస్యము;) ఇదే అనుశాసనము (ఈశ్వరవచనము); ఈప్రకారమే ఉపాసన చేయవలయును; ఇదే ఉపాస్యము.

12. అనువాకము.

"శంనోమిత్ర" అని ప్రారంభింపఁబడుచున్నది. దీనియభిప్రాయము మొదటి అనువాకమునందు చెప్పఁబడినది.

(బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము అని నాలుగాశ్రమములుగలవు; ఒక్కొకఆశ్రమస్థునకును బ్రహ్మవిద్యాధికార ముకలదు. ఉత్తమమును శ్రేయస్సునైనమోక్షము బ్రహ్మవిద్య(వేదాంత విద్య) చేతనే సిద్ధించు ననియును, కేవలకర్మము చిత్తశుద్ధినిమాత్రమే నొసంగుననియును శ్రీశంకరాచార్యులవారు ఆక్షేపసమాధానములతో సిద్ధాంతీకరించియున్నారు.)

సహనావవ త్వితి శాన్తిః.

---

బ్రహ్మానందవల్లి అను ద్వితీయాధ్యాయము.

సహనావవ త్వితి శాన్తిః.

1. అనువాకము.

ఇఁక చెప్పఁబోవు బ్రహ్మవిద్యాప్రాప్తికి భంగము కలుగక యుండవ లయు నని శాంతి చెప్పఁబడుచున్నది:—

మమ్ము (గురుశిష్యులను) రక్షింపవలయును; మాకు భోజన మొసంగవలయును; విద్యాసామర్థ్యము నిప్పించవలయును; తేజస్సంపన్నమైనమాకు విద్య తెలియఁబడుసుగాక! మాలో పరస్పరము ద్వేషము లేకుండునుగాక !

(కర్మములకు విరోధములేనిస ంహితావిషయోపాసనములు చెప్పఁబడినవి; ఉపాధిసహితమగు ఆత్మనుగూర్చియు, వ్యాహృతిద్వారముగా స్వారాజ్యఫలమును గూర్చియు చెప్పఁబడినది; ఇప్పుడు సంసారబీజ నాశముకొఱకై, అజ్ఞాననివృత్తిద్వారముగా ఉపాధిరహితమగు ఆత్మను గూర్చి యీవల్లి ప్రారంభింపఁబడుచున్నది. అజ్ఞాననివృత్తిచేతనే బ్రహ్మవిద్య సిద్ధించును; సంసారనాశము కల్గును; బ్రహ్మవిద్యయందు ప్రవృత్తి కలుగునిమిత్తమై ప్రథమమున దాని ప్రయోజనము చెప్పఁబడుచున్నది.)

బ్రహ్మము నెఱింగినవాఁడు దానినే (బ్రహ్మమునే)పొందుచున్నాఁడు (బ్రహ్మము నెఱింగినవాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడని భావము.) ఈయర్థమునందు "సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మ" అను ఋక్కు చెప్పుచున్నది. అనఁగా ఆ బ్రహ్మము సత్యమై, జ్ఞానమై, అనంతమై యున్నది. అదే పరవస్తువు.

(సత్యమనఁగా:—ఏవస్తువు ఏరూపముగా నిశ్చయింపఁబడుచున్నదో ఆవస్తువు ఆరూపమునందు మాఱుబాటొందక యుండునేని అది సత్యవస్తువేయగును. అనఁగా ఏకాలమునందును ఏవిధముగను మాఱుబాటొందనివస్తువు. జ్ఞానమనఁగా-తెలివి అనువస్తువు. అనంతమనఁగా-ఏది ఏచోటను విభజింపఁబడకయుండునో ఆవస్తువు. అనఁగా కాలముచేతను, దేశముచేతను బాధింపఁబడనిదియు, ఎల్లలేనిదియు నగువస్తువు.)

ఈ బ్రహ్మము హృదయాకాశమునందు బుద్ధిగుహాలో నుండుననెవ్వఁడెఱుంగునో, వాఁడు బ్రహ్మస్వరూపుఁడై సకలభోగ్యముల ననుభవించును. ఇట్టి బ్రహ్మమునుండి శబ్దగుణముగలదియును, మూర్తద్రవ్యములకు స్థాన మొసంగునదియు నైనఆకాశము కల్గెను. ఆయాకాశము నుండి శబ్దము, స్పర్శముఅను రెండుగుణములతోఁ గూడినవాయువుకలిగెను. ఆవాయువు నుండి శబ్దము, స్పర్శము, రూపముఅనుమూఁడుగుణములతోఁగూడిన అగ్ని కల్గెను. ఆయగ్నివలన శబ్దము,స్పర్శము, రూపము, రసము అను నాలుగుగుణములతోఁగూడిన జలము కలిగెను. ఆజలము

నుండి శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అను ఐదుగుణములతోఁగూడిన పృథివికలిగెను. ఆపృథివివలన ఓషధులు (చెట్లుమొదలగునవి) కలిగెను. ఆఓషధులనుండి అన్నము కలిగెను. ఆయన్నమువలన రేతస్సు కలిగెను. ఆరేతస్సునుండి మనుష్యప్రాణి కలిగెను. అట్టి ఈపురుషుఁడు అన్నరసమయుఁడై యున్నాఁడు.

అట్టి ఈపురుషునకు శిరస్సు శిరస్సుగను, కుడిచేయి కుడిరెక్క (దక్షిణపక్షము) గను, ఎడమచేయి ఎడమరెక్క (ఉత్తరపక్షము) గను, దేహమధ్యభాగము ఆత్మగను, తోఁక, అనఁగా పుచ్ఛము నాభికి క్రింది భాగముగను ఉన్నది (అనఁగా పక్షిస్వరూపముగా జెప్పఁబడియున్నది). ఇఁక ప్రాణాదులు వర్ణింపఁబడును.—

2. అనువాకము.

"పృథ్విని ఆశ్రయించుకొనియుండు ప్రాణులన్నియును అన్నము నుండి కలిగినవి. అన్నముచేతనే జీవించుచున్నవి. కడపటఅన్నమునే పొందుచున్నవి. ఏలన, సకలభూతములకును అన్నము ప్రధానముగా (కారణముగా) నున్నది. కావున అది అందఱకును ఔషధము" "ఎవరు అన్నమును బ్రహ్మముగా అనఁగా మనము అన్నమునుండికలిగితిమి ; అన్నముచేత జీవించుచున్నాము; అన్నమునందే చేరఁబోయెదము" అని తలంచి ఉపాసింతురో, వారు సమస్తమైన అన్నమును పొందుదురు. (స్థూలశరీరము బ్రహ్మముకాదు; ఇట్లుతలంచినచో అన్నముమాత్రము లభించుననియును, మోక్షము లభింపదనియును తాత్పర్యము). దేనిని భుజింతుమో, ఏది భుజింపఁబడునదియో, అది అన్నము (అన్నమయాదికోశములను ఆత్మయని భావించుట అజ్ఞానము). ఈ అన్నమయకోశము కంటెను వేఱైనది ప్రాణమయకోశము. ఈప్రాణమయముచేత (తిత్తికిగాలివలె) అన్నమయశరీరము నిండియున్నది. ప్రాణమయశరీరము పురుషాకృతిని ఆశ్రయించియున్నది. ఎట్లనఁగా, అన్నమయముయొక్క ఆకృతిని అనుసరించియున్నది (అనఁగా సొంతమైన రూపములేదు). దానికినిశిరస్సు మొదలగునవి కల్పింపఁబడుచున్నవి.

ప్రాణవాయువు శిరస్సు; వ్యానవాయువు దక్షిణపక్షము; అపానవాయువు ఉత్తరపక్షము; ఆకాశమను సమానవాయువు మధ్యభాగము; పృథ్వియను ఉదానవాయువు పుచ్ఛము.

3. అనువాకము.

"దేవతలు(అగ్న్యాదులు; అధ్యాత్మముగా అర్థమగునపుడు ఇంద్రియములు); ప్రాణమును (వాయువును) అనుసరించి తమతమ కార్యములను చేయుచున్నారు. అనఁగా వాయ్వంశము లేనియెడల తమతమ కార్యములు జరుగవు. మఱియు మనుష్యులును, పశువులును, ప్రాణమువలన బ్రదికియున్నారు. ప్రాణమే ప్రాణులయొక్క ఆయుస్సు; అది అందఱియొక్క ఆయుస్సుగాఁ జెప్పఁబడియున్నది." ఇట్లు సర్వరూప ప్రాణమును దెలిసికొని ఉపాసింతురో వారికి పూర్ణాయువు కలదు (అపమృత్యువు లేదు). ఈప్రాణమయకోశము అన్నమయశరీరసంబంధమైన ఆత్మ. ఈప్రాణమయముకంటెను వేఱుగను అంతర్గతముగను మనోమయకోశమున్నది; దీనిచేత ప్రాణమయము నిండియున్నది; దీనిఆకృతి అన్నమయకోశము నిండియున్నది. దీనికి యజుర్వేదము శిరస్సు; ఋగ్వేదము దక్షిణపక్షము; సామవేదము ఉత్తరపక్షము; ఆదేశము (వేదమునందలి విశేషభాగము) మధ్యభాగము; అథర్వవేదము పుచ్ఛము.

4. అనువాకము.

"ఏబ్రహ్మమునుదాఁట నేరక (తెలియ నేరక) వాక్కుసుమనస్సునుమరలినవో అట్టి బ్రహ్మముయొక్క ఆనందము నెఱిఁగినవాఁడు దేనికని భయమొందఁడు." అని; ఈమనోమయకోశము, ప్రాణమయశరీరసంబంధమైన ఆత్మయని తెలియవలయును. దీనికంటె వేఱైనదియు, అంతర్గతమైనదియునగు విజ్ఞానకోశముకలదు. దీనిఆకృతి పూర్వస్వరూపము ననుసరించియుండును.

దీనికి శ్రద్ధ శిరస్సు(అనఁగా విజ్ఞానముతో కర్మము చేయవలయును; ఆకర్మమునకు శ్రద్ధ ముఖ్యము; కావున, శ్రద్ధ శిరస్సువలె నున్నది); ఋతము దక్షిణపక్షము; సత్యము ఉత్తరపక్షము; యోగము (బుద్ధి, లేక సమాధానము) మధ్యభాగము; మహత్తత్త్వము (పరబ్రహ్మమునందుండి ముందుకల్గినతత్త్వము) పుచ్ఛము (విజ్ఞానాదులకుఁ గారణము).

5. అనువాకము.

"విజ్ఞానముగలవాఁడు యజ్ఞముచేయును; ఇతరకర్మములును జేయును; దేవతలు విజ్ఞానమును (ప్రారంభమునందుఁగలిగిన విజ్ఞానమును) బ్రహ్మమని ఉపాసనచేసెదరు; పాపములనెల్ల పరిహరించికొని సకలకామములను బొందుచున్నాఁడు."

ఇది మనోమయశరీరసంబంధమైనఆత్మ. దీనికంటె వేఱైనదియును అంతర్గతమైనదియు నగు ఆనందమయకోశ మున్నది. దీనిచేత విజ్ఞాన మయకోశము నిండియున్నది. దీనిఆకృతి మునుపటి తనస్వరూపము నను సరించియున్నది; దీనికి ప్రియము (ఆశ) శిరస్సు; అనఁగా ఆనందమునకు ఆశయే ముఖ్యమని తెలియునది. మోదము (సంతోషము) దక్షిణ పక్షము; ప్రమోదము (అత్యంతసంతోషము) ఉత్తరపక్షము; ఆనందము (సుఖానుభవము) మధ్యభాగము; బ్రహ్మము (వీనికికారణమైన పరబ్రహ్మ వస్తువు) పుచ్ఛము.

6. అనువాకము.

"బ్రహ్మము లేదనువాఁడు అసత్పురుషుఁడు; బ్రహ్మమున్నది యనువాఁడు సత్పురుషుఁడు."

ఇది పూర్వవిజ్ఞానమయశరీరసంబంధమైన ఆత్మయైయున్నది. ఈ విషయమై శిష్యుఁడు కొన్ని ప్రశ్నముల నడుగుచున్నాఁడు:—బ్రహ్మ జ్ఞానము లేనివాఁడు పరమాత్మను చేరునా? చేరఁడా? బ్రహ్మజ్ఞానిమాత్రమే పరమాత్మను చేరునా? (ఈవిషయమై ఇఁక చెప్పఁబడును.)

ఆ పరమాత్మ, ప్రపంచమును సృష్టింపనెంచి, ప్రపంచమును సృష్టి చేయువిధానమునుగూర్చి ఆలోచించెను; ఇట్లాలోచించి, కనఁబడునవి ఏవేవికలవో వానినన్నిటిని సృష్టించి, వానియందన్నిట ప్రవేశించెను.

ప్రపంచమంతయు ఆత్మ (పరబ్రహ్మ) స్వరూపమై పరిణమించియుం డఁగా, అతఁడు వేఱుగను, జగత్తు వేఱుగను తోఁపింపఁజేసి, దానియందు ప్రవేశించినాఁ డని చెప్పవచ్చునా? అనఁగా, సర్వవికల్పమునకును ఆస్పద మైయుండు నిర్వికల్పవస్తువగుపరబ్రహ్మము ప్రాణుల పంచకోశములద్వార ముగా ప్రవేశించియున్నాఁడు. ఎట్లన, జలమునందు సూర్యప్రతిబింబము కనఁబడుచున్నది; ఎట్లు మనకన్నులకు సూర్యుఁడు జలమునందు ప్రవేశించి యున్నట్లు కనఁబడుచున్నాఁడో, అట్లు బ్రహ్మము ప్రవేశించియున్నట్లు కల్పింపఁబడియున్నాఁడే గాని వేఱుకాదు. ఒకయింటియం దొకఁడు లోప లికిఁబోయి బయటికివచ్చునట్లు తలంపఁగూడదు.

ఇట్లు ఆ బ్రహ్మము ప్రవేశించి మూర్తవస్తువులుగను, అమూర్తవస్తు వులుగను, ఇట్టిదని నిశ్చయించి చెప్పఁదగినవస్తువులుగను, నిశ్చయింప నలవి గాని వస్తువులుగను, ఆశ్రయవస్తువులుగను, అనాశ్రయవస్తువులుగను,

బుద్ధిగలవిగను, బుద్ధిలేనివిగను, వ్యవహారసంబంధమైనసత్యవస్తువులుగను, అసంబంధమైన అసత్యవస్తువులుగను, పరమార్థసత్యవస్తువుగను, తక్కిన సర్వముగను అయియున్నది. ఇదే సత్యవస్తువు. ఈవిషయమునందు దిగువ నుదాహరించుమంత్రము కలదు.

7. అనువాకము.

"ఈజగత్తు, సృష్టించుటకుపూర్వము అసత్తుగానుండినది (నామరూపభేదములచే వికారమొందక అవ్యాకృతరూపమైన బ్రహ్మముగా నుండినది). అందుండి సత్తుకలిగెను (నామరూపవిశేషముచే వికారమై వ్యాకృతరూపమైన జగత్తు కల్గెను). ఆఅసత్తు తన్ను సత్తుగాఁ జేసికొనెను. అది(బ్రహ్మము) 'సుకృత' మని చెప్పఁబడుచున్నది. సుకృతమనఁగా, స్వయంకర్త, లేక పుణ్యము" అని.

ఈబ్రహ్మవస్తువు సుకృతమైయుండుటవలన, రసమై (మాధుర్యరసపదార్థమై) యున్నది. ఆరసము ననుభవించినవానికి ఆనందము కలుగును. అది హృదయాకాశమునందు ఆనందరూపమై యున్నది. అది అట్లుండని యెడల ప్రాణావృత్తుల నొనర్చువారెవ్వరు? అది లోకమునకు సుఖము నొసంగుచున్నది. ఎప్పుడో కసాధకుఁడు కనఁబడనిదియును, శరీరములేనిదియును, ఇట్టిదని గుర్తించి చెప్పుటకు కానిదియును, గుర్తించుటకు అవకాశము లేనిదియును అగుఆత్మయందు స్థైర్యముతో తన్ను పొందించునో, అప్పుడు వాఁడు అభయమును పొందును. ఎప్పుడో కనికి తాను వేఱనియును, ఆత్మ వేఱనియును భేదబుద్ధికలుగుచున్నదో, వానికి భయము కలదు. వాఁడు తెలిసినవాఁడై యుండినప్పటికిని భేదబుద్ధి గలవానికి భయముకలదు.

8. అనువాకము.

"ఆతనివలని భయమువలన, గాలివీచుచున్నది; సూర్యుఁ డుదయించుచున్నాఁడు; అగ్నియును, ఇంద్రుఁడును, మృత్యువును తమతమ కార్యముల నొనర్చెదరు." (పైని చెప్పినవారు స్వయము కర్తృత్వము గలవారై యుండినప్పటికిని, ఆనందమయుబ్రహ్మవస్తువునకు లోఁబడి యున్నారు.) ఆయానందము విచారింపఁబడుచున్నది.—

(విషయ విషయిసంబంధమైన లౌకికానందమా? లేక, స్వాభావికమైన బ్రహ్మానందమా? బ్రహ్మానంద మిట్టిదని తెలియుటకొఱకు

మొదట ఉత్కృష్టము గను, బాహ్యాధ్యాత్మసాధనసంపత్తినిమిత్తమై యుండులౌకికానందము చెప్పఁబడుచున్నది; ప్రసిద్ధముగుదీనిని తెలిసికొన్న యెడల శాంతమైనబుద్ధికి గోచరమైన బ్రహ్మానంద మిట్టిదని తెలియును. లౌకికానందము బ్రహ్మానందముయొక్క ఒక అంశము; మనుష్యానందము మొదలు ప్రారంభించి దానికి మీఁది శ్రేష్ఠమైన ఒక్కొకఆనందమును గూర్చి బోధించి బ్రహ్మానందము చెప్పఁబడుచున్నది.)

యౌవనము, సాధుత్వము, వేదాధ్యయనము, పరిజనము, శరీర దృఢత్వము, ధైర్యము, బలము, ఈభూమియంతయు నేలునట్టిశక్తి, సంపూర్ణధనము అను నీమొదలగునవిగల యొకమనుష్యుని ఆనందము మనుష్యానందమని చెప్పఁబడును. ఇట్టి ఆనందము నూఱింతలుగలది మనుష్యగంధర్వానందము; ఈ ఆనందము వేదార్థమెఱింగిన వానికిని, కామములేని బ్రహ్మవేత్తకును గలదు. ఇఁక చెప్పఁబోవు ఒక్కొక ఆనందమును బ్రహ్మవేత్తకుఁ గలదు (మనుష్యుఁడై నప్పటికిని,కర్మవిద్యావిశేషము చేత అంతర్ధానాదిశక్తియు, సూక్ష్మకార్యకారణత్వమును, గంధర్వత్వమును బొందినవాఁడు మనుష్యగంధర్వుఁ డనఁబడును. ఇట్టివానిచిత్తము విశేషానందమై యుండును.) ఇట్టివాని ఆనందము నూఱింతలుగలది దేవగంధర్వానందము (దేవగంధర్వుఁడనఁగా జాతిగంధర్వుఁడు.)

చాలకాలము పితృలోకమునందుండు పితృదేవతలయొక్క ఆనందము దేవగంధర్వానందముకంటె నూఱింత లధికమైనది. స్మార్తకర్మ విశేషముచేత దేవతాస్థానము నొందినవారియొక్క ఆనందము పితృదేవతలఆనందముకంటె నూఱింత లధికమైనది. అగ్నిహోత్రాదివైదికకర్మము చేత దేవత్వము నొందినవారియొక్క ఆనందము అంతకంటె నూఱింత లధికము. హవిస్సును భుజించు ముప్పదిమువ్వురు దేవతలయొక్క ఆనందము అంతకంటె నూఱింతలధికము. ఆదేవతలకధిపతి యైన దేవేంద్రుని ఆనందము అంతకన్న నూఱుపాళ్లధికము. త్రిలోకశరీరి యగు ప్రజాపతి యొక్క ఆనందము అంతకంటె నూఱుపాళ్లు అధికము. సూత్రాత్మ యగు బ్రహ్మముయొక్క ఆనందము అంతకన్న నూఱింతలధికము. ఆ బ్రహ్మము పురుషుని హృదయగుహాయం దున్నది. ఆదిత్యునియొద్దనున్నది. ఇట్లు తెలిసికొన్నవాఁడు ఈదేహమును వదలి అన్నమయాత్మను దాఁటుచున్నాఁడు (అన్నమయకోశమును మొదట తెలిసికొని,దానిని ఆత్మగాదని

నిగ్రహించుచున్నాఁడు.) ఇట్లు ప్రాణమయము, మనోమయము, విజ్ఞాన మయము, ఆనందమయము అనువీనిని ఆత్మగాదని యెఱుంగుచున్నాఁడు.

9. అనువాకము.

"దేనియందుండి వాక్కు మనస్సుతో (విజ్ఞానముతో) తెలియ నేరక మరలుచున్నదో,ఆ బ్రహ్మమును తెలిసికొన్న విద్వాంసునకు దేనియం దును(ఎట్లుండినప్పటికిని) భయములేదు.)"ఇట్టివిద్వాంసుఁడు పుణ్యముచేసి నప్పటికిని, పాపముచేసినప్పటికిని వానిని బాధించదు. అనఁగా పుణ్యఫల ముగాని, పాపఫలముగాని వానిని పొందదు. వాఁడు పుణ్యపాపములను తనఆత్మగా భావించుచున్నాఁడు. అనఁగా తానుమాత్రమే మిగిలి పుణ్య పాపములను ధ్వంసముచేయుచున్నాఁడు. ఇదే ఉపనిషత్తు (రహస్యము).

సహనావవ త్వితి శాన్తిః.

---

## భృగువల్లి అను తృతీయాధ్యాయము.

### 1. అనువాకము.

సహనావవత్వితి శాన్తిః

(పైని చెప్పఁబడిన తెఱంగున తెలిసికొన్నవానికి, పుణ్యపాపములు జన్మము నొసంగదని యిదివఱకుఁ జెప్పఁబడినది. ఇప్పుడు బ్రహ్మవిద్యా సాధన మైనతపస్సు, ఏకాగ్రచిత్తము, బాహ్యేంద్రియనిగ్రహము,బ్రహ్మ విచారమునందు బుద్ధి మొదలగువానినిఁ జెప్పుటతోఁగూడ, అన్నమ యాదివిషయములును, ఉపాసనలును జెప్పఁబడును.)

దిగువ నుదాహరించిన కథను విద్యాస్తుతికొఱకుఁ జెప్పఁబడుచు న్నది వరుణునికొడుకైన భృగువనుపేరుగల యొకఋషి తండ్రినిఁజూచి "బ్రహ్మమునుగూర్చి నాకుఁజెప్పుము" అనియడిగెను. తండ్రి యిట్లనియె.- 'శరీరము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు మొదలగునవి బ్రహ్మము నెఱుంగుటకు మార్గములు.మఱియు,బ్రహ్మలక్షణ మెట్టిదనఁగా- ఈబ్రహ్మాదిస్తంబ (తృణ) పర్యంతముగల భూతములు దేనియందుండి కల్గినవో, కల్గినవి దేనిచే జీవించియున్నవో, నశించునపుడు దేనియందు లయమగునో అదియే బ్రహ్మము. (ఇట్టిబ్రహ్మము శరీరాదులమూలముగా

నెఱుంగవలయునని తాత్పర్యము.) అట్టి బ్రహ్మము నెఱుంగుట కభిలషింపఁ దగును. ఇట్లు వినిన భృగువు ఏకాగ్రచిత్తుఁడై ఆలోచింపఁ దొడంగెను.

## 2. అనువాకము.

అన్నము బ్రహ్మమని తెలిసికొనెను. ఏలన, అన్నముచేత భూతములుకలిగెను; అన్నముచేత బ్రదికియున్నవి; అన్నము నేపొందుచున్నవి. ఇట్లు తెలిసికొనియు, అన్నము ఉత్పత్తివాశములకు లోనైనది గాన అది బ్రహ్మము కానేరదని తెలిసికొని, మరల తండ్రికడకుంజని "బ్రహ్మమును గూర్చి చెప్పవలయును" అనియడిగెను. అంత తండ్రి యిట్లనియె-"తపస్సుచేసి బ్రహ్మమును తెలిసికొనుము; చక్కఁగా ఆలోచించి చూడఁగా చూడఁగా తెలియును." అనెను. పిమ్మట భృగువు మరల నాలోచింపఁ దొడంగెను.

## 3. అనువాకము.

తర్వాత భృగువు తపస్సుచేసి ప్రాణమును బ్రహ్మమని తెలిసికొని, మరల ఆలోచించి చూడఁగా అదియు బ్రహ్మము కాదని నిశ్చయించికొని తండ్రిపాలికింజని "బ్రహ్మమునుగూర్చి బోధింపుము" అనెను. తండ్రి "తపస్సుచేఁ దెలిసికొనుము" అనెను.

## 4. అనువాకము.

పిమ్మట భృగువు తపస్సుచేసి, మనస్సును బ్రహ్మమని తెలిసికొని మఱియు నాలోచించిచూచి, మనస్సు బ్రహ్మముకా దని నిశ్చయించి, తండ్రినిఁజూచి "బ్రహ్మమునుగూర్చి చెప్పుము" అనఁగా తండ్రి "తపస్సుచేసి తెలిసికొనుము" అనియెను.

## 5. అనువాకము.

అనంతరము భృగువు తపస్సుచేసి విజ్ఞానమును బ్రహ్మమనియెఱింగి మరలవిచారించి అది బ్రహ్మము కాదని యెంచికొని, తండ్రియొద్దకుఁబోయి "బ్రహ్మమును గుఱించి తెలియఁజేయుము" అనఁగా నతఁడు "తపస్సుచేసి తెలిసికొనుము" అనెను.

## 6. అనువాకము.

అటుపిమ్మట భృగువుతపస్సుచేసి ఆనందము బ్రహ్మమని తెలిసికొని, మరలనాలోచించి అదియు కాదని నిశ్చయించెను. ఈ భార్గవీ, వారుణీ విద్యలు హృదయాకాశగుహాయందు ప్రతిష్ఠింపఁబడియున్నవి. ఇట్లెఱిం

గినవాఁడు బ్రహ్మమే యగుచు. అన్నము గలవాఁడుగను, అన్నమును భుజించుటకుఁ దగిన దీప్తాగ్నిగలవాఁడుగను, మహాపురుషుఁడుగను, పశువులు, ప్రజలు, కీర్తి మొదలగువానితోఁ గూడినవాఁడుగను అగుచున్నాఁడు.

## 7. అనువాకము.

(అన్నముద్వారముగా బ్రహ్మజ్ఞానము గలుగుటవలన) అన్నమును నిందింపఁదగదు; అదివ్రతముగా ఉపదేశింపఁబడుచున్నది; ప్రాణమే అన్నమయముగను, శరీరము అన్నము నొసంగునదిగను ఉన్నది; ప్రాణముశరీరమునందును, శరీరము ప్రాణమునందును ప్రతిష్ఠితమైయున్నది; (ఒకదానికి మఱియొకటి ఆధారముగనున్నది;) కావున, అన్నముఅన్నమునందు ప్రతిష్ఠితమైయున్నది. ఇట్లు తెలిసికొనినవాఁడు ప్రజలు, పశువులు, కీర్తి మొదలగువానితోఁ గూడినవాఁ డగుచున్నాఁడు.

## 8. అనువాకము.

అన్నమును నిందింపరాదు; అది వ్రతము; జలమే అన్నము; జ్యోతిస్సు అన్నము నొసంగుచున్నది; జలమునందు జ్యోతిస్సును, జ్యోతిస్సునందు జలమును ప్రతిష్ఠితమైయున్నది. కావున, అన్నము అన్నమునందే ప్రతిష్ఠితమైయున్నది. ఇట్లు తెలిసికొన్నవారికి ప్రజలు, పశువులు, కీర్తి ఈ మొదలైనవి సిద్ధించుచు.

## 9. అనువాకము.

అన్నమును మిగుల్పవలయును (పలువిధములుగా నుపాసింపవలయును). అది వ్రతము; పృథ్వియే అన్నము, ఆకాశము అన్నము నొసంగుచున్నది; అన్నమునందు ఆకాశమును, ఆకాశమునందు అన్నమును ప్రతిష్ఠింపఁబడి యున్నది. ఇట్లు ఎఱింగినవానికి ప్రజలు, పశువులు, కీర్తి ఇవి మొదలగునవి కలుగును.

## 10. అనువాకము.

ఇంటియందువసించుటకు వచ్చినవారిని పొమ్మనరాదు (వసించుటకు తావిచ్చినపుడు అన్నమును అవశ్యము నిడవలయును); ఇదివ్రతము; కావున, ఎట్లయినను విశేషముగా అన్నమును సంపాదింపవలయును(అన్నమడిగినవార్థికి లేదనరాదు; సిద్ధముగానున్నదని చెప్పవలయును; ఇంకను

అన్నము యొక్క మాహాత్మ్యము చెప్పఁబడుచున్నది). ఎట్లువే కాలమునందు దానము చేయుచున్నాఁడో, అట్లు ఆయా కాలమునందు దానిదానికి తగినఫలము ఇచ్చినవానికి కల్గును; ఎట్లన, బాల్యమునందు లేక ముఖ్య వృత్తితో అన్న మొసంగినచో, అట్లే మరల వీనికి లభించును; అట్లు మధ్యవయస్సునందును, వార్ధకమునందును ఇట్లు చేసినవానికి అట్లే మరల వీనికిలభించును. ఇట్లు తెలిసికొన్న వానికి ప్రజలు, పశువులు, కీర్తి లభించును (ఇఁక బ్రహ్మోపాసనా ప్రకారము చెప్పఁబడుచున్నది).

బ్రహ్మము వాక్కునందు క్షేమరూపమై ప్రతిష్ఠితమైయున్నదని ఉపాసింపవలయును (క్షేమమనఁగా, సంపాదించినదానిని రక్షించుట). ప్రాణవాయువునందును, అపానవాయువునందును, యోగముగను, క్షేమముగను ప్రతిష్ఠితమై యున్నదని ఉపాసింపవలయును (యోగమనఁగా లేనిదానిని సంపాదించుట). హస్తములయందు కర్మరూపముగా నున్నదని ఉపాసింపవలయును; పాదములయందుగతిరూపముగను, వాయువునందు విముక్తిరూపముగను ఉపాసింపవలయును; ఇవి మనుష్యసంబంధమైన జ్ఞానములు; ఇఁక దేవసంబంధజ్ఞానములు చెప్పఁబడును.—వర్షమునందు తృప్త్యాత్మగను, మెఱుమునందు బలరూపముగను,పశువులయందు యశోరూపముగను, నక్షత్రములయందు జ్యోతీరూపముగను, ఉపస్థమునందు పుత్రామృతానందరూపముగను, ఆకాశమునందు సర్వముగను భావించి ఉపాసింపవలయును. ఇట్లు ప్రతిష్ఠాగుణోపాసనమువలన బ్రహ్మనిలయుఁడగుచున్నాఁడు (అనఁగా ప్రతిష్ఠావంతుఁ డగుచున్నాఁడు). బ్రహ్మమును మహత్త్వగుణముగా ఉపాసించినయెడల మహాత్ముఁడగుచున్నాఁడు. బ్రహ్మమును మనస్సుగా ఉపాసించినయెడల మననసామర్థ్యముగలవాఁ డగుచున్నాఁడు. బ్రహ్మమును నమ యని ఉపాసించినచో నమ్రగుణము గలవాఁడగుచున్నాఁడు. సకలకామములును వానికి వశమగును. బ్రహ్మముగా ఉపాసించినయెడల బ్రహ్మగుణముగలవాఁ డగును. బ్రహ్మముయొక్క తెఱచాపగానైన వాయువును ఆత్మయగు ఆకాశముగా ఉపాసించినయెడల, ఉపాసించువానిశత్రువులును అప్రియులును నాశమగుదురు. ఆ బ్రహ్మమే ఈపురుషునియొద్దను ఆదిత్యునియొద్దను నుండువాఁడు.

ఇట్లు తెలిసికొన్నవాఁడు ఈ లోకమును విడిచి అన్నమయాదులనుక్రమముగాపొంది, సకలాభీష్టముల నొందినవాఁడై, కామరూపియై

ఈభూమి మొదలగు లోకములయందు సంచరించుచు సామ (బ్రహ్మ) గానముచేయుచు సుఖముగానుండును (సమస్తమును బ్రహ్మమని యెఱింగి కృతార్థుఁడై యుండును.)

ఆసామ మేదియనఁగా:—"అహో (ఆశ్చర్యము) ముమ్మాఱుచ్చరింపవలయును; నేను అన్నము ముమ్మాఱుచ్చరింపవలయును; నేను అన్నాదుఁడను (ముమ్మాఱు); నేను శ్లోకకృత్తు (ముమ్మాఱు); నేను జగమునకు మున్ను పుట్టినవాఁడను; దేవతలకంటె ముందువాఁడను; నేను ప్రాణుల నడుమనుండు వాఁడను; ఎవఁడు నన్ను అన్నముగా భావించునో వాఁడు నన్ను రక్షించును; నేను అన్నమును భుజించువానికి అన్నమొసంగుదును (అన్నమును భోక్తయును నేననిభావము); నేను సకల భువనమైయున్నాను; నేను ఆదిత్యునివలె ప్రకాశముగలవాఁడను" ఇట్లెఱింగినవానికి ప్రజలు; పశువులు, కీర్తి మొదలగునవి కలుగును.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

సహనా వవ త్వితి శాన్తిః.

తైత్తిరీయోపనిషత్తు సమాప్తము.

---

# తైత్తిరీయోపనిషత్సారాంశము.

(శంకరాచార్యాభిప్రాయము.)

దురితక్షయార్థములై యుండు నిత్యకర్మములను గూర్చియు, కామ్యార్థములై యుండు నైమిత్తికకర్మములనుగూర్చియు కర్మకాండము నందుఁ జెప్పఁబడియున్నది. కర్మఫలములు సంసారమునొసంగును. ఈఫలమునందు సుఖదుఃఖములు రెండును గలవు. నిత్యసుఖమునకు కర్మలు చాలవు. బ్రహ్మవిద్యచేతనే నిత్యమ్ము సుఖముకల్గును. కర్మములకు హేతువు కామము; అనఁగా ఇచ్ఛ. ఇచ్ఛలేనివానికి ప్రవృత్తిలేదు. అట్టి దేనియందును చిత్తమునందుంపక తనయందే (ఆత్మయందే) జ్ఞాపకము గలవాఁడై యుండును,

ఆత్మనెఱుంగఁ గోరికకలవానికి ఇతరవిషయములయందభిలాషము నివృత్తియగును. ఆత్మను (బ్రహ్మమును) ఎఱింగినవాఁడు సద్గతిని (నిత్య సుఖమును) పొందును. కావున అవిద్యను నిగ్రహించి తనలోనుండుపర మాత్మను చింతించుచుండవలయును. మఱియు కామ్యకర్మములను,నిషిద్ధ కర్మములను ప్రారంభింపఁదగదు. ఆరంభించినయెడల ఆకర్మఫలములను అవశ్యమనుభవింపవలయును. విహితమైననిత్యకర్మమునుచేసినయెడల అది పద్ధతికి మార్గముఁజూపును. సద్గతియనఁగా స్వర్గసుఖము నొసంగును. అంతియగాని మోక్షముకలుగునని చెప్పఁదగదు. ఏలన, కర్మములును కర్మఫలములును అనేకవిధములుగ నుండును; అనేకజన్మములందు చేసిన విరుద్ధకర్మఫలములు ఒకేజన్మమునందు అనుభవించుటకు సాధ్యముగాదు; కాఁబట్టి ఆఫలముల ననుభవించుట కనేకజన్మము లెత్తవలయును. ఇట్లొక్కొకజన్మమునందును చేయఁబడుకర్మముల ఫలముల ననుభవించుటకై మరలమరల జన్మము లెత్తుచుండవలయును. కావున, మోక్షముసిద్ధింపదు. కాఁబట్టి నిత్యకర్మములు మోక్షమునకు చాలవు. జ్ఞానము లేనియెడలకర్మ హేతువులైన కామములునశింపవు. ఆత్మజ్ఞానము లేనివానికి కామములు నశింపవు. తనఆత్మయే పరబ్రహ్మము. నిత్యకర్మములు మోక్షసాధనములు కావనితలంచి చేయకయుండఁగూడదని శ్రుతి చాటుచున్నది. చేయక యుండిన యెడల చెడుగుగల్గును. దేనికి ప్రారంభముకలదో అది నశించును. కావున, కర్మారంభముచేత మోక్షముకలుగదు. మోక్షము శాశ్వతముగానుండునట్టిది. లేనిదికలుగుటయే ఆరంభమనఁబడును. కాఁబట్టి, అవిద్యాకామకర్మోపాదానహేతునివృత్తియైనమీఁద స్వాత్మ న్యవస్థాన మనెడిమోక్షము సిద్ధించును. అనఁగా తనఆత్మనెఱింగిన మోక్షములభించును. అట్టిపరబ్రహ్మవిద్యను బోధించునదే ఉపనిషత్తు. బ్రహ్మము సమీపమునందు చేర్పించుటయే ఉపనిషత్తనఁబడును.

# 8. ఐతరేయోపనిషత్తు

## ప్రథమాధ్యాయము.

ఓమ్ వాఙ్మే మనసీతి శాన్తిః.

### 1. ఖండము.

1. (నామరూపములుగా వికారమొంది కనఁబడునట్టి) ఈ ప్రపంచము సృష్టికి పూర్వము ఒకేఆత్మగా నుండినది. అతఁడుతప్ప వేఱేదియు లేదు; ఆయాత్మలోకములను సృష్టింపవలయునని యాలోచించెను.

2. ఇట్లాలోచించి ఈలోకములను సృష్టించెను. అవి ఏవియన, అంభస్సు.—స్వర్గలోకము, దానికిమీఁదనుండు మహాలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము మొదలగు ఈలోకములను; మరీచి.—సూర్యకిరణములచే వ్యాపింపఁబడిన అంతరిక్షలోకము; మరము.—జీవులు నాశమొందెడిభూమి, భూలోకము; ఆపస్సు.—జలసంబంధమైన భూమికి దిగువనుండులోకములు. ఈలోకములను,జలమును ప్రధానముగాఁగల పంచభూతములవలన సృష్టించెను.

3. ఇప్పుడు నాచే సృష్టింపఁబడిన లోకములను పరిపాలింపనిచో నాశమొందును. కాఁబట్టి, లోకపాలకులను సృష్టింతు నని ఎంచి పైని చెప్పినపంచభూతములలోనుండి యొకపురుషాకారపిండమును నిర్మించెను.

4. ఆపిండమునుగూర్చి యిట్లు తలపోసెను. అందు పక్షియొక్క గ్రుడ్డువలె శిరస్సు కలిగెను; ఆశిరస్సునుండి వాగింద్రియము కలిగెను; అందుండి అగ్ని దేవత కలిగెను. పిమ్మట నాసిక కలిగెను. అందుండిఘ్రాణేంద్రియము కలిగెను; అందుండి సర్వత్ర వ్యాపించియుండు వాయు దేవత కలిగెను. తర్వాత నేత్రములు కలిగెను; వానినుండి చక్షురింద్రియము కలిగెను; అందుండి ఆదిత్యదేవత కలిగెను. అనంతరము శ్రోత్రము కలిగెను; దానియందుండి శ్రోత్రేంద్రియము కలిగెను; అందుండి దిగ్దేవత కలిగెను. పదంపడి చర్మము కలిగెను; అందుండి రోమములైన స్పర్శేంద్రియము కలిగెను; అందుండి ఓషధులు మొదలగు వానికిఅధిష్ఠానదేవతయైన వాయుదేవత కలిగెను. అటుపిమ్మట అంతఃకరణమునకు అధిష్ఠానమైన హృదయకమలము కలిగెను; అందుండి మానసేంద్రియముకలి

గెను; అందుండి చంద్ర దేవత కలిగెను. తర్వాత నాభి కలిగెను; అందుండి పాయురింద్రియము కల్గెను; అందుండి మృత్యుదేవత కల్గెను. తదుపరి శిశ్నము కలిగెను; అందుండి రేతస్సనెడి ఉపస్థేంద్రియము కల్గెను; అందుండి అద్దేవత (వరుణుఁడు) పుట్టెను. ఇట్లు లోకపాలకులను సృష్టిచేసెను.

౨. ఖండము.

1. ఈ అగ్న్యాద్యధీంద్రియదేవతలు మహత్తైన ఈసంసారసాగరంబునం బడిరి; (సంసారము సాగరమెట్లనఁగా:—అవిద్యాకామకర్మములచేఁ గలిగిన దుఃఖమే జలము; రోగము, ముదిమి, మరణము మొదలగునవి మొసళ్లు; అనాది; అంతములేనిది; సారములేనిది; పట్టుగొమ్మలేనిది; విషయేంద్రియములచేఁ గలిగిన సుఖలేశమువలన క్షణకాలము విశ్రాంతిగలది. పంచేంద్రియములు, అర్థము, ఆశ, అనుగాలిచే చలింపఁబడి యెగయునట్టి అనర్థములనెడి అలలుగలది. వ్యసనముచేఁ గలిగిన రోదనమను మహాఘోషము కలది. సత్యము, శౌచము, దానము, దయ, అహింస, దమము, శమము, ధృతి మొదలగు ఆత్మగుణములైన పాథేయము నిండిన జ్ఞానమను నావచేత దాఁటఁదగినది. ఆతీరము చేరుటకు సత్సంగము, సర్వత్యాగము అనునివి మార్గములు. మోక్షమే ఆతీరము.)

ఆయాత్మ పైని చెప్పఁబడిన ప్రకారము సృష్టింపఁబడిన పురుషపిండమును ఆఁకలి దప్పులతోఁ గూర్చియుంచెను. అందువలన ఆపిండము నుండి కలిగిన యితర దేవతలకును ఆఁకలి దప్పులు కల్గెను. అప్పుడు ఆ దేవతలు మేము ఎచ్చటనుండి అన్నమును భుజియింపఁగలమో ఆచోటును ఏర్పఱచవలసినదని ఆ బ్రహ్మమును అడిగిరి.

2. అందులకు ఈశ్వరుఁడు పశ్వాకృతిగా నొకపిండమును సృజించి మీ రిందుండవలసిన దనెను. ఆ దేవతలు "ఇది మాకుఁ దగినది కాదు" అనిరి. తర్వాత నొకగుఱ్ఱమును సృష్టించి దానిని చూపెను. అదియు మాకు తగినది కాదనిరి.

3. తర్వాత ఒకపురుషుని చూపెను. ఇది తగునని యంగీకరించిరి. అట్లయిన, దానిలో ప్రవేశింపుఁ డనియె.

4. అగ్ని-వాగ్రూపముగా ముఖమునందును, వాయువు-ఘ్రాణముగా ముక్కునందును, ఆదిత్యుఁడు-చక్షురింద్రియముగా నేత్రములందును, దిక్కులు - శ్రోత్రేంద్రియముగా చెవులయందును, ఓషధివనస్ప

తులు-స్పర్శేంద్రియముగా చర్మమునందును, చంద్రుఁడు - మనస్సుగా, హృదయమునందును, మృత్యువు-పాయ్వింద్రియముగా నాభియందును, జలము-ఉపస్థేంద్రియముగా ఉపస్థమునందును ప్రవేశించిరి.

5. ఆఁకలి, దప్పి అనునీరెండును మాకు చోటునేర్పఱచుమని కోరినవి; అందులకు ఆపరమాత్మ, మీరు "ఈదేవతలయొద్ద నుండుఁడు; వారికి లభించెడి ఆహారములందు మీకును భాగముకలదు; ఏదేవతకు హవిస్సు నిప్పించబడినప్పటికిని అందు ఆఁకలిదప్పులకును భాగముకలదు" అనెను.

(జీవునకుమాత్రమే భోక్తృత్వము కలదని చెప్పఁబడియున్నది. అయినను ఇంద్రియదేవతలు, ఆఁకలి, దప్పి, వీరికి భోక్తృత్వముగలదని చెప్పుటయందు దోషములేదు; వాస్తవమునందు బ్రహ్మస్వరూపమైన జీవునకు భోక్తృత్వము లేకపోయినప్పటికిని, ఇంద్రియదేవతలు, ఆఁకలి, దప్పి అను ఉపాధులవలననే జీవునకు భోక్తృత్వము చెప్పఁబడియున్నది.)

3. ఖండము.

1. ఇట్లు ఈశ్వరుఁడు సృష్టించి, తాను సృష్టించినలోకములకును, లోకపాలకులకును, ఆఁకలి దప్పులను ఏర్పఱచినందున వారికి అన్నమును సృష్టింపవలయునని ఆలోచించెను.

2. జలమునుగూర్చి సంకల్పించెను, అందుండి యొక ఆకృతి కలిగెను. అది ఘనరూపమును, చేతులతో నెత్తఁదగినదియును చరాచర లక్షణముతోఁ గూడినదియునగు అన్నముప (ఆహారమునకుఁ దగిన జంతువులు చరము, వడ్లు మొదలగునవి అచరము.)

3. ఇట్లు సృష్టింపఁబడిన అన్నము వెనుకకుమరలెను (అనఁగా దేవతలు భుజింపకయుండిరి). అప్పుడు ఆదియందు సృష్టింపఁబడిన పురుషుఁడు నోటిమాటలతో అన్నమును గ్రహింపఁజూచెను; సాధ్యముకాలేదు. అది సాధ్యమైయుండినయెడల ఒకఁడు అన్నమునుగూర్చి ప్రశంసించుటచేతనే తృప్తినొందవచ్చును (అనఁగా అది అసంభావితమని తాత్పర్యము).

4. తర్వాత ఘ్రాణేంద్రియముచే అన్నమును గ్రహింపఁజూచెను, సాధ్యముకాదయ్యెను. సాధ్యమైయుండునేని మూర్కొనుటచేతనే తృప్తి నొందియుండవచ్చును (ఇదియు అసంభావితము).

5. అనంతరము చక్షురింద్రియము గ్రహింపఁజూచెను. ప్రయోజనపడదయ్యెను. ఇది సాధ్యమైయుండినచో చూచుటచేతనే తృప్తినొందవచ్చును (అదియు అసంభావితము).

6. పిదప శ్రోత్రేంద్రియము ప్రయత్నించెను. సాధ్యముకాలేదు. సాధ్యమగునేని యిప్పుడు వినుటచేతనే తృప్తికలుగును (అదియు అసంభావితము).

7. స్పర్శేంద్రియము ప్రయత్నపడెను. సాధ్యముకాకపోయెను. అది సాధ్యపడియుండిన తాఁకుటచేతనే సంతృప్తికలుగును (ఇదియు సంభావితము కాదు).

8. మనస్సు గ్రహింప సుంకించెను. సాధ్యపడలేదు. సాధ్యపడియుండిన తలంచుటచేతనే తృప్తిగల్గును (అదియు అసంభావితము).

9. శిశ్నము (విసర్జనము) ప్రయత్నముచేసెను. సాధ్యముకాదయ్యె.

10. పిమ్మట అపానవాయువుచే అన్నమును గ్రహింపఁదొడంగినపుడు గ్రహించుటకు సాధ్యమయ్యెను. ఇదే అన్నమును గ్రహింపఁదగినది. ఈ అపానవాయువు అన్నమును గ్రహించి జీవించియున్నదనుట సుప్రసిద్ధము.

11. వాక్కుచేఁ జెప్పబడినను, ఘ్రాణముచే మూర్కొనంబడినను, కన్నులచేఁ జూడఁబడినను, శ్రోత్రముచే వినఁబడినను, త్వక్కుచే తాఁకఁబడినను, మనస్సుచే ధ్యానింపఁబడినను, అపానముచే గ్రహింపఁబడినను, శిశ్నముచేవిసర్జింపఁబడినను, ఈకార్యకారణసముదాయము నావలననే నెలకొనియున్నది. (ఇవి నాప్రేరణముచేతనే తమతమపనులు నొనర్చుచున్నవి; కావున నేను వీనిలో ప్రవేశింపవలయును; తల, కాలు అను వీనిలో నేమార్గముగా ప్రవేశింపవచ్చును?అని ఈశ్వరుఁడు ఆలోచించెను.)

12. మూర్ధమును భేదించి యామార్గమునఁ బ్రవేశించెను. దీనికి (ద్వారమునకు) విదృతి యని పేరు; ఇది ఆనందమయద్వారము; ఇట్లు ప్రవేశించిన ఈశ్వరునకు వసించుటకు మూఁడుస్థలములుకలవు;జాగ్రదవస్థయందు కుడికన్ను; స్వాప్నావస్థయందు మనస్సు; సుషుప్త్యవస్థయందు హృదయాకాశము; ఈమూఁడును స్వప్నములు (ఈజాగ్రత్స్వప్నసుషు

ఫ్తులు నశ్వరములును, స్వప్నమువంటివియునై యున్నందున స్వప్నము లని చెప్పఁబడినవి)

13. ఇట్లు కలిగిన (కార్య కారణసముదాయ మైనఉపాధితోఁగూడిన) జీవుఁడు అహంకరించి "ఈశరీరమునందు వేఱే యేమికలదు? సర్వము నేను" అని అభిమానము నారోపించికొనుచున్నాఁడు. ఇట్లు బహుకాలము, తెలివిలేక మైమఱచియుండి, ఒకానొకసమయము పరమకృపానిధి యగు ఆచార్యోపదేశమువలన మేల్కాంచి, పరమపురుషుఁ డగు బ్రహ్మమును తనలో తానై చూచుచున్నాఁడు.

14. కాఁబట్టి, ఈపురుషునకు ఇదంద్రుఁడనిపేరు. (ఇదంద్రుఁడు= దీనినిచూచువాఁడు, అపరోక్షమైయుండు ప్రత్యగాత్మను శరీరమునందు న్నట్లు చూచుచున్నాఁడు.) ఆబ్రహ్మమును పరోక్షముగా ఇంద్రుఁ డని చెప్పెదరు. (పూజ్యులపేరును ప్రత్యక్షముగాఁ జెప్పుటకంటెను పరోక్ష ముగాఁ జెప్పుటయే మర్యాదయగును; పూజ్యు లందఱికంటె పూజ్యుఁడైన ఈశ్వరుని మర్యాదచేయవలయునుకదా?)

ఈఅధ్యాయసారాంశము:—ఈలోకమును సృష్టించి, రక్షించి, సంహరించుపరమాత్మ అసంసారి, సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడునై యున్నాఁడు. ఈప్రపంచమును ఏయొక్క ఉపాదానకారణమును లేకయే ఆకాశాదిక్రమముగా సృష్టించి, తనయాత్మను తానై యెఱుంగునట్లు సకల ప్రాణులశరీరములందును ప్రవేశించియున్నాఁడు. కాఁబట్టి, ఒక ఆత్మయే సకలశరీరములందు నున్నదని తెలిసికొనవలయును.

సృష్టిక్రమమునందు అనేకములైన ఆక్షేపము లున్నవని ఆ శంకించువారి కిట్లు సమాధానము చెప్పఁబడుచున్నది.

1. సృష్టిక్రమము అర్థవాదము. అనఁగా, ఈజగత్తుయొక్క లక్షణమును సులువుగా బోధించుటకై లోకవ్యవహారమును కథవలె చెప్ప వలసివచ్చినది. ఆత్మ నెఱుంగుట ముఖ్యమే కాని సృష్టిక్రమము నెఱుం గుటవలన నేప్రయోజనమును లేదు.

2. అయినను, మాయావియగు ఈశ్వరున కేది అసాధ్యముం డును? మాయకు సర్వమును సాధ్యమగును. ఆత్మ నెఱుంగుటకు శాస్త్రో పదేశమే తగినది. వేఱొక్కటియు లేదు. కాఁబట్టియే ఆత్మ నెఱుంగుటకై ఉప నిషత్తులు మొదలగునవి ప్రవర్తించియున్నవి. ఎంతవఱకు ఆత్మ నెఱుంగ

కుందునో, అంతవఱకును అవిద్యోపాధిధర్మములు తన కని భావించి నానావిధ యోనులలంబడి పుట్టుచు గిట్టుచునుండును (ఇట్టి మూఢునిస్థితిని గూర్చిముందు చెప్పఁబడును).

ద్వితీయాధ్యాయము.

4. ఖండము.

ఈజీవుఁడు అవిద్యాకామకర్మవశుఁడై యజ్ఞాదులనొనర్చి, ధూమాదిమార్గముగా చంద్రలోకమును జేరి, తత్ఫలానుభవానంతరము వృష్ట్యాదులమూలముగా భూమినిఁ జేరి, అన్నరూపమైజన్మించుచున్నాఁడనుదానినిగూర్చి బోధింపబడుచున్నది.—

1. ఈజీవుఁడు మొదట పురుషునిగర్భమునం దున్నాఁడు. ఎట్లన, అన్నమయమైన శరీరమునందు సకలాంగములయం దుండియు కలుగునట్టి సారమే రేతస్సు. అది మొదట పురుషునిగర్భమునందే యున్నది. పిమ్మట స్త్రీతో సంయోగముచేయు కాలమునందు జీవునకు మొదటిజన్మ మగుచున్నది (అనఁగా ప్రథమావస్థ).

2. ఇట్లు స్త్రీయం దుంచబడిన రేతస్సు దానినేపొంది వృద్ధినొందుచున్నది. (ఆస్త్రీయొక్క సొంతఅంగమైన స్తనాదు లెట్లు వృద్ధినొందుచున్నవో, అట్లు క్రమక్రమముగా వృద్ధినొందుచు శరీరమునందేయిమిడి యున్నది). కాఁబట్టి ఆగర్భము స్త్రీని పీడించుటలేదు. ఆస్త్రీఆగర్భమును రక్షించుచున్నది.

3. ఇట్లు గర్భమును రక్షించుచుండు స్త్రీని రక్షింపవలయును. పదియవనెల కుమారుఁడు జన్మించుచున్నాఁడు; పితయొక్కఆత్మయేపుత్త్రరూపమై పుట్టుచున్నాఁడు. అట్టిపుత్త్రుని, జాతకర్మాదిక్రియలచే తండ్రి తనవలె భావించుచున్నాఁడు. అట్లు చేయవలసినదేల ? అనఁగా లోకమునందు ప్రజావృద్ధినిమిత్త మని తెలియఁదగినది (పుత్త్రోత్పాదనముచే మోక్షముగలుగదు). ఇట్లు తల్లిగర్భమునుండి జన్మించుట ఈజీవుని రెండవజన్మము (అనఁగా ద్వితీయావస్థ).

4. ఇట్లు కలిగిన పుత్త్రాత్మ, తండ్రికి (అనఁగా తండ్రికి ప్రతిగా నుండి) పుణ్యకర్మములుచేయుటకు ప్రతినిధి యగుచున్నాఁడు. అపుడు తండ్రి కృతకృత్యుఁడై వార్ధకమునొంది గతించుచున్నాఁడు. ఇట్టివాఁడు

కర్మవశముచేత మఱుజన్మమునొందుచున్నాఁడు. ఇది జీవుని మూఁడవ జన్మము (అనఁగా తృతీయావస్థ).

5. గర్భమునం దుండినపుడు వామదేవుఁడు ఇట్లుతలపోసెను.— "నేను వాక్కు అగ్ని మొదలగువారిజన్మములను తెలిసికొంటిని; మిక్కిలి కఠినములైన ఇనుమువంటిశరీరముల నెన్నియో వడసి రక్షింపఁబడితిని; ఇప్పుడు వలలోనుండి తప్పించుకొన్న గ్రద్దవలె తత్త్వజ్ఞానముచేఁ గల్గిన సామర్థ్యమువలన ఈసంసారబంధమును త్రెంచికొని (గర్భమునుండి) వెలువడుచున్నాఁడను" అని.

6. ఇట్లు జ్ఞానియైన వామదేవఋషి, ఈశరీరమునుండి వెడలి, స్వర్గముచేరి సకలభోగముల ననుభవించి ముక్తినొందెను.

---

## తృతీయాధ్యాయము.

### 5. ఖండము.

1. ముముక్షువు లగు బ్రహ్మజ్ఞానులు పరస్పర మిట్లు ప్రశ్నించుచున్నారు.—

ఎవనినిఆత్మయని సాక్షాత్తుగా మనము ఉపాసింపవలయును? అతఁడెవఁడు! ఇరువురలో ఆత్మయెవరు ? (దేహామునందు క్రియాంగములై యుండునదియా? లేక చేయువాఁడై యుండునదియా?) దేనిచేత రూపమును జూచుచున్నాఁడో, దేనిచేత శబ్దమును వినుచున్నాఁడో, దేనిచే గంధమును మూర్కొనుచున్నాఁడో, దేనిచే శబ్దములను భాషించుచున్నాఁడో, దేనిచేఇదిమంచిది; ఇదిచెడ్డది యని తెలిసికొనుచున్నాఁడో, ఆసాధన మేది ? అనఁగా.—

2. ఎది హృదయమో, ఎది మనస్సో, ఆరెండు నని తెలియఁదగినది. (ఈరెండు కరణములయొక్కకూడికయే ప్రాణ మనఁబడును.) ఈకరణసంహతి ఉపాసింపఁదగినఆత్మ యగునా? కానేరదు. మఱేది? ఈహృదయమనోరూపకరణమువలన ఎవఁడు ఉపలబ్ధిని పొందుచున్నాఁడో, ఎవనికరణమునకు దిగువ నుదాహరించుసంజ్ఞాదులు అంతఃకరణవృత్తులై యున్నవో, అట్టివస్తువును ఉపాసింపఁదగినఆత్మ యని నిశ్చయించికొనిరి. ఆవృత్తు లేవి యనఁగా.—సంజ్ఞానము(చేతనభావము, ప్రాణిత్వము); ఆజ్ఞానము(ఈశ్వరభావము); విజ్ఞానము (లౌకికజ్ఞానము); ప్రజ్ఞానము (తెలివి)' మేధ (చదివి

నది మఱవకుండుట); దృష్టి (ఇంద్రియములద్వారముగ సర్వము నెఱుంగుట); ధృతి (ధైర్యము); మతి (తలంపు); మనీష (నిశ్చయబుద్ధి); జూతి (మనోదుఃఖావస్థ); స్మృతి(జ్ఞాపకము); సంకల్పము (పద్ధతి); క్రతువు (నిశ్చయము); అసువు (జీవించియుండుట); కామము (లభింపనిదానియందలి కోరిక); వశము (స్త్రీలు మొదలగువారియందు ఇచ్ఛ); ఇవి యన్నియు ప్రజ్ఞానముయొక్క నామములు. (అనఁగా శుద్ధప్రజ్ఞానమై యుండునది బ్రహ్మము; ఆ బ్రహ్మమునకు మీఁదఁ జెప్పఁబడిన సంజ్ఞానాద్యంతఃకరణ వృత్తులు నామధేయములు ఉపాధులై యున్నవి. ఈఉపాధులతోఁగూడి నప్పుడు నామరూపాత్మకమైన బ్రహ్మముగుచున్నది.)

3. (ప్రజ్ఞానరూపమైయుండునదే బ్రహ్మము; ఈ బ్రహ్మము సకల శరీరములందును ప్రవేశించి, అంతఃకరణోపాధులతోఁ జేరి, అనేకములగుజలాశయములయందు ఒక్కసూర్యుఁడు అనేకసూర్యులుగాఁ గనంబడునట్లు, ఒక్కొకప్రాణియందును భిన్నముగనే కనఁబడుచున్నాఁడు.) ఇతఁడే ఇంద్రుఁడు, ప్రజాపతి (మొదట కలిగినవాఁడు); ఇతఁడేఅగ్న్యాది దేవతలు; ఇతఁడే పృథ్వ్యాదిపంచభూతములు; ఇతఁడే సర్పాదిజంతువులు; ఇతఁడే కారణము; ఇంకను అండమునందుండి కలుగుజంతువులు; ఇతఁడే గర్భకోశమునుండి కలుగుజంతువులు; ఇతఁడే చెమటయందుండి కలుగుజంతువులు; ఇతఁడే వృక్షములు; ఇతఁడే అశ్వములు; ఇతఁడే పశువులు; ఇతఁడే పురుషులు; ఇతఁడే గజములు; ఇతఁడే పక్షులు; ఇతఁడే శిలలు మొదలగు స్థావరములు; ఇంకను గల సకలప్రాణులును ఆ బ్రహ్మముగానేయున్నది. సమస్తమును ప్రజ్ఞానేత్రము. (అనఁగా ప్రజ్ఞయే నేత్రముగానున్నది. లేక, నడపునట్టి కర్తగా నుంచికొనియున్నది.) సర్వమును ప్రజ్ఞానమునందు స్థాపింపఁబడియున్నది. లోకమే ప్రజ్ఞానేత్రము. ప్రజ్ఞయే ప్రతిష్ఠ; ప్రజ్ఞానమే బ్రహ్మము.

4. వామదేవఋషియును, తక్కిన బ్రహ్మవేత్తలును ఈ ప్రజ్ఞానాత్మ నెఱింగి, ఈలోకమును వదలి స్వర్గమునందు సకలకామములను బొంది అమృతత్వమును బొందుచున్నారు.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.
వాఙ్మేమనసీతి శాన్తిః.
ఐతరేయోపనిషత్తు సమాప్తము.

# 9. ఛాందోగ్యోపనిషత్తు.

## ప్రథమ ప్రపాఠకము.

ఆప్యాయం న్త్వితి శాన్తిః.

### 1. ఖండము.

1. ఓం. ఉద్గీథ మను పేరుగల 'ఓం' అను అక్షరమును ఉపాసింపవలయును. 'ఓం' అని (సర్వత్ర) గానముచేయుచుండుటవలన (ఉచ్చరించుచుండుటవలన) ఉద్గీథమని చెప్పఁబడుచున్నది. దానినిగూర్చి వ్యాఖ్యానము చేయఁబడుచున్నది.

2. (చరాచరములైనట్టి, ఈ) పృథ్వీరసమై (సారమై) యున్నది. పృథ్వీలోపల జలము రసము. జలమునకు ఓషధులు రసము. ఓషధులకు పురుషుఁడు రసము. పురుషునకు వాక్కు రసము. వాక్కునకు ఋగ్వేదము రసము. ఋగ్వేదమునకు సామవేదము రసము. సామవేదమునకు ఉద్గీథము రసము (అనఁగా ఓంకారము రసము).

3. ఇట్లు ఎనిమిదియవ ఏ ఉద్గీథముగలదో, అది రసములకెల్ల రసమైయున్నది. ఉత్తమమైనది. బ్రహ్మమునకు స్థానమై యుండునట్టిది.

4. ఋగ్వేద మెట్టిది? సామవేద మెట్టిది? ఉద్గీథ మెట్టిది? అని విచారింపఁబడును.

5. వాక్కు ఋగ్వేదము, ప్రాణము సామవేదము, ఓం అను అక్షరము ఉద్గీథము, ఋక్కునకును సామమునకును కారణములై యుండు వాక్కును ప్రాణమును మిథునము; (జంట; ఒకటితోనొకటియెడఁబాయక యున్నది.)

6. ఈమిథునము ఓం అను అక్షరమునందు సంబంధించి యున్నది. (లోకమునందు) మిథునములు ఒకటితో నొకటి కలియునపుడు ఎట్లు పరస్పరేచ్ఛ కలుగుచున్నవో, అట్లు (వాక్ప్రాణములు రెండును చేరిన ఓంకారము సర్వాభీష్టముల నొసంగును.)

7. ఏవిద్వాంసుఁడు ఉద్గీథమును ఈరీతిగా నెఱుంగునో, వాఁడు సకలాభీష్టములను బొందుచున్నాఁడు.

8. లోకమందు దేనికిని ఓం అని అనుమతి నొసంగుటవలన దానికి అనుజ్ఞాక్షరమని పేరు. సమృద్ధి యనియును పేరు. ఏవిద్వాంసుఁడు ఈ అక్షరమును ఇట్లుపాసించుచున్నాఁడో వానికి సకలకామములు నొసంగును. (అందువలననే సమృద్ధియని పేరు.)

9. అందుచేత ఈమూఁడు విద్యలు నున్నవి. (ఈ ఓం అక్షరము యొక్కపూజార్థము.) (సోమయాగమునందు) ఓం అని ఉచ్చరించి (దేవతలు) వినునట్లు చేయుచున్నది? ఓం అని నుతింపఁబడుచున్నది? ఓం అని గానము చేయఁబడుచున్నది. దానిమహిమచేతను, రసముచేతను ఇట్లేర్పడి యున్నది.

10. తెలిసినవాఁడును తెలియనివాఁడును ఇర్వురును కర్మమును చేయుచున్నారు. విద్య (జ్ఞానము) అనేకవిధములు. అవిద్య (అజ్ఞానము) అనేకవిధములు. జ్ఞానముతోడను శ్రద్ధతోడను విధ్యుక్తముగను చేయు కర్మమునకు అధికబలమైన ఫలము కలదు. ఇట్లు ఈ (ఉద్గీథ) అక్షరము యొక్కతాత్పర్యమై యున్నది.

2. ఖండము.

1. దేవతలును (ప్రకాశముగలవారు, ఇంద్రియముల సద్వృత్తులు), అసురులును (తమజీవితమునందు అధికాసక్తిగలవారు, ఇంద్రియముల అసద్వృత్తులు) ఒకరిని మఱొకరు జయింప నిశ్చయించి యుద్ధము చేసిరి. ఇరుతెగలవారును ప్రజాపతి (అత్మ) యొక్కబిడ్డలు. దేవతలు అసురులను జయింప నెంచి ఉద్గీథోపలక్షితమైన యాగాదికర్మము నారంభించిరి.

2. దేవతలు (అసురులను జయించుటకై) ఘ్రాణేంద్రియ ప్రాణమును ఉద్గీథకర్తగా(ఉద్గీథముచే చెప్పఁబడు ఆత్మగా) ఉపాసించిరి. దానిని అసురులు పాపముతోఁ గొట్టిరి. అందువలన, ఘ్రాణేంద్రియప్రాణము పాపముచేఁ గొట్టువడినందున సుగంధ దుర్గంధములను మూర్కొనుచున్నది.

3.—6. తర్వాత (క్రమముగా) 3. వాగింద్రియము, 4. చక్షురింద్రియము, 5. శ్రోత్రేంద్రియము, 6. మానసేంద్రియము, ఇవియు పైనిచెప్పినప్రకారమే కొట్టువడి దానిదానికిఁ దగిన మంచిచెడ్డలను పొందినవి.

7. పిమ్మట ముఖ్యప్రాణమును (ఆత్మను) ఉపాసించిరి. శిలను తాలుచుట కెట్లు వలనుపడదో, అట్లు దానిని భేదింప సాధ్యముగాక అసురులు దానిచేత (ఆత్మచేత) కొట్టువడిపోయిరి.

8. ఇట్లు ముఖ్యప్రాణమును తెలిసినవానికి ఎవఁడు కీడుచేయఁ దలంచునో, ఎవఁడు హింసించునో, వాఁడు కొట్టువడిపోవును. ఆత్మ నెఱింగినవాఁడు శిలవలె భేదింపఁబడఁడు.

9. ఆ ముఖ్యప్రాణముచేత సుగంధదుర్గంధములు రెండును తెలియఁబడుటలేదు; అది పాపములేనిది దేనిని భుజించుచున్నదో, దేనిని త్రాగుచున్నదో, దానిచేత తక్కినప్రాణములను రక్షించుచున్నది. దీనిని మరణకాలమునందు ఘ్రాణాదీంద్రియములు బొందక బయలు వెడలుచున్నవి; నోరు తెఱచుచున్నవి.

10. ఆ ఉద్గీథమును 'అంగిరస్సు' అనుఋషి తనప్రాణముగనే ఉపాసించిరి. అందువలన ఉద్గీథము 'అంగిరస్' అని చెప్పఁబడెను. (ప్రాణము) అంగములలో రసముగలది గాన ఈ పేరొందినది.

11. అందువలన ఆ ఉద్గీథమును బృహస్పతియును అదేప్రకారముపాసించెను. అందువలన అది 'బృహస్పతి' అనియు చెప్పఁబడెను. వాక్కునకు పతియగుటంబట్టి అట్లనఁబడినది.

12. అందుచేత ఆ ఉద్గీథమును 'ఆయాస్యుఁ' డను ఋషియును ఉపాసించెను. అందుచేత 'ఆయాస్యం' అనియు చెప్పఁబడినది. వక్త్రము నుండి (నోటినుండి) కలిగినందువలన అట్లనఁబడినది.

13. అందుచేత దాల్భ్యుని కుమారుఁడైన బకుఁ డను ఋషియును ఆ ఉద్గీథ మిట్టిదని తెలిసికొనెను;అట్లెఱింగి(సత్రయాగమునందు) నైమిశారణ్యఋషులకు ఉద్గాతయైయుండి వారలకు ఇష్టమైనవన్నియు గానముచేసిరి.

14. ఏ విద్వాంసుఁ డిట్లెఱింగి ఉద్గీథోపాసనను చేయుచున్నాఁడో, వాఁడు సకలమైన కామములను గానము చేయువాఁడుగ నున్నాఁడు (పొందెడివాఁ డగుచున్నాఁడు); ఆత్మసంబంధముగాఁ (ఇంతవఱకు) జెప్పఁబడినది.

3. ఖండము.

1. ఇఁక అధిదైవతము (దైవసంబంధము చెప్పఁబడును). ఏ (ఈ కనఁబడు) ఈసూర్యుఁడు తపించుచున్నాఁడో అతనిని ఉద్గీథముగా ఉపాసింపవలయును. ఉదయమై ప్రజలకొఱకు పైకిపోవుచున్నాఁడు. ఉదయించి చీఁకటిని, అందుచేతఁ గలుగుపాపమును పోఁగొట్టుచున్నాఁడు. ఇట్లైవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడు (జననమరణ) భయమును, (దానికిఁ గారణమైన అజ్ఞానమనెడి) అంధకారమును పోఁగొట్టుచున్నాఁడు.

2. ఈసూర్యుఁడును, ఆప్రాణమును సమానము. రెండును ఉష్ణమైనవి. ప్రాణమునకును స్వరము (పోవునది, బైటపోవునది) అనిపేరు. సూర్యునకును స్వరము (పోవునది) ప్రత్యాస్వరము (మరలివచ్చునది) అనిపేరు. (కాఁబట్టి గుణముచేతను పేరుచేతను సమమైయున్నవి.) కావున నీరెండును ఉద్గీథముగా ఉపాసింపవలయును.

3. వ్యానవాయువును ఉపాసింపవలయును. ఏది బ్రదికియుండునట్లు చేయుచున్నదో (శ్వాసము మీఁదికి పోవుచున్నదో) అది ప్రాణవాయువు. ఏది క్రిందుగ ప్రసరించుచున్నదో అది అపానవాయువు. ఈ రెంటినడుమ యేదియున్నదో అది వ్యానవాయువు. ఏది వ్యానవాయువో అదియే వాక్కు. ఆవాయువు పైకిపోక దిగువకుపోక వాక్కును ఉచ్చరించుచున్నది.

4. వాక్కే ఋక్కు; కావున మీఁదికిపోకయు దిగువకుపోకయు ఋక్కును ఉచ్చరించుచున్నది. ఋక్కే సామము; అట్లే సామమును గానము చేయవలసినది; సామమే ఉద్గీథము; అట్లే అధికముగా గానము చేయవలయును.

5. అగ్నిని మథించుట, గుర్తించిన మేరకు పరుగిడుట, దృఢమైన ధనుస్సును వంచుట, ఈమొదలగువీర్య సాధ్య కార్యములెన్నిగలవో వానినన్నియు (వ్యానవాయువు) పైకిపోకయు దిగువకుపోకయు (శ్వాస నిరోధముచే) చేయుచున్నది. కావున వ్యానవాయువును ఉద్గీథముగా ఉపాసింపవలసినది.

6. మఱియు, ఉద్గీథశబ్దముయొక్క ఒక్కొకయక్షరమును ఉద్గీథముగా ఉపాసింపవలసినది. 'ఉత్' అనఁగా ప్రాణము; ప్రాణముచేతఁగదా మీఁది కెగయుట. 'గీ' అనఁగా వాక్కు, వాక్కు 'గీ' అని చెప్పఁబడును. 'థమ్' అనునది అన్నము. అన్నముచేతఁగదా ఈ ప్రపంచము నెలకొనియున్నది.

7. 'ఉత్' ఆకాశము, (మీఁదనుండుటవలన) 'గీ' అంతరిక్షము, (లోకములను అణఁచియుంచికొని యుండుటవలన) 'థమ్' పృథివి (ప్రాణులయొక్క స్థానమైయుండుటవలన). 'ఉత్' సూర్యుఁడు, (మీఁదనుండుట వలన) 'గీ' వాయువు, (అగ్న్యాదులను కబళించుటవలన) 'థమ్' అగ్ని (కర్మము నంటికొనియుండుటవలన).

'ఉత్' సామము, (స్వర్గమును స్తుతించుటవలన) 'గీ' యజుర్వేదము, (దేవతలకు హవిస్సు నొసంగుటవలన) 'థమ్' ఋగ్వేదము, (ఇందు సామము అణఁగియుండుటవలన) (ఇట్లు తెలిసికొన్న వానికిఫలము) ఏ విద్వాంసుఁడు ఉద్గీథాక్షరములను ఉద్గీథమని ఉపాసించుచున్నాఁడో, వానికి వేదోక్తకర్మఫలము నంతయు తత్ఫల మనుపాలను పితికి యిచ్చుచున్నది. వాఁడు అన్నముగలవాఁడుగను, దానినిభుజించుటకు శక్తిగల వాఁడుగను నుండును.

8. ఇఁక కామసమృద్ధి (చెప్పఁబడును.) ధ్యానింపఁదగినదాని నంతయు ఉపాసింపవలయును. ఏసామముచేత స్తోత్రముచేయుటకు ఇచ్ఛయించుచున్నాఁడో ఆసామమును చింతించుచున్నాఁడు. (అనఁగా సామ ధ్యానమువలన తత్ఫలమునంతయుఁ బొందును.)

9. ఏఋక్కునందు ఏఋషిని, ఏదేవతను స్తోత్రముచేయుటకు ఉద్దేశించుచున్నాఁడో ఆఋక్కును, ఆఋషిని, ఆదేవతను చింతించుచున్నాఁడు.

10. ఏఛందస్సుచేతనుఏస్తోమముచేతను స్తోత్రముచేయుటకు ఉద్దేశించుచున్నాఁడో ఆఛందస్సును ఆస్తోమమును చింతించుచున్నాఁడు.

11. ఏదిక్కును స్తోత్రముచేయుటకుఁగోరుచున్నాఁడో ఆదిక్కును (దిగ్దేవతను) చింతించుచున్నాఁడు.

12. ఎవఁడు ప్రమాదము నొందనివాఁడుగను,ధ్యానించుచు తనయొక్క ఆత్మను గూర్చియే హృదయమున నిల్పి ఏ కామమును (కోర్కిని) ఉద్దేశించి స్తోత్రముచేయుచున్నాఁడో, ఆ కామము సమృద్ధిగా వానికి లభించును.

### 4. ఖండము.

1. 'ఓం' అను అక్షరమును ఉపాసింపవలయును. 'ఓం' అని గానము చేయవలయును. దాని వివరణము (ఏమన).

2. దేవతలు మృత్యువునకు భయపడి వేదవిద్యను పొందిరి.(వేదోక్తకర్మముల నాచరించిరి.) వారు ఛందస్సులచేత (వేదమంత్రములచేత) కర్మముల ననుష్ఠించి తమ్ము తాము మఱుఁగించికొని యుండినందున (అనఁగా ఆత్మ యిట్టిదని తెలియక కర్మములందే దృష్టి నుంచికొని యుండినందున) వేదములకు 'ఛందస్సు' అను పేరుగలిగినది.

3. ఎట్లు చేఁపలుపట్టువాఁడు జలమునందలి చేఁపలను (వలవేసి పట్టవలయు నని తలంచుచున్నాఁడో) చూచుచున్నాఁడో, అట్లు మృత్యుదేవత దేవతలను వేదకర్మములందు (వేదోక్తకర్మములనుమాత్ర మను ష్ఠించుచు ఆత్మజ్ఞాన మిట్టిదని తెలియనివారై యుండినచో కార్యసిద్ధి యగు నని మృత్యుదేవత) చూచుచున్నాఁడు. దేవతలు (మృత్యుదేవతాభిప్రాయము నెఱింగి) మూఁడువేదములకంటె శ్రేష్ఠమైన 'ఓం'కారమును ఉపాసనచేసిరి.

4. ఎప్పుడు ఋక్కును పొందుచున్నాఁడో (అధ్యయనము చేయుచున్నాఁడో) అప్పుడు 'ఓం' అని అధిస్వరము చేయవలయును. (గట్టిగాఁ జెప్పవలయును.) అట్లే సామమును, యజుస్సును చేయవలయును. ఏది అక్షరమై, అమృతమై, అభయమైయున్నదో, అదే స్వరము (ఓం). దానిని పొంది దేవతలు అమృతులై నిర్భయులై యున్నారు.

5. ఏవిద్వాంసుఁ డిట్లు అక్షరమై, అమృతమై, అభయమైయుండు స్వరమును (ఓంకారమును) ఉపాసించుచున్నాఁడో, వాఁడు దేవతలవలె అమృతత్వమును బొందును.

5. ఖండము.

1. ఉద్గీథ మెదియో అదియే ప్రణవము; ఏది ప్రణవమో అది ఉద్గీథము; ఈ (కనఁబడుచున్నట్టి) సూర్యుఁడును ఉద్గీథము; ఇతఁడే ప్రణవము; ఇతఁడే 'ఓం' అని ఉచ్చరించుచు సంచరించుచున్నాఁడు.

2. 'ఈసూర్యుని (అతనిరశ్ములకును ఇతనికిని భేదములేక) నేను ఉపాసించితిని; అందువలన నీవొకబిడ్డవే నాకుఁ గలిగితివి; రశ్ములను నీవు భేదముగా ఉపాసింపుము; నీకు అనేకపుత్త్రులు గలుగుదురు.' అని కౌషీతకిఋషి తనకుమారునిఁ జూచి చెప్పెను. ఇట్లు అధిదైవతము.

3. ఇఁక అధ్యాత్మము (చెప్పఁబడును). ఏముఖ్యప్రాణము కలదో

దానిని ఉద్గీథముగా ఉపాసింపవలయును; ఈప్రాణము 'ఓం' అని ఉచ్చరించుచు మీఁది కెగయుచున్నది.

4. 'దీనిని (ఈముఖ్యప్రాణమును ఇతరప్రాణములనును దీనికిని భేదములేక) ఉపాసించితిని. నీవు ఒకపుత్త్రుఁడవు జన్మించితివి; (నాగాది ప్రాణములను) నీవు భేదముగా ఉపాసింపుము. నీకు పెక్కుఱుపుత్త్రులు పుట్టుదురు' అని కౌషీతకిఋషి తనకుమారునితోఁ జెప్పెను.

5. తర్వాత, ఏది ఉద్గీథమో అది ప్రణవము. ఏది ప్రణవమో అది ఉద్గీథము. ఈ ఏకత్వదర్శనము (యాగమునందు) హోతకర్మములందు తప్పుగా ఉద్గానముచేయుబట్టి వాక్కును దిద్దుచున్నది.

6. ఖండము.

1. ఈపృథివి ఋక్కు, అగ్ని సామము, ఋక్కునందు సామము అంతర్భూతమై యున్నది; కావున, సామము ఋక్కునం దుండునట్లు గానము చేయవలయును. పృథ్వి 'సా' (సామ అను శబ్దమునందు సగము 'సా') అగ్ని 'అమ' (తక్కిన సగము)అది(రెండుసగములనుచేరి) 'సామ'.

2. ఇట్లే అంతరిక్షము, వాయువిషయమునందు రెండును చేరి 'సామ'.

3. ఇట్లే స్వర్గము, సూర్యుఁడు రెండునుచేరి 'సామ'.

4. ఇట్లే నక్షత్రము, చంద్రుఁడు రెండునుచేరి 'సామ'.

5. ఇట్లే ఆదిత్యుని శుక్లకాంతి, కృష్ణకాంతి ఈరెండును చేరి 'సామ'.

6. ఈ ఆదిత్యుని హిరణ్మయమైన (జ్యోతిర్మయమైన) పురుషుఁడు కనఁబడు చున్నాఁడు; జ్యోతిర్మయ మైన వీచికలవాఁడు; జ్యోతిర్మయమైన రోమములుగలవాఁడు; కాలి బొట్టనవ్రేలి గోరునైతము జ్యోతిగా నుండును.

7. అతనికన్నులు రెండును కోఁతిపృష్ఠమువలెను, ఎఱ్ఱనితామర పుష్పమువలెను నుండును. అతనికి 'ఉత్' అని పేరు. సకలపాపముల నుండి పై కెగసిపోవుటవలన, ఇట్లెఱుంగువాఁడు సకలపాపములనుండి మీఁది కెగసిపోవుచున్నాఁడు.

8. అతనికి ఋక్కును సామమును కేశములు (పర్వములు, కణుపులు, అవయవములు). అందువలన అతఁడే ఉద్గీథము. అందుచేత ఉద్గాత

ఇతనినే గానముచేయుచున్నాఁడు. ఈ ఆదిత్యమండలమునకు మీఁద నేయేలోకములు గలవో, ఆలోకములయొక్కయు, దేవతలయొక్కయు, ఇష్టార్థప్రదమైన ఈశ్వరుఁడై యున్నాఁడు. ఇట్లు అధిదైవతము (చెప్పఁబడినది.)

7. ఖండము.

1. ఇఁక అధ్యాత్మము (చెప్పఁబడును). (ఆఱవఖండము మొదటి ఋక్కువలె) వాక్కు, ప్రాణము విషయమునందు రెండునుచేరి 'సామ'.

2. ఇట్లే చక్షుస్సు, ఆత్మ ఈరెండునుచేరి 'సామ'.

3. ఇట్లే శ్రోత్రము, మనస్సు, ఈరెండునుచేరి 'సామ'.

4. ఇట్లే నేత్రముయొక్క శుక్ల కాంతి, కృష్ణకాంతి చేరి 'సామ'.

5. నేత్రములోపల ఏపురుషుఁడు కనఁబడుచున్నాఁడో అతఁడే ఋక్కు, సామ, ఉక్థము, యజుస్సు, బ్రహ్మము; ఆదిత్యునకు ఏరూపము, పర్వములు, నామముకలదో అవియే యితనికి (అక్షిపురుషునకుఁగలది).

6. అట్టి యీ (అక్షిపురుషుఁడు) తనకు మీఁదుగనుండు లోకములకును, మనుష్యేచ్ఛలకును ఈశ్వరుఁడు. గానముచేయువారు ఇతనినే గానముచేయుచున్నారు.

7. ఇట్లేవిద్వాంసుఁడు సామమును గానముచేయుచున్నాఁడో, వాఁడు ఈఆదిత్యపురుషుని, అక్షిపురుషుని గానముచేయుచున్నాఁడు. వాఁడు (ఆదిత్యునివలన) తనకంటె మేలైనలోకములను దేవకామములను బొందుచున్నాఁడు.

8. ఈ అక్షిపురుషునివలన తనకు మేలైనలోకములను మనుష్యకామములను పొందుచున్నాఁడు. కావున ఉద్గాత యజమానునిఁజూచి (దిగువఁజెప్పునట్లు) చెప్పునది యేమనఁగా,

9. "నీకేమికావలయును నని కోరికగలదో దాని నిచ్చుచున్నాఁడను." ఇట్లు ఏవిద్వాంసుఁడు తెలిసి గానముచేయుచున్నాఁడో వాఁడు సకలాభీష్టములను పొందును.

8. ఖండము.

1. ఉద్గీథవిషయమునందు సమర్థులైనవారు ముగ్గురుండిరి. వారెవ్వరనఁగా, 1 శాలావత్యుఁ డనెడిశిలకుఁడు; చైకితాయనుఁ డనుదాల్భ్యుఁడు; జైబలి అనెడి ప్రవాహణుఁడు. 'మనము ఉద్గీథవిషయము

నందు సమర్థులమైయున్నారముకదా, ఆవిషయమునుగూర్చి సంవాదము చేయుదము' అని ఒకరితోనొకరుమాటలాడికొనిరి.

2. ఆప్రకారమే అందఱును 'సరి' అని యంగీకరించి (ఒకచోట) కూరుచుండిరి. 'బ్రాహ్మణులగు మీమాటను నేను వినెదను. మీరు చెప్పుఁడు' అనిప్రవాహణుఁడు తక్కినయిర్వురను జూచి చెప్పెను.

3. 'నేను మిమ్ము ప్రశ్నించెదను' అని శిలకుఁడు దాల్భ్యునిఁజూచి చెప్పెను. (శిలకుఁడడుగఁగా దాల్భ్యుఁడు ఉత్తరముచెప్పెను.)

4. సామమునకుగతి (స్థానము, మూలము, కారణము) ఏది ? స్వరము (ఓమ్).

సర్వమునకు గతియేది ? ప్రాణము.

ప్రాణమునకు గతియేది ? అన్నము.

అన్నమునకు గతియేది ? జలము.

5. జలమునకు గతియేది ? స్వర్గలోకము.

స్వర్గలోకమునకు గతియేది ? స్వర్గమును దాఁటి వేఱెవ్వరును సామమును నయించుటలేదు. (దానికి మీఁద నేమియు లేదు.)సామమును స్వర్గమునందు స్థాపింతము; సామము స్వర్గమునుగూర్చి స్తోత్రముచేయు చున్నది గదా !

6. దానికి శిలకుఁడు చెప్పిన దేమనఁగా, "సామము ప్రతిష్ఠితము గాదు; ప్రతిష్ఠితమని యెవ్వఁడు విపరీతముగా చెప్పుచున్నాఁడో, అట్టి వానినిఁ జూచి 'నీతలపగిలిపోవును.' అని చెప్పుదును."

7. దాల్భ్యుఁడు—హంత ! (ఇష్టము); దీనిని నీవలనఁ దెలిసి కొంటిని.

శిలకుఁడు— తెలిసికొనుము. (ఇప్పుడు దీనికి బదులుచెప్పుము.)

స్వర్గలోకమునకు గతియేది ? ఈలోకము.

ఈలోకమునకు గతి యేది ?

ఈలోకమునకు మీఁద సామమును ఎవ్వరును నయించుట లేదు. (ఈలోకమునకు మీఁద నేదియు లేదు). ఈ ప్రతిష్ఠయైన లోకమునందు సామమును స్థాపింతము; సామమును ప్రతిష్ఠను స్తుతించుచున్నది కదా.

8. ప్రవాహణుఁ డిట్లుఉత్తరము నిచ్చుచున్నాఁడు— "అట్లన కుము ! అట్లు చెప్పెడివానినిఁజూచి 'నీతల పగిలిపోవును' అని చెప్పుదును."

(దాల్భ్యుఁడు) హాంత! (ఇష్టము) దీనిని నీయొద్దనుండి (నీవలన) తెలిసికొంటిని.

(ప్రవాహణుఁడు) తెలిసికొనుము.

## 9. ఖండము.

1. శిలకుఁ డిట్లనుచున్నాఁడు.—ఈలోకమునకు గతి యెది? (ప్రవాహణునిడుత్తరము) ఆకాశము; ఆకాశమునుండియే సకలభూతము లును కలుగుచున్నవి; లయించుచున్నవి; ఆకాశము పెద్దది; అదే పరా యణము (స్థానము).

2. ఈయుద్గీథము పరోవరీయము (పరమాత్మసంపన్నము), అనం తము. ఎవఁడిట్లు తెలిసికొని ఉపాసించుచున్నాఁడో, వానికి పరోవరీయ మైన జీవనము కలుగుచున్నది. పరోవరీయములై యుండు లోకములను జయించుచున్నాఁడు.

3. దీనినిగూర్చి శౌనకుఁడు ఉదరశాండిల్యునకుఁ జెప్పి, మరలఁ జెప్పినదేమనఁగా:—'నీప్రజలు ఎంతకాలముదాఁక ఉద్గీథమును ఉపా సించుదురో అంతకాలముదనుక వారలకు పరోవరీయమైన జీవన ముండును.

4. ఇట్లే ఈలోకమునందు ఎవఁడు ఉద్గీథమును ఉపాసించు చున్నాఁడో వానికి పరోవరీయమైనజీవనము కలుగుచున్నది.

## 10. ఖండము.

1. కురుదేశము పిడుగుపడి నాశమైనప్పుడు (దుర్భిక్షసమయము నందు) చాక్రాయణుఁడు అను ఉషస్తి (ఆఁకలిచేత) తనభార్యయైన ఆటికి అను నామెతోఁ గూడి తల్లడిల్లుచు నడుచుచుపోయి మావటీంద్రు వసిం చెడిగ్రామమునకుఁ బోయి చేరెను.

2. అతఁడు (అన్నార్థమై పోవుచుండునపుడు), ఉలవలు తినుచున్న మావటివానింజూచి యాచించెను. మావటివాఁడు 'ఇది ఉచ్ఛిష్టమై పోయినది, ఇంతకంటె వేఱే లేదు' అనెను.

3. ఆయుచ్ఛిష్టమైన ఉలవలనైనను ఇమ్ము; అని ఉషస్తి యడిగెను. మావటివాఁడు ఉలవలనిచ్చెను. త్రాగుటకై జలమును నైత మిచ్చెను. ఈజలము ఉచ్ఛిష్టము, నాకువలదని ఉషస్తి చెప్పెను.

4. ఈఉలవలుమాత్రము ఉచ్ఛిష్టముకాదా? (వానినిమాత్రము తినవచ్చునా? అని మావటివాఁడు) అడిగెను. వానిని తిననియెడల నా ప్రాణము పోయియుండును (కావున అట్టి ఆపత్సమయమునందు ఉచ్ఛిష్ట దోషము లేదు). నాకు త్రాగుటకు జలముదొరకును (ఇప్పు డక్కఱ లేదు). అని ఉషస్తి చెప్పెను.

5. ఆ ఉలవలలో నతఁడు తినినదిపోఁగా, మిగత ఉలవలను తన భార్యకిచ్చెను. అప్పు డామెకు ఆఁకలి లేనందున ఆ ఉలవలను తాను తినక దాఁచియుంచెను.

6. అతఁడు ఉదయమున లేచి "నాకు కొంచెము అన్నము(ఆహారము) దొరకినయెడల భుజించి సేదదీర్చికొని కొంతధన మార్జింపఁగలను; ఎట్లన, ఇక్కడి కనతిదూరంబున రాజు యాగము చేయుచున్నాఁడు, ఋత్విక్కుగా నన్ను వరించును, అందువలన ధనము లభించును." అని తన భార్యయగు ఆటికతోఁ జెప్పెను.

7. (ఇట్లు ఉషస్తి చెప్పఁగా; ఆటకి, భర్తనుజూచి 'నిన్న మీరిచ్చిన) ఉలవలున్నవి; వానినిభుజించి యాగమునకు పొండు' అని తన పురుషునకుఁ (ఉషస్తికిఁ) జెప్పెను.

8. (ఉచ్ఛిష్టమును పర్యుషితమునగు ఉలవలను భుజించి యాగశాలకుఁబోయి) స్తోత్రముచేయుటకు సంసిద్ధులగు ఉద్గాతలున్నస్థలమున కేఁగి, కూర్చుండి, ప్రస్తోతనుజూచి యిట్లనియె.

9. ఏదేవతనుగూర్చి నీవు స్తోత్రముచేయుచున్నావో ఆదేవతను నీవు తెలిసికొనక స్తోత్రముచేయుదువేని 'నీతల బ్రద్దలగును' అనెను.

10. ఇటులే ఉద్గాతతోను జెప్పెను.

11. ఇదేరీతిగా ప్రతిహర్తకును జెప్పెను. ముగ్గురును బదులు చెప్పక మిన్నకుండిరి.

## 11. ఖండము.

1. తర్వాత, ఉషస్తినిఁజూచి రాజు 'మిమ్మెఱుఁగుటకు అభిలషించుచున్నాఁడను' అనఁగా నతఁడు 'నేను చాక్రాయణుఁడను ఉషస్తిని' అని చెప్పెను.

2. 'ఈ ఋత్విక్కులలో తాము నొక్కరైయుండఁ గోరెదను; తాము కనఁబడమిచేత నేనితరులను వరించితిని' అని రాజు చెప్పెను.

3. '(ఇప్పుడు) తాము ఈబుత్విక్కులతోఁగూడ నుండి యాగమును నెఱవేర్పవలయును' అని చెప్పెను. 'అట్లేకానిమ్ము; వీరు నాయుత్తరువుచొప్పున స్తోత్రము చేయుచుందురు గాక; వారి కెంతధనమిత్తువో అంతధనము నాకు నొసంగుము' అని రాజుతో ఉషస్తి చెప్పెను.

4. తరువాత, ప్రస్తోత ఉషస్తి చెంతకు వచ్చి యిట్లనియె.—'ఏ దేవతనుగూర్చి స్తోత్రము చేయు బోవుచున్నవో, ఆ దేవతను తెలియనియెడల నీతల పగిలిపోవు నని మున్ను నీవు నాతోఁ జెప్పితివికదా! ఆ దేవత యెది?' అని యడిగెను.

5. 'ప్రాణము' అని చెప్పెను. (ఏలన,) ఈసకలభూతములును (ఆకాలమునందు) ప్రాణమునందే లయించుచున్నవి; అందుండియే కలుగుచున్నవి; ఈస్తోత్రము ప్రాణదేవతకే చెందుచున్నది. దానిని తెలియక స్తోత్రము చేసినచో నీతల బ్రద్దలగునని నేను నీకుఁ జెప్పినందులకు ఇదే ప్రత్యుత్తరమగును.

6. పిమ్మట (ప్రస్తోత యడిగినట్లే) ఉద్గాత (తనకుఁ దగినట్లు) ఏ దేవతయని ఉషస్తిని అడిగెను.

7. 'ఆదిత్యుఁడు' అని చెప్పెను. (ఏలన,) ఈసకలభూతములును పైనుండు ఆదిత్యునే గానము చేయుచున్నారు. (తక్కినది అయిదవ బుక్కువలెనే గ్రహించునది.)

8. తరువాత ప్రతిహర్త (తనకు తగినయట్లు) ఏ దేవత యని యడిగెను.

9. 'అన్నము' అనెను. (ఏలన,) ఈసకలప్రాణులును అన్నమునే అవలంబించి జీవించుచున్నవి. (తక్కినది అయిదవబుక్కువలె నెఱుంగునది.)

## 12. ఖండము.

1. ఇక శౌ(శ్వసంబంధమైన) వోద్గీథము చెప్పఁబడుచున్నది.—బకుఁడు, దాల్భ్యుఁడు, గ్లావుఁడు, మైత్రేయుఁడు అను నీనాలుగు పేర్లుగల ఒకబుషి (సామమును) అధ్యయనము చేయుటకు వెలుపలికేఁగెను.

2. అతనిని అనుగ్రహించుటకై వేదపురుషుఁడు (ముఖ్యప్రాణము) ఇతరదేవతలను (ఇంద్రియములను) తనపిల్లలనుగాఁ జేసికొని తానొక తెల్లకుక్కవేషముదాల్చి ఈబుషికడకు వచ్చెను. అపిల్లలు మాకు ఆత

లిగానున్నది; అన్నము పెట్టించుము; అని తల్లిని (తెల్లకుక్కను) అడిగెను.

3. ఆపిల్లలకు తల్లికుక్క 'ఉదయము కానీ' అని బదులు చెప్పెను. ఈమాటను విని ఆఋషి ఆసమయమును ఎదురుచూచుచుండెను.

4. (అట్లే ఉదయమున కుక్కలు ఋషికడకు వచ్చెను.) అప్పుడా కుక్కపిల్లలు బహిష్పవమాన మనెడిసామముచేత (అన్న ...కొఱకు)స్తోత్ర ముచేయువారివలె ఒకదానిని నొకటి పడి సేనగులాడుచు వాలము ను ఆట లాడుచు 'హిమ్' అని శబ్దించుచుండినవి.

5. (తర్వాత ఈవిధము సుదాహరించుసామమును జెప్పినవి.) 'ఓమ్! భుజింపఁబోయెదము! త్రాగఁబోవుచున్నాము! దేవుఁడును, వరుణుఁడును, ప్రజాపతియునై యుండు సూర్యుఁడు అన్నమును తెచ్చి యిచ్చుఁగాక; ఓ అన్నాధిపతీ! అన్నమును మాకొఱకు తెమ్ము; తెమ్ము;' అని. (అసఁగా ఈసామమును గానముచేసినచో అన్నము లభించునని యటను ఋషికిఁ దెలియఁజేయుటకై తనపిల్లలతోఁగూడి తెల్లకుక్కరూపముతో వేదపురుషుఁడు ఉపదేశించును.)

13. ఖండము.

1. సామమునందు ప్రయోగింపఁబడెడిస్తోభాక్షరములకు సంజ్ఞాక్షరములకు అర్థము చెప్పఁబడుచున్నది.—హా ఉ-లోకము; హాఇ-వాయువు; అథ-చంద్రుఁడు; ఇహా-ఆత్మ; ఈ-అగ్ని.

2. ఊ-సూర్యుఁడు; ఏ-ఆహ్వానము, సంబోధనము; ఔహోఇ-విశ్వేదేవతలు; హిం-ప్రజాపతి; స్వరము-ప్రాణము; యా-అన్నము; వాక్-విరాట్టు, లేక అన్నము.

3. హుమ్ - చెప్పఁదగని పదిమూఁడవ అక్షరములయొక్క చిహ్నములు.

4. ఏవిద్వాంసుఁడు ఈయర్థములతోఁగూడ ఉపనిషత్తును దెలిసికొనుచున్నాఁడో వానికి మంచివాక్కు కలుగును. అందువలన వాఁడు అన్నము గలవాఁడుగను, అన్నమును భుజించువాఁడుగను అగును.

ద్వితీయప్రపాఠకము

1. ఖండము.

1. సకలసామముయొక్క ఉపాసనమును సాధువు (మంచిది); ఏది సాధువో అదియే సామము; ఏది అసాధువో అది అసామము.

2. ఈవిషయమునుగూర్చి లోకవదంతి యిట్లు చెప్పఁబడుచున్నది. ఇతనిని (ఈరాజును, లేక ఒక ప్రభువును) సామముచేత (మంచిమాటల చేత, స్తుతియించినందున) పొందినాఁడు. అసామముచేత (అసాధువుచేత) ఇతనిని (ఈదుష్టుని) పొందినాఁడు (సామశబ్దమునకును సాధుశబ్దమున కును ఒకటేయర్థము).

3. మఱియును లోకములయందు చెప్పఁబడును దేదియనఁగా, "సాధు (మంచిది) మాకు 'బత' (ఉండునుగాక; ప్రయోజ్యమైపోవునుగాక; మంచిదే మాకు కావలయునని దైన్యముతోఁ జెప్పఁబడుచున్నది.)ఏది సాధువో అది యే (సాధువు) ఉండును గాక; అసాధు (చెడ్డది) మాకు 'బత' (కష్టము, వలదు). ఏది అసాధువో అది (అసాధువే) మాకు వలదు."

4. ఏవిద్వాంసుఁడు 'సాధు' 'సామ' అను నీరెండు శబ్దములను ఏకముగా భావించి ఉపాసించుచున్నాఁడో, వానిని వెంటనే మంచిధర్మ ములు ఆశ్రయించి శుశ్రూష చేయుచుండును.

## 2. ఖండము.

1. లోకములను ఐదు విధములైన సామముగా ఉపాసింపవల యును. పృథ్వి-హింకారము; అగ్ని-ప్రస్తావము; అంతరిక్షము-ఉద్గీథము; సూర్యుఁడు-ప్రతిహారము; ఆకాశము-నిధనము; ఇట్లు ఊర్ధ్వలోకములను ఉపాసింపవలయును.

2. అట్టే తలక్రిందుగా, అనఁగా; ఆకాశము - హింకారము; సూర్యుఁడు-ప్రస్తావము; అంతరిక్షము - ఉద్గీథము; అగ్ని-ప్రతిహారము; పృథ్వి-నిధనము. ఇట్లు ఉపాసింపవలయును.

ఇట్లు ఉపాసించువాఁడు సమర్థుఁడై ఊర్ధ్వలోకములను జయిం చును.

## 3. ఖండము.

1. వృష్టిని ఐదువిధములగు సామముగా ఉపాసింపవలయును. పురోవాతము - (దిగువగాలి, వానను తెచ్చెడిగాలి) హింకారము; మేఘ ము-ప్రస్తావము; వర్షము-ఉద్గీథము; మెఱుపును ఉఱుము-ప్రతిహారము.

2. వర్షము నిలుచుట-నిధనము; ఇట్లు ఉపాసించువానికి వాని యిష్టమైన (కోర్కులు సిద్ధించునట్లు) ఫలములు వర్షించును.

4. ఖండము.

1. జలమును ఐదువిధములైన సామముగా ఉపాసింపవలయును. మేఘాంతర్గతజలము - హింకారము; వర్షించుజలము-ప్రస్తావము; నదీజలము-ఉద్గీథము; సదములజలము-ప్రతిహారము;సముద్రజలము-నిధనము.

2. ఇట్లెఱింగి ఉపాసించువానికి జలమునకుఁ గొఱఁత లేదు.

5. ఖండము.

1. ఋతువులను ఐదువిధములైన సామముగా ఉపాసింపవలయును. వసంతము-హింకారము; గ్రీష్మము-ప్రస్తావము; వర్షర్తువు-ఉద్గీథము; శరత్-ప్రతిహారము; హేమంతము-నిధనము.

2. ఇవ్విధముగా నుపాసించువాఁడు ఋతుమంతుఁడగును (ఋతువులు వానికి సాయము చేయును).

6. ఖండము.

1. యాగపశువులను అయిదువిధములైనట్టి సామముగా ఉపాసింపవలయును. తెల్లమేఁక-హింకారము; గొఱ్ఱె-ప్రస్తావము; ఆవు-ఉద్గీథము; గుఱ్ఱము-ప్రతిహారము; నరుఁడు-నిధనము.

2. ఈప్రకారము తెలిసి యుపాసించువాఁడు యాగఫలము నొందును.

7. ఖండము.

1. ప్రాణములను (జ్ఞానేంద్రియములను) ఐదువిధములగు సామముగా ఉత్తరోత్తరము శ్లాఘనీయమైన వానిని ఉపాసింపవలయును. ప్రాణము (నాసిక)-హింకారము; వాక్-ప్రస్తావము; చక్షుస్-ఉద్గీథము; శ్రోత్రము-ప్రతిహారము; మనస్-నిధనము.

2. ఇదేవిధముగా నెవ్వఁడెఱింగి యుపాసించుచున్నాఁడో వాని జీవనము క్రమముగా వృద్ధియగును; శ్రేష్ఠమైనలోకములను జయించును.

8. ఖండము.

1, 2. ఇఁక సప్తవిధసామము చెప్పఁబడుచున్నది. వాక్కును సప్తవిధసామముగా నుపాసింపవలయును. ఏదేని యొకమాటకు విశేషమైయుండు హుమ్-(అనునది) హింకారము; ప్ర-ప్రస్తావము; ఆ-ఆది (ఓం); ఉత్-ఉద్గీథము; ప్రతి-ప్రతిహారము; ఉప-ఉపద్రవము(అనునొకసామము) ని-నిధనము.

3. ఇట్లు తెలిసికొని ఉపాసించువానికి వాక్కు కలుగును; అందువలన అన్నముగలవాఁడై, అన్నముగు భుజించువాఁడగును.

9. ఖండము.

1. సూర్యుని ఏడువిధములకు సామముగా ఉపాసింపవలయును; ఎప్పుడును సామరూపమై యుండుటబట్టియు, ఒక్కొకప్రాణికిని సమముగా నుండుటంబట్టియు, ఆసూర్యుఁడు 'సామ' అనఁబడును.

2. ఇఁకఁ జెప్పఁబోవుసకలభూతములును ఆసూర్యుని ఆశ్రయించి జీవించుచున్నవని తెలియఁదగినది.

3. సూర్యోదయాత్పూర్వముండెడిరూపము (అరుణోదయసమయము)-హింకారము; దానిని పశువులు మృగము లనుసరించుచున్నవి ; ఆవేళలో 'హిమ్' అని శబ్దించుచున్నవి (అనఁగా, ఆవేళలో లేచి దానిదానికార్యములను జూచుచున్నవి).

4. మొదట ఉదయమగునప్పటి రూపము-ప్రస్తావము; దానిని మనుష్యులు అనుసరించెదరు (అనఁగా ఆసమయమునందు వారువారు కర్మములను (కార్యములను) చేయుటకుఁ బ్రారంభించెదరు).

5. కిరణములు ప్రసరించుసమయము (ఉదయానంతరము) రూపము-ఆది; దానిని పక్షు లనుసరించుచున్నవి; నిరాలంబమగు ఆకాశమున ఎగిరిపోవుచున్నవి.

6. మధ్యాహ్నరూపము-ఉద్గీథము; దానిని దేవతలు అనుసరించెదరు; ప్రజాపతియొక్క పుత్త్రులలోపల ఉత్తములైనవార లాకాలమున సంచరించెదరు.

7. మధ్యాహ్నోత్తరమునందలి రూపము-ప్రతిహారము; దానిని గర్భములు (కిరణములు) అనుసరించుచున్నవి. అవి దిగువనుండి పైకి పోవుచున్నవి.

8. సాయంకాలసమయమునందు రూపము-ఉపద్రవము; దానిని ఆరణ్యకమృగములు అనుసరించుచున్నవి; మనుష్యులనుజూచి భయమొంది అడవులలోను గుహాలలోను దాఁగుచున్నవి.

9. అస్తమయరూపము నిధనము; దానిని పితరు లనుసరించెదరు; వారు సంచరించెదరు. ఇట్లు ఉపాసించువానికి ఆయాఫలములులభించును.

## 10. ఖండము.

1. తన అవయవసంఖ్యచే లెక్కింపఁబడినదియును, మృత్యువును జయించునదియునగు సామమును ఉపాసింపవలయును. అనఁగా సప్తవిధములగు భక్తినామాక్షరములను మూఁడుమూఁడక్షరములుగా విభజించి ఒక్కొకభాగముగా ఉపాసింపవలయును. ఎట్లన, 'హింకారం' మూఁడక్షరములు; ఒకభాగము. 'ప్రస్తావం' మూఁడక్షరములు; ఇది ఒక భాగము.

2. 'అది' రెండక్షరములు; 'ప్రతిహారం' నాలుగక్షరములు, మొత్తము ఆఱక్షరములలో మూఁడేసిమూఁడేసిగా రెండుభాగములు.

3. 'ఉద్గీథం' మూఁడక్షరములు; 'ఉపద్రవం' నాలుగక్షరములు; మొత్తము ఏడక్షరములలో మూఁడుమూఁడుగా రెండుభాగములు పోఁగా ఒకఅక్షరము మిగులుచున్నది. ఆ మిగిలినఅక్షరము మూఁడవ భాగము.

4. 'నిధనం' మూఁడక్షరములు, ఒకభాగము; అంతయుఁజేరి మొత్తము ఇరువదిరెండక్షరములు.

5. ఆదిత్యుఁడు ఇరువదొకయక్షరముఁగలది; అట్లు వేదమునందు చెప్పఁబడినది (ఎట్లన, నెలలు 12, ఋతువులు 5, లోకములు 3, ఆదిత్యుఁడు 1, మొత్తము ఇరువదొక్కటి). ఈసామము ఇరువదొక్కటికిమీఁద ఇరువదిరెండవదిగా అయినందున సంఖ్యచేత ఆదిత్యుని జయించినది; అదేసుఖము; శోకములేనిది.

## 11. ఖండము.

1. మనస్సు-హింకారము; వాక్-ప్రస్తావము; చక్షుస్సు-ఉద్గీథము; శ్రోత్రము ప్రతిహారము; ప్రాణము-నిధనము; ఇది గాయత్రం సామము, ప్రాణములయందు గ్రుచ్చఁబడియున్నది.

2. ఇట్లెవ్వాఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు ప్రాణముగలవాఁడు; దీర్ఘాయుష్మంతుఁడు; ప్రకాశము గలవాఁడు; పశువులతోను ప్రజలతోనుగూడ మహాపురుషుఁడై యుండును; విశేషకీర్తి గలవాఁడై యుండును; మహామనస్సు గలవాఁడై యుండును. ఇది వ్రతము (అనుష్ఠింపవలసినది; మహామనస్సుగలవాఁడై యుండవలసినది).

## 12. ఖండము.

1. (అగ్ని) మథించునది - హింకారము; పొగయునపుడు ప్రస్తావము; జ్వలించునపుడు-ఉద్గీథము; నిప్పుగా నుండునపుడు-ప్రతిహారము; చల్లారునపుడును, ఆఱినతర్వాతను-నిధనము. ఇది రథంతరసామము; అగ్నియందుఁ జేర్పఁబడియున్నది.

2. (ఫలము ఇంతకుముందు చెప్పినట్లే,) అగ్నిని వెనుకభాగమున నుంచికొని భోజనము చేయఁదగదు; ఇది వ్రతము. చీమిడి మొదలగు వానిని విసర్జించుటయుఁ దగదు; ఇది వ్రతము.

## 13. ఖండము.

1. (స్త్రీయొద్ద) మొదట సంకేతము చేయుట-హింకారము; జ్ఞాపకము చేయుట-ప్రస్తావము; ఇద్దఱుఁగూడి ఒక్క శయనమునకుఁ బోవుట - ఉద్గీథము; స్త్రీకి అభిముఖమైయుండి (సంభాషించుట)-ప్రతిహారము; ఇర్వురును జేరి కాలము పుచ్చుటయును, పూర్తియగుటయును-నిధనము. ఇది వామదేవ్యంసామము; మిథునమునందుఁ జేర్పఁబడియున్నది.

2. (ఫలము) స్త్రీగలవాఁడై యుండును; (వ్రతము) తానై శయనించుటకు వచ్చెడిస్త్రీని నిగ్రహింపరాదు.

## 14. ఖండము.

1. (సూర్యుఁడు) ఉదయించునుదయము-హింకారము; ఉదయానంతరము-ప్రస్తావము; మధ్యాహ్నము - ప్రతిహారము; అస్తమయము - నిధనము; ఇది బృహత్సామము; ఆదిత్యునియందు గ్రుచ్చఁబడియున్నది.

2. (ఫలము పూర్వమువలె;) తపించునట్టిసూర్యుని నిందింపఁ దగదు; ఇది వ్రతము.

## 15. ఖండము.

1. (మొదట) ఆకాశమునందు తేలుచుండు మేఘములు- హింకారము; ఒకటిగాఁజేరిన మేఘము-ప్రస్తావము; వర్షము-ఉద్గీథము; మెఱుపు ఉఱుము-ప్రతిహారము; వర్షము నిలుచుట-నిధనము; ఇది వైరూప్యసామము; మేఘములయందు చేర్పఁబడియున్నది.

2. (ఫలము) పలు తెఱఁగులైన పశువులను బొందును; వర్షమును నిందింపరాదు; ఇది వ్రతము.

16. ఖండము.

1. వసంతము-హింకారము; గ్రీష్మము-ప్రస్తావము; వర్షర్తువు-ఉద్గీథము; శరత్తు-ప్రతిహారము; హేమంతము-నిధనము; ఇది వైరాజ సామము; ఇది ఋతువులయందు గ్రుచ్చఁబడియున్నది.

2. (ఫలము) చక్కఁగా వృద్ధినొందును. (తక్కినది మునుపటి వలె;) ఋతువులను నిందింపరాదు; ఇది వ్రతము.

17. ఖండము.

1. పృథ్వి-హింకారము; అంతరిక్షము-ప్రస్తావము; స్వర్గము-ఉద్గీథము; దిక్కులు ప్రతిహారము; సముద్రము - నిధనము; ఇది శక్వర్య సామము లోకములందు గ్రుచ్చఁబడియున్నది.

2. (ఫలము) లోకముగలవాఁడగును; (తక్కినది పూర్వమువలె;) లోకములను నిందింపరాదు; ఇది వ్రతము.

18. ఖండము.

1. మేక - హింకారము; గొఱ్ఱె-ప్రస్తావము; ఆవు - ఉద్గీథము; అశ్వము-ప్రతిహారము;పురుషుఁడు-నిధనము; ఇది రేవత్యసామము; పశువులయందు (గ్రుచ్చఁబడి) చేర్పఁబడి యున్నది.

2. (ఫలము) పశుసమృద్ధిగలవాఁడై యుండును. (తక్కినది మును పటియట్లు;) పశువులను నిందింపరాదు; ఇది వ్రతము.

19. ఖండము.

1. రోమము-హింకారము; చర్మము-ప్రస్తావము; మాంసము-ఉద్గీథము! అస్థి ప్రతిహారము; మజ్జ-నిధనము; ఇదియజ్ఞాయజ్ఞీయసామము; అంగములయందుఁ జేర్పఁబడియున్నది.

2. (ఫలము) అంగహీనుఁడై యుండఁడు; (తక్కినది పూర్వము వలె;) మాంసమును భుజింపఁదగదు; ఇది వ్రతము.

20. ఖండము.

1. అగ్ని-హింకారము; వాయువు-ప్రస్తావము; సూర్యుఁడు-ఉద్గీథము: నక్షత్రములు-ప్రతిహారము; చంద్రుఁడు-నిధనము; రాజనంసామము; దేవతలతోఁ జేర్పఁబడియున్నది.

2. (ఫలము) దేవతలకు సమానమైనలోకములను, వృద్ధిని, సాయుజ్యమును పొందును; (తక్కినవి మునుపటిరీతిగా;) ప్రాణమును నిందింపఁ గూడదు.

21. ఖండము.

1. మూఁడువేదములు-హింకారము; మూఁడులోకములు-ప్రస్తావము; అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు ముగ్గురును ఉద్గీథము; నక్షత్రములు; పక్షులు, కిరణములు మూఁడును - ప్రతిహారము; సర్పములు,గంధర్వులు, పితరులు మూఁడును - నిధనము; ఇది సముదాయసామము; అన్నిటియందును జేరియున్నది.

2. (ఫలము) అన్నియునై యుండును (సర్వేశ్వరుఁడై యుండును).

3. ఈమూఁడేసిమూఁడేసియు ఐదువిధములుగాఁ జెప్పఁబడుచున్నది. దీనికంటె శ్రేష్ఠమైనది వేఱేదియు లేదు.

4. (ఫలము) 'సమస్తమును దెలిసినవాఁడు; వీనికి సకలదిక్కులును బలియొసంగుచున్నవి; 'సమస్తము నేనైయున్నాఁడను' అని ఉపాసన చేయవలయును; ఇది వ్రతము.

22. ఖండము.

1. (దీనియందు సామగానమునకు స్వరభేదము చెప్పఁబడుచున్నది; బ్రహ్మజ్ఞానమునకు పనికిరాదు.)

2. 'దేవతలకు అమృతత్వమును, పితరులకు స్వధయును, మనుష్యులకు ఆశయును, పశువులకు తృణజలములును, యజమానునకు స్వర్గలోకమును, తనకు అన్నమును సాధింపించెదను' అని మనస్సుచే ధ్యానించుచు అప్రమత్తుఁడై (సామముచే) స్తోత్రము చేయవలయును.

3. సమస్తమైన అచ్చులును (స్వరములును) ఇంద్రాత్మలు; సకల ఊష్మములును (శ - ష - సలును) ప్రజాపతి ఆత్మలు; సకలస్పర్శాక్షరములును మృత్యువుయొక్క ఆత్మలు; ఎవఁడు అచ్చులను క్రమముగా ఉచ్చరింపలేదో వానికి ఇంద్రుఁడు బదులుచెప్పును (ఖండించును).

4. ఊష్మాక్షరముల నెవ్వఁడు సరిగా ఉచ్చరింపలేదో వానిని ప్రజాపతి ధ్వంసముచేయును; స్పర్శాక్షరములను క్రమముగా ఉచ్చరింపని వానిని యముఁడు భస్మముచేయును.

5. పైనిచెప్పిన అక్షరముల నెట్లు ఉచ్చరింపవలయు ననుటను గూర్చి యిందు చెప్పఁబడుచున్నది.—

23 ఖండము.

1, 2. ధర్మస్కంధములు మూఁడు (కర్మమందు పట్టుదలగల ఆశ్రమములు మూఁడు), యజ్ఞము, వేదాధ్యయనము, దానము ఇవి చేరినది మొదటిది (గృహస్థాశ్రమము); తపస్సు రెండవది (వానప్రస్థాశ్రమము సన్న్యాసాశ్రమమును); ఎప్పుడును ఆచార్యునిసన్నిధియందు వసించుట మూఁడవది (బ్రహ్మచర్యాశ్రమము); వీనియందు ఆయాఆశ్రమములలో నుండువారు (దానికిందగిన) పుణ్యలోకమును బొందుదురు. అయినను, బ్రహ్మసంస్థుఁడు (బ్రహ్మము నెఱింగినవాఁడు) అమృతత్వమును బొందుచున్నాఁడు.

(ఇచ్చట సన్న్యాసి యనఁగా కర్మానుష్ఠానముగల సన్న్యాసి; పరివ్రాట్టు కాదు (సర్వసంగపరిత్యాగము చేసినవాఁడు కాఁడు); సర్వకర్మములను త్యజించి బ్రహ్మసంస్థుఁడై యుండువాఁడే పరివ్రాట్టు; పైనిచెప్పిన నాలుగాశ్రమములలో నుండువాఁడును బ్రహ్మసంస్థుఁడు కానగును. సన్న్యాసియే కావచ్చుననునియమము లేదు. ఒక్కొక ఆశ్రమమునందుండు వాఁడును ఎప్పుడు బ్రహ్మమును తెలిసికొని కర్మమును త్యజించుచున్నాఁడో అప్పుడు వానికి పరివ్రాట్ అనునామము తనంతట కలుగును. సకలకర్మలను త్యజించినప్పుడుమాత్రమే పరివ్రాట్టను పేరు గలుగును; వాస్తవముగా బ్రహ్మమునెఱింగినవాఁడుమాత్రమే కర్మమును త్యజింపనగును; సాక్షాత్కారముకలుగనిచో కర్మను త్యజింపఁదగదు; అట్లు విడిచినదోషము కల్గును; సాక్షాత్కారానంతరము కర్మను త్యజించినచో దోషము కలుగదు; కర్మలను త్యజించినచో బ్రహ్మసంస్థుఁడు కావచ్చునని తలంచి, బ్రహ్మసంస్థుఁడుకాని స్థితియందే కర్మత్యాగము చేయుట పొరఁబాటు.)

3. లోకములను ఉద్దేశించి వానిలో నేది సారమని ప్రజాపతి (విరాట్పురుషుఁడు; లేక కశ్యపప్రజాపతి, లేక బ్రహ్మ) ధ్యానించెను (తపస్సుచేసెను). వానిలో మూఁడువేదములు సారమని తోఁచెను. ఆమూఁటిలో నేది సారమని ధ్యానించెను. భూః, భువః, సువ, అను నీమూఁడు వ్యాహృతులు (బ్రహ్మముయొక్క జగదాకార స్వరూపము, అనఁగా

భూమి, అంతరిక్షము, స్వర్గము ఈమూఁటిలో సకలజగత్తును ఐక్యము. వ్యాహృతి యనఁగా సకలమును గ్రహించి పట్టుకొనియుండునది). సార మని తోఁచినది.

4. వానిలో నేది సారమని ధ్యానించెను. 'ఓం' అను ప్రణవము సారమని తెలిసికొనెను. (ఓం అనునాదము బ్రహ్మముయొక్క శరీరము. అనఁగా, దానిలో బ్రహ్మము జ్యోతిర్మయమై కనఁబడుచున్నది. అనఁగా ఓం అనుశక్తి, దానియందు బ్రహ్మము ప్రకాశించుచున్నది.) ఒక కాడ యందు ఆకులు బంధింపఁబడియుండునట్లు ఈ ప్రణవమునందు సకలమైన వాక్కులును (మాటలు, భాషలు) బంధింపఁబడియున్నవి. సర్వమును ఓంకారమే.

## 24. ఖండము.

1-16. (యాగమునందు ప్రాతస్సవనము, మాధ్యాహ్నసవనము, సాయంసవనము, వీనిని అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు, ఈముగ్వురు దేవ తలకొఱకు నిచ్చెడి క్రమము మొదలగునవి చెప్పఁబడియున్నది. బ్రహ్మ జ్ఞానమునకు ఆవశ్యకము లేదు.)

---

## తృతీయప్రపాఠకము.

## 1. ఖండము.

1. ఈ ఆదిత్యుఁడు దేవమధువు (దేవతలకు తేనె, అమృతము); దానికి స్వర్గలోకము అడ్డువెదురుకట్ట (అనఁగా తేనెతెట్టియ యుంచియుం డెడి స్థానము); అంతరిక్షలోకము తేనెతెట్టె. భూమియందుండి సూర్యు నిచే గ్రహింపఁబడు జలకణములైన కిరణములు పుత్త్రులై యున్నారు. (తేనెతెట్టెకు తేనెటీఁగలవలె హితులై యుండువారు.)

2. అతనితూర్పుకిరణములుతూర్పుతేనెతెట్టెబెజ్జములు. ఋక్కులు తెట్టెయందు తేనియను దెచ్చియుంచు ఈఁగలు. ఋగ్వేదోక్తప్రకారము చేయునట్టికర్మము తేనియను గ్రహించునట్టిపుష్పములు. ఆయాగకర్మ మందలి నేయి, సోమము మొదలగురసము పుష్పమునందలితేనెరసము (అమృతరసము).

3. ఋక్కులగు తేనెటీఁగలు యాగకర్మమనుపుష్పమునందు ఆజ్యాహుతియగు అమృతరసమును గ్రహించి, యాగపుష్పమును

తపింపఁజేయుచున్నది. (పూర్తి చేయుచున్నది; వాడునట్లు చేయుచున్నది); అట్లు తపింపఁబడినకర్మ మనుష్యస్వమునందుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియబలము, వీర్యము, అన్నాద్యము (అన్నము నొసంగుశక్తి) అగు ఫలప్రదము అను తేనె కలుగుచున్నది.

4. ఆరసమైన తేనెపోయి ఆదిత్యునిపరివేష్టించి ఆశ్రయించుచున్నది (అనఁగా ఆదిత్యుఁడు తేనెగా అగుచున్నాఁడు); ఈ తేనెరూపమే ఆ ఆదిత్యుని రక్తస్వరూపము.

2. ఖండము.

1-3. సూర్యుని దక్షిణకిరణములను గూర్చి పైని చెప్పినట్లే, యజూంషి తేనెటీఁగలు. యజుర్వేదకర్మము పుష్పములు. ఇది అతని యొక్క శ్వేతరూపము.

3. ఖండము.

1-3. అతనియొక్క పశ్చిమదిక్కుకిరణములనుగురించి మీఁదఁ జెప్పినయట్లే సామములు తేనెటీఁగలు. సామవేదకర్మము పుష్పములు. ఇది అతనికృష్ణ (నలుపు) రూపము.

4. ఖండము.

1-3. అతని ఉత్తరకిరణములనుగూర్చి పైని వివరించినయట్లే అథర్వాంగిరస్సులు తేనెటీఁగలు. ఇతిహాసపురాణములు పుష్పములు. ఇది శుద్ధకృష్ణవర్ణము (గాఢమైననలుపు).

5. ఖండము.

1-3. అతనిఊర్ధ్వకిరణములనుగూర్చి పైనిచెప్పినయట్లు, రహస్యాదేశములు (వేదాంతరహస్యములు) తేనెటీఁగలు. ఓంకారము పుష్పము. చలించుచుండు జ్యోతిర్మయరూపము.

4. ఇవి (పైనిచెప్పఁబడిన ఎఱుపు మొదలగు స్వరూపాదిరసములు) రసములకెల్ల రసములు. దేవతలు రసములై యున్నారు. వారలలో పైనిచెప్పఁబడినవి రసములు. అట్లే అమృతములలో అమృతము.

6. ఖండము.

1. వీనిలో మొదటిఅమృతమును వసువులును, అగ్నిముఖముగా భుజించి బ్రతికియున్నారు. దేవతలు భుజించుటయు లేదు. త్రాగుటయు లేదు. అమృతమును జూచినంతనే తృప్తినొందెదరు.

2. ఆ అమృతరూపమునందు ప్రవేశించెదరు. అందువలన ఉత్సాహము నొందెదరు.

3. ఆయమృతము నిట్టిదని యెవ్వఁడెఱుఁగుచున్నాఁడో వాఁడు వసువులతోఁ గలసి, అగ్నిముఖముగా ఆయమృతమునే చూచి తృప్తి నొందుచున్నాఁడు. ఆరూపము నే పొందుచున్నాఁడు. అందువలన ఉత్సాహము నొందుచున్నాఁడు.

4. వాఁడు సూర్యుఁ డుదయమై పడమట అస్తమించుదాఁక వసువులయొక్క అధిపత్యమగు స్వారాజ్యమును పొందును.

7. ఖండము.

1-4. రెండవ అమృతమునుగూర్చి (మునుపటివలె) రుద్రదేవతలు. ఇంద్రముఖముగా తృప్తి. ఆదిత్యుఁడు తూర్పుగా ఉదయించి పడమట అస్తమయ మగునంతదాఁక పోవచ్చును.

8. ఖండము.

1-4 మూఁడవఅమృతమునుగూర్చి (మునుపటిమట్లు) ఆదిత్యదేవతలు. వరుణముఖముగా తృప్తి; ఆదిత్యుఁడు దక్షిణముగా ఉదయించి ఉత్తరమున అస్తమించుపర్యంతమును, పశ్చిమమున ఉదయమై తూర్పుగా అస్తమించుపర్యంతమును పోనగును.

9. ఖండము.

1-4. నాలవఅమృతమునుగుఱించి (పూర్వమువలె) మరుత్తులు; సోమముఖముగా తృప్తి; ఆదిత్యుఁడు పడమట ఉదయమై తూర్పుగా అస్తమించువఱకును పోవచ్చును.

10. ఖండము.

1-4. ఐదవ అమృతముగూర్చి (మునుపటివలె) సాధ్యులు. బ్రహ్మముఖముగా తృప్తి. ఆదిత్యుఁడు ఉత్తరముగా నుదయమై దక్షిణముగా అస్తమయ మగువఱకును, మీఁదుగా ఉదయించి దిగువ అస్తమించు పర్యంతమును పోవచ్చును.

11. ఖండము.

1. ఆదిత్యుఁడు (మున్ను చెప్పినట్లు) మీఁద ఉదయమై (ప్రాణులయొక్క కర్మఫలభోగమును అంతటితో త్యజించి) తర్వాత ఉదయించుట లేదు. అస్తమించుటయు లేదు. అద్వితీయుఁడై మధ్యనిలువంబడి ప్రకా

శించుచున్నాఁడు. (పైనిచెప్పిన సాధ్యులయొక్క లోకమునకుమీఁద బ్రహ్మలోకము. అందు ఉదయాస్తమయములు లేవు. ఎల్లప్పుడును ప్రకాశము) ఈవిషయమునందు దిగువ నుదహరించుమంత్రము కలదు.

2. (ఆ బ్రహ్మలోకమునందు ఇచ్చటనుండునట్లు ఉదయాస్తమయములై ప్రాణులయొక్క ఆయుస్సును క్షీణింపఁజేయునా? లేక ఎట్లు? అని యడుగునట్టివానికి ప్రత్యుత్తరము.)

అచ్చట ఇట్లులేదు. ఒక్కప్పుడును ఉదయాస్తమయములు లేవు (ప్రతిజ్ఞగా చెప్పఁబడుచున్నది). ఓదేవతలారా! (మీరుసాక్షులైయుండి వినుండు) ఈసత్యవచనముచేత బ్రహ్మముతో నేను విరోధింపను (బ్రహ్మత్వమా నాకు సిద్ధింపకపోదు).

3. ఈ ఉపనిషత్ జ్ఞానమును దెలిసినవిద్వాంసునకు ఉదయాస్తమయములు లేవు. నిరంతరమును బ్రహ్మస్వరూపము ప్రకాశించుచుండును. (స్వప్రకాశుఁడును; బ్రహ్మము నగుచున్నాఁడు).

4. ఈమధుజ్ఞానమును సాక్షాత్తు బ్రహ్మ (చతుర్ముఖబ్రహ్మ, సగుణ బ్రహ్మము) ప్రజాపతికి (సృష్టికర్మమును వహించినవానికి) చెప్పెను.అతఁడు మనువునకుఁ జెప్పెను. అతఁడు ఇక్ష్వాకు మొదలగు ప్రజలకు చెప్పెను. ఉద్దాలకునితండ్రి తనజ్యేష్ఠకుమారుఁడగు ఉద్దాలకునకుఁ జెప్పెను

4. ఈ బ్రహ్మవిద్యను ఒకఁడుతన జ్యేష్ఠకుమారునకు ఉపదేశింపవలయును లేక యోగ్యుఁడగు శిష్యునకు ఉపదేశింపవలయును.

6. ఇతరులకు ఉపదేశింపఁగూడదు. దీనికి మూల్యము లేదు. భూమినంతయు నిచ్చినను చాలదు. దానికంటె శ్రేష్ఠమైన దేదియు లేదు. ఏదియు లేదు.

## 12. ఖండము.

1. ఈసకలభూతములును (కనంబడు స్థావరజంగమమైన జగత్తు) గాయత్రిగా ప్రకాశించుచున్నది. (ఎట్లన) వాక్కు గాయత్రి. ఈసకల భూతములును వాక్కుగా నున్నది. వాక్కే దీనినంతయుఁ జెప్పుచున్నది (శబ్దించుచున్నది) రక్షించుచున్నది (కావున గాయత్రి అనుపేరు).

2. అట్టి యీగాయత్రి యీపృథ్వియై యున్నది; (ఎట్లన)-ఈపృథ్వియందు ఈసకలభూతములును ఉంపఁబడియున్నవికదా! ఈపృథ్విని అతిక్రమించి అవతలపోవుట లేదు.

3. అట్టి యీపృథ్వి ఈపురుషునియందుండుశరీరమై యున్నది. (ఎట్లన) ఈశరీరమునందు ప్రాణములుంపఁబడి యున్నవి. ఈశరీరమును దాఁటి అవతలికి పోవుటలేదు.

4. అట్టి యీశరీరము ఈపురుషునకు లోపలనుండు హృదయమై యున్నది. (ఎట్లన) ఈహృదయమునందు ప్రాణములుంపఁబడియున్నవికదా? ఈహృదయమును అతిక్రమించి చనుటలేదు.

5. అట్టిగాయత్రి నాలుగుపాదములు కలది; ఆఱువిధములైనది. (వాక్కు, భూతము, పృథివి, శరీరము, హృదయము, ప్రాణము) ఇట్లు ఋక్కునందును చెప్పఁబడియున్నది.

6. అట్టిగాయత్రిచే చెప్పఁబడినపురుషుఁడు మిక్కిలి శ్రేష్ఠమైన వాఁడు. మిగుల మహిమకలవాఁడు. (ఎట్లనఁగా) అతని ఒకపాదము (పాతికవంతు) ఈసకలభూతములునై యున్నది. తక్కినమూఁడుపాదములును అతనిజ్యోతిర్మయమైన అమృతస్వరూపము.

7. అతఁడే బ్రహ్మమని చెప్పఁబడువాఁడు. అతఁడే పురుషుని వెలుపల నుండు ఆకాశమై యున్నాఁడు. అపుడు "బహిర్ధాపురుషాకాశః" అని చెప్పఁబడుచున్నది (జాగ్రదవస్థ).

8. అతఁడు పురుషునిలోపలనుండు ఆకాశమై యున్నాఁడు. అపుడు "అన్తఃపురుషఆకాశః" అని చెప్పఁబడుచున్నది (స్వప్నావస్థ).

9. అతఁడు హృదయములోపలనుండు ఆకాశమై యున్నాఁడు. అది పూర్ణము (సర్వత్ర నిండియున్నది). అప్రవృత్తి (ఒకప్పుడును చలింపనిది). (సుషుప్త్యవస్థ.) ఇట్లు ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడు పూర్ణమును అప్రవృత్తియునైన మంగళమును (బ్రహ్మమును) పొందును.

13. ఖండము.

1. ఇట్టిహృదయమునకు (బ్రహ్మముండుస్థానమునకు) ఐదు దేవద్వారములు (కడపలు) కలవు. పూర్వద్వారము (తూర్పువాకిలి) ప్రాణవాయువు. అదియే నేత్రము (నేత్రేంద్రియము). అదియే ఆదిత్యుఁడు (దేవత). దానిని తేజస్సు, అన్నాద్యము అనునీగుణములతో నుపాసింపఁదగినది. ఇట్లు తెలిసికొనువాఁడు తేజస్వియును, అన్నాదుఁడు నగును.

2. దక్షిణద్వారము వ్యానవాయువు. అది శ్రోత్రము (శ్రోత్రేంద్రియము) అది చంద్రుఁడు (దేవత). శ్రీ, యశస్సు అనునీగుణములతో

ఉపాసింపఁదగినది. ఇట్లు తెలిసికొనువాఁడు ధనవంతుఁడును కీర్తిమంతుఁడును అగుచున్నాఁడు.

3. పశ్చిమద్వారము అపానవాయువు. అదేవాక్కు (వాగింద్రియము). అదే అగ్ని (దేవత) బ్రహ్మవర్చసము, అన్నాద్యము ఈగుణములతో ఉపాసింపవలయును. ఇట్లెఱుంగువాఁడు బ్రహ్మవర్చస్సు గలవాఁడును, అన్నాద్యుఁడును అగుచున్నాఁడు.

4. ఉత్తరద్వారము సమానవాయువు. అదే మనస్సు (మనయింద్రియము). అదేపర్జన్యుఁడు (వరుణదేవత). కీర్తి, వ్యష్టి (కాంతి) ఈగుణములతో ఉపాసింపవలయును. ఇట్లు తెలిసికొనువాఁడు కీర్తియు, కాంతియు గలవాఁడగును.

5. ఊర్ధ్వద్వారము ఉదానవాయువు. అదే వాయువు (దేవత). అదే ఆకాశము (ఇంద్రియాతీతమైనందున ఇంద్రియవిషయము చెప్పఁబడలేదు). ఓజస్సు (బలము). మహః (మహత్త్వము) ఈగుణములతో ఉపాసింపవలయును. ఇట్లు తెలిసికొనువాఁడు బలముగలవాఁడును మహాత్ముఁడు నగును.

6. ఈ ఐదుగురు బ్రహ్మపురుషులును స్వర్గలోకమునకు ద్వారపాలకులు. వీరిని ఇట్లెఱుఁగువాఁడు స్వర్గమునొందును. వీని కులమునందు వీరుఁడు (పరమయోగి) పుట్టును.

7. ఈస్వర్గముకంటెను శ్రేష్ఠమైనజ్యోతి స్సొకటి ప్రకాశించుచున్నది. ఈజగత్తును, సంసారమును దాఁటి ఉత్తమలోకములందు (సత్యలోకము మొదలగులోకములందు) ప్రకాశించుచున్నది. (అయినను బ్రహ్మమునకు స్థానమును, రూపమును లేకుండఁగా ఇట్లు చెప్పుట తగునా? అనఁగా, హిరణ్యగర్భాదికార్యబ్రహ్మస్థానమని తెలిసికొన్నయెడల సమాధానమగును.) అట్టివస్తువైన జ్యోతిస్సు ఈపురుషునకు లోపలను ప్రకాశించుచున్నది. (దానినిఁ జూచుటకును సాధ్యమగును, వినుటకును సాధ్యమగును) దానినిఁ జూచెడివిధము దిగువఁ జెప్పఁబడును.

8. ఈశరీరమును తాఁకుటచేత ఒకఉష్ణభావము తెలియఁబడుచున్నదికదా? ఆజ్యోతిస్సు ఉండుటవలన దేహమునందు ఈఉష్ణము ఉన్నది. అట్లుండుట ప్రత్యక్షమై యున్నదిగదా? అందుచే అది చూడఁదగినదియు, వినఁదగినదియునై యున్నది. (ఎట్లన) రెండుచెవులను వ్రేళ్లతో మూసి

కొని, నిదానించి విన్నచో రథగమనమువంటి ఒకశబ్దము (నినదము) వినఁబడును; వృషభగర్జనమువంటి ఒకశబ్దము (నదథుః) వినఁబడును; అగ్ని ప్రజ్వలించునట్టి శబ్దము వినఁబడును; దీనిచేతనే చూడఁబడుచున్నది; వినఁబడుచున్నది; ఇట్లు తెలిసికొన్నవాఁడు చూడఁదగినవాఁడును (రూపవంతుఁడును) వినఁదగినవాఁడును (కీర్తిమంతుఁడును) అగును.

## 14. ఖండము.

1. నామరూపము గలదియగు ఈ ప్రపంచమంతయు బ్రహ్మము. (ఎట్లన)జగత్తు దానియందుండియేకల్గినది; దానియందే లయమగుచున్నది. ఉండునప్పుడు దానివలననే జీవించియున్నది. ఇట్లు (రాగద్వేషాదులులేక) శాంతుఁడై బ్రహ్మమును ఉపాసింపవలయును (తెలిసికొనవలయును). (ఎట్లు ఉపాసించుట యనఁగా) మొదట ఒక నిశ్చయము చేసికొనవలయును; ఏలన, జీవుఁడు అధ్యవసాయాత్మకుఁడు (నిశ్చయమయుఁడు, బుద్ధినిశ్చయమే జీవుఁడు); ఈలోకమునందు జీవుఁడు ఎట్టినిశ్చయము గలవాఁడై యుండునో, ఆజీవుఁడు ఈదేహమును వదలిపోయినతర్వాత, అట్టి నిశ్చయము గలవాఁడుగ నుండును. (అనఁగా, ఒకవిధమైన నిశ్చయము చేయవలయును; ఆనిశ్చయము చెప్పఁబడుచున్నది.

2. (సగుణబ్రహ్మోపాసనము చెప్పఁబడును.) ఆబ్రహ్మము ఎట్టిదనఁగా) మనోమయుఁడు (మనస్సుగా, లేక మనస్సుచేఁ దెలియఁబడువాఁడుగ నున్నాఁడు); ప్రాణశరీరి సూక్ష్మశరీరము గలవాఁడు, అనఁగా మనవలె సూక్ష్మశరీరము లేనివాఁడు); భారూపి (ఎప్పుడును ప్రకాశించుచుండువాఁడు); సత్యసంకల్పుఁడు (వ్యర్థముగాని సంకల్పముగలవాఁడు) ఆకాశాత్మ (ఎచ్చటను వ్యాపించియుండువాఁడు); సర్వకర్మఁడు (సమస్తమును కలుగఁజేసినవాఁడు); సర్వకాముఁడు (సకలకోర్కులును గలవాఁడు; అనఁగా ఏకొఱఁతయు లేనివాఁడు); సర్వగంధుఁడు (మంచి వాసనలు గలవాఁడు; అనఁగా పాపసంబంధమైన వాసనలు లేనివాఁడు); సర్వరసుఁడు (దుష్టరసములు లేనివాఁడు); సర్వమిదమభ్యాత్తుఁడు (ఈజగమంతయు వ్యాపించియుండువాఁడు); అవాగి (వాక్కు లేనివాఁడు, అనఁగా దశేంద్రియములు లేనివాఁడు); అనాదరుఁడు (సంభ్రమము లేనివాఁడు, ఏకొఱఁతయు లేనివాఁడు).

3. ఈనాయొక్క ఆత్మ (జీవాత్మ) హృదయములోపల వడ్లు, యవలు, ఆవాలు, చామలు, చామబియ్యము వీనికంటెను చిన్నది. (అతిసూక్ష్మమైనది); హృదయములోపల అంతరిక్షము, స్వర్గము అను నీ లోకములకంటెను గొప్పది.

4. సర్వకర్మ, సర్వకామ, సర్వగంధ, సర్వరస, సర్వమిదమభ్యాత్తా, అవాగి, అనాదరమై యుండు నాయొక్క ఆత్మ, హృదయాంతర్గత ఆత్మ, (ఈరెండును) బ్రహ్మమే. ఈబ్రహ్మమునే (నేను) శరీరము విడిచిన తర్వాత పొందఁబోవుచున్నాఁడను. ఇట్లు ఎవనికి నిశ్చయ ముండునో వాఁడు బ్రహ్మమునుబొందుటకు సంశయము లేదు. ఇట్లు శాండిల్యముని చెప్పెను.

## 15. ఖండము.

1. (ప్రధానము, మాయ అనఁగా జగత్తుగా పరిణమించియుండు బ్రహ్మోపాసనము చెప్పఁబడుచున్నది.)

ఇది యొక పెద్దసంచి (గోనె); దానికి అంతరిక్షము కడుపు (బయటి ప్రదేశము); భూమి దిగువనుండునది (అనఁగా ఆసంచి భూమిమీఁద నున్నది); నాశములేనిది; దిక్కులు దానికి ఓరలు (అంచులు); స్వర్గము దానికి మీఁదిబొక్క (నోరు); ప్రాణులకర్మఫలము దానిలో నుంపఁబడి యుండు ధనము (ఫలము); ఆఫలముతో నీజగమంతయు నుంపఁబడి యున్నది.

2. దాని (ఆసంచి) తూర్పుదిక్కు జుహూవు (తూర్పుగాఁజూచి హోమాదులు చేయఁబడుచున్నవి); దక్షిణదిక్కుసహమానము (పాపులు యమలోకమునందు పాపఫలమునందు సహించి అనుభవించెదరు); పశ్చిమదిక్కు రాజ్ఞి (వరుణరాజు, లేక, సంధ్యారాగముతోఁ జేరియు న్నది); ఉత్తరదిక్కు సుభూతా [కుబేరాదుల ఐశ్వర్యము (నిధి) ఉన్నది]; ఈదిక్కులకు పుత్త్రుఁడు వాయువు; ఇట్లు వాయువును తెలిసికొన్నవానికి పుత్రశోకము లేదు; పుత్త్రుఁడు దీర్ఘాయుష్మంతుఁడై యుండును.

3. (ఇట్లెఱింగినవాఁడు క్రిందఁజెప్పినట్లు చెప్పుచున్నాఁడు) ఈపు త్త్రునివలన (మూఁడులేపలు) నాశములేని కోశమును (ధనసంచయమును) పొందుచున్నాను; ప్రాణమును పొందుచున్నాను; (భూః) భూమిని

పొందుచున్నాను; (భువః) అంతరిక్షమును పొందుచున్నాను; (సువః) స్వర్గమును పొందుచున్నాను.

4. ప్రాణమును పొందుచున్నానని చెప్పిన దేలయనఁగా, ఈసకల భూతములును ప్రాణముగనే యుండుటంబట్టి అట్లు చెప్పినాఁడను.

5. భూః, పొందుచున్నాననఁగా భూమి, అంతరిక్షము, స్వర్గము అను నీమూఁటిని చెప్పినాఁడ నని తెలియునది.

6. భువః, అనఁగా అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు అనుముమ్వు రను జెప్పిన ట్లెఱుంగునది.

7. సువః అనఁగా ఋగ్, యజుస్, సామము అను నీమూఁడు వేదములను చెప్పినట్లు తలంపవలయును.

## 16. ఖండము.

1. (ఆయుర్వృద్ధికొఱకు చేయఁదగిన ఉపాసనమును జపమును చెప్పఁబడుచున్నది.)

పురుషుఁడు (జీవాత్మ) యజ్ఞముగనున్నాఁడు (యజ్ఞమని భావింప వలయును.) వాని ఇరువదినాలుగు సంవత్సరములదాఁక ప్రాతస్సవనము; గాయత్రి ఇరువదినాలుగు అక్షరములు; గాయత్రీసంబంధమే ప్రాతస్సవనము; దానికి వసువులు దేవతలు; ప్రాణములే వసువులు; ఈవసువులే సమస్తమును జీవించునట్లు చేయుచున్నారు.

2. ఈ ఇరువదినాలుగేండ్లలోఁగా ఏదేని ఆపద సంభవించినపుడు ఈజపము చేయఁదగును. "ఓ ప్రాణములగు వసువులారా! ప్రాతస్సవనము మధ్యాహ్నసవనమును అనుసరించున ట్లగునుగాక! ప్రాణముల నడుమ నాకేవిధమైన కొఱంతయు రాకుండునుగాక!" అని ఇట్లు జపించినయెడల ఆయాపదనుండి విముక్తుఁడై ఆరోగ్యము నొందును.

3. ఇరువదినాలుగేండ్లకు పైఁబడి నలువదినాలుగేండ్లు (అనఁగా అరువదెనిమిదేండ్లదాఁక) మాధ్యాహ్నసవనము; త్రిష్టుప్ నలువదినాలుగక్షరములు; రుద్రులు దేవతలు; ప్రాణములే రుద్రులు; ఈరుద్రులే సమస్తమును జీవించునట్లు కావించుచున్నారు.

4. ఈ అరువదెనిమిదేండ్లలోపల నేదియేని యాపద సంభవించిన యెడల ఈ జపము చేయనగును. "ఓప్రాణములగు రుద్రులారా! మధ్యా

ప్ర్యాసవనము సాయంసవనమును అనుసరించునట్లగుఁగాక! ప్రాణముల నడుమ నాకేవిధమైన కొఱంతయు రాకయుండునుగాక" అని యిట్లు జపించినచో ఆయాపదనుండి విడివడి ఆరోగ్యము నొందును.

5. ఆవయస్సునకుమీఁద నలువదెనిమిదేండ్లు (అనఁగా నూటపదునాఱువత్సరములు) సాయంసవనము. జగతీఛందస్సు నలువదెనిమిది యక్షరములు; ఆదిత్యులు దేవతలు; ప్రాణములే ఆదిత్యులు; ఈ ఆదిత్యులే సర్వమును బ్రదుకునట్లు కావించుచున్నారు.

6. ఈనూటపదునాఱేండ్లలోపల నేదేని ఆపదకలిగినపుడు ఈ జపము చేయవలయును. "ఓప్రాణములగుఆదిత్యులారా! ఈసాయంసవనము పూర్తియగునంతలోపల నాకెట్టిలోపమును కలుగకుండును గాక!" అని. ఇట్లు జపించినయెడల ఆరోగమునుండి విముక్తుఁడై ఆరోగ్యము నొందును.

7. ఇట్లు నిశ్చయము నెఱింగినమహిదాసుఁ డనుఋషి "ఓరోగమా! నీవు నన్నేమిచేయఁగలవు? ఏల వృథాశ్రమమొంది నన్ను పీడింపఁ జూచెదవు?" అని చెప్పిరి. వారు నూటపదునాఱేండ్లుజీవించిరి. ఎవఁ డిట్లు ఉపాసించుచున్నాఁడో వాఁడు నూటపదునాఱేండ్లు బ్రదుకును.

## 17 ఖండము.

1. (ఇఁక పురుషునకును యజ్ఞమునకును సామ్యము చెప్పఁబడుచున్నది.) దేనిని భుజించుటకును పానముచేయుటకును గోరుచున్నాఁడో, ఏది లభింపమిచే దుఃఖపడుచున్నాఁడో అదే యజ్ఞమునందుదీక్ష (వ్రతము.)

2. దేనిని భుజించుచున్నాఁడో, దేనినిపానముఁజేయుచున్నాఁడో, ఏది లభించినపుడు సంతోషించుచున్నాఁడో, అది యజ్ఞమునందు ఉపసదము (అల్పాహారము, పాలు మొదలగువానివంటిది).

3. నవ్వుట, భుజించుట, మైథునము ఇవి యజ్ఞమునందు స్తుతశస్త్రములు (స్తోత్రాదులు.)

4. తపస్సు, దానము, ఋజుత్వము (క్రమము,) అహింస, సత్యవచనము ఇవి యజ్ఞమునందు దక్షిణలు.

5. సోష్యతి, అసోష్ట అని రెంటియందును చెప్పఁబడుచున్నది. (పురుషపరమునందు-కనఁబోవుచున్నాఁడు, కనినాఁడు; అనఁగా పొంధఁ

బోవుచున్నాఁడు, పొందినాఁడు. యజ్ఞపరమునందు - సోమరసమును పానముఁ జేయఁబోవుచున్నాఁడు, పానము చేసినాఁడు, అని చెప్పఁబడు చున్నది - శబ్దసామ్యము). మరణము యజ్ఞమునందు అవబృథస్నానము (ముగింపు.)

6. ఈవిద్యను దేవకీపుత్త్రుఁడగు కృష్ణునకు ఘోర అను ఆంగిరసుఁ డుపదేశించెను. అతఁడు తక్కినవిద్యను గోర లేదు; (అనఁగా ఇదే ఉత్కృష్ట మని తలంచెను.) ఈపురుషయజ్ఞపద్ధతిని తెలిసికొన్నవాఁడు మరణ కాలమునం దిట్లు జపము చేయవలసినది. అక్షితమసి (క్షీణించ లేకున్నావు), అచ్యుతమసి జాఱుట లేకయున్నావు), ప్రాణసంశితమసి (సూక్ష్మప్రాణమై యున్నావు); అని ఈవిషయమునందు రెండు ఋక్కులు కలవు.

7. పురాణపురుషుఁడై, కారణపురుషుఁడై యుండు (బ్రహ్మసంబంధ మైనదియును) తమస్సుకంటె అధికమును ఉత్కృష్టము నైనదియును, దేవతలకంటె మేలైనదియును, ఉత్తమమైనదియును, అగుజ్యోతిని చూచినవారమై యున్నారము; పొందినవారమై యున్నారము.

18. ఖండము.

1. మనస్సును బ్రహ్మముగా ఉపాసింపవలయును; ఇది అధ్యాత్మము (ఆత్మసంబంధమైనది); ఆకాశమును బ్రహ్మముగా ఉపాసింపవల యును (ఇది దైవసంబంధము.)

2. ఆమనోమయబ్రహ్మము నాలుగుపాదములుగలది (భాగములు కలది); వాక్కు, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము; ఆకాశమయబ్రహ్మము నాలుగుపాదములు; అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు, దిక్కులు.

3. వాక్కు ఒకభాగము; వాక్కు అగ్నిచేతను జ్యోతిస్సుచేతను ప్రకాశించుచున్నది. (ఫలము) ఇట్లు తెలిసికొన్నవాఁడు కీర్తి, యశస్సు, బ్రహ్మవర్చస్సు అనువీనితోఁ బ్రకాశించును.

4. ప్రాణము ఒక్కభాగము; ప్రాణము వాయువుచేత ప్రకాశించు చున్నది. (ఫలము) ఇట్లు తెలిసికొన్నవాఁడు కీర్తి, యశస్సు, బ్రహ్మ వర్చస్సు అనువీనితోఁ దేజరిల్లును.

5. చక్షుస్సు ఒకభాగము; చక్షుస్సు ఆదిత్యునిచేతఁ బ్రకాశించు చున్నది; (ఫలము) ఇట్లెఱింగినవాఁడు కీర్తి, యశస్సు, బ్రహ్మవర్చస్సు అనువీనితోఁ బ్రకాశించును.

6. శ్రోత్రము ఒకభాగము; శ్రోత్రము దిక్కులచేత ప్రకాశించుచున్నది; (ఫలము) ఇట్లు తెలిసికొనినవాఁడు కీర్తి, యశస్సు బ్రహ్మవర్చస్సు అనువీనితో ప్రకాశించుచున్నాఁడు.

## 19. ఖండము.

1. ఆదిత్యుఁడే బ్రహ్మమని ఉపదేశింపఁబడుచున్నది. దానియొక్క వ్యాఖ్యాన మెట్లన, పూర్వము ఈజగత్తు అసత్తుగానుండెను(నామరూపాదులులేకుండెను); పిమ్మట సత్తు అయినది (కనఁబడినది) క్రమక్రమముగా వృద్ధినొందెను; అది యొక గ్రుడ్డువంటిదాయెను; పిమ్మట పగిలెను. ఆరెండు చీలికలలో ఒకటి (ఒకచిప్ప) వెండిగను, ఇంకొకటి (ఒకచిప్ప) బంగారముగను నుండినది.

2. వెండిగానుండినది యీభూమియాయెను; బంగారముగనుండినది స్వర్గలోకమైనది; గర్భస్థూలకోశము పర్వతము లాయెను; సూక్ష్మకోశము మేఘము, మంచు ఇవియాయెను; నాడులు (నాళములు) నదులాయెను; మూత్రకోశము జలము సముద్రమయినది.

3. ఆగ్రుడ్డునందుండి కలిగినది (ఏ శిశువో) ఎదియో అదే యీసూర్యుఁడు. ఆశిశువు పుట్టినవెంటనే సకలభూతములును వారివారి యిచ్ఛలును కోశములుగను, గొప్పశబ్దములుగను అయినవి. అట్లు ప్రతి సూర్యోదయమున శబ్దాదులును గలుగుచున్నవి. (అనఁగా సూర్యోదయమైనవెంటనే సకలభూతములును లేచి తమతమ కార్యములను చేయుచున్నవి.)

4. ఇట్లు తెలిసికొన్నవారు (బ్రహ్మము నుపాసించువారు) మంచి కోశములను (ఇచ్ఛలును) పొందుచున్నారు, అనుభవించుచున్నారు.

# చతుర్థప్రపాఠకము.

## 1. ఖండము.

1. ఒకానొకప్పుడు, శ్రద్ధతో దానముచేసినవారును, అమితముగా నిచ్చినవారును, విశేషముగా ఇతరులకు తనయింటియందు భోజనం బిడినవారును, పౌత్రాయణుఁ డనుజానశ్రుతి యనురాజొకఁడుండెను; అతఁడు తనయొక్క సొంతధనమునుండియే (తనయన్నమునే) ఇతరులు

తృప్తిగా భుజింపవలయు ననెడితలంపుతో ననేకస్థలములందు ధర్మసత్రము
లను స్థాపించెను.

2. ఇట్లుండ నొకనాఁడు, ఇతని సత్రమునందు భుజించి సంతోష
మొందినమహర్షులు (దేవతలు) జానశ్రుతిని రక్షించునిమిత్తమై రాత్రి
యందు (అతనికి సమీపమునందు) హంసస్వరూపముదాల్చి వాలిరి.
అందొక హంసము మఱొకహంసమునుజూచి యిట్లనియె. ఓరీభల్లాక్షా,
(ఒకహంసపేరు) స్వర్గము, లేక పగటికి సమానమైన ఈజానశ్రుతి జ్యోతి
యందు (కీర్తియందు) సంబంధపడవలదు. (దానినిగూర్చి హేళనముచేయ
వలదు); అది దహింపకయుండునుగాక; (ఆకీర్తి అట్టి మహిమగలది.)

3. భల్లాక్షుఁడు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను:—ఓరీ! ఎవ్వరినిఁ
జూచిచెప్పెదవు! ఈఅల్పునిఁగూర్చి సయుగ్వాక్ అనురైక్వునిం జెప్పు
నట్లు శ్లాఘించి చెప్పెదవేమి ?

(అప్పు డాహంసము) ఆరైక్వుఁ డనువాఁ డెవఁడు! అతఁ డెట్టి
వాఁడు? చెప్పుము.

4. (భల్లాక్షుఁ డిట్లనియె) (సొగటాలు ఆడునపుడు కాయ పాదిక
యందు నాలుగుచుక్కలుగలప్రక్కను) కృతాయమను పేరుగలది పడి
జయించినపుడు తక్కినవి (మూఁడు, రెండు, ఒకటి అను నీచుక్కలుగల
అయములు) ఎట్లు అణఁగిపోవుచున్నవో, అట్లు, రైక్వుఁ డొనర్చుసుకృత
మునందు ఇతరప్రజలుచేయుసుకృతములన్నియు దానిలోపల నణఁగిపోవు
చున్నవి. (అనఁగా రైక్వునిసుకృతము హెచ్చైనది) అతనిజ్ఞానములోపల
ఇతరులజ్ఞానములును అణఁగిపోవుచున్నవి. ఇట్టివారినే నేను చెప్పితిని.

5. ఇట్లు మాటలాడుచున్న హంసవచనములను జానశ్రుతి విని
లేచి సారథినిపిలిచి యిట్లనియె:—ఓసారథీ! రైక్వుని తోడితెమ్ము అనఁగా,
సారథి అతఁ డెవఁడు ? అని యడిగెను.

6. అతఁడు అందఱికంటెను మిక్కిలి సుకృతాత్ముఁడును జ్ఞాన
వంతుఁడు నై యున్నాఁడు. అతనిని తోడ్కొని రాఁగోరితిని.

7. సారథి పలువలంకుల వెదకిచూచి యెచ్చటను గనంబడక మరలి
రాఁగా జానశ్రుతి మరల నిట్లనిచెప్పెను. బ్రాహ్మణుని (అనఁగా పెద్దలను)
ఎచ్చట వెదకవలయునో అచ్చటికిఁబోయి చూడుము.

8. అతఁడు (రైక్వుఁడు) ఒకకట్టబండిక్రింద, మూఁగగజ్జిని గీరు

కొనుచు కూర్చుండియుండెను. "అయ్యా! నీవు రైక్వుఁడవా? అని అతనింజూచి సారథియడిగెను. అతఁడు నేను నీవే" అనెను. ఆసారథి ఇతఁడే రైక్వుఁడని తెలిసికొని మరలివచ్చెను.

2. ఖండము.

1. (రైక్వు డుండుస్థానమును దెలిసికొని) ఆఱువందలగోవులను ఒకహారమును, ఒకరథమును గైకొని రైక్వునికడకుఁ జనెను.

2. జానశ్రుతి రైక్వునింజూచి యిట్లనియె:—"వీనిని గ్రహించి, ఏదేవతను నేను ఉపాసింపవలయునో దానిని నాకు ఉపదేశింపవలయును" అనెను.

3. రైక్వుఁడు "ఓరీ శూద్ర! (శోకమునొంది కృశించువాఁడా!) ఈపశ్వాదులన్నియు నీయొద్దనే యుండనిమ్ము" అనెను. పిమ్మట జానశ్రుతి వేయిపశువులను హారము, రథము, భార్య, నీవు వసించు గ్రామము, అను నివియన్నిటిని గైకొని రైక్వునికడకుఁ బోయెను.

4. జానశ్రుతి రైక్వునిఁజూచి—"ఈవేయిపశువులు, ఒకహారము, ఒకరథము, నాభార్య, నీవు వసించుగ్రామము, అనునివి యన్నిటిని గ్రహించి నాకు ఉపదేశింపుము" అనెను.

5. రైక్వుఁడు జానశ్రుతిభార్యయొక్క ముఖమునుజూచి, అంగీకరించి, తక్కినవన్నిటిని గ్రహించి యిట్లనియె:—ఈముఖము "(జానశ్రుతి భార్యవదనము) ద్వారముగా నన్ను మాటలాడునట్లు చేసినాఁడవు; నేను వసించు ఈగ్రామములు మహావృష మనుదేశమునందు రైక్వపర్ణా అనెడి ప్రసిద్ధమైనపేరుతో నుండునుగాక"అనిచెప్పెను. (విద్యనుఉపదేశించెను.)

3. ఖండము.

1. వాయువేసంవర్గము (సర్వమును గ్రహించెడి స్వభావముగలది.) (ఎట్లన) ఎప్పుడు అగ్ని చల్లారుచున్నదో అప్పుడు వాయువును చేరుచున్నది (అనఁగా వాయువే అగుచున్నది). సూర్య చంద్రు లస్తమించునపుడు అవి వాయువును చేరుచున్నవి. (వాయువుచేత చలింపఁబడి అస్తమయ మగుచున్నవి.)

2. జలము వడిసిపోవునపుడు వాయువునే చేరుచున్నది; వాయువే వీని నంతయు గ్రహించుచున్నది. ఇది అధిదైవతము.

3. ఇఁక అధ్యాత్మము చెప్పఁబడును; ప్రాణము (ముఖ్యప్రాణము)

సంవర్గము; (ఎట్లన) నిద్రించునపుడు వాక్కు ప్రాణమునే చేరుచున్నది. చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు ఇవియు ప్రాణమునే చేరుచున్నవి)

4. ఈ రెండు సంవర్గములైనవాయువును, ప్రాణమును దేవతల యందును (భూతములయందును) ప్రాణములయందును (ఇంద్రియముల యందును) ఉన్నవి.

5. తర్వాత, శౌనకుఁడను కాపేయుఁడు, అభిప్రతారి అనుకాక్షసేని, అను వీరిర్వురును భుజించుటకుఁ గూర్చున్నపుడు, ఒక బ్రహ్మచారి భిక్షను వచ్చెను. అతనికి భిక్షయొసంగలేదు. (ఇతఁ డేమిచెప్పఁగలఁడో, వినవలయునని తలంచి భిక్షయిడలేదు.)

6. ఆ బ్రహ్మచారి ఈ చతురుల నిర్వారనుజూచి యిట్లనియె :— ఎవఁడో దేవుఁ డొకఁడున్నాఁడు; అతఁడు సర్వమును భక్షించుచున్నాఁడు; భువనమును రక్షించుచున్నాఁడు; మహా ప్రకాశుఁడై యుండువాఁడు; ఇట్టి వానిని మనుష్యులు (తెలియనివారు) చూచుటలేదు; ఈఅన్నమంతయు నతనికేయుండఁగా అతనికి అన్న మొసఁగలేదు కదా.

7. దానిని విని శౌనకుఁడును ఆలోచించి బ్రహ్మచారికడ కేఁగి యిట్లనిరి:..." దేవతలయు ప్రజలయు జనితాహిరణ్యదంతములు (గట్టి పండ్లు) గలవాఁడు; భుజింపఁదగినవాఁడు ; అతిమేధావంతుఁడు; ఇట్టి వానిమహిమ మిక్కిలి శ్రేష్ఠమైనది; అన్నము నతఁడే. తినువాఁడు నతండే; అని మాకుఁదెలియును; భిక్ష యొసంగెదము.

8. భిక్షయిడిరి. ఈయైదును (భుజించునట్టివాయువొకటి, అన్నములైన అగ్ని, సూర్యుఁడు చంద్రుఁడు, జలము, అనునివి నాలుగు,అన్నియుఁ జేరి ఐదు) తక్కినవి యైదును, (తినునట్టి ప్రాణము ఒకటి, అన్నములగు వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు అనునవి నాలుగు, మొత్తము ఐదు) ఈ రెండైదులు చేరి పదియాయెను. ఇదే విరాట్టు; అన్నాది; దీని చేత సర్వము కనఁబడుచున్నది; దీనికి సమస్తమును కనఁబడుచున్నది; ఇట్లు ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడు అన్నాదుఁడగుచున్నాఁడు.

4. ఖండము.

1. జాబాలుఁ డనుసత్యకాముఁడు తనతల్లియైన జబలా అను నామెనుజూచి "నేను బ్రహ్మచర్యము ననుష్ఠింపఁబోయెదను. నాగోత్రము (వంశము) ఏమి ?" యని యడిగెను.

2. ఆమె చెప్పినదేమనఁగా, "నీగోత్రము నాకుఁదెలియదు; అనేక స్థలములలో పనిచేయుచుంటిని; యౌవనకాలమునందు నిన్నుఁ గంటిని; నీపేరుసత్యకాముఁడు; నాపేరు జబలా; ఆప్రకారము చెప్పుము పొమ్ము." అని.

• 3. (దీనిని విని) సత్యకాముఁడు, హారిద్రుమతుఁ డనుగౌతముని కడకుఁబోయి "బ్రహ్మచర్యము ననుష్ఠించుటకై మీయొద్దకు వచ్చి నాఁడను" అనెను.

4. గౌతముఁడు "నీగోత్రమేమి?" అని యడిగెను. అతఁడు "నాకుఁ దెలియదు; నాతల్లిని యడిగినాఁడను (రెండవసూత్రమునందుఁ జెప్పఁబడినట్లు) చెప్పినది" అనెను.

5. బ్రాహ్మణుఁడుకానియెడల ఇట్లు చెప్పఁడు. (వీఁడు బ్రాహ్మణుఁ డని తలంచెను.) "సమిధలను తెమ్ము, నీకు ఉపనయనము చేసెదను" అనెను. అట్లే ఉపనయన మొనర్చి, మరల చెప్పినదేమనఁగా—"ఈకృశించిన నన్నూఱు పశువులను తోలికొనిపోయి మేపుచుండుము; అవి వేయియగు నంతవఱకు ఇచ్చటికి రావలదు" (అని.) అట్లతఁడు ఆపశువులు వేయియగు నంతదాఁక చాలసంవత్సరములు పశువులను మేపుచుండెను.

5. ఖండము.

1. ఇట్లుండ నొకనాఁడు, వాయుదేవుఁడు ఒక వృషభమునందు ప్రవేశించి "ఓసత్యకామా!" అని పిలిచెను. అతఁడు "ఏమి భగవంతుఁడా!" అనెను. (ఆవృషభము) "వేయి అయినది; గురువుచెంతకు మమ్ముఁ దోలికొనిపొమ్ము" అనెను.

2. (వృషభము) నేను బ్రహ్మముయొక్క నాలుగుపాదములలో నొకపాదమును (ఒకభాగమును) చెప్పెదను.

(సత్యకాముఁడు) చెప్పుఁడు.

(వృషభము) ఆ ఒక్కపాదమునకు నాలుగుకలలు, అనఁగా తూర్పుదిక్కు ఒకకల, దక్షిణము ఒకకల, పశ్చిమము ఒకకల, ఉత్తరము ఒకకల ఈనాలుగుకలలును జేరినది ఒకపాదము ; దీనికి ప్రకాశవంతుఁ డనిపేరు.

3. ఇట్లు తెలిసికొని ఉపాసించువాఁడు లోకమునందు ప్రకాశము గలవాఁడైయుండును; ప్రకాశముగల లోకములను జయించును.

6. ఖండము.

1. 'ఇంకొకపాదమును అగ్ని దేవుఁడు నీకుఁ జెప్పును' అనిచెప్పి మిన్నకుండెను. మఱునాఁ డుదయమున పశువులఁ దోలికొని గురువు ఆశ్రమమునకుఁ బోవుటకు బయలుదేరెను. సాయంకాలమున ఒకచోట నివసించి అగ్ని ప్రజ్వాలింపఁజేసి దానికి వెనుకవైపునఁ గూర్చుండి అగ్నిని జూచుచునుండెను.

2, 3. అగ్ని (వృషభముచెప్పినట్లే చెప్పి) పృథ్వి ఒకకల, అంతరిక్షము ఒకకల, స్వర్గము ఒకకల, సముద్రము ఒకకల అను నీనాలుగు కలలు చేరినది ఒకపాదము (ఇది రెండవపాదము); దీనికి అనంతవంతుఁడని పేరు. (అని అగ్నిదేవుఁడు) చెప్పెను.

4. ఇట్లు దీని నెఱింగినవాఁడు లోకమునందు అనంతవంతుఁడై యుండును; అనంతలోకములను జయించువాఁడై యుండును.

7. ఖండము.

1. ఇంకొకభాగమును హంసము చెప్పునని పల్కి అగ్నిదేవుఁడు విరమించెను. (తక్కిన ఆఱవఖండము మొదటిమంత్రమువలె).

2, 3. హంసము (పూర్వమువలెఁ జెప్పి):—అగ్నిఒకకల, సూర్యుఁ డొకకల, చంద్రుఁ డొకకల, మెఱుము ఒకకల ఈనాలుగును జేరి బ్రహ్మమునకు ఒక్కపాదము; (ఇది మూఁడవపాదము;) దీనికి జ్యోతిష్మంతుఁ డనిపేరు.

4. దీని నెఱింగినవాఁడు మహాజ్యోతిష్మంతుఁడై యుండును.

8. ఖండము.

1. నీటికోడి మఱొకభాగమును జెప్పు నని జెప్పి హంసము విరమించెను. తక్కినది మునుపటియట్లు.

2, 3. నీటికోడి చెప్పినదేమనఁగా:—మొదట పూర్వమువలెఁ జెప్పి ప్రాణము ఒకకల, చక్షుస్సు ఒకకల, శ్రోత్రము ఒకకల, మనస్సు ఒకకల అను నీనాలుగుకలలును జేరి ఒకపాదము. (ఇది బ్రహ్మమునకు నాలవపాదము(; దీనికి ఆయతనవంతుఁడని పేరు.

4. దీని నెఱింగిన విద్వాంసుఁడు ఎల్లవారికిని స్థానభూతుఁడై యుండును.

1. సత్యకాముఁడు గురువుకడకుఁబోయి చేరెను; గురువు (గౌతముఁడు) సత్యకామునింజూచి (దిగువఁజెప్పఁబోవునట్టు) ఇట్లనియె.

2. నీవు బ్రహ్మము నెఱింగినవానింబోలెఁ గానబడుచున్నాఁడవు; నీకెవరు చెప్పిరి?

సత్యకాముఁడు:—మనుష్యులు కానివారు. చెప్పిరి. అయినను మీరు నాకుఁ జెప్పవలయును.

3. గురూపదేశముచేతనే విద్య సాధుత్వమును బొందునని మీవంటిపెద్దలు చెప్పఁగా వినియున్నాఁడను.

గురువు షోడశకలావిద్యను సక్రమముగా ఉపదేశించెను.

10. ఖండము.

1. ఉపకోసలుఁడను కామలాయనుఁడు పైనిచెప్పిన సత్యకాముని గురువుగా వరించి, అతనియొద్దనే పండ్రెండేండ్లు బ్రహ్మచర్యవ్రతముతో శుశ్రూష చేయుచుండెను. సత్యకాముఁ డితనికిఁదక్క తక్కినవారికి మాత్రము ఉపదేశముచేసి, సమావర్తన మొనర్చి వానివానిగృహము నకుఁ బంపెను.

2. సత్యకామునిభార్య, సత్యకామునింజూచి—"ఈ బ్రహ్మచారి (ఉపకోసలుఁడు) అగ్నులకు శుశ్రూషచేయుచున్నాఁడు కదా, వానికిఉపదేశము చేయకుండినచో అగ్నులు కోపపడవా?" అనియడుగఁగా, సత్యకాముఁ డేదియుఁజెప్పక మిన్నకుండినదేగాక, మఱిమఱి శుశ్రూష చేయించుకొనుచుండెను.

3. ఉపకోసలుఁడు మనోవ్యాధిచే భోజనమును మానివేసెను. గురుపత్ని (సత్యకామునిభార్య) "నీవు భోజనమును మానియుండుటకుఁ గతంబేమి?" అనఁగా అతఁడు, "ఈపురుషునియొద్ద (నాయొద్ద) అనేక కామములు అనుభవింపవలసిన దుఃఖపరంపరలు ఉన్నవి; ఆవ్యాధిచే నిండియున్నాఁడను; అందువలన భుజించుటలేదు" అనెను.

4. తర్వాత, వీనియెడ అగ్నులు కరుణించి "వీఁడు మనకు మిక్కిలి మక్కువతో శుశ్రూషచేయుచున్నాఁడు; కావున, వీనికి ఉపదేశముఁజేయవలయును" అని తలంచి ఆ బ్రహ్మచారికి ఉపదేశ మొనర్చినవి.

5. ప్రాణము-బ్రహ్మము; కం.(సుఖము) బ్రహ్మము;ఖం-(ఆకాశము) బ్రహ్మము అని అగ్నులుచెప్పెను. తర్వాత అతఁడు అగ్నులనుజూచి—

ప్రాణము తెలిసినది; కం-ఖం-తెలియలేదు; అనఁగా, అగ్నులు—ఏది కం అనునదియో, అదే ఖం అనునది (అనఁగా సుఖమైయుండు ఆకాశమే హృదయాకాశము. భౌతికాకాశముకాదు) ఏది ఖం అనునదో, అదే ఖం; (అనఁగా ఆకాశమైనసుఖము, స్వచ్ఛసుఖము; విషయసుఖముగాదు; అనఁగా ఆనందము). కడపట ప్రాణమును ఆకాశమును బ్రహ్మమని అగ్నులు ఉపదేశించినవి.

## 11. ఖండము.

1. పిదప నతనింజూచి గార్హపత్యాగ్ని యిట్లనియె:—పృథివి, అగ్ని, అన్నము, ఆదిత్యుఁడు అనునీనాలుగును నాశరీరములు; (వీని యందు) ఆదిత్యుని యందు ఏపురుషుఁడు కనఁబడుచున్నాఁడో, వాఁడే నేను; నేనేవాఁడు.

2. ఫలము ఇట్లు తెలిసికొని ఎవ్వఁడుపాసించుచున్నాఁడో వాఁడు పాపమునుండి విముక్తినొంది లోకముగలవాఁడును, దీర్ఘాయువుగల వాఁడును, జ్యోతిస్సుగలవాఁడును అగును. వానివంశము వృద్ధినొందు చుండును. వానిని ఈలోకమునందును పరలోకమునందును మేము రక్షింతుము.

## 12. ఖండము.

1. తర్వాత దక్షిణాగ్ని యిట్లు ఉపదేశించెను:—జలములు, దిక్కులు, నక్షత్రములు, చంద్రుఁడు ఇవి నాశరీరములు ; చంద్రునియం దుండుపురుషుఁడు నేను.

2. ఫలము పూర్వమువలె.

## 13. ఖండము.

1. అనంతరము ఆహవనీయాగ్ని యిట్లని యుపదేశించెను:—ప్రాణము, ఆకాశము, స్వర్గము, మెఱుము అను నివినాలుగును నాశరీరములు; మెఱుములోనుండుపురుషుఁడు నేను.

2. ఫలము మునుపటివలె.

## 14. ఖండము.

1. ఈఅగ్నివిద్య ఆత్మవిద్యయనియును, నీకు గురువు గతిని బోధించుననియును జెప్పి, ఆయగ్నులు నిలువంబడియుండునపుడు, గురువువచ్చి ఉపకోసలునిం బిలిచెను.

2. ఉపకోసలుఁడు—'ఏమి' అనియడిగెను. గురువుశిష్యునింజూచి "నీవు బ్రహ్మవేత్తవలె కనఁబడుచున్నాఁడవు; నీకెవరు ఉపదేశించిరి"?

శిష్యుఁడు—(నిజమును మఱుఁగుపఱచి) నాకెవ్వరు ఉపదేశించిరి? ఈఅగ్నులు (మిమ్ముఁజూచినమీఁద) ఇట్లయినవి; ముందు వేఱురీతిగా నుండినవి; అని చెప్పెను.

గురువు—ఈఅగ్నులు ఉపదేశించినవియా? అని యడిగెను.

3. అగ్నులు ఉపదేశించినప్రకారమే శిష్యుఁడు చెప్పినాఁడు; గురు విట్లనియె:—అగ్నులు లోకములను (కర్మములను) గూర్చి ఉపదేశించినవి; తామరాకునందలిజలమువలె సంబంధములేనిదియును, పాపము, కర్మము అనువీనియందుఁ జేరనిదియును (అగుబ్రహ్మవిద్యను) నేను నీకుఁ జెప్పెదను; అని చెప్పఁదొడంగెను.

## 15. ఖండము.

1. నేత్రమునందు ఒకపురుషుఁడు కనఁబడుచున్నాఁడు కదా! అతఁడే బ్రహ్మము, ఆత్మ. అది అమృతమును, అభయమునై యుండునట్టి బ్రహ్మము. (ఈపురుషునిస్థానమైన) నేత్రమునందు నేయి లేక, జలమును పోసినయెడల జాఱిపోవుచున్నది; (తామరాకులోనిజలమువలె) (బ్రహ్మస్థానమే యిట్లుండఁగా, బ్రహ్మమునుగూర్చి అడుగవలయునా ఏమి? అది నిర్లేపము, నిరంజనము.)

2. దీనిని (ఈఅక్షిపురుషబ్రహ్మమును) 'సంయద్వామ' అనెదరు. ఎట్లన, ఇతనిని సకలవామములును (శోభనములను) చేరియున్నవి; ఇట్లు తెలిసికొని ఉపాసించువానికి సకలశోభనములును కలుగును.

3. ఇతనికి (ఈఆత్మకు) 'వామనీః' అనిపేరు. ఏలన, సకల వామములను (పుణ్యకర్మఫలములను) నయించుచున్నాఁడు; ఇట్లెఱింగినవాఁడు సకలవామములను బొందుచున్నాఁడు.

4. ఇతనికి 'భామనీః, అనిపేరు. సకలలోకములయందును ప్రకాశించుచున్నాఁడు. (సూర్యచంద్రజ్యోతిస్స్వరూపముగా ప్రకాశించుచున్నాఁడు; అనఁగా వారిని ప్రకాశించునట్లుచేయుచున్నాఁడు.) ఇట్లు తెలిసికొను వాఁడు సకలలోకములందును ప్రకాశించుచున్నాఁడు.

5. ఇట్లు తెలిసికొన్నవిద్వాంసుఁడు, వానిమరణానంతరము వానిప్రేతమునకు కర్మములుచేసినను, చేయకపోయినను, వాఁడు కాంతినిపొం

దుచున్నాఁడు, పిమ్మట పగటి అభిమానదేవత, శుక్లపక్షదేవత, ఉత్త రాయణదేవత, వర్షదేవత, ఆదిత్యదేవత, చంద్రదేవత, విద్యుద్దేవతలను క్రమముగా పొందుచున్నాఁడు.

6. అమానవుఁడు (దేవత) అగు పురుషుఁడు వీనిని (పైనిచెప్పిన వానిని) కడపట బ్రహ్మమును పొందునట్లు చేయుచున్నాఁడు. ఇది దేవ మార్గము; ఈమార్గముద్వారముగా బ్రహ్మమునుపొంది, మరల జననము నొందఁడు. అనఁగా పునర్జన్మరహితుఁడై శాశ్వతసుఖమును బొందును.

16. ఖండము.

1. ఈవాయువు యజ్ఞమునకు సమమైయున్నది; ఆవాయువు చలించుచు సర్వమును పరిశుద్ధము చేయుచున్నది; కావున, అది యజ్ఞమని చెప్పఁబడుచున్నది. దానికి రెండుమార్గములు; ఒకటివాక్కు; ఒకటి మనస్సు.

2, 3. వాని వాక్కును మనస్సుచేత బ్రహ్మ అనుఋత్విక్కు సంస్కారము చేయుచున్నాఁడు. మనస్సునువాక్కుచేత హోత్రధ్వర్యూద్గాతలు సంస్కార మొనర్చెదరు. ప్రాతరనువాకారంభమునకు తర్వాత పరిధానీయక్రియకు మునుపు, బ్రహ్మ మౌనముగానుండక మాటలాడిన యెడల యజ్ఞము భంగమగుచున్నది; యజమానుఁడును పాపియగు చున్నాఁడు. అపుడు ఒకవిధమైనసంస్కారము చేయఁబడుచున్నది. (ఒంటి కాలితో నడుచు మనుష్యునివలెను, ఒంటిచక్రపు బండివలెను అని తెలియునది).

4, 5. మౌనముగానుండినయెడల రెండువిధములైనసంస్కార ములు చేయఁబడుచున్నవి. అపుడు యజ్ఞము సఫలమైనదగుచున్నది; యజమానుఁడును శ్రేయస్సునొందును. రెండుకాళ్లతో నడచునట్టి పురుషుఁడును, రెండుచక్రములుగల బండివలెను చక్కఁగానుండును.

17. ఖండము.

1. ప్రజాపతి లోకములలో నేది సారమో తెలిసికొనునిమిత్తమై ధ్యానము (తపము) చేసెను; పృథ్వియందు అగ్ని రసమనియును, అంత రిక్షమునందు వాయువు రసమనియును, స్వర్గమునందు ఆదిత్యుడు రస మనియును తెలిసికొనెను.

2. ఇట్లు తెలిసికొన్నవానిలో నేది రస మని మరల ధ్యానమొన

ర్చెను; అగ్నినుండి ఋగ్వేదమును, వాయువునుండి యజుర్వేదమును, ఆదిత్యునుండి సామవేదమును తెలిసికొనెను.

3. వానిలో రసము తెలియని మరల ధ్యానించెను. ఋక్కునుండి 'భూః' అనువ్యాహృతియును, యజుస్సునుండి 'భువః' అను వ్యాహృతియును, సామమునుండి 'సువః' అనువ్యాహృతియును రసములని తెలిసికొనెను.

4, 6. యజ్ఞముఁ జేయునప్పుడు ఋక్కునందు దోషముకలిగిన యెడల 'భూః' అని హోమముచేయుటయే ప్రాయశ్చితము; యజుస్సునందు దోషము సంభవించినయెడల 'భువః' అని హోమము చేయవలయును; సామమునందు దోషముకలిగినయెడల 'సువః' అని హోమము చేయుట ప్రాయశ్చిత్తము.

7-10. (యజ్ఞమునందు బ్రహ్మ అనుఋత్విక్కులక్షణము చెప్పఁబడుచున్నది, అముఖ్యమగుటచే వ్రాయలేదు.)

---

## పంచమప్రపాఠకము.

### 1. ఖండము.

1. జ్యేష్ఠమును, శ్రేష్ఠము నైనదానిని ఎవఁడెఱుఁగుచున్నాఁడో, వాఁడు జ్యేష్ఠుఁడును, శ్రేష్ఠుఁడు నై యుండును. ప్రాణమే జ్యేష్ఠమును శ్రేష్ఠము నై యుండునట్టిది.

2. వసిష్ఠమైయుండుదానిని (సమస్తమును మఱచేఁగించికొని తాను మాత్రము ముందుగా జీవించియుండుస్వభావముగలది) ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడు తనసమూహమువారిలోవసిష్ఠుఁడై యుండును. వాక్కుమాత్రమే ఆప్రకారముగ నుండునట్టిది.

3. ప్రతిష్ఠగలదానిని (స్థిరమైయుండునట్టిది) ఎవఁడెఱుఁగుచున్నాఁడో వాఁడుఇహపరలోకములందు ప్రతిష్ఠగలవాఁడై యుండును. చక్షుస్సుమాత్రమే ప్రతిష్ఠగలదై యుండునట్టిది.

4. సంపదగలదానిని (శ్రోత్రముచే వేదశ్రవణము, అనంతరము కర్మానుష్ఠానము, తర్వాతఫలము, అనఁగా సంపద) ఎవఁడు తెలిసికొనుచు

న్నాఁడో వాఁడు సంపదగలవాఁడై యుండును. దేవతలును, మనుజులును వానికోర్కులను కొనసాగునట్లు కావింతురు. శ్రోత్రమే సంపదగలయట్టిది.

5. ఎవఁడు ఆయతనమును (వాసస్థానమును) తెలియుచున్నాఁడో వాఁడు తనతోఁ జేరిన వారికి ఆశ్రయస్థానమై యుండును. మనస్సే ఆయతనము.

6. ఈ ఐదుప్రాణములును (అనఁగా ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు) ఒకదానితోనొకటి 'నేనేపెద్ద, నేనేపెద్ద' అని వాదించుచు ప్రజాపతికడ కేఁగి, 'మాలో ఏది పెద్ద ?' అని అనఁగా; ప్రజాపతి—'ఏది ఈ శరీరమును విడిచిపోయినయెడల శరీరము ఉపయోగము లేకపోవునో అదేపెద్దది' అనిచెప్పెను.

7. వాక్కు శరీరమునుండి బయలువెడలి ఒకసంవత్సరము బయట నుండి మరలివచ్చి, తక్కిన వానినిఁ జూచి—"నేనులేక మీరెట్లు బ్రతికియుంటిరి?" అని యడుగఁగా, అవి—"మూఁగవాఁ డెట్లు మాటలాడక ప్రాణముంచికొని, చెవులతో వినుచు, కనులతోఁ జూచుచు, మనస్సుతోఁ దలంచుచు నుండునో అటు లుంటిమి" అని బదులు చెప్పినవి. తర్వాత వాక్కు శరీరములోపలఁ బ్రవేశించెను.

8. తర్వాత చక్షుస్సు బయలుదేరెను. అదియు మరలివచ్చి యడుగఁగా 'గ్రుడ్డివాఁడుండునట్లుంటిమి' అనినవి. పిమ్మటచక్షుస్సు ప్రవేశించెను.

9. అనంతరము శ్రోత్రము బయలు వెడలిపోయి మరలివచ్చి యడుగఁగా 'చెవిటివానివలె నుంటిమి' అని బదులుచెప్పినమీఁద శ్రోత్రము ప్రవేశించెను.

10. పదంపడి మనస్సు బయలుదేరిపోయి మరలివచ్చి యడుగఁగా "మనస్సు లేనివానివలె నుంటిమి" అని బదులుచెప్పినతర్వాత మనస్సు లోపలఁజొచ్చెను.

11. పిమ్మట ప్రాణము బయలుదేర నిశ్చయించి గుఱ్ఱము గూటములను పెఱికికొనిపోవునట్లు తక్కినప్రాణములను తోడ్కొనిపోవుటకు నిశ్చయించినపుడు "ఉండుము; మాలో నీవే శ్రేష్ఠుఁడవు; నీ వీశరీరమును విడిచిపోవలదు" అని ప్రాణమునుఁజూచి తక్కినవి చెప్పెను.

12, 13. "ఎవరివలన నేసును వసిష్ఠుఁడనైతినో ఆవసిష్ఠుఁడవు నీవే" అని వాక్కును, తక్కినవియు దానిదానికిఁ దగినట్లు చెప్పినవి.

14. వాక్కును, నేత్రమును, శ్రోత్రమును, మనస్సును, ప్రాణముతో సమానముకాదు; ప్రాణమే సర్వమునై యున్నది.

2. ఖండము.

1. నాకు అన్న మెదియని ప్రాణమడిగెను; అన్ని ప్రాణులును ఏయే అన్నమును భుజించుచున్నవో ఆయా అన్నము నీకని తక్కినవి (చక్షుస్సు మొదలగునవి) చెప్పినవి. ఇదే ప్రాణమునకు అన్నము; 'అన' అని ప్రాణమునకుఁ బేరు; ఇట్లు తెలిసికొన్నవానికి అన్నము (భోజనము లేకుండుట) ఉండదు. (అనఁగా ఇట్లు తెలిసికొనువాఁడు మంచిభోజనముగలవాఁడై సుఖముగ నుండునని తాత్పర్యము.

2. నాకు వస్త్ర మెది యని ప్రాణమడిగెను; జలములు వస్త్రమని తక్కినవి చెప్పెను; బ్రాహ్మణులు భోజనమునకు ముందును అనంతరము నందును ఆచమనీయజలముచే అన్నమును మఱుఁగుపఱచెదరు.

3. సత్యకాముఁ డనుజాబాలి గోశ్రుతికిఁ జెప్పిన దేమనఁగా, "ఈ విద్యను ఎండిపోయినకట్టెకు చెప్పినప్పటికిని అది చిగురించును."

4-9. మహత్త్వమునుబొందుటకై చేయునట్టి 'మన్థం' అనుయాగక్రమము చెప్పఁబడియున్నది. బ్రహ్మజ్ఞానమునకు ముఖ్యమైనది కాదు.

3. ఖండము.

వైరాగ్యము నొందుటకై ప్రాణుల సంసారగతిని గూర్చి కథారూపముగాఁ జెప్పఁబడుచున్నది.

1. శ్వేతకేతువు అనునతఁడు పాంచాలదేశమునం దొకసభకుఁ బోయి చేరెను. ఆసభలో ప్రవాహణుఁడనునతఁడు శ్వేతకేతువునుచూచి "నీ తండ్రి నీకు ఉపదేశము చేసినాఁడా!" అనఁగా శ్వేతకేతువు "స్వామీ! ఉపదేశించిరి" అనెను.

2. ప్రవాహణుఁడు—నీ కతఁడు ఉపదేశించినాఁడు కదా, (౧) ప్రజలు ఈలోకమునం దుండి యెచ్చటి కేఁగెదరో తెలియునా?

శ్వేతకేతువు— తెలియదు.

ప్రవాహణుఁడు—(౨) వారే ప్రకారముగ మరలివచ్చెదరో తెలియునా?

శ్వేతకేతువు— తెలియదు.

ప్రవాహణుఁడు—(3) జ్ఞానము కల కర్మఠులకు దేవయానమార్గ మును, కేవల కర్మఠులకు పితృయానమార్గము నని రెండుమార్గము లేర్పడియున్నవి కదా, ఈ రెండుమార్గములలోనుండి పోవువారలకు ఎచ్చట వియోగస్థాన మగునది తెలియునా? అని యడిగెను.

శ్వేతకేతువు—తెలియదు.

3. ప్రవాహణుఁడు—(4) ఈపితృసంబంధియైనలోకము ఏ కారణ ముచేత పూర్ణము కాలేదో తెలియునా?

శ్వేతకేతువు— తెలియదు.

ప్రవాహణుఁడు—(5) ఐదవ ఆహుతియందు అప్పులు (రసవం తములు) ఎట్లు పురుషవాచ్యములుగా (పురుషుఁడని పిలువఁబడునవిగా) అగుచున్నవో తెలియునా?

శ్వేతకేతువు—తెలియదు.

4. ప్రవాహణుఁడు—ఇవన్నియు నీకుఁ దెలియక యుండఁగా 'నాకు ఉపదేశమైయున్నది' అని యెట్లుచెప్పితివి ? ఇట్లు అడుగఁబడిన శ్వేతకేతువు చింతాక్రాంతుఁడై, తండ్రియగు గౌతముని కడకుం జని "నాకు ఉపదేశముచేయకుండఁగా ఉపదేశముచేసితి ననియెట్లుచెప్పితివి?" అని యడిగెను.

5. మరల నిట్లనియె —ప్రవాహణుఁడు నన్ను అయిదుప్రశ్న లడిగెను. ఒకదానికేని బదులు చెప్ప నాకుఁ దెలియకపోయినది. అనఁగా తండ్రి కుమారునింజూచి, "ఈప్రశ్నలను నే నిప్పుడేవింటిని, ఇంతకుమున్ను నేను విన్నదిలేదు, కావున నేనును బదులుచెప్ప జాలను" అని అనెను.

6. ఇట్లు శ్వేతకేతువునకుఁ జెప్పి, గౌతముఁడు రాజగుప్రవా హణునియొద్దకుఁ బోయెను. ప్రవాహణుఁడు గౌతమునింజూచి, "మీకు వలసినంతధన మిచ్చెదను, అడుగవచ్చును" అనెను. గౌతముఁడు, అది యుండును గాక, "నాకుమారుని అడిగిన అయిదుప్రశ్నలకును ఉత్త రమును నాకు ఉపదేశింపవలయును" అని యడిగెను.

7. చాలదినములు వేచియుండినచో ఉపదేశించెదను; ఇంతకు మును ఈవిద్య బ్రాహ్మణులకు ఉపదేశింపఁబడలేదు. క్షత్రియులకు

పరంపరగా ఉపదేశింపఁబడుచుండెను. అట్టిదానిని నీకు ఉపదేశించెదను; వినుమని ప్రవాహణుం డనెను.

4. ఖండము.

1. 2. ఐదవ ప్రశ్నకు ఉత్తరము — ఈ లోకము (స్వర్గలోకము) అగ్ని; దానికి సూర్యుఁడు సమిత్తు; కిరణములు పొగ; పగలు ప్రకాశము; చంద్రుఁడు మంట; నక్షత్రములు కణములు; ఈ అగ్నియందు దేవతలు (ప్రాణాదీంద్రియాభిమాన దేవతలు శ్రద్ధను (జలమును) హోమము చేసెదరు. అందుండి సోమరాజు (చంద్రమండలము) కలుగుచున్నాఁడు.

5. ఖండము.

1, 2. పర్జన్యుఁడు (వర్షదేవత, ఇంద్రుఁడు) అగ్ని; వాయువు సమిత్తు; మేఘము పొగ; మెఱుపు ప్రకాశము; ఉఱుము మంట; శబ్దములు కణములు; ఈ యగ్నియందు దేవతలు సోముని హోమముఁ జేయుచున్నారు; అందుండి వర్షము కలుగుచున్నది.

6. ఖండము.

1, 2. పృథివి అగ్ని; సంవత్సరము సమిత్తు; ఆకాశము పొగ; రాత్రి ప్రకాశము; దిక్కులు మంట; విదిక్కులు కణములు; ఈ యగ్నియందు దేవతలు వర్షమును హోమ మొనర్చెదరు.

7. ఖండము.

1, 2. పురుషుఁడు అగ్ని; వాక్కు సమిత్తు; ప్రాణము పొగ; నాలుక ప్రకాశము; నేత్రము మంట; శ్రోత్రము కణములు; ఈయగ్నియందు దేవతలు అన్నమును హోమముచేయుచున్నారు; అందుండి రేతస్సు కలుగుచున్నయది.

8. ఖండము.

1, 2. స్త్రీ అగ్ని; ఉపస్థము సమిత్తు; రతికి స్త్రీని ఆహ్వానించుట పొగ; యోని ప్రకాశము; సంభోగము మంట; దానివలనఁగలుగు ఆనందము కణములు; ఈయగ్నియందు దేవతలు రేతస్సును హోమము చేయుచున్నారు. గర్భము కలుగుచున్నది.

9. ఖండము.

1. ఇట్లు ఐదు అగ్నులయందు హోమముచేయఁబడుజలము పురుషుఁ డగుచున్నాఁడు; ఈగర్భము, (అనఁగా గర్భమునందలి పురుషుఁడు)

గర్భకోశమునందు పరిశుద్ధమై మిక్కిలి కష్టముతో తొమ్మిది లేక, పది నెలలు కడుపులోపలనుండి తర్వాత పుట్టుచున్నాఁడు.

2. ఇట్లు పుట్టినవాఁడు ఆయుస్సుండునంతదాఁక జీవించి మృతి నొందిన తర్వాత వానిప్రేతమును ఏయగ్నియందుండి మొదటకలిగినాఁడో ఆయగ్నియందుంచి దహించుటకై కొనిపోవుచున్నారు.

10. ఖండము.

1, 2. మొదటిప్రశ్నకు బదులు చెప్పఁబడుచున్నది.—ఈపంచాగ్ని విద్య నెఱింగినగృహస్థులును, అరణ్యవాసులగు వానప్రస్థులును, సన్న్యాసులును, నైష్ఠికబ్రహ్మచారులును, శ్రద్ధను తపస్సును ఉపాసించెదరు (అనుష్ఠించెదరు). వారు గతించినమీఁద అర్చిస్సును (కాంతిని, ప్రకాశాభిమాన దేవతను) పొందెదరు. అందుండి పగలును,అందుండి క్రమముగా శుక్లపక్షము, ఉత్తరాయణము, సంవత్సరము, ఆదిత్యుఁడు, చంద్రుఁడు, విద్యుదభిమాన దేవత, అను నీదేవతలను పొందెదరు. అప్పుడు దేవత్వము (అమానవత్వము) కలుగుచున్నది. బ్రహ్మమును (సత్యలోకమును) పొందెదరు. ఇదే దేవయానమార్గము.

3, 4. కేవలము కర్మఠులై యుండుగృహస్థులు యజ్ఞము,గుంటలు మొదలగుధర్మములు, దానములు చేయుచున్నారు. వారు ధూమాభిమానదేవతను చెందెదరు. అందుండి క్రమముగా రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము, పితృలోకము, ఆకాశము, చంద్రుఁడు వీని అభిమాన దేవతలను పొందెదరు. ఆసోమరాజు దేవతలను అన్నము; దానిని భుజించెదరు. అనఁగా దానిని తమ అధికారమునకులోఁగా నుంచికొని యున్నారు.

5, 6. రెండవప్రశ్నకు ఉత్తరము.—

ఆచంద్రునియొద్ద కర్మఫలము నశించునంతవఱకు నుండి, తర్వాత నీక చెప్పెడి విధముగా మరలివచ్చెదరు (జన్మించెదరు). ఎట్లన, ఆకాశము, వాయువు, ధూమము (పొగ) వర్షించుటకు సిద్ధమైయుండు (అభ్రమను) మేఘము, వర్షించుమేఘము, వర్షము, వ్రీహి (వడ్లు) మొదలగు అన్నము అను నీచెప్పినవరుసచొప్పున అగుచున్నది. ఆయన్నమును భుజించినవానికి రేతస్సు కలుగుచున్నది. ఆరేతస్సు స్త్రీయొద్ద

ఋతుకాలమునందు (ఋతుమతి యైనపిమ్మట) విడువంబడుచున్నది. అప్పుడు మరల పుట్టుచున్నాఁడు. జన్మము కలుగుచున్నది.

మూఁడవ ప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పఁబడియున్నది.—

దేవయాన పితృయాన మార్గములందు ఏకకాలమునం బ్రవేశించి పోవునట్టివారు అయనములదాఁక ఒకటిగాఁజేరి పోయెదరు. ఆ గ్రాత వే ర్వేఱై జ్ఞాని ఉత్తరాయణమునందుండి సంవత్సరమునకుఁ బోవుచున్నాఁడు; కర్మి దక్షిణాయనమునందుండి పితృలోకమునకుఁ బోవుచున్నాఁడు.

7, 8. పుణ్యముచేసినవారు శీఘ్రకాలమున రమణీయమైన బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులయోనిని పొందుచున్నారు. పాపముచేసినవారు కుక్క, పంది, చండాలాదియోనులను పొందుచున్నారు. వీరికి మీఁదఁ జెప్పిన రెండుమార్గములును లేవు. వీరు మాటిమాటికి జననమరణముల నొందునట్టి మూఁడవస్థానము (మార్గము)గలవారు. మాటిమాటికి దుష్ట జన్మము నెత్తుచుందురు.

నాలవ ప్రశ్నమునకు బదులు చెప్పఁబడుచున్నది.—పాపులకు పితృలోకముకూడ లేకయుండుటవలన పితృలోకము పూర్ణముగాక యున్నది. అనఁగా పితృలోకమునకు అందఱునుపోవుట లేదు, కొందఱు మాత్రమే పోవుచున్నారని తాత్పర్యము.

కావున ఈమూఁడవమార్గమునకు సంకోచింపవలసినది. (పాపమునకు భయపడవలసినది.) ఆవిషయము చెప్పఁబడుచున్నది.

9. బ్రాహ్మణుని ధనమును దొంగిలించువాఁడును; సురాపానము చేయువాఁడును; గురుతల్పగమనము చేయువాఁడును; బ్రహ్మహత్య చేయువాఁడును; అగు వీరందఱును పాపులై అప్పుడప్పుడు జనించి కష్ట మొందెదరు.

10. ఈ పంచాగ్నివిద్యను ఎఱింగినవారికి పాప భయము లేదు; పుణ్యలోకమును (దేవయానమును) పొందెదరు.

11.- ఖండము.

1. ౧ ప్రాచీనశాలుఁడను ఔపమన్యవు, ౨ సత్యయజ్ఞుఁడను పౌలుషి, 3 ఇంద్రద్యుమ్నుఁడను భాల్లవేయుఁడు, ౪ జనుఁడను శార్కరాక్షుఁడు, ౫ బుడిలుఁడను ఆశ్వతరాశ్వి అను నీయైదుగురును గృహస్థులును మహాశ్రోత్రియులునై యుండిరి. వీ రొకప్పుడందఱును జేర

మన ఆత్మయేది? బ్రహ్మమేయ్యది? అనువిషయమునుగూర్చి చర్చించు చుండిరి.

2. ఉద్దాలకుఁడను ఆరుణి ఈవైశ్వానరాత్మను తెలిసికొనకున్న వాఁడు. ఆతనికడకుఁబోయి తెలిసికొనవచ్చునని నిశ్చయించికొని యం దఱు నతనికడకుం జనిరి.

3. అతఁడు వీరు వచ్చుచున్నారనియును,వీరికిఁ జెప్ప రాదనియును, వేఱొకరియొద్దకుఁబోయి తెలిసికొనుఁడని చెప్పిపంపించవలయుననియును సంకల్పించికొనియుండెను.

4. ఆ ఐదుగురును ఉద్దాలకునియొద్దకురాఁగా, నతఁడు వారినిఁ జూచి యిట్లనియె.—అశ్వపతియనెడి కైకయుఁ డనునతఁడు ఆత్మనెఱింగిన వాఁడు; మనమందఱమును అతనికడకుఁ బోవుదము రండు; అని అంద ఱునుపోయిరి.

5. కైకయుఁడు(అశ్వపతి) ఈఆఱుగురను మిక్కిలి సత్కరించెను; మఱునాఁ డుదయమున (వచ్చినవారలకు విశేషధన మొసంగఁబోఁగా, వారు వలదనిరి; అంత నతఁడు నాయం దేదియేని దోష ముండినందుననే వీరు నాధనమును స్వీకరింపరైరని తలంచి చింతతో) నిట్లనియె.— నారాజ్యమునందు దొంగలేఁడు, సురాపానముచేయుబ్రాహ్మణుఁడు లేఁడు, యాగము చేయనివాఁడు లేఁడు, అవిద్వాంసుఁడు లేఁడు, వ్యభిచరించు పురుషుఁడు లేఁడు, జారిణి లేదు, నేను యాగముచేయఁబోయెదను; ఋత్విక్కులకును మీకును విశేషధన మొసంగెదను; ఉండుఁడు; నాయజ్ఞ మును వీక్షింపుఁడు అని చెప్పెను.

6. అందులకు వా రిట్లనిరి:—(మాకు ధనమువలదు) ఏప్రయోజన మునకై పురుషుఁడు సంచరించుచున్నాఁడో, దానిని (ఆవైశ్వాన రాత్మను) నీవు తెలిసికొనియున్నావు;దానిని మాకు ఉపదేశింపుము అనిరి.

7. రేపు ఉదయమునఁ జెప్పెదను, అనిపల్కి మఱునాఁ డిట్లు చెప్పఁదొడఁగెను.

## 12. ఖండము.

1, 2. ఓ ఔపమన్యవ! నీవు దేనినివైశ్వానరాత్మగా ఉపాసించెదవు? ఔపమన్యవుఁడు—స్వర్గమును.

అశ్వపతి:—ఇది తేజస్సుగలది; వైశ్వానరుఁడు; నీవు దీనిని ఆత్మగా ఉపాసించుటవలన నీకులమునందు యాగక్రియ సఫలముగాఁ గనంబడుచున్నది; అన్నమును భుజించెదవు; ప్రియవస్తువులను జూచెదవు; అట్లే ఒకఁడు చేయుచున్నాఁడు; ఎవఁడిట్లు వైశ్వానరాత్మను ఉపాసించుచున్నాఁడో వానికులమునందు బ్రహ్మవర్చస్సుకల్గును. ఇదే (స్వర్గలోకము) ఆత్మయొక్క శిరస్సు; నాయొద్దకు వచ్చి ఇట్లు తెలిసికొనని యెడల నీతల క్రిందపడిపోయియుండెను.

13. ఖండము.

1, 2. సత్యయజ్ఞునడిగెను. అతఁడు ఆదిత్యుని వైశ్వానరునిగాఁ జెప్పెను. (తక్కినది దీనికితగినట్లు పైని చెప్పఁబడినట్లు) ఫలము - విశ్వరూపము; ఆదిత్యుఁడు వైశ్వానరుని చక్షుస్సు.

14. ఖండము.

1, 2. ఇంద్రద్యుమ్ను నడిగెను. అతఁడు వాయువును ఉపాసించునట్లు చెప్పెను. (తక్కినది దీనికితగినట్లు) ఫలము - పలుతెఱఁగులగు వస్త్రాదివైభవములు; వాయువు వైశ్వానరుని ప్రాణము.

15. ఖండము.

1, 2. జనుని అడిగెను. అతఁడు ఆకాశమును ఉపాసించునట్లు చెప్పెను. (తక్కినది దీనికితగినరీతిగా)ఫలము - ప్రజయును ధనమును విశేషముగానుండును; ఆకాశము వైశ్వానరుని మధ్యదేహము.

16. ఖండము.

1, 2. బుడిలుని అడిగెను. జలమును ఉపాసించునట్లుచెప్పెను. (తక్కినది దీని కనుగుణముగా గ్రహించునది) ఫలము - ఐశ్వర్యము; జలము వైశ్వానరుని మూత్రకోశము.

17. ఖండము.

1, 2. ఉద్దాలకుని అడిగెను. పృథ్విని ఉపాసించునట్లు చెప్పెను. (తక్కినది దీనికిం దగినట్లు) ఫలము - ప్రజచేతను, పశువులచేతను ప్రతిష్ఠ (అధికము); పృథివి వైశ్వానరునిపాదములు.

18. ఖండము.

1. అందఱనుజూచియిట్లనియె.—పృథక్కుగాఁగనంబడునదియును ఒకేవస్తువుగా నుండునదియును అగు ఆత్మను వైశ్వానరుఁడని యెఱింగి

అన్నమును భుజించెదరు; ఎవఁ డిట్లు ఆత్మను ప్రాదేశమాత్రునిగను (అనేకవిధములుగా విభజించి తెలియఁబడువానినిగను) అభివిమానుండనియును (నేను అని తెలియంబడినవానినిగను), ఎఱింగి ఉపాసించువాఁడు సకలలోకములయందును, సకలాత్మలయందును (ఇంద్రియములయందును) వసించి అన్నమును భుజించుచున్నాఁడు.

2. ఇట్టి ఆత్మకు శిరస్సు సుతేజస్సు; నేత్రము విశ్వరూపము; ప్రాణము పృథగ్వర్త్మాత్మ, మధ్యదేహము బహుళము, వస్తి ఐశ్వర్యము, పాదములు పృథ్వి, (ఈవైశ్వానరవిద్యను ఎఱింగినవారు భుజించునపుడు, దీనిని యాగముగా భావించునట్లు చెప్పఁబడుచున్నది). వక్షస్సు-యాగవేది; రోమములు-దర్భ; హృదయము-గార్హపత్యాగ్ని; మనస్సు-దక్షిణాగ్ని; వాయువు-ఆహవనీయాగ్ని.

19—24. ఖండము.

(వీనియందు పంచప్రాణాహుతినిగూర్చియు, వైశ్వానరవిద్యను గూర్చియుఁ దెలిసికొన్నవానికి ఫలము చెప్పఁబడియున్నది - ఇది అముఖ్యము).

---

షష్ఠప్రపాఠకము.

1. ఖండము.

1. శ్వేతకేతువను ఆరుణేయుఁ డొకఁడుండెను. అతనితండ్రియైన ఉద్దాలకుఁడు కుమారునిం జూచి—"నీవు మంచిగురువును ఆశ్రయించి బ్రహ్మచర్యమును అనుష్ఠించుము; మనకులమునందు ఎవ్వరును ఆప్రకారమనుష్ఠింపక కేవలము బ్రహ్మబంధువుగామాత్రము (వేరునకుమాత్రము బ్రాహ్మణుఁడుగా) ఉండినది లేదు" అనెను.

2. అప్పుడు పండ్రెండేండ్లవయస్సుగల శ్వేతకేతువు ఒకగురువునాశ్రయించి యిరువదినాలుగేండ్లవఱకు సకలవేదములను అధ్యయనము చేసికొనిగించెను. తర్వాత, మహావివేకవంతుఁడుగను, వేదాధ్యయన గౌరవము గలవాఁడుగను, గర్వము గలవాఁడుగను నై స్వగృహమును జేరెను.

3. అతనింజూచి తండ్రి యిట్లని యడిగెను.—"ఏయుపదేశముచేత వినఁబడనిది వినఁబడుచున్నదో, తలంపనిది తలఁపఁబడుచున్నదో,

(తర్కింపఁబడుచున్నదో,) తెలియంబడనిది తెలియంబడుచున్నదో,(నిశ్చయింపఁబడుచున్నదో,)అట్టిఉపదేశము చేయుఁడని గురువునడిగితివా?"అని.

4. శ్వేతకేతువు——ఆయుపదేశ మెట్టిది?

తండ్రి.——చెప్పెదను, వినుము; మృత్పిండముచేత మృన్మయమైన (కుండలు, చట్లు మొదలగునవి) వస్తువులన్నియు మృత్తిక యనియును, నామరూపములుమాత్రమే వేఱనియును, మృత్తికమాత్రము సత్యమని యును ఎట్లు తెలియంబడుచున్నదో అట్లును;

5. ఒకబంగారుగడ్డచే వివిధాభరణములై నామరూపములు మాత్రము వేఱైయుండి సర్వము నెట్లు బంగారమై యుండుట యెట్లు సత్యమో అట్లును;

6. ఇనుము ఒకటిగానుండి, సలాకు మొదలగునవి నామరూపము లచే వేఱువేఱుగా నుండియు, అన్నియును ఇను మనుట యెట్లు సత్యమో, అట్లును తెలిసికొనుటయే ఉపదేశము.

7. శ్వేతకేతువు.——ఇది నాగురువునకుఁ దెలియదని తోఁచు చున్నది; తెలిసియుండు నేని వారు చెప్పకయుందురా? మీరు చెప్పుఁడు; అని తండ్రిని అడిగెను.

తండ్రి——చెప్పెదను,వినుము.అని కుమారునకు ఆరుణేయుండనెను.

2. ఖండము.

1, 2. నామరూపవిశేషములతోఁ గనంబడు ఈజగత్తు ఉత్పత్తి యగుటకు మునుపు, సత్తుగా (సూక్ష్మమును, నిర్విశేషమును, సర్వగత మును, నిరంజనమును,నిరవయవమును, విజ్ఞానమును, 'ఉన్నది'అని చెప్పఁ బడు వస్తుమాత్రముగను,) ఏకమును, అద్వితీయమును నై యుండినది. ఈజగత్తు అసత్తై (లేనిదై) ఏకమై, అద్వితీయమై యుండినది. ఆ అసత్తు నుండి సత్తు గలిగినది, అని కొందఱనెదరు. (అది సరికాదు). అది సాధ్యముకానిది. దానికి ప్రమాణమేమి? అసత్తునుండి సత్తుకలుగునా? కలుగదు. కావున ఈజగత్తు మొదట సత్తామాత్రమై యుండినది; ఏకమై, అద్వితీయమై యుండినది.

3. ఆ సత్తు బహుప్రకారము లగుటకు నిశ్చయించి తేజస్సును సృష్టించెను. ఆ తేజస్సయిన సత్తు బహుప్రకారము లగుటకై మరల నిశ్చయించి జలమును సృష్టించెను. కాబట్టియే ఒకపురుషుఁడు తపించినయెడల

చెమటఁ బుట్టుచున్నది. అందుచేతనే అగ్నియందుండి జలము కలిగినదని చెప్పఁబడుచున్నది.

4. ఇట్లు జలమైనసత్తు బహుప్రకారము లగుటకు నిశ్చయించి అన్నమును (పృథివిని) సృష్టించెను. కావున, ఎచట అధికముగా వర్షము కురియుచున్నదో అచ్చట అన్నము అధికముగా కలుగుచున్నది. కావున జలమువలన అన్నము కలుగుచున్నదని చెప్పఁబడుచున్నది.

3. ఖండము.

1. ఈకనంబడు (పశుపక్షిస్థావరాదులు) భూతములకన్నిటికిని మూఁడువిధములగు కారణములు గలవు. ౧ గుడ్డునందుండి కలుగు పక్షి జాతి; ౨ గర్భకోశమునందుండి కలుగు మనుష్యపశ్వాదిజాతి; 3 భూమిని చీల్చికొని పుట్టునట్టి పర్వతవృక్షాదిజాతి.

2, 4. ఇట్టి (తేజస్సు, జలము,భూమి అనువీనికి కారణమును, సత్తామాత్రమైనదియును) దేవత, ఇప్పుడు మనము పైనిచెప్పిన మూఁడు దేవతలలో ఈజీవాత్మను (స్వబుద్ధిస్థముగను, పూర్వసృష్టస్యభూతముగను, తన అభ్యాసముగను అద్దమునందలి పురుషునివలెను, జలమునందలి సూర్యునివలెను,తనప్రతిబింబరూపముగను,ఛాయామాత్రరూపముగను నుండు జీవుఁడను పేరుగల తనఅంశమును) ప్రవేశింపఁజేసి అనేకములైన నామరూపములను చేయవలెనుననియును, ఆమూఁడు దేవతలను ఒక్కొక దానిని మూఁడుమూఁడుగా జేయవలయునని తలంచి,ఆప్రకారమే కావించెను. ఈత్రివృత్కరణము ఎట్లు చేయఁబడినదో దానిని తెలిసికొనుమని గురువు శిష్యునకుపదేశించెను. (త్రివృత్కరణమనఁగా, పైనిచెప్పిన తేజస్సు (అగ్ని), జలము, భూమి,అను నీమూఁడుభూతములను మొదట ఒక్కొకదానిని రెండురెండుగాఁ జేసి, అందు ఒక్కొకదానియందలి ఒక్కొకభాగమును ప్రత్యేకముగానుంచి, తక్కిన ఒక్కొక్కదానిలోని ఒక్కొకభాగమును రెండురెండుభాగములు చేసి, మొదట నుంచియున్న ఒక్కొకభాగములో తర్వాతచేసిన రెండేసిభాగములలో నొక్కొక దానిని యుంచుటయే త్రివృత్కరణము) ఎట్లనః—

| (1) పృథివి | ½ | (2) అప్పు | ½ | (3) తేజస్సు | ½ |
|---|---|---|---|---|---|
| అప్పు | ¼ | తేజస్సు | ¼ | పృథివి | ¼ |
| తేజస్సు | ¼ | పృథివి | ¼ | అప్పు | ¼ |

4. ఖండము.

1. త్రివృత్కరణమైన అగ్నియందలి ఎఱ్ఱనిరూపము ఏదిగలదో అది ఆత్రివృత్కరణమైన తేజస్సుయొక్క రూపము. తెలుపు జలము యొక్క రూపము. నలుపు అన్నము (పృథివి) యొక్క రూపము. ఇట్లు తెలిసికొన్నతర్వాత అగ్నియొక్క అగ్నిత్వము పోవుచున్నది. అగ్నియను నది వాఙ్మాత్రము; నామమాత్రవికారము; పైనిచెప్పిన మూఁడురూప ములుమాత్రము సత్యము.

2-4. ఇట్లే సూర్యుఁడు, చంద్రుఁడు, మెఱుపు అను వీనినివిషయ మునందును ఎఱుంగునది.

5. ఇప్పుడు మనలో నెవ్వరును తెలిసికొననిదియు; తలంపనిదియు; కనుఁగొనుటకు సాధ్యముకానిదియు నగుదానిని ఉదాహరింపఁగూడదని పూర్వమున్న మహాయోగులు (పెద్దలు) చెప్పియున్నారు. వారు పైని చెప్పిన దృష్టాంతములచేఁ దెలిసికొనిరి.

6, 7. ఏది ఎఱ్ఱనిరూపముగాఁ గనఁబడుచున్నదో అది అగ్ని యొక్క రూపమనియును, ఏది తెల్లనిరూపముగాఁ గనంబడుచున్నదో అది జలముయొక్క రూపమనియును, ఏది నల్లనిరూపముగాఁ గనంబడు చున్నదో అది అన్నము (పృథ్వి) యొక్కరూపమనియును, ఏయొద్ది వ్యక్తముగాఁ గనంబడకున్నదో అది పైనిచెప్పిన మూఁటియొక్క మిశ్రమరూపమనియును తెలిసికొనిరి. ఇట్లు పైన చెప్పిన మూఁడు దేవ తలును పురుషునిఁజేరి మూఁడు మూఁడుగా నున్నవో దానిని నావలనఁ దెలిసికొనుమని చెప్పెను.

5. ఖండము.

1. భుజింపఁబడు అన్నము జఠరాగ్నివలన పక్వమై మూఁడువిధము లగుచున్నవి. దానిస్థూలాంశము మలము; మధ్యాంశము రసవంతమై మాంసమగుచున్నది. (మాంసముతోఁ జేరుచున్నది); సూక్ష్మాంశము (సత్తు) హృదయమును జేరి హితమనునాడిలోఁ బ్రవేశించి వాగాదికరణ ములను వానివాని కార్యములను జేయునట్లు ప్రేరించు మనస్సు అగు చున్నది (మనస్సునకు బలమునొసంగుచున్నది).

2. త్రాగునట్టిజలము జీర్ణమై మూఁడువిధము లగుచున్నవి. ఎట్లన, స్థూలాంశము మూత్రముగను, మధ్యాంశము రక్తముగను, (రక్తము

తోఁ గలిసినట్టిదియును)ఁ సూక్ష్మాంశము ప్రాణముగను (ప్రాణమునకు బలము నిచ్చునదియును) అగుచున్నది.

3. భుజింపఁబడిన తేజస్సు (తైలము, ఘృతము మొదలగు తేజస్సంబంధములగు వస్తువులు)జీర్ణమై, మూఁడువిధము లగుచున్నది. ఎట్లన, స్థూలాంశము ఎముకయై (ఎముకతోఁ జేరినదై) మధ్యాంశము ఎముకలోనుండు మజ్జయై, సూక్ష్మాంశము వాక్కై (మాటలాడుశక్తి నొసంగునదియై) అగుచున్నది.

4. ఇట్లు మనస్సు అన్నమై, ప్రాణము అప్మయమై (జలమయమై) వాక్కు తేజోమయమై యున్నది. ఓసౌమ్యా! అని గురువు చెప్పఁగా, నాకేదియు తెలియలేదు. చక్కఁగాఁ జెప్పవలయునని శిష్యుఁ డడుగఁగా, గురు విట్లనియె.

6. ఖండము.

1-4. మథింపఁబడిన పెరుగులోనుండి సూక్ష్మాంశము వెన్నగా పైకి లేచి, యెట్లు నెయ్యి యగుచున్నదో, అట్లు అన్నముయొక్క సూక్ష్మాంశము పైకిలేచి మనస్సగను, జలముయొక్క సూక్ష్మాంశము ప్రాణముగను, తేజస్సుయొక్క సూక్ష్మాంశము వాక్కుగను అగుచున్నది.

5. అయిదవఖండము నాలవమంత్రమువలె.

7. ఖండము.

1. పురుషుఁడు పదునాఱుకళలతోఁ గూడినవాఁడు;పదునైదుదినములు భుజింపక యుండుము; నీయిష్టముచొప్పున జలమును గ్రోలుము; ప్రాణము జలమయమైనందున జలము త్రాగువాని ప్రాణము పోనేరదు.

2. ఇట్లు శిష్యుఁడును కుమారుఁడునగు శ్వేతకేతువు పదునైదు దినములు భుజింపకయుండి, గురువు (తండ్రి) కడకు వచ్చి, "నేను ఏమి చెప్పుదును?" అని యడుగఁగా, గురువు—"ఋగ్యజుస్సామములను జెప్పుము" అనెను. శిష్యుఁడు "అవి ఇప్పుడు నామనస్సునకు గోచరము కాలేదు" అని చెప్పెను.

గురువు.—ఎట్లు పెద్దగా మంటఁబెట్టిన నిప్పంతయు ఆఱిపోయి, అందు మిగిలిన ఒక్కమిణుఁగురుమాత్ర మేప్రకారముగా బహువస్తువులను కాల్పదో, అట్లు నీపదునాఱుకళలలో నొక్కకళమాత్రము మిగిలి

యున్నది; కావున, ఇప్పుడు నీకు వేదములను జెప్పుటకు శక్తి లేకున్నది. కావున భోజనము చేయుము.

4. తర్వాత (భోజనానంతరము) నావలనఁ దెలిసికొందువు. అనఁగా శిష్యుఁడు భుజించి వచ్చెను. అప్పుడు వేదములలో కొన్ని విషయములను అడుగఁగా, శిష్యుఁడు క్రమముగాఁ జెప్పెను. మరల గురు విట్లనియె.

5. ఎట్లు పైనిచెప్పిన అగ్నికణమును తృణాదులచే రగులఁబెట్టి జ్వలింపఁ జేసినచో, దానివలన బహువస్తువులు దహింపఁబడునో, అట్లు;

6. నీయొద్ద మిగిలియున్న ఒక్కకల, నీవు భుజించినయన్నముచే మనోబలము నొందినది. అందుచే నీవు వేదములనుజెప్పుటకు శక్తికల వాఁడవైతివి. కావున మనస్సు అన్నమయము, ప్రాణము జలమయము, వాక్కు తేజోమయము అని యిట్లు శిష్యుఁడు తెలిసికొనెను.

8. ఖండము.

1. ఉద్దాలకుఁడు తనకుమారుఁడైన శ్వేతకేతువునుజూచి (దిగువ నుదహరించు ప్రకారము) యిట్లనియె. సుషుప్తిని నావలనఁ దెలిసికొనుము; ఒక పురుషుఁడు నిదురించునపుడు సత్సంపన్నుఁడు (సత్తుతోఁ గూడిన వాఁడు.) గా అగుచున్నాఁడు. తన్ను తానుచేరుచున్నాఁడు. (అనఁగా ప్రతిబింబమైన జీవుఁడు, సకలవ్యవహారములను మాని శుద్ధాత్మతోఁ జేరుచున్నాఁడు.) కావున, నిద్రించునపుడు "నిద్రపోవుచున్నాఁడు" అని చెప్పఁబడుచున్నాఁడు.

2. ఎట్లు దారముతోఁ గట్టఁబడినపక్షి ఎక్కడికి పోయినప్పటికి నిలుచుటకుఁగాక, యెప్పటియట్లు కట్టఁబడినచోటికే వచ్చి చేరుచున్నదో, అట్లు ఆమనస్సు (మనస్థమైన ఆత్మ, జీవుఁడు) ఎక్కడెక్కడికి పోయినప్పటికిని (జాగ్రత్స్వప్నముల అవస్థలయందు సుఖదుఃఖలక్షణమైన కర్మముల ననుభవించి, మిక్కిలి కష్టమొంది తుదకు) వేఱేచోటు కనంబడనందున (సుషుప్తికాలమునందు) ప్రాణమునే(ప్రాణమనెడి పరమాత్మను, సత్తును) చేరుచున్నది. మనస్సుప్రాణముచేత (జీవుఁడు సత్తుచేత) కట్టుపడియున్నదికదా.

3. అన్నాదికార్యకారణపరంపరాద్వారముగా జగన్మూలము కనఁబఱచఁబడుచున్నది.

గురువు మరల నిట్లనుచున్నాఁడు.—ఆఁకలి,దప్పి అను వీనివృత్తాంతమును వినుము ఒకపురుషుఁడు భుజింపఁగోరుచున్నాఁడనుట ముఖ్యము

కాదు. గౌణము; (అనఁగా పురుషుఁడు, జీవుఁడు భుజించుటకుఁ గోరలేదు. దిగువ నుదాహరించు ప్రకారము జలము అన్నమును గోరుచున్నది). భుజించిన అన్నమును జలము పాలించుచున్నది. (కలియంబెట్టి, పక్వముచేసి, మలమును వేఱుచేసి; సారమును తనతోఁ జేర్చుకొనుచున్నది; అన్నమును జీర్ణింపఁజేయుచున్నది.); పశువును తోలువాఁడు, గుఱ్ఱమును తోలువాఁడు, మనుష్యులను పాలించువాఁడు అని వ్యవహరించునట్లు, అన్నమును జలము పాలించుచున్నదియని చెప్పఁబడుచున్నది. ఆయన్నముచేఁ బుట్టినది యీశరీరము (అనఁగా అన్నరసము శుక్లశోణితమై దేహమగుచున్నది); దీనికి మూలము కలదు.

4. శిష్యుఁడు—దీనికి అన్నముకంటెను వేఱే మూలమేమి?

గురువు—దీనికి అన్నము అంకురముగాన (నాశముగలది గాన) దానికి జలము మూలమని తెలిసికొనుము; జలము అంకురమైనదిగాన దానికి తేజస్సు మూలమని తెలిసికొనుము; తేజస్సును అంకురముగాన దానికి సత్తు మూలమని యెఱుంగుము; ఈప్రజలు సత్తునుండి కలిగిరి; సత్తుచే బ్రదికియున్నారు; సత్తునే కడపట చెందుచున్నారు.

5. అట్లే ఒకపురుషుఁడు త్రాగుటకుఁ గోరుచున్నాఁడు; అనుటయు గౌణమే. పురుషుఁడు గౌణము. పురుషుఁడు త్రాగుటలేదు. తేజస్సు త్రాగుచున్నది; ఎట్లన, త్రాగునట్టిజలమును తేజస్సు పాలించుచున్నది (ఇంకునట్లు చేయుచున్నది). (పూర్వము చెప్పినదృష్టాంతమే యిచ్చటను గ్రహించునది) జలమును పాలించునది తేజస్సు అని పేరొందెను. కావుననే ఈశరీరమనెడి అంకురము కలిగెను. దీనికిని మూలముకలదు.

6. శిష్యుఁడు—ఆమూలము జలముకంటె వేఱైనదా?

గురువు—మొదట చెప్పిన వరుసప్రకారము సత్తే మూలమని యెఱుంగుము. సర్వమును సత్తునుండి కలిగి, దానిచేతనే బ్రదికి దానియందే లయమగుచున్నది. ఈమూఁడు దేవతలును పురుషుని ఆశ్రయించి మూఁడుమూఁడుగా అగుచున్నదని మునుపే చెప్పఁబడియున్నదికదా? గతించిన పురుషునియొక్క వాక్కు మనస్సుతోఁ కలియుచున్నది; మనస్సు ప్రాణమును, ప్రాణము తేజస్సును, తేజస్సు పరమాత్మను చేరుచున్నవి. (ఇట్లు మనస్థమైన జీవుఁడు ఆత్మజ్ఞుఁడు, సుషుప్తికాలమునందువలె సత్తుతోఁ జేరుచున్నాఁడు. వాఁడు మరల వేఱేశరీరము నొందుటకు సుషుప్తియం

దుండి మేల్కొనునట్లు మేల్కొనుటలేదు; అయినను అనాత్మజ్ఞుఁడైనవాఁడు, లోకమునం దొకభయప్రదేశమును వదలి నిర్భయప్రదేశమునకుఁబోవునట్లు, సత్తునుండి మరల సుషుప్తిలోనుండి మేల్కొనునట్లు మేల్కాంచి, గతించి, మరల వేఱేశరీరమును బొందుచున్నాఁడు.) ఈపరమాత్మయే సకల జగత్తునకును కారణమైన అణుప్రమాణవస్తువుగా నున్నది.

7. ఈ సకలజగత్తునందును ఈయాత్మగలదు; అది సత్యవస్తువు; అదియె ఆత్మయని చెప్పంబడునది; అది నీవై యున్నాఁడవు.

శిష్యుఁడు—(ఒక్కొకదినమునందును జీవులందఱును సుషుప్త్యవస్థయందు సత్తుతోఁ జేరుచున్నారని చెప్పితిరికదా? అట్లు సత్తుతోఁజేరిన వారు, 'మేము సత్తుతోఁజేరితిమి' అని చెప్పకపోవుటకు హేతువేమి? వెంటనే మేల్కొనెదరు; ఈసందేహము నాకున్నది) ఇంకొకతేప నాకు దృష్టాంతముతోఁ జక్కఁగాఁ జెప్పవలయునని యడిగెను.

గురువు—అలాగే చెప్పెద ననియెను.

9. ఖండము.

1. తేనెటీఁగలు పలుచోటులలోనుండు వృక్షముల (పుష్పముల) రసముల నన్నిటిని ఒకటిగాఁ జేర్చి ఒక్కరసముగాఁ జేసి తేనెను గలుగఁ జేయుచున్నవి.

2. ఆరసము లొక్కొక్కటియు తా నీపుష్పరసమని యెఱుఁగుచున్నవా? లేదుకదా; అట్లు ఈసకలప్రజలును సత్తును జేరియు సత్తుతోఁ జేరితిమని యెఱుఁగుటలేదు, (సుషుప్తి, మరణము, ప్రళయము, మూర్ఛ మొదలగు సమయములయందు ఎఱుఁగుటలేదు).

3. అయినను అవి యెట్లగుచున్నవనఁగా, వారివారి కర్మానుసారముగా ఈలోకమునకు మరలివచ్చి వ్యాఘ్రము, సింహము మొదలగు క్రూరసత్త్వము లగుచున్నవి.

4. అట్టిపరమాత్మ, ఈసకలప్రపంచమును అతనిచేత పూర్ణము (పూర్తి) చేయఁబడియున్నది, అతఁడే సత్యము; అతఁడే ఆత్మ; అతఁడు నీవై యున్నాఁడవు అని గురువు చెప్పఁగా, శిష్యుఁడు (నిద్రపోయి మేల్కాంచినతర్వాత, ఒకచోటికిఁ బోయినపుడు, తాను ఇంటియందుండి

వచ్చినట్లుచెప్పుటకుఁ గారణమేమి? ఈసంచేహామును నివృత్తిచేయవల యును) ఇంకొకపర్యాయము విశదముగాఁ జెప్పుఁడని యడిగెను.

గురువు—ఆలాగే చెప్పెదను.

10. ఖండము.

1, 2. సముద్రమునందుండి మేఘముద్వారముగాఁ గలిగిన నదీ నదములు, పిదప ఆసముద్రమునందే కలిసిన అనంతరము, ఆనదులు పూర్వము ఈనదీరూపముగా నుంటిమని యెట్లు తెలిసికొనుటలేదో, అట్లు ఈ ప్రజలందఱును సత్తునుండి వచ్చినప్పటికిని, సత్తునుండి వచ్చినట్లు తెలిసికొనకయున్నారు. వ్యాఘ్రము మొదలగునట్టి జన్మములను మరల మరల నెత్తుచున్నారు.

3. అతఁడు అణుప్రమాణవస్తువు. సకలజగత్తునందును ఆత్మ కలదు; (ఆత్మలేనిచోటు లేదు); అది సత్యవస్తువు; అదే ఆత్మ; అది నీవై యున్నావు.

శిష్యుఁడు:—(జీవులు వానికారణభావమును సత్తును ప్రతిదిన మును పొందినప్పటికిని, సుషుప్తి, మరణము, ప్రళయము మొదలగు అవస్థలయందు నశించుటలేదని చెప్పఁబడుటకు దృష్టాంతమేమి?) ఇంకొక తేప స్పష్టముగాఁ దెలియఁజేయుఁడు.

గురువు:—అటులే చెప్పెదను.

11. ఖండము.

1. ఒకగొప్పవృక్షమునం దొకవైపున కత్తితోఁ గొట్టినయెడల ఆవృక్షము చచ్చుటలేదు; బ్రదుకుచు సారముమాత్రము కాఱుచుం డును; మధ్యకొట్టినను అట్లేయుండును; కొనలోఁ గొట్టినను ఆలాగే యుండును; అది జీవునిచే వ్యాప్తమై భూసంబంధమైన జలమును గ్రహించుచు (త్రాగుచు) సంతోషముతో నుండును.

2. ఆచెట్టులో నొకరెమ్మను జీవుఁడు వదలినమీఁద ఆరెమ్మ యెండి పోవుచున్నది; రెండవ మూఁడవ రెమ్మలు నట్లే; అన్నిటిని జీవుఁడు వదలి పెట్టినయెడల అంతయు నెండిపోవును; అట్లే తెలిసికొనుము.

3. జీవునిచే విడువఁబడినమీఁదట యీదేహము నశించుచున్న దేగాని జీవుఁడు నశించుటలేదు. అతఁడు అణుప్రమాణవస్తువు; ఈసకల

జగత్తునందును ఆత్మ నిండియున్నది; అది సత్యవస్తువు; అదే ఆత్మ యని తెలిసికొనుము; అతఁడు నీవై యున్నాఁడవు.

శిష్యుఁడు:— అత్యంతము సూక్ష్మమైన సత్తునుండి ఈమహత్తైన ప్రపంచ మెట్లు కలిగెను? దానిని దృష్టాంతముతోఁ జెప్పుఁడు. అని యడిగెను.

గురువు—ఆప్రకారమే చెప్పెదను.

(ఒకకార్యమును చేయుచున్నవాఁడు నిదురించి లేచినపిమ్మట, చేసినపనియందలి కొఱఁతను పూర్తిచేయవలయునని చెప్పుచున్నాఁడు; ఇందుచేత జీవునకు జ్ఞాపకశక్తి యున్నట్లు విశదమగుచున్నది; మఱియు ఒకబిడ్డకు పుట్టినవెంటనే స్తన్యపానాభిలాషయును భయమును ఉన్నది; దీనిచేత పూర్వజన్మవాసన యున్నదని తెలియుచున్నది; మఱియు స్వర్గాది భోగముకొఱకు యాగముచేయఁబడుచున్నది; శరీరపతనానంతరము జీవుఁడు స్వర్గమునకుఁ జని అనుభవించుచున్నాఁడు. ఇత్యాదికారణముల చేత జీవుఁడు నశించుట లేదు.)

## 12. ఖండము.

1-3. గురువు (శిష్యునింజూచి) ఒక మఱ్ఱిపండును తెమ్ము.

శిష్యుఁడు— ఇదిగో తెచ్చినాఁడను.

గురువు—దానిని త్రుంపుము.

శిష్యుఁడు—త్రుంచితిని.

గురువు—దానియం దేమియున్నది.

శిష్యుఁడు—అత్యంతము సూక్ష్మమైన విత్తనములున్నవి.

గురువు—వానిలో నొకవిత్తనమును చీల్పుము.

శిష్యుఁడు—చీల్చినాఁడను.

గురువు—అం దేమియున్నది?

శిష్యుఁడు—ఏమియు లేదు.

గురువు—ఇట్లు ఏమియు లేని సూక్ష్మమునుండి పెద్ద మఱ్ఱిమాను ఎట్లు కలిగినదో, అట్లు అతిసూక్ష్మమైన సత్తునుండి ఈమహాప్రపంచము కలిగినదని తెలిసికొనుము. అది అణుప్రమాణవస్తువు; ఈసకలజగత్తు నందును ఆత్మకలదు; అది సత్యవస్తువు; అదే ఆత్మ; అది నీవైయున్నావు.

శిష్యుఁడు—ఇట్టి సత్తామాత్రమైన వస్తువు ప్రపంచమునకు మూలమై యుండఁగా, అది కనఁబడకుండుటకు హేతువేమి? దానిని దృష్టాంతముతో ఇంకొకసారి చెప్పవలయునని యడిగెను.

గురువు—చెప్పెదను, వినుము.

## 13. ఖండము.

1-3 ఒకఉప్పుగడ్డను ఒకచెంబెఁడునీళ్లలో రాత్రి వేసియుంచి మఱునాఁ డుదయమున నాయొద్దకురమ్ము; అనఁగా శిష్యుఁడాప్రకార మొనర్చి మఱునాఁ డుదయమున గురువుకడకు వచ్చెను. గురువు—"ఇప్పు డాఉప్పుగడ్డను తీసికొని రా" అనఁగా, శిష్యుఁ డాఉప్పుగడ్డను నీళ్లలో వెదకి చూచి కనఁబడక మరలివచ్చి, గురువును జూచి—"ఆఉప్పు గడ్డ నీళ్లలో కరఁగిపోయినది, కనఁబడ లేదు" అనెను.

గురువు—(అది నీళ్లలో కరఁగి మఱఁగిపోయెను; దానిని కంటితో జూచుటకుఁ గాదు; వేఱేవిధముగాఁ దెలిసికొనవచ్చును) దాని పైనీటిని త్రాగి చూడుము.

శిష్యుఁడు—ఉప్పగా నున్నది.
గురువు—మధ్యజలమును త్రాగి చూడుము.
శిష్యుఁడు—ఉప్పగా నున్నది.
గురువు—అడుగునీటిని త్రాగిచూడుము.
శిష్యుఁడు—ఉప్పగా నున్నది.
గురువు—ఇటురమ్ము.
శిష్యుఁడు—వచ్చితిని.

గురువు—జలమునందు ఆ ఉప్పు కలిసిపోయి యున్నది. ఎట్లు అది (కంటితోఁ జూచుటకును, చేతితోఁ దాఁకుటకును, సాధ్యముగాక, నాలుకతోమాత్రము రుచిచూచి తెలిసికొనుటకుమాత్రము సాధ్యమై) మఱఁగి యున్నదో, అట్లు సత్తు (ఈశరీరమునందు) మఱఁగియున్నది. (ఇంద్రియములచే నెఱుంగుటకు సాధ్యముకానిది. వేఱేవిధముగాఁ దెలియనగును.) అతఁడు అణుప్రమాణవస్తువు. ఈసకలప్రపంచమునందును ఆత్మ కలదు; అది సత్యవస్తువు; అది ఆత్మయనునది; అతఁడు నీవై యున్నావు.

శిష్యుఁడు—(వేఱేవిధముగా నెఱుంగుటకు ఉపాయ మేమి?) ఇంకొకతడవ విశదముగా బోధింపుఁడనెను.

గురువు—ఆరీతిగానే చెప్పెదను.

14. ఖండము.

1-3. గాంధారదేశములోనుండి, ఒకానొకనిని కన్నులను చేతులను గట్టి జనసంచారములేని ప్రదేశమునకు తెచ్చివదలిపెట్టిపోయినమీఁద, వాఁడేప్రకారముగా నేచోటికినిఁబోనేరక, (నన్నెవరైనను కన్నులను చేతులను విప్పివేయుఁడు) నేనిచ్చటకుఁ గొనిరాఁబడియున్నాఁడను అని ప్రలపించుచుండునో, ఆసమయమున (దైవవశమున) ఎవఁడేనిదయగలవాఁడామార్గమునవచ్చి వానికట్లనువిప్పి, గాంధారదేశము ఈదిక్కులోనున్నది, ఈమార్గముగాఁ బొమ్ము, అనినమీఁద నీగాంధారదేశస్థుఁడు గ్రామగ్రామముగాఁ జని దారి తెలిసికొని యెట్లు తనదేశమును జేరుచున్నాఁడో, అట్లు (పురుషుఁడు సత్తునుండి వచ్చి తేజోబన్నమైన అరణ్యమును జేరి "వాత, పిత్త, కఫ, రక్త, మేదో, మాంసాస్థి,మజ్జా, శుక్ల, క్రిమి, మూత్ర, పురీషభాజనంబైన దేహము," మోహపటముచేఁ గట్టఁబడిన నేత్రముగలవాఁడుగను, భార్యాపుత్రపశుబంధాది దృష్టాదృష్టములైయనేకవిషయములైన ఆశాపాశములచే బంధింపబడినవాఁడుగను, పుణ్యపాపములైన దొంగచేఃబట్టుకొని రాఁబడినవాఁడుగను, నేనుపలానివానికుమారుఁడను, వీరు నాబంధువులు, సాధనము నష్టమైనది, నేను ఎట్లు బ్రదికియుందును అనునీమొదలగుపలుమాటలాడుచు ప్రలపించువాఁడుగను నుండి, తర్వాత, ఏదేని పుణ్యవశముచేత కరుణగల గురువుచే దారి చూపఁబడి సంసారమందు విరక్తినొందినవాఁడై, తుదకు సత్తును పొందుచున్నాఁడు. సత్తుతో నైక్యమగుచున్నాఁడు.)

ఆచార్యుండైనపురుషుఁడు బ్రహ్మమును, (సత్తును) తెలిసికొనుచున్నాఁడు. వాఁ డెఱింగినమీఁద సత్సంపదకు (మోక్షమునకు, సత్తుతోఁ జేరుటకు) ప్రారబ్ధకర్మము నంతయు ననుభవించినతర్వాత దేహపాతము కలుగుచున్నది. అదేమోక్షకాలము. వెంటనే సత్సంపద కలుగుచున్నది.

(బ్రహ్మజ్ఞానము కలిగినమీఁద సంచితకర్మమును, ఆగామికర్మమును నశించుచున్నది; కాని ప్రారబ్ధకర్మముమాత్రము అనుభవము కావలయును. ఎట్లన, ఒకచోటనుండి విడువంబడిన బాణము లక్ష్యమును

దాఁకి, దానిచే ప్రతిబంధక మేర్పడినప్పటికిని వేగశేషమువలన, లక్ష్యమును దాఁటి మఱికొంతదూరము పోవునట్లు, అని తెలియునది).

4. ఆత్మ అణుప్రమాణవస్తువు; సకలప్రపంచమును ఆత్మ (బ్రహ్మ) మయము. అది సత్యవస్తువు; అది ఆత్మయనఁబడును. ఓ శ్వేతకేతూ! ఆ యాత్మ నీవై యున్నావు.

శిష్యుఁడు—ఆచార్యుఁడుగ నుండువాఁడు ఏపద్ధతిగా సత్తును జేరుచున్నాఁడో, దానిని దృష్టాంతముతోఁ జెప్పవలయును, అని యడిగెను.

తండ్రి (గురువు)—ఆలాగే చెప్పెదను. అనెను.

15. ఖండము.

1,2. మరణావస్థయందుండువానిని, వానిచుట్టములందఱును జేరి, నన్ను ఎఱుఁగుదువా! నన్ను ఎఱుగుదువా? అనియడిగెదరు. అప్పుడు వాని యొక్క వాక్కు మనస్సునందును, మనస్సు ప్రాణమునందును, ప్రాణము తేజస్సునందును, తేజస్సు పరమాత్మయందును లయము కానంతవఱకు 'నిన్ను ఎఱుఁగుదును' (నీవు పలానివాఁడవు;) నిన్నెఱుఁగుదును, అని చెప్పుచున్నాఁడు. తర్వాత వానికి ఏమియు దెలియదు.

3. అట్టి ఇతఁడు (పరమాత్మ, ఆత్మ, సత్తు) అణుప్రమాణవస్తువు; సకలప్రపంచమును ఆత్మమయమ్మై యున్నది; అది సత్యవస్తువు; అది ఆత్మ యనఁబడుచున్నది; ఓ శ్వేతకేతూ! ఆయాత్మ నీవై యున్నావు.

శిష్యుఁడు—[సత్సంపత్తి (మోక్షము) కలిగినమీఁద జీవుఁడు మరలుట లేదు; అవిద్వాంసుఁడు మరలుచున్నాఁడు. అని చెప్పఁబడుటకుఁ గారణమేమి? దృష్టాంతముతో] ఇంకొక తేప ఉపదేశింపుఁడని యడిగెను.

గురువు—ఆప్రకారమే చెప్పెదననియెను.

16. ఖండము.

1,2. ఒకానొకనిని రాజభటులు పట్టుకొనిపోవుచుండిరి. ఆమార్గమందున్నవారు— "వీఁ డేమిచేసినాఁడని పట్టుకొనిపోవుచున్నారు?" అనఁగా, భటులు— "వీఁడు దొంగిలించినాఁడు" అని చెప్పిరి. అందొకఁడు—"ఒక ఇనుపగొడ్డలిని కాల్చి వీనిచేత నుంపుఁడు, వీఁడుదొంగిలియున్నచో కాల్చును, లేనిచో కాల్పదు" అనెను. ఆరీతిగా బ్రహ్మజ్ఞాని మరలిరాక సత్తుతో నేకమగుచున్నాఁడు. (బ్రహ్మజ్ఞాని కానివాఁడు మరలుచున్నాఁడు).

3. అట్టిపరమాత్మ అణుస్వరూపము; ఈజగమంతయు పరమాత్మ స్వరూపమై యున్నది; అదియే ఆత్మ; అదిసత్యవస్తువు; ఓ శ్వేతకేతూ! అది (పరమాత్మ) నీవై యున్నావు, అనిచెప్పఁగా శ్వేతకేతువు తెలిసికొనెను.

---

1. ఖండము.

సప్తమప్రపాఠకము.

1. నారదుఁడు సనత్కుమారునొద్దకుఁ బోయి, అధ్యయనము చేయింపుఁడని వేఁడెను. అతఁడు, నారదునిం జూచి—"నీకుఁ దెలిసిన దానినిఁ జెప్పుము, తక్కినదానినిఁ జెప్పెదను" అనెను.

2. నారదుఁడు—ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, పంచమ వేదమగు ఇతిహాస పురాణములు, వ్యాకరణము, పితృసంబంధమైన కల్పము, రాశి (గణిత) శాస్త్రము, ధూమకేతూత్పాతముల నెఱుంగు దైవశాస్త్రము, నిధిశాస్త్రము, తర్కశాస్త్రము, ఏకాయనము, నీతిశాస్త్రము, దేవవిద్య, బ్రహ్మవిద్య(శిక్షాకల్పాదులు), భూతవిద్య, క్షత్రవిద్య (ధనుర్వేదము), జ్యోతిషవిద్య, సర్పవిద్య, గంధర్వవిద్య (సంగీత, నర్తనశాస్త్రము), వీనిని అధ్యయనముకావించి యున్నాఁడను; ఇంతవఱకు నాకుఁదెలియును.

3,4. ఇట్లెఱింగిననేను మంత్రవేత్తగా నున్నాఁడను; (కర్మమును మాత్ర మెఱింగినవాఁడనై యున్నాను. శబ్దార్థజ్ఞానమునెఱింగినవాఁడను గాను); ఆత్మవేత్తను కాలేదు; ఆత్మవేత్తయై శోకమునుండి విడివడిముక్తుఁడగుచున్నాఁడని మిమ్ముఁబోని పెద్దలు చెప్పగా వినియున్నాఁడను; నేను శోకము నొందియున్నాఁడను; నన్ను శోకసముద్రమునుండి దరిజేర్పవలయును' [అనఁగా ఆత్మ (బ్రహ్మ) వేత్తగాఁజేయవలయును].

ఇట్లు నారదుఁడు చెప్పఁగా సనత్కుమారుం డిట్లనియె-నీవు ఇదివఱకు అధ్యయనముఁ జేసియుండునది యంతయు నామమాత్రమేగాని వేఱుకాదు; ఋగ్వేదాదులును నామమాత్రమే యని యెఱుంగుము; కావున, ఆనామమాత్రమును బ్రహ్మమని యుపాసనచేయుము (నామజపముఁ జేయుము).

5. (ఫలము)నామమును బ్రహ్మమని యుపాసించువాఁడు, ఆనామ ముచే నెంతవిషయము బోధమగుచున్నదో, అంత విషయమునందును వానికి స్వేచ్ఛానుభవము గల్గియుండును. (అనఁగా అన్నివిషయములును వానికిఁ దెలియును, కర్మము నాచరించి దానిఫలమును బొందును).

నామముకంటెను (పెద్దది, గొప్పది) శ్రేష్ఠమైనది కలదా? యని నారదుఁడు అడుగఁగా, సనత్కుమారుఁడు కలదనెను. దానిని చెప్ప వలయు ననఁగా, సనత్కుమారుఁ డి ట్లనియె.

## 2. ఖండము.

1. నామముకంటెను వాక్కు శ్రేష్ఠమైనది,(పెద్దది,గొప్పది) వాక్కు ఋగ్వేదమును తెలియఁజేయునట్టిది; అట్లే యజుర్వేదము మొదలగు మున్ను చెప్పఁబడినవాని నన్నిటిని బోధించునది; మఱియు స్వర్గము,పృథివి, వాయువు, ఆకాశము, జలము, తేజస్సు, దేవతలు, మనుష్యులు, మృగ ములు, పక్షులు, వృక్షములు, దుష్టజంతువులు, ధర్మము, అధర్మము, సత్యము, అనృతము, సాధువు, అసాధువు, మనస్సునకు రమ్యమైనది, రమ్యము కానిది, అను వీనినన్నిటినిఁ దెలియఁజేయును. వాక్కు లేని యెడల ధర్మాధర్మము లిట్టివని చెప్పెడివాఁ డుండఁడు; చెప్పెడివాఁడు లేనిచో అడుగువాఁ డుండడు; అట్లే సత్యాసత్యములును ఇట్టివని తెలి యదు; సమస్తమును వాక్కు తెలియఁజేయుటవలన వాక్కు శ్రేష్ఠ మైనది. కనుక వాక్కును ఉపాసింపుము.

2. (ఫలము)పూర్వమువలె వాక్కున కెంతవఱకు గోచరమగునో అంతవఱకు స్వేచ్ఛానుభవము కలుగును; అనఁగా, వాక్కుకంటె శ్రేష్ఠ మైనది కలదా యన, సనత్కుమారుఁడు, కలదనఁగా, నారదుఁడు, దానిని జెప్పు మనఁగా సనత్కుమారుఁడు చెప్పఁదొడంగెను.

## 3. ఖండము.

1. వాక్కుకంటె మనస్సు శ్రేష్ఠము; ఎట్లు రెండు ఉసిరికకాయలు గాని, రెండు రేఁగుఁబండ్లుగాని, రెండు తాండ్రికాయలుగాని ఒక్క ముష్టి (పిడికిలి) ఇముడ్చు కొనునో, అట్లు నామమును వాక్కును (అను నీరెంటిని) మనస్సు తనలో నిముడ్చుకొని యున్నది. మంత్రములను అధ్యయనము చేయవలయునని మనస్సుతోఁ దలంచిన తర్వాత అధ్యయ

నము చేయఁబడుచున్నది. అట్లే మొదట తలంచినపిమ్మట కర్మములు చేయఁబడుచున్నవి. అట్లే తలంచియే పుత్త్రాదులను లోకములను పొందుచున్నాఁడు. మనస్సు, ఆత్మ, లోకము, బ్రహ్మము. కావున మనస్సును బ్రహ్మముగా ఉపాసింపుము.

2. (ఫలము.) దీనికిం దగినట్లు మనస్సుకంటెను శ్రేష్ఠమేది? యనఁగా, సనత్కుమారుఁడు కలదనఁగా, నారదుఁడు చెప్పవలయుననఁ, సనత్కుమారుఁ డిట్లనియె.

## 4. ఖండము.

1. మనస్సుకంటెను సంకల్పము శ్రేష్ఠము,(సంకల్పము-మనోవృత్తి; వృత్తిలేనిచో మనస్సుండదు; ఉష్ణభావము లేనిచో అగ్నియుండదని యట్లని తెలియునది.)ఎప్పుడు సంకల్పింపఁబడుచున్నదో, అప్పుడు తలంపఁబడుచున్నది; మనస్సు కలుగుచున్నది; తర్వాత వాక్కును ప్రేరించుచున్నది; నామములందు మంత్రము లణఁగియున్నవి; మంత్రములందు కర్మము లణఁగియున్నవి;(మంత్రములందు కర్మములుచెప్పఁబడియున్నవి).

2. ఇవి (మనస్సు మొదలగునవి) సంకల్పమునందు లయించుచున్నవి; సంకల్పమునందు కలిగినవి సంకల్పమునం దున్నవి; స్వర్గమును పృథివియు సంకల్పము; వాయువును, ఆకాశమును, జలమును, సంకల్పించియే వర్షించుచున్నది; వర్షమువలన అన్నమును, అన్నమువలన ప్రాణమును, ప్రాణమువలన మంత్రమును, మంత్రమువలన అగ్నిహోత్రాదికర్మమును, ఆకర్మమువలన స్వర్గాదిలోకఫలమును, ఆఫలమువలన సమస్తమును (కోరినదంతయు) కలుగుచున్నది. కావున సర్వమును సంకల్పమూలమై యున్నది. కాఁబట్టి సంకల్పమును బ్రహ్మముగా నుపాసింపవలయును.

3. (ఫలము) ఇట్లు ఉపాసించువానికి, ధ్రువమైనలోకములు సిద్ధించుచున్నవి. వీఁడును ధ్రువుఁడు (స్థిరుఁడు) అగుచున్నాఁడు. అవ్యథమానుఁడై (భయములేక,) మిత్త్రాదిసంపన్నుఁ డగుచున్నాఁడు. (తక్కినవి మునుపటియట్లు).

సంకల్పముకంటెను శ్రేష్ఠమైనది కలదా? అనఁగా, సనత్కుమారుఁ డిట్లనుచున్నాఁడు.

5. ఖండము.

1. సంకల్పముకంటెను చిత్తము గొప్పది; చిత్తము అనఁగా చేతయితృత్వము; తెలివి; ఒకవస్తువు సిద్ధించినపుడు అనురూపమై యుండు తెలివి; గతించినదానిని రాఁబోవుదానినిగూర్చినవిషయప్రయోజనమును నిరూపణము చేయునట్టి సామర్థ్యము; అనఁగా, మొదటకలుగు వస్తుజ్ఞానము; ఒకవస్తువు లభించినవెంటనే ఇది యీప్రకారము లభించినది యనెడి తెలివియే.(చిత్తము.)చిత్తము కల్గినమీఁద ఈవస్తువును గ్రహింతమా ? వలదా? అనిసంకల్పించుచున్నది; వెంటనే మనస్సు కలుగుచున్నది; తర్వాత, క్రమక్రమముగా పైనిచెప్పినయట్లు మంత్రము కర్మము మొదలగునవి (సిద్ధించుచున్నది).

2. ఇవి (సంకల్పము మొదలు కర్మమువఱకు) చిత్తమునందు లయించుచున్నవి;అందు ఉత్పత్తి యగుచున్నవి;అందుస్థితిని కలిగియున్నవి; కావున, ఒకఁడు (అచిత్తుఁడై నప్పుడు) అనేకశాస్త్రము లెఱింగి యుండిన ప్పటికిని, వాఁడు తెలియనివాఁడని చెప్పఁబడుచున్నాఁడు. కనుక, వానికి తెలిసియుండునదియు వ్యర్థమై పోవుచున్నది. ఒకవిద్వాంసుఁడు అచిత్తుఁడై యున్నచో వానిని తెలియనివాఁడని చెప్పెదరు; ఒకఁడు స్వల్పముగా తెలిసియున్నప్పటికిని చిత్తముగలవాఁడై యుండినయెడల అట్టివానియుపదేశమును అందఱును విన నభిలషించెదరు. కావున, చిత్తము అన్నిటికిని మూలమైయున్నది. నీవు చిత్తమును ఉపాసింపుము.

3. (ఫలము) అట్టివాఁడు చిత్తవంతుఁడగును. తక్కినది పూర్వము వలె.

చిత్తముకంటెను గొప్పదానిని జెప్పవలయు ననఁగా సనత్కుమారుం డిట్లనియె.

6. ఖండము.

1. చిత్తముకంటెను ధ్యానము శ్రేష్ఠము(ధ్యానమనఁగాచిత్తవృత్తి; శాస్త్రోక్తదేవతాదులయందు విశ్వాసముంచుట). పృథ్వి, అంతరిక్షము, స్వర్గము,పర్వతములు, దేవతలు,మనుష్యులు లేక, దేవమనుష్యులు,(సమాధిగుణసంపన్నులు) ధ్యానమొనర్చువారివలెఁగనఁబడుచున్నారు.(నిశ్చలులై యున్నారు; ఇందువలనమహత్త్వము నొందుచున్నారు). కనుక ఈలోకములో ధనము, విద్య, గుణము వీనిచేమనుష్యమహత్త్వమును బొందిన

వారు ధ్యానబలము నొందినవారై యున్నారు. తక్కినవారు అల్పులు; కలహకారులును, కొండెము చెప్పెడివారును, పరజనదూషకులు నయ్యెదరు. పరోపకారులందఱును ధ్యానబలము నొందినవారు కావున ధ్యానము గొప్పది. నీవు ధ్యానమును ఉపాసింపుము.

2. (ఫలము పూర్వమువలెఁ దీనికిం దగినట్లు) ధ్యానమునకంటె గొప్పదాని నడుగఁగా, సనత్కుమారుఁ డిట్లనియె.

7. ఖండము.

1. ధ్యానముకంటెను విజ్ఞానము శ్రేష్ఠము; (విజ్ఞాన మనఁగా, శాస్త్రార్థవిషయజ్ఞానము, జ్ఞాన మనఁగా ఇతరవిషయమైనపుణ్యము; శాస్త్రార్థమును మొదట తెలిసికొని, తర్వాత అందు ప్రతిపాదింపఁబడిన దేవతలలో నొకదానిని అవలంబించి ధ్యానముచేయవచ్చును). విజ్ఞానము చేతనే ఋగ్వేదాదులు తెలియఁబడుచున్నది; కావున, విజ్ఞానమును బ్రహ్మముగా ఉపాసనచేయుము.

2. (ఫలము) విజ్ఞానము గలవిగను జ్ఞానముగలవిగను నుండులోకములను బొందుచున్నాఁడు. (తక్కినది పూర్వమువలె) విజ్ఞానముకంటెను శ్రేష్ఠమును నారదుఁ డడుగఁగా సనత్కుమారుం డిట్టు లనియె.

8. ఖండము.

1. విజ్ఞానముకంటెను బలము గొప్పది; (అనఁగా, అన్నపానాదుల నుపయోగించుటవలనను, మనస్సునందు గోచరమగునట్లొనర్చుటకుఁ దగిన శక్తి కలదియును జలఁ మనఁబడును.) విజ్ఞానవంతులు నూఱుగురున్నప్పటికిని బలవంతుఁ డొక్కఁడు ఎల్ల వారిని భయపెట్టుచున్నాఁడు. బలము గలవాఁడుమాత్రమే లేచునట్టి శక్తిగలవాఁడుగ నుండును; లేచి ఆచార్యునకును గురువునకును శుశ్రూషలొనర్చుచున్నాఁడు;అందువలన వారికి ప్రియుఁ డగుచున్నాఁడు; కావున వారిని ఆశ్రయించుచున్నాఁడు; వారి ఉపదేశమును వినుచున్నాఁడు; విని మననముచేయుచున్నాఁడు; తెలిసికొన్నదానికిఁ దగినట్లు కర్మముల నాచరించుచు, దానిఫలము ననుభవించుచున్నాఁడు; పృథ్వి మొదలగునవి బలముచేతనే యున్నవి; బలముచేతనే లోకమున్నది; కావున, బలమును బ్రహ్మముగా ఉపాసింపుము.

2. (ఫలము) పూర్వము చెప్పినట్లు; బలముకంటెను శ్రేష్ఠమైనదానినిఁ జెప్పవలయునని నారదుఁ డడుగఁగా, సనత్కుమారుఁ డిట్లనియె.

## 9. ఖండము.

1. బలముకంటెను అన్నము శ్రేష్ఠము. అన్నపానముచేతనే బలము కలుగుచున్నది. ఒకఁడు పదిదినములు భుజింపకున్నయెడల చచ్చిపోఁగలఁడు. ఒకవేళ జీవించియున్నప్పటికిని ద్రష్టగా (ఇతరులను జూచుటకు) శక్తిగలవాఁడై యుండఁడు; అన్నమును భుజించినచో శక్తిగలవాఁడై యుండును; కావున, అన్నమును ఉపాసింపుము.

2. (ఫలము) అన్నపానములుగల లోకములనుబొందుచున్నాఁడు. (తక్కినది పూర్వమువలె) అన్నముకంటెను గొప్పదేది ? యనఁగా సనత్కుమారుఁ డిట్లనియె.

## 10. ఖండము.

1. అన్నమును (పృథివిని)మించినది జలము. (అన్నమునకుఁ గారణమైనది జలముగాన జలము శ్రేష్ఠము.)మంచివర్షములు లేకపోయినప్పుడు క్షామము కలుగఁబోవుచున్నదని ప్రజలు పరితపించెదరు; మంచివర్షములు కురిసినపుడు అన్నమునకు దరిద్రము లేదని జనులు సంతసించెదరు; జలమే యాకసఁబడురూపములుగా పరిణమించియున్నవి; జలమే పృథ్వ్యాది మూర్తములై యున్నవి; కావున జలమును ఉపాసింపుము.

2. (ఫలము) సకలాభీష్టములనుబొంది సుఖముగా నుండును.(తక్కినది పూర్వమువలె) జలముకంటెను శ్రేష్ఠమెయ్యది యని నారదుఁ డడుగఁగా సనత్కుమారుఁ డిట్లనియె.

## 11. ఖండము.

1. జలముకంటెను తేజస్సు శ్రేష్ఠమైనది (జలమునకు తేజస్సు కారణమైనందువలన), తేజస్సు వాయువును చలింపనీయక, ఆకాశమునందు వ్యాపించి తపింపఁజేయుచున్నది; ఉక్కపుట్టించుచున్నది; వర్షము కురియఁబోవుచున్నదని చెప్పెదరు; మొదట తన్నెఱుకపఱచుకొని తర్వాత తేజో జలమును కలుగఁజేయుచున్నది; కావున మేఘములు పైకి పోవునవిగను, అడ్డముగాఁ బోవునవిగను మెఱుముతోఁ గూడి సంచరించుచున్నవి; కాఁబట్టి లోకులు మెఱయుచున్నది. ఉఱుముచున్నది అని చెప్పుచున్నారు. కావున తేజస్సును బ్రహ్మముగా ఉపాసింపుము.

2. (ఫలము) తేజస్విగ నుండును; ప్రకాశము గలదియును, చీకటి లేనిదియునుఅగులోకములనుబొందుచున్నాఁడు.(తక్కినదిమునుపటివలెఁ)

తేజస్సుకంటెను శ్రేష్ఠమైన దేది యని నారదుఁడడుగఁగా, సనత్కుమారుం డిట్లనియె.

(ఇచ్చట మఱికొందఱభిప్రాయము—తేజస్సుకంటెను వాయువు గొప్పదియనియును, వాయువు లేనియెడల తేజస్సునకు వృత్తిలేదనియును, తేజస్సునకు వాయువు కారణమనియును తెలియునది).

12. ఖండము.

1. (వాయుసహితమైన) తేజస్సుకంటెను ఆకాశము (బట్టబయలు) గొప్పది; (వాయువు మొదలగువానికి కారణమై యుండుటవలన), సూర్యుఁడు, చంద్రుఁడు, మెఱుము, నక్షత్రములు, అగ్ని ఈ తేజస్సులంతయు ఆకాశములో నణఁగియున్నవి; ఆకాశముచేత పిలుచుచున్నాఁడు, వినుచున్నాఁడు, బదులుచెప్పుచున్నాఁడు (అనఁగా బయలు లేనిచో శబ్దము వినఁబడదు). ఆటలాడుచున్నాఁడు; ఆటలాడకయున్నాఁడు; కలుగుచున్నది (బయలు లేనియెడల శిశువు ఎట్లు ఉత్పత్తియగును; అడ్డమున్నయెడల బయలుపడదు); మొలక బయలునందే మొలచుచున్నది; దిగువ మొలచుచున్నది. కాఁబట్టి ఆకాశమును బ్రహ్మముగా ఉపాసింపుము.

2. (ఫలము) ఆకాశవంతములును, ప్రకాశవంతములును, ఇఱుకు లేనివియును, విస్తీర్ణముగా వ్యాపించియుండునవియు నగు లోకములను బొందుచున్నాఁడు. (తక్కినది మునుపటివలె). ఇంతకంటె గొప్పదానినిఁ జెప్పవలయునని సనత్కుమారుని నారదుఁ డడుగఁగా, నిట్లనియె.

13. ఖండము.

1. ఆకాశముకంటెను స్మరణము గొప్పది; స్మరణము—తలంపు; తెలివి; అంతఃకరణధర్మము; పూర్వ మెఱింగినదానినిమఱవక యుండునట్టి జ్ఞానము; జ్ఞాపకము చేసికొను తెలివి (జ్ఞాపకశక్తి) స్మరణ మున్నయెడల గదా ఆకాశాదులు ప్రయోజనపడును; అనుభవింపనగును; స్మరణము లేనిచో ఉండునదియు లేనిదానితో సమానమే; స్మరణము లేనియెడల ఆకాశాదుల నెఱుంగుటకును సాధ్యముకాదు; ఎట్లన, ఒకచోట అనేకులు గుమిగూఁడి యుండఁగా, స్మరణము లేనియెడల ఒకరు చెప్పెడిదానిని మఱొకరు తెలిసికొనుటకు సాధ్యముకాదు; ఆలోచించుటయును, తెలిసి వర్తించుటకును సాధ్యముకాదు; స్మరణముచేతనే తనపుత్త్రాదులను పశ్వాదులను ఎఱుఁగుచున్నాఁడు. కావున, స్మరణమును బ్రహ్మముగా ఉపాసింపుము.

2. (ఫలము) పైనిచెప్పినట్లు, స్మరణముకంటె శ్రేష్ఠమైనదానిని చెప్పవలయు ననఁగా సనత్కుమారుఁ డిట్లనియె.

14. ఖండము.

1. స్మరణముకంటెను ఆశ గొప్పది; (లభింపనిదానియందలియిచ్ఛ) అంతఃకరణస్థమైన ఆశచేతనే స్మరింపవలసినదానిని స్మరించుచున్నాఁడు; అనఁగా ఫలేచ్ఛచేత వేదాధ్యయనమును చేయవలయు నని స్మరించు చున్నాఁడు; అధ్యయనముఁ జేసికర్మములను జేయుచున్నాఁడు; తర్వాత పుత్త్రాదులను బొందుటకుఁగోరుచున్నాఁడు. లోకాదులను ఇచ్ఛించు చున్నాఁడు; కావున, ఆశను బ్రహ్మముగా నుపాసింపుము.

5. (ఫలము) సకలాభీష్టములును సిద్ధించును; సకలప్రార్థనలును నెఱవేఱును. (తక్కినది మునుపటివలె). ఆశకంటె గొప్పదానిని నారదుఁ డడుగఁగా, సనత్కుమారుఁ డిట్లనియె.

15. ఖండము.

1. ఆశకంటెను ప్రాణము పెద్దది; (ప్రాణము-ముఖ్యప్రాణము; దేహమునందుండు ప్రజ్ఞాత్మ; దేనియందు అద్దమువలె పరమాత్మ ప్రతిబింబమై యుండునో అదియే ప్రాణము; ఎయ్యది, ఒకరాజుయొక్క సర్వాధికారపురుషునివలె, పరమాత్మకు సర్వాధికారియై యుండి కార్యములను చేయుచుండునో అది; ఎది నీడవలె పరమాత్మ ననుసరించియుండునో) అది ఒకబండిచక్రముయొక్కనాభియందలి అరము లెట్లు గ్రుచ్చఁబడి యున్నవో, అట్లుప్రాణమునందు ఆశ మొదలగునవి గ్రువ్వఁబడియున్నవి. ప్రాణము లేనియెడల ఆశ మొదలగునవి యెచ్చటనుండును; ప్రాణము స్వతంత్రము; తానై పోవునట్టిది; ప్రాణము తన్నే అర్పించునది (సమస్తమును తన్మయమైయున్నది) ప్రాణము తనకే అర్పించుకొనుచున్నది; తల్లి దండ్రి మొదలగువారును ప్రాణమే.

2. ఒకఁడు తనతండ్రి మొదలగువారిలో నెవ్వరినేని, కొంచెము అమర్యాదగా మాటలాడినయెడల, వానిని లోకులు నీవు చెడితివి? నీవు పితృహత్యాదులను జేయువాఁడవు?నిన్ను కాల్పవలయును,అనిచెప్పెదరు.

3. ప్రాణముపోయినతర్వాత తండ్రి మొదలగువారిని దహించు చున్నాఁడు. ఇదిక్రూరకర్మముగా నుండినప్పటికిని, 'వానిని పితృహత్య చేసినవాఁడు.' అని యెవ్వరును చెప్పుటలేదు.

4. సర్వమును ప్రాణమైయున్నది; ఎవఁడు ఇట్లు (ప్రాణమే అన్నిటి కంటె పెద్దది) చూచి, తలంచి, తెలిసి అనుభవించుచున్నఁడో వాఁడు అతివాది యగుచున్నాఁడు (తక్కువయైన ఆకాశాదులకంటె ప్రాణమే శ్రేష్ఠమని చెప్పుచున్నాఁడు) "నీవు అతివాదివి" అని ఇంకొకనిని అన్న యెడల, వాఁడు "ఔను, నేను అట్టివాఁడనే"అనుచున్నాఁడు. (కావున) వానిని నిందింపరాదు.

## 16. ఖండము.

(ఇట్లు సనత్కుమారుఁడు చెప్పఁగా, నారదుఁడు ప్రాణముకంటె శ్రేష్ఠమైనది కలదా? యని యడుగక, ప్రాణమే శ్రేష్ఠమని విశ్వసించి యుండినందున, సనత్కుమారుఁడు దయతో నిట్లనియె).

1. సనత్కుమారుఁడు—ప్రాణము దెలిసికొన్నవాఁడు అతివాది కానేరఁడు; నామాదుల నపేక్షించి వాఁడు అతివాది యగుచున్నాఁడు. అయినను, పరమార్థప్రకారము వాఁడు అతివాది కాఁడు; అయినను, అతివాది యెవఁడనఁగా ఎవఁడు సత్యమును (పరమార్థమును తెలిసికొని) చెప్పుచున్నాఁడో వాఁడే అతివాది (శ్రేష్ఠమైనవస్తువును చెప్పెడివాఁడు; బ్రహ్మజ్ఞాని; బ్రహ్మవేత్త; ఆత్మవేత్త).

నారదుఁడు—నన్ను ఆసత్యముతోఁగూడిన అతివాదిగా యుండు నట్లు అనుగ్రహింపుఁడు.

సనత్కుమారుఁడు—సత్యమును దెలిసికొనవలయును.

నారదుఁడు—సత్యమును తమవలనఁ దెలిసికొనఁగోరెదను.

## 17. ఖండము.

1. సనత్కుమారుఁడు—ఎప్పుడు సత్యవస్తువు నెఱుంగునో (ఈ ప్రపంచమంతయు అసత్యమనియు, సత్తుమాత్రమే సత్యమనియుఁ దెలిసి కొనుచున్నాఁడో) అప్పుడు సత్యమును చెప్పెడివాఁ డగుచున్నాఁడు. చక్కఁగాఁ దెలిసికొనక సత్యమును చెప్పఁడు. తెలిసికొనియే చెప్పును. కావున అట్టి విజ్ఞానమును దెలిసికొనవలయును.

నారదుఁడు—అట్టి విజ్ఞానమును తమవలనఁ దెలిసికొన నిచ్ఛ యించెదను,

## 18. ఖండము.

1. సనత్కుమారుఁడు (విజ్ఞానమునకు హేతువు మతి, మననము, చక్కఁగా నాలోచించుట) ఎప్పుడు విచారించుచున్నాఁడో అప్పుడు తెలిసికొనుచున్నాఁడు. (తక్కినది మునుపటివలె)

నారదుఁడు—మతిని వినఁగోరెదను.

## 19. ఖండము.

1. సనత్కుమారుఁడు—(మతికి హేతువు శ్రద్ధ; విశ్వాసము, ఆస్తికతయం దభిలాష) ఎప్పుడు శ్రద్ధగలుగునో అప్పుడు మననముఁ జేయుచున్నాఁడు. (తక్కినది పూర్వమువలె దీనికి తగినట్లు.)

నారదుఁడు—శ్రద్ధను తెలిసికొనఁగోరెదను.

## 20. ఖండము.

సనత్కుమారుఁడు—(శ్రద్ధకు హేతువు నిష్ఠ; బ్రహ్మజ్ఞానార్థమై గురుసేవాదులు) ఎప్పుడు నిష్ఠచేయుచున్నాఁడో, అప్పుడు (సత్సహవాసమువలన) శ్రద్ధ కలుగును. (తక్కినది మునుపటివలె)

నారదుఁడు—నిష్ఠనెఱుఁగ నభిలషించెదను.

## 21. ఖండము.

1. సనత్కుమారుఁడు—(నిష్ఠకు హేతువు కృతి; ఇంద్రియసంయమము, చిత్తైకాగ్రత, ఇంద్రియనిగ్రహము, ఇంద్రియనిగ్రహముచేతనే నిష్ఠయందు ప్రవేశించుటకు బుద్ధి కల్గును).ఎప్పుడు కృతిచేయుచున్నాఁడో అప్పుడు నిష్ఠచేయును. (తక్కినది ఎప్పటివలె)

నారదుఁడు—కృతినిఁ దెలిసికొనఁగోరెదను.

## 22. ఖండము.

1. సనత్కుమారుఁడు—(సుఖముకొఱకు కృతి చేయఁబడుచున్నది); (ఇఁకఁ జెప్పఁబోవు నిరతిశయమైన) సుఖమును బొందవలయునని యెప్పుడు కోరుచున్నాఁడో, అప్పుడు కృతిచేయును; ఏసుఖమును గోరక యెవ్వఁడు నేకార్యముఁ జేయఁడు. (తక్కినది పూర్వమువలె).

నారదుఁడు—సుఖమును బోధింపుఁడు.

## 23. ఖండము.

1. భూమ (గొప్పది, మహత్తు) అనునది సుఖము; (ఆనందము, బ్రహ్మము, ఆత్మ) అల్పమునందు సుఖముండదు, కావున సుఖమే గొప్పది;

కావున భూమ అనుదానిని తెలిసికొనవలయును.

నారదుఁడు—భూమ అనుదానిని ఎఱుంగఁగోరెదను.

24. ఖండము.

1. సనత్కుమారుఁడు—దేనియందు తనకంటె వేఱైనది కనంబడుట లేదో, వినంబడుట లేదో, (తలంపఁబడుట లేదో) తెలియంబడుట లేదో అదియే భూమ; దీనికంటె వేఱైనదంతయు అల్పము; భూమ నాశరహితమైనది; అల్పమునకు నాశముకలదు.

నారదుఁడు—ఆభూమ దేనియందు ప్రతిష్ఠితమై యున్నది?

సనత్కుమారుఁడు—దానిసొంతమైన మహిమయందు ప్రతిష్ఠితమై యున్నదని చెప్పఁగూడదా? యనఁగా, అట్లు చెప్పుటకును వీలులేదు.

2. లోకమునందు ఒకనికిఁ గలిగియుండు ఆవులు, గుఱ్ఱములు మొదలగుసంపదలయందు వానికి మహిమ కలదు; అట్లు భూమ ఈ విషయమునందు అన్యమునం దన్యము ప్రతిష్ఠితమై యున్నదని చెప్పఁదగదు. (ఇంకను వినుము).

25. ఖండము.

1. ఆభూమ దిగువను, మీఁదను, వెనుకను, ముందును, ప్రక్కలను నిండియున్నది. ఈకనంబడు ప్రపంచమంతయు అదియే. అహంకారముచేత ఉపదేశము (చెప్పఁబడుచున్నది). అదే నేను; నేనే దిగువను, మీఁదను, ఎల్లయెడల నున్నాను; అంతయు నేనుగా నున్నాను.

2. ఆత్మగా ఆదేశము (చెప్పఁబడుచున్నది). దిగువను, మీఁదను, ఎచ్చోటను ఆత్మయే నిండియున్నది. అంతయు ఆత్మయే; ఇట్లుచూచియు, తలంచియు, తెలిసికొనువాఁడు ఆత్మయందే క్రీడించుచుండును. అనఁగా ఆత్మ తనయందే యున్నదని ఆనంద మొందువాఁడు; ఆత్మయందే క్రీడించువాఁడు (బాహ్యసంబంధమునందును క్రీడించును; ఎచ్చటను ఆత్మ యున్నదని తెలిసికొని యుండుటవలన) ఆత్మానందుఁడు (వానిఆనందము ఆత్మమయమైయుండును). తానేరాజై యుండును; సకలలోకములయందును తనయిష్టప్రకారము వర్తించుచుండును; ఎవఁడు(ఆత్మను) వేఱువిధముగా నెఱుంగునో, (అట్టి అవిద్వాంసుఁడు) ఇతరరాజునకు లోఁబడి యుండును; నాశముగల లోకములను బొందును; సకలలోకములందును తనయిష్టప్రకారము సంచరించుటకు సాధ్యముకాదు.

## 26. ఖండము.

ఇట్లు తెలిసికొని చూచి తలంచి యుండువానికి ప్రాణాదులన్నియును ఆత్మస్వరూపముగ నుండును;అన్నియు ఆత్మయందుండియే కలిగినవని తోఁచును.

2. ఆత్మను ఇట్లు తెలిసికొనినవాఁడు మృత్యువును జూడఁడు; రోగము నొందఁడు; దుఃఖము నొందఁడు;సర్వమును ఆత్మయని చూచును; సమస్తముగను, సర్వప్రకారములుగను (ఆత్మ) తానే అగుచున్నాఁడు. సృష్టికిఁబూర్వము వాఁడే (బ్రహ్మమే) యుండినవాఁడు. అనఁగా ఆత్మ. తర్వాత మూఁడై, ఐదై, ఏడై, తొమ్మిదై, పదునొకండై, అనేకములైనాఁడు.

మొదట ఆహారము పరిశుద్ధమై యుండవలయును(శుద్ధమైన అన్నమును భుజింపవలయును, శుద్ధమైనవానినే చూడవలయును, శుద్ధమునే వినవలయును, శుద్ధమునే తాఁకవలయును). ఇట్లున్న అంతఃకరణశుద్ధి కల్గును; అందువలన స్మరణశక్తి కల్గును. అందువలన సంశయనివృత్తియును కల్గును.

ఇట్లు రాగద్వేషాదిరహితుఁడైన నారదునకు అజ్ఞాననివృత్తిని సనత్కుమారుఁడు బోధించెను. (నారదుఁడు బ్రహ్మజ్ఞానియైనాఁడని భావము). ఈసనత్కుమారుఁడు స్కందుఁ డనఁబడుచున్నాఁడు.

---

## అష్టమప్రపాఠకము.

### 1. ఖండము.

(పూర్వప్రపాఠకమునందు పరబ్రహ్మము దిగ్దేశకాలాదిభేదశూన్యమైనదనియును, ఏకవస్తువనియును జెప్పఁబడియున్నది. ఇపు డా బ్రహ్మమును దెలిసికొనుటకై మనస్సును ఒక్కచోట నిల్పవలయుననెడి యోగులయభిప్రాయము చెప్పఁబడుచున్నది).

1. ఈదేహమునందు బ్రహ్మపురమను (స్థానము కలదు.) (దానికి ఇంద్రియములు ప్రజలు; బ్రహ్మము రాజు). అల్పమైనదియును, తామరస పుష్పమువంటిదియునగు ఒకగృహము కలదు. దానియందు అల్పమైన ఆకాశము (బయలు) ఉన్నది. ఆబయలులోనుండు (బ్రహ్మమును) దానిని వెదుకవలయును; తెలిసికొనవలయును.

2. ఇట్లుపదేశించిన గురువును (సనత్కుమారునిఁ) జూచి—"ఇదేమి, లెక్కకు అందునట్టి యీశరీరమునందు, అల్పమైన ఒకగృహము, అందు అల్పమైన ఆకాశము, అందెట్లు మహత్తయిన పరబ్రహ్మముండును? దానిని వెదకుటకుఁగాని; తెలియుటకుఁగాని, ఎట్లు సాధ్యమగును?" అని శిష్యుఁడు (నారదుఁడు) అడుగఁగా, సనత్కుమారుఁ డిట్లనుచున్నాఁడు.

3. ఆహృదయాకాశము ఎట్టిదనఁగా, కొలఁతకు లోఁబడి కనంబడు భౌతికాకాశమువలె గొప్పదై యున్నది; ఇంకను విస్తారమైనది; ఎట్లన, స్వర్గము, భూమి, అగ్ని, వాయువు, సూర్యుఁడు, చంద్రుఁడు, మెఱుము, నక్షత్రములు, ఇవిగాక శరీరములు గలవియు, శరీరములు లేనివియు నగు సమస్తమును హృదయాకాశమునం దణఁగియున్నవి.

(శరీరమందలి హృదయపుండరీకాకాశమునందు, మహత్తైనట్టి భూతాదు లెట్లుండు ననఁగా, స్వచ్ఛమైన చిన్నదర్పణము, లేక, చిన్న పాత్రమునందుండు జలమునందే ప్రకారముగా ఈగొప్పదగు ఆకాశము, సూర్యచంద్రనక్షత్రాదులన్నియుఁ గనఁబడుచున్నవో, అట్లు స్వచ్ఛమైన అంతఃకరణము అల్పముగ (చిన్నదిగ) నున్నను, మున్ను చెప్పిన స్వర్గాదులన్నియు కనంబడును.)

4. ఈబ్రహ్మపురమైన దేహమునందు సకలభూతములును; సకల కామములు, తక్కినసర్వమును ఉన్నదనఁగా, ఈశరీరము ముదిమినొంది నశించినపుడు అందుండునవి యంతయు నశించునుగదా? అపు డేది మిగులునని యడుగఁగా గురువిట్లనిరి.

5, 6. ఈదేహమునకు ముదిమిగల్గినను బ్రహ్మమునకు ముదిమి లేదు. దేహమునకు దెబ్బ తాఁకినను బ్రహ్మమునకు దెబ్బ తాఁకుట లేదు; ఈ బ్రహ్మపురము సత్యము; దేహమును బ్రహ్మపురము సత్యము కాదు; సత్యమను బ్రహ్మపురమందు ఇచ్ఛలన్నియు నుంపఁబడియున్నవి. ఈబ్రహ్మమునకు (ఆత్మకు) పామరత్వమును, ముదిమియు, మరణమును, శోకమును, ఆఁకలిదప్పులును లేవు. సత్యకాముఁడు (కోరిన ప్రకారము జరుగును),సత్యసంకల్పుఁడు నగుబ్రహ్మమును దెలిసికొనవలయును. ఇట్టిబ్రహ్మమును దెలియకపోయినచో నేమిదోష మనఁగా, ఈలోకములో ప్రజలు తమకంటె వేఱైన ఒకస్వామి(రాజు)ఉన్నాఁడని తలంచికొని(అనఁగాతానే బ్రహ్మమని తెలిసికొనక), ఆస్వామి యాజ్ఞాప్రకారము వర్తింపవలయునని

యుంచియున్నారో; అట్టివారు ఆదేశమును ఆస్థలమునుమాత్రము పొందుదురుగాని, (బ్రహ్మవేత్తవలె) తాము కోరినప్రకారము స్వేచ్ఛగా స్వతంత్రముగా సమస్తమును పొందరు. మఱియు, ఈలోకములో నిట్టి వారియొక్క సేవాదికర్మముచే పొందఁబడినఫలమును, పరాధీనోపయోగ ములును నశించును. కావున, ఎవఁడు తన ఆత్మలక్షణ మిట్టిదనియును, సత్యసంకల్పములును ఇచ్ఛలును ఆత్మస్థము లనియును దెలియక స్వశరీర మును వదలిపోయినమీఁద వాఁడు అకామచరుఁడై, అనఁగా, అస్వతం త్రుఁడై (ఇష్టానుసారమైనట్లు నడుచుకొనుటకు సామర్థ్యము లేనివాఁడై) యుండును. (పరమాత్మను) తెలిసికొనినవాఁడు కామచరుఁడై యుండును. (కనుక ఆత్మవిచారణ చేయవలయును.)

2. ఖండము.

1. ఇట్లు దహరాకాశమునందుండు బ్రహ్మము నెఱింగినవాఁడు పితృలోకసుఖమును (ఒకనికి పుత్త్రుఁడై పుట్టి, అందువలనఁ గల్గుసుఖమును) కోరినయెడల, అట్టిసుఖమును కోరినంతనే పొందునట్టి మహిమగలవాఁ డగును.

2-9. అట్లే, మాతృ, పితృ, భ్రాతృ, శ్వశ్రు, స్నేహ, గంధమాల్య, అన్నపాన, గీతవాదిత్ర, స్త్రీలోకసుఖములను కోరినయెడల, కోరినప్రకా రము పొందఁగలమహిమను జెందుచున్నాఁడు.

10. మఱియు నేయేలోకములనుపొందవలయునని కోరుచున్నాఁ డో, ఇంక నేయేకోర్కులను అభిలషించుచున్నాఁడో అంతయు సంకల్ప మాత్రముచేతనే పొందగల మహిమగలవాఁ డగును.

3. ఖండము.

1. ఈ సత్యమైనకామములు తనఆత్మయందే లభించునవిగా నుండినప్పటికిని అవి అసత్యముచేఁ గప్పఁబడియున్నవి. అనృతమే ఆచ్ఛా దనము. (మఱుఁగు, కప్పు) (అనృతమనఁగా బాహ్యమందలిస్త్రీ, మొద లగు ఇచ్ఛలు, ఆయిచ్ఛలకై కావింపఁబడు వర్తనములు, ఇవియే మిథ్య, అజ్ఞానము, అవిద్య.) ఈ అజ్ఞానమే సత్యకామములను మఱఁగించుకొని యున్నది. (అజ్ఞానముచేత ఇష్టప్రకారము కోరినది లభింపదనుట. యెట్ల నఁగా) అవిద్వాంసుఁడు (బ్రహ్మము నెఱుఁగనివాఁడు) మరణమునొందిన తనమిత్త్రులను ఈలోకమునందు మరలఁ జూడవలయునని తలంచినయెడల

సాధ్యము కాదుగదా?(బ్రహ్మజ్ఞానియైనవాఁడు హృదయాకాశమునందు అందఱను జూడఁగలఁడు).

2. ఈలోకమునందు ఒకఁడు బ్రదికియుండు పుత్త్రాదులను, గతించినవారు మరల రావలయుననియును, ఇంకను వలయువస్తువులను గోరినయెడల వానిని పొందకయున్నాఁడు.హృదయాకాశమునందు సర్వమును అణఁగియున్నది. అయినను అనృతముచేత మఱఁగింపఁబడియున్నది. ఎట్లన, భూమిలోపలనుండుస్వర్ణనిక్షేపమును తెలిసికొననివాఁడు దానిమీఁదనే అడుగిడి సంచరించుచుండియు నెట్లు తెలిసికొనఁడో, అట్లు ప్రజలు ప్రతిదినమును సుషుప్తికాలమునందు బ్రహ్మము తనయందే లయమైనప్పటికిని అజ్ఞానమువలన ఆబ్రహ్మలోకమును తెలిసికొనకయున్నారు.

3. అట్టిఆత్మ హృదయమునందే యున్నది; దానికి ఇది (ఇఁక చెప్పఁబడునది) శబ్దార్థము; హృది-అయమ్, హృదయమ్, (ఈ ఆత్మ) ఇట్లు తెలిసికొన్నవాఁడు ప్రతిదినమును స్వర్గమును (బ్రహ్మమును) పొందుచున్నాఁడు.

4. ఇ ట్లెఱింగినవాఁడు సంప్రసాదుఁడనఁబడుచున్నాఁడు. మంచి ప్రసాదమును (బ్రహ్మప్రసాదమును, లేక బ్రహ్మానుగ్రహమును) పొందినవాఁడు శరీరాత్మభావము మొదలగు అజ్ఞానమునుండి తొలఁగి పరంజ్యోతిస్స్వరూపమును ఆశ్రయించి స్వరూపముతో నైక్యమొందుచున్నాఁడు. కావున, జీవునకును ఆత్మయనిపేరు (జీవాత్మ). ఆయాత్మ అమృతమై, అభయమై, బ్రహ్మమై యున్నది. ఈబ్రహ్మమునకు సత్యమనిపేరు.

5. "సత్యమ్," అనునీమూఁడక్షరములకును అర్థము చెప్పఁబడుచున్నది. స-అమృతము; తి-మర్త్యము; యమ్-ఆరెంటిని చేర్చునది, ఏకముగాఁ జేయునది, వశముఁ జేయునది. (స-జలము, శక్తి; త-అగ్ని, శివుఁడు; యమ్-వాయువు, ఐక్యము, ఆనందము). ఇట్లు తెలిసికొనినవాఁడు ప్రతిదినమును స్వర్గలోకమును (ఆత్మను) పొందుచున్నాఁడు.

4. ఖండము.

1, 2. అట్టి ఆత్మ సేతువు (గట్టువలె, జలమును బయటికిపోనీయక అడ్డగించికొనియున్నది). మఱియు విధృతిగానున్నది. (సర్వమును భరించికొనియున్నది. (వర్ణాశ్రమధర్మములను తప్పిపోనీయక (కట్టుబాటుగా నుంచికొనియుండుటవలన (దానికి సేతువు అనిపేరు).ఈసేతువనెడి ఆత్మను

పగలును రాత్రియు దాటుటలేదు. (కాలపరిచ్ఛేదములేనిది). దానికి జర, మృత్యువు, శోకము, సుకృతము, దుష్కృతము, అనునవి లేవు. సకల పాపములును నశించుచున్నవి. కావున, బ్రహ్మలోకమును ఆత్మ (హృదయాకాశఆత్మ, సంప్రసాదమును బొందినజీవుఁడు) పాపరములేనివాఁడు. కాఁబట్టి, ఈసేతువును దాఁటినచో (తెలిసికొనినయెడల) అంధుఁడు అనంధుఁడగును. "శరీర ముండునప్పుడే అజ్ఞానము (అంధత్వము) నొందియున్నవాఁడు, జ్ఞానమును (అనంధత్వమును) బొందును." శరీర ముండునప్పుడు తత్కార్యములచే దుఃఖమొందినవాఁడు, శరీరపాతానంతరము సుఖమొందును. సంకటము నొందినవాఁడు సంకటము లేనివాఁడగుచున్నాఁడు. ఈసేతువును దాఁటినవానికి రాత్రి పగలగుచున్నది. (అనఁగా ప్రకాశమును గాంచును.) ఎల్లప్పుడును ప్రకాశముగలవాఁడై ఆత్మైక్యము నొందును.

3. ఎవఁడీ బ్రహ్మలోకమును (ఆత్మను) బ్రహ్మచర్యమువలనఁ బొందుచున్నాఁడో వాఁడు సకలలోకములందును కామచరుఁడై (స్వతంత్రముతో) సంచరించును. (బ్రహ్మచర్యము లేనివాఁడు కామచరుఁడు గాఁడు; వాఁడు అకామచరుఁడు; అస్వతంత్రుఁడు. బ్రహ్మచర్య మనఁగా, స్త్రీవిషయాభిలాష లేకుండుట. బ్రహ్మచర్యముచేతనే బ్రహ్మలోకముసిద్ధించును. కావున, అవశ్యము బ్రహ్మచర్యము కావలయును. బ్రహ్మము నెఱింగిన వానికిని బ్రహ్మచర్యము అవశ్యము వలయును).

5. ఖండము.

1. (జ్ఞానసాధనమైన బ్రహ్మచర్యము యజ్ఞశబ్దార్థముచే స్తుతింపఁబడుచున్నది).

యజ్ఞమనునదియు బ్రహ్మచర్యమే; జ్ఞాని బ్రహ్మచర్యమువలన యజ్ఞఫలమును బొందుచున్నాఁడు. ఇష్టమును (దేవపూజాదులును) బ్రహ్మచర్యమే; ఆబ్రహ్మచర్యముచే ఆత్మను బొందుచున్నాఁడు.

2. సత్త్రాయణ మనునదియు బ్రహ్మచర్యమే. (ఆత్మరక్షణము, అనఁగా, వేదోక్తమైనదియు బహుయజమానులు గలదియునగు నొక యాగము) బ్రహ్మచర్యముచేత సత్తైన ఆత్మయొక్కరక్షణమును బొందుచున్నాఁడు. మౌనమనునదియు బ్రహ్మచర్యమే;(శాస్త్రమువలనను,గురువు

వలనను దెలిసికొని తలంచుచు; మౌనముగ నుండుట) ఈ బ్రహ్మచర్యము చేత ఆత్మను దెలిసికొని తలంచుచున్నాఁడు.

3. అనాశకాయన మనునదియు బ్రహ్మచర్యమే; (ఉపవాసాదులు). ఈ బ్రహ్మచర్యముచేత ఏఆత్మ పొందఁబడుచున్నదో, ఆయాత్మకు నాశము లేదు. (జననమరణములు లేవు) అరణ్యాయన మనునదియు బ్రహ్మచర్యమే. (అరణ్యవాసము మొదలగునవి). (ఇచ్చట బ్రహ్మలోకము నొందుటకై యొకరుచి చూపఁబడుచున్నది.) బ్రహ్మలోకమునందు 'అర' అనియు, 'ణ్య' అనియు రెండుసముద్రములు గలవు; మూఁడవదగు స్వర్గమును బ్రహ్మలోకమునందు అన్నమయమైన ఐరంమదీయ మనుసరస్సున్నది; అచ్చట (ఆ సరస్తీరమునందు) సోమసవన మనుఅశ్వత్థవృక్షమున్నది;(ఎవరివలనను జయించుటకు సాధ్యముకాని) అపరాజితయనునగరమున్నది; ఆ బ్రహ్మలోకము హిరణ్మయమై యున్నది. దానికి పరమాత్మ ప్రభువు.

4. పైనిచెప్పఁబడిన రెండుసముద్రములను (అమృతమును) బ్రహ్మచర్యముచేత బ్రహ్మలోకమునందు పొందుచున్నాఁడు. అట్టి బ్రహ్మచారులకు బ్రహ్మలోకము సిద్ధించును. ఇట్లెఱింగినవాఁడు సకలలోకములందును కామచరుఁడై యుండును.

## 6. ఖండము.

1. (హృదయాకాశబ్రహ్మోపాసకునకుసుషుమ్నానాడీమార్గముగా గతికలుగునని చెప్పఁబడుచున్నది). హృదయపుండరీకమునుండి పలు తెఱంగులగు వర్ణముకలసూక్ష్మరసముతోనిండి వ్యాపించునట్టినాడులనేకములుగలవు; అవి తెలుపు, నలుపు, పసుపు, ఎఱుపురంగుల రసములతోను నిండియున్నవి. (పిత్తముతోఁ గఫము కొంచెముగఁ జేరిన పింగళవర్ణము, పిత్తముతో వాయువు అధికముగాఁజేరిన నీలము,పిత్తముతో కఫము సమముగాఁజేరిన పీతము, పిత్తముతో రక్తము అధికముగాఁజేరిన లోహితము). ఈ ఆదిత్యుఁడు పింగళ, శుక్ల, నీల, పీత, లోహితవర్ణములు గలవాఁడు. (సూర్యునకీనాడులతోడిసంబంధము చెప్పఁబడుచున్నది.)

2. ఒకవిస్తారమైన రాజమార్గము, ఒకవైపున సమీపమందలి గ్రామమునకును, వేఱొకవైపున దూరమునందలి గ్రామమునకును, ఎట్లు రెండుగ్రామములకును; మార్గమైయున్నదో,అట్లు విస్తారములైన సూర్యకిరణములు, ఆ ఆదిత్యలోకమును, ఈపురుషలోకమునుగూర్చి పోవు

చున్నవి; ఆదిత్యునియందుండి బయలుదేరి ఈ పురుషనాడులందుఁ జొచ్చుచున్నవి; మరల అవి ఈనాడులలోనుండి బయలువెడలి, వ్యాపించి, ఆదిత్యునిఁ జేరుచున్నవి.

3. ఈపురుషుఁడు సుషుప్తిదశయందు కరణము లణఁగినవాఁడై బాహ్యవిషయములవలనఁ గలిగిన కాలుష్యములేనివాఁడై, ఎప్పుడు స్వప్నమును అనుభవింపకయున్నాఁడో, అప్పుడు పైనిజెప్పిన నాడుల మార్గముగ హృదయకమలమును జేరుచున్నాఁడు. అప్పుడు వానిని పాపము తాఁకుటలేదు; తేజస్సంపన్నుఁ డగుచున్నాఁడు.

4. ఒకపురుషుఁడు అబలమును (మరణసమయమును) పొందిన తర్వాత, వానిచుట్టును వానిజ్ఞాతులు పరివేష్టించి 'నన్నెఱుంగుదువా?' అనియడిగెదరు.శరీరమునం దాత్మయుండునంతవఱకునుఎఱుకయుండును.

5. తర్వాత, ఈశరీరమునుండి (ఆత్మ) లేచి, సూర్యకిరణములతోఁ జేరి మీఁది కేఁగుచున్నాఁడు. అవిద్వాంసుఁడు వానికిఁదగిన లోకములకుఁ బోవుచున్నాఁడు. విద్వాంసుఁడు, ఓంకారముచేత ఆత్మ ధ్యానమును జేసికొని పైకిఁ బోవుచున్నాఁడు. మనస్సు నశించినమీఁద ఆదిత్యుని పొందుచున్నాఁడు. ఆ ఆదిత్యుఁడే బ్రహ్మలోకమునకు ద్వారము; విద్వాంసులు పొందునట్టి స్థానము; అవిద్వాంసు లచ్చటికిఁ బోవుటకు సాధ్యముకాదు.

6. దీనినిగుఱించి మంత్రము కలదు; అనఁగా, "హృదయమునందు నూటఒక్కనాడులున్నవి. వానిలో నొక్కనాడి మూర్ధమును పొందుచున్నది.(అదేసుషుమ్నానాడి)తద్ద్వారముగ(విద్వాంసుఁడు,జ్ఞాని) మీఁదికిఁబోయి అమృతత్వమును బొందుచున్నాఁడు. అవి అడ్డముగను పొడవుగను నున్నవి; అవి ఉత్క్రమణముకొఱకుమాత్రమున్నవి."

7. ఖండము.

1. ఆత్మ పాపరహితమైనది; జరలేనిది; మరణములేనిది; శోకములేనిది; ఆఁకలిదప్పులులేనిది; సత్యకామమును సత్యసంకల్పమును గలది; ఇట్టిఆత్మను వెదకి తెలిసికొనవలయును. ఇట్లు తెలిసికొన్నవాఁడు సకలకామములను సకలలోకములను బొందుచున్నాఁడని ప్రజాపతి చెప్పెను.

2. ఈ ప్రజాపతివచనమును దేవతలును అసురులును అనుపూర్వ్యముగను వినిరి. ఏయాత్మను కనుఁగొన్నచో సకలలోకములును సకలకామ

ములును లభించునో, ఆయాత్మను వెదకవలయునని వారివారిసమూహ ములో నిశ్చయించికొని, దేవరాజగు ఇంద్రుడును, అసురరాజగు విరోచనుడును ఒకరికొకరు తెలియక, సమిత్పాణులై ప్రజాపతికడకు బోయిరి.

3. అచ్చట ముప్పదిరెండేండ్లు బ్రహ్మచర్యమును (గురుశుశ్రూషను) అనుష్ఠించుచు వసించిరి.

ప్రజాపతి—మీరిరువురు తెగలవారు నిచ్చట నేలయున్నారు? వారిరు తెగలవారును—పాపరహితమై నాశరహితమైనది ఆత్మయని తాము చెప్పినట్లు పెద్దలుచెప్పుచున్నారు; ఆయాత్మను తెలిసికొనుటకై కాచియున్నారము.

4. ప్రజాపతి—నేత్రమునం దేపురుషుడు గనంబడుచున్నాడో (నేత్రమునందుండి చూచుటకు శక్తి నిచ్చుచున్నాడో, ఏది చూచుచున్నదో) ఆపురుషుడు ఆత్మ; అదియే అమృతవస్తువు; అభయవస్తువు; బ్రహ్మము అని చెప్పబడునది.

(దీనిని ఛాయాపురుషుడు, ప్రతిబింబపురుషుడు, జీవుడు, అని యిరువురును తలంచికొనిరి).

ఇరువురును—జలమునందును ఆత్మప్రతిబింబము కనంబడుచున్నది; తామొకటి చెప్పితిరి (నేత్రమునందు పురుషుని); ఈ రెంటిలో ఆత్మ యేది? అన్నిటియందున కనంబడునది ఒకటియా? ప్రజాపతి—అన్నిటియందును కనంబడునది ఒకటియే. ఆయాత్మ (ఆత్మ అన్నిటియందున్నదని యభిప్రాయము.)

8. ఖండము.

1. జలముగల ఒకపాత్రమునందు ఆత్మను (మీశరీరములను) జూచికొనుడు; ఏదియు తెలియనిచో నన్ను అడుగుడు.

ఆయిరువురును ఆలాగే చూచిరి.

ప్రజాపతి—దేనిని చూచితిరి ?

ఆయిరువ్వురు—నఖకచపర్యంతము సర్వావయవములతో, గూడిన దేహమును (ఆత్మను) చూచితిమి?

2, 3. క్షౌరముచేసికొని మంచివస్త్రాభరణములను ధరించి జలపాత్రమునందు జూడుడు.

ఆయిరువ్వురు—చూచితిమి.

ప్రజాపతి—ఇప్పుడు దేనిని చూచితిరి?

ఇరువురు—పూర్వము అలంకారములేదు; ఇప్పుడు అలంకారముతోఁ గూడిన దేహమును జూచితిమి.

ప్రజాపతి—అదియే ఆత్మ, అమృతము, అభయము, బ్రహ్మము.

ఇట్లు ఇరువురును విని శాంతచిత్తులై పోయిరి.

4. ఇట్లు పోవుచున్నవారిని ప్రజాపతి పిలిచి యిట్లనియె—మీరు ఆత్మను తెలిసికొనక,దానిని పొందకయే పోవుచున్నారు. దేహము ఆత్మయని తలంచినచో దేవతలైనను,అసురులైనను అవమానమునొందుదురు.

ఇట్లు ప్రజాపతి చెప్పియు విరోచనుండు శాంతుఁడై అసురులకడకుం జనెను. దేహమే ఆత్మయనియు, అదియే పూజనీయమైనదనియు, పరిచర్యకు పాత్రమైనదనియు, అట్లు కావించిన ఇహపరలోకములు రెండును సిద్ధించుననియు అసురులకుఁ జెప్పెను.

5. కావున, అసురులఅభిప్రాయము విమర్శలేనిదియును, శ్రద్ధలేనిదియును, యాగాదికర్మను లేనిదియునైనది; జీవుఁడులేని శరీరమునకు అలంకారాదులనుజేసి, కొనియాడుచున్నారు; ఇందువలన ఆలోకమును జయింపవచ్చునని తలంచెదరు.

## 9. ఖండము.

ఇంద్రుఁడు సందేహ (భయ) మొంది దేవతలయొద్దకు పోలేదు. జలపాత్రమునందు శరీరాలంకారమునకుఁ దగినట్టి ప్రతిబింబము కనబడుచున్నది; మొండి అవయవము లుండినచో మొండి అవయములే కనఁబడుచుండును. శరీరమునకు నాశము కలదు కదా? నాశమగు పిదప భోగ్యమేదియుఁ గనఁబడకున్నదే! అనిసంశయచిత్తుఁ డయినాఁడు.

2. మరల సమిత్పాణియై ప్రజాపతికడకు వచ్చినాఁడు.

ప్రజాపతి—నీవు శాంతహృదయుఁడవై, విరోచనునితోఁ గూడఁ బోయినాఁడవుకదా? మరల నేలవచ్చితివి? దానికి (మున్ను చెప్పినట్లు) తనకుఁగల సంశయములను జెప్పినాఁడు.

3. ఓయింద్రుఁడా! ఛాయాత్మజ్ఞానము (కూడదు.) ప్రయోజనకారి కాదు; నేను జక్కఁగా ఉపదేశించెదను. నీవు ఇంకను ముప్పదిరెండేండ్లు బ్రహ్మచర్యవ్రతము నవలంబింపుమనియె. అట్లే ముప్పదిరెండేండ్లుండెను. తర్వాత ప్రజాపతి యిట్లనియె.

## 10. ఖండము.

1. 2. ప్రజాపతి—ఏయాత్మ స్వప్నదశయందు మహిమనుబొంది, సకలభోగముల ననుభవించుచున్నాఁడో వాఁడే ఆత్మ; అమృతము; అభయము; బ్రహ్మము.

ఇంద్రుం డీమాటను విని శాంతహృదయుఁడై పోయెను. దేవతల యొద్దకుఁబోక, తనలోఁ దా నాలోచించి చూచి భయమొందెను. ఏలయన, ఈశరీరము అంగవిహీనమైనప్పటికిని స్వప్నాత్మ అంగవిహీన మైనది కాదు. శరీరమునకుంబోలె నీయాత్మకు దోషములేదు; దెబ్బ తాఁకుటలేదు; అంగహీనమువలన బాధింపఁబడుటయు లేదు; అట్లుండియు కొందఱచే కొట్టఁబడినట్లును, తఱుమునట్లును; ఏడ్చునట్లును కనంబడు చున్నది. (అట్లుండఁగా దానికి అమృతత్వమును అభయత్వమును ఎట్లు సిద్ధించును?) ఈవిషయమునందును భోగ్యమును లేదు (అనఁగా స్వప్నాత్మ విషయమునందును దోషమున్నది).

3, 4. (ఈసంశయమును దీర్చుకొనుటకై) మరల దేవేంద్రుఁడు సమిత్పాణియై ప్రజాపతికడకు వచ్చెను.

ప్రజాపతి—ఇంద్రునింజూచి మరల వచ్చినకారణమేమి?

ఇంద్రుఁడు—తనకుంగల సంశయమును జెప్పెను.

ప్రజాపతి—ఇంకను నీయందు దోషమున్నది; కావున ఇంకను ముప్పదిరెండేండ్లు బ్రహ్మచర్యవ్రతస్థుఁడవై యుండుము.

ఇంద్రుఁ డట్లేయుండెను; మరల ప్రజాపతి యిట్లనియె.

## 11. ఖండము.

1. ప్రజాపతి—ఏయాత్మ సుషుప్తిదశయందు, సమస్తకరణము లును లయమొంది, బాహ్యవిషయములచే బాధింపఁబడక సంప్రసన్నమై యుండునో, స్వప్నవిషయములను అనుభవించుటలేదో అదియే ఆత్మ; అభయము; అమృతము; బ్రహ్మము.

దీనిని విని యింద్రుఁడు శాంతహృదయుఁడై పోయెను; మరల దేవ తలకడకుఁబోక ఆలోచించి చూడఁగా సంశయముకల్గెను. ఏమన, ఈ సుప్తాత్మ, సుషుప్తికాలమునందు తా నిట్టివాఁడనిగాని, ఈభూతము లిట్టి వనిగాని తెలిసికొనుటలేదు; నాశమొందిన యట్లున్నది. (తెలివియే లేదు;)

తెలివియున్నఁగదా సద్భావముండును? అట్లుండఁగా దీనిని అమృతమని యెట్లు చెప్పవచ్చును?)

2. ఇట్లు సంశయచిత్తుఁడైన ఇంద్రుఁడు మరల సమిత్పాణియై ప్రజాపతికడకుం జనెను.

ప్రజాపతి—ఏల మరలివచ్చితివి ?

ఇంద్రుఁడు—తనసంశయమును జెప్పెను.

3. ప్రజాపతి—జాగ్రత్స్వప్నసుషుప్తిదశలయందలి ఆత్మ ఆత్మ కాదు; వీని నతిక్రమించినవస్తువు కలదు; అదే ఆత్మ; దానిం జెప్పెదను. అయినను, ఇంకను నీయందు కొంచెము దోషమున్నది; కావున, ఐదేండ్లు బ్రహ్మచర్యము నవలంబించియుండు మనెను. ఇట్లు ఇంద్రుఁడు నూటఒక్కసంవత్సరములు బ్రహ్మచారియై యుండెను. కాఁబట్టియే ఇంద్రుఁడు నూటఒక్కసంవత్సరములు (గురుశుశ్రూషచేయుచు) బ్రహ్మచర్యోపాసన చేయుచుండినాఁడని పెద్దలు చెప్పెదరు. తర్వాత ప్రజాపతి యిట్లనియె.

## 12. ఖండము.

1. ప్రజాపతి—ఈశరీరము నశించుస్వభావముగలది; మృత్యువుచే పట్టువడినట్టిది; (మరణము సిద్ధము; ఏక్షణమున మరణము సంభవించునోయని తలంపవలయును.) ఈశరీరము, అశరీరమైన ఆత్మకు (పరబ్రహ్మమునకు) వాసస్థలము. (ఎపుడు ఆవస్తువు శరీరమునందు ప్రవేశించునో అపుడు దానికి జీవుఁ డనిపేరు; సశరీరి యనియుం జెప్పఁబడును.) సశరీరుఁడు ప్రియాప్రియములచేత (పుణ్యపాపములకుఁ గారణములైన ధర్మాధర్మములు, బాహ్యవిషయసంయోగవియోగములు) స్పృశింపఁబడుచున్నాఁడు. శరీరముతోనుండు సద్వస్తువును స్పృశించియుండెడి ప్రియాప్రియములకు నష్టములేదు. అశరీరియైన సద్వస్తువును ప్రియాప్రియములు స్పృశింపవు.

2, 3. వాయువు, అభ్రము (తెల్లనిమబ్బు), మెఱుము, జలమేఘము (కాఱుమబ్బు). శరీరములేనివై ఆకాశమునం దణఁగి ఆజ్ఞకు (కట్టుబాటునకు) లోఁబడి నిలిచియున్నవి. ఇవి (వర్షాకాలమునందు) ఆకాశమునుండి లేచి, పరంజ్యోతినిఁబొంది (సూర్యప్రకాశముచేత తపింపఁబడి) స్వస్వరూపముతో కలుగుచున్నవి (అనఁగా, శీతవాతము, చలనముగు విద్యుల్లతారూపము, ఉఱుము, జలమేఘము మొదలగునవి). ఇట్లు

ఈసంప్రసాదుఁడైనఆత్మ (ఎండకాలమైన అవిద్యాకాలమునందు కట్టుపడి యున్నట్టివాఁడు) ఈశరీరమునుండి (వర్షాకాలమైన ఆత్మజ్ఞానకాలము వచ్చినవెంటనే) లేచి పరంజ్యోతినిఁ బొంది (ఆత్మ ప్రకాశమును దర్శించి) తన సొంతరూపముతో అశరీరసచ్చిదానందస్వరూపుఁ డగుచున్నాఁడు. ఇతఁడే ఉత్తమపురుషుఁడు;ఎచ్చోటికినిఁబోఁగలఁడు; భక్షించుచున్నాఁడు (తలంచినంతమాత్రమునవలసినదానినిఅనుభవించు వాఁడగుచున్నాఁడు). క్రీడించుచున్నాఁడు (సంకల్పమాత్రముచేత బాహ్యలోకవస్తువులతోఁ జేరి క్రీడించుచున్నాఁడు). స్త్రీ, వాహనము, జ్ఞాతులు అనువీనితోఁగూడి తలంచినంతమాత్రమున రమించు (సంతోషించు) చున్నాఁడు. పునర్జన్మమును, ఈశరీరమును తలంచుటలేదు (అనఁగా, జననమరణముల కెడ మీఁయకచేసికొనుచున్నాఁడు). అట్టి ఈఆత్మ రథమునందు గుఱ్ఱము కట్టు వడియుండునట్లు ఈశరీరమునందు (నడపుటకై)ప్రాణముగా కట్టఁబడి యున్నాఁడు.

4. నేత్రమండలి కృష్ణతారకచేత ఉపలక్షితమైన ఆకాశమందు (చిన్నబయలులో) వసించి, ఏవస్తువు చక్షుస్సను పేరొంది చూచునో, అదిచాక్షుషపురుషుఁడు (చక్షుస్సంబంధాత్మ). అనఁగా ఆయాత్మ అచ్చట లేనియెడల చక్షుస్సునకు చూపు కనఁబడదు. అయినను చూచుటకొఱకు చక్షురింద్రియ మున్నది.

దీనిని వాసనచూచుచున్నానని యేది తెలియుచున్నదో అది ఆత్మ; వాసనచూచునిమిత్తమై ఘ్రాణేంద్రియము.

దీనిని చెప్పఁబోవుచున్నానని యెది యెఱుఁగుచున్నదో అది ఆత్మ; చెప్పుటకై వాగింద్రియము.

దీనిని వినఁబోవుచున్నానని యెయ్యది తెలియుచున్నదో అది ఆత్మ; వినుటకై శ్రోత్రేంద్రియము.

5, 6. దీనిని తలంచెదనని యేది యెఱుంగుచున్నదో అది ఆత్మ; మనస్సు దైవచక్షుస్సు (శ్రేష్ఠమైనయింద్రియము); ఈమనస్సుచేత బ్రహ్మ లోకమునందలి సకలకామములను (సంకల్పమాత్రముచేఁ గలుగుభోగ ములను) అనుభవించుచు సంతోషించుచున్నాఁడు.

ఇట్టిఆత్మను ఉపాసించి దేవతలందఱును, సకలలోకములను సకల కామములను బొందిరి; అట్లే మనుష్యులును పొందుదురు. ఎవఁ డిట్లే

యాత్మను దెలిసికొనునో వాఁడు (దేవతలవలె) సకలలోకములను సకల కామములను బొందునని ప్రజాపతిచెప్పెను.

13. ఖండము.

1. శ్యామముచేత (మిక్కిలినల్లనివర్ణముచేత,సులువుగాఁదెలియుటకు సాధ్యముకాని హృదయబ్రహ్మజ్ఞానమువలన) చపలమును (పలువర్ణములను, చపలబ్రహ్మమును, ప్రకృతిస్వరూపాత్మను, బ్రహ్మమును)పొందుచున్నాను (తెలియుచున్నాను). చపలముచేత(నామరూపాత్మచేత, బ్రహ్మలోకముచేత)శ్యామము(హృదయబ్రహ్మభావము)ను పొందుచున్నాఁడను ఎట్లన, ఒకగుఱ్ఱము శరీరమునుదులుపుకొని తనశరీరమునందలి శ్రమము, దుమ్ము మొదలగువానిని పోఁగొట్టుకొనునట్లు, పాపమును పోఁగొట్టుకొని, రాహువుముఖమునుండి చంద్రుఁడు విడివడునట్లు, శరీరమును విడిచి, కృతకృత్యుఁడై, నిత్యమైన బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు. (ఈమంత్రము బ్రహ్మజ్ఞానుల అనుభవముకొఱ కేర్పడినది.)

14. ఖండము.

1. అట్టిబ్రహ్మమునకు ఆకాశమనిపేరు; (సూక్ష్మమై సర్వగతమైనందున) అది నామరూపములను వహించుచున్నది; దానిలో నామరూపము లణఁగియున్నవి; అదే బ్రహ్మము, అమృతము, ఆత్మ.

"(ఇట్లు తెలిసికొని) బ్రహ్మలోకమునుబొందెదను; యశస్సయ్యెదను; బ్రహ్మక్షత్రియవైశ్యులయశస్సయ్యెదను; అట్టియశస్సును పొందుటకుఁ గోరెదను; అట్టినేను యశస్సులకెల్ల యశస్సయియున్నాను. తెల్లగను, భక్షింపఁదగినదిగను (తేజస్సు, బలము, వీర్యము, విజ్ఞానము, ధర్మము, వీనిని నాశముచేయఁదగినదియును) అగుబిందువును (శుక్లశోణితములను) నేను పొందకయుండవలయును" (ఇదియు అనుభవముకొఱ కేర్పడిన మంత్రము).

15. ఖండము.

1. ఈబ్రహ్మవిద్యను, బ్రహ్మ, తనపుత్త్రుఁడైన కశ్యపప్రజాపతికిం జెప్పెను; అతఁడు మనువునకుఁ జెప్పెను; అతఁడు సకలమనుష్యులకును జెప్పెను. అయినను, జ్ఞానకాండము నవలంబించి కర్మకాండమును త్యజింపఁగూడదు.

గురువునొద్ద వసించి, గురుశుశ్రూషాకాలమునందుఁ దక్క, తక్కిన కాలములయందు వేదాధ్యయనము చేయుచు సమావర్తనానంతరము, గృహస్థధర్మమవలంబించి, పరిశుద్ధస్థలమునుండి నిత్యనైమిత్తికకర్మముల ననుష్ఠించుచు, ధార్మికులగుపుత్త్రులను శిష్యులను బడసి, ఇంద్రియ జయుఁడై, శాస్త్రోక్తకృత్యములను జేయుచు, పరహింసావర్జితుఁడై, ఎవఁ డిట్లు ఆయుఃపర్యంతము వర్తించునో, వాఁడు బ్రహ్మలోకమునుబొందును; వానికి జననమరణములు లేవు (అనఁగా బ్రహ్మైక్యము నొందును).

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఆప్యాయ న్త్విలి శాన్తిః.

ఛాందోగ్యోపనిషత్తు సమాప్తము.

---

# బృహదారణ్యకోపనిషత్తు సారాంశము.

ఇది యడవియందు చెప్పఁబడిన దగుటచేతను, గొప్పది యగుట చేతను "బృహదారణ్యకోపనిషత్తు" అని పేరొక్కనంబడినది. మూలము నందు ఒకటిమొదలు ఎనిమిదియధ్యాయములు కలవు. వానిలో రెం డధ్యాయములు అశ్వమేధయాగవిషయము కాఁబట్టి, అవి ప్రకృతోప యోగికానందున శ్రీశంకరాచార్యులవారు ఆరెండధ్యాయములను వదలిపెట్టి మూఁడవయధ్యాయముమొదలు భాష్యముచేసిరి.

ఈతెనుఁగుపరివర్తనమునందు మూఁడుమొదలు ఎనిమిదియధ్యా యము లని లిఖియింపక దానినే ఒకటిమొదలు ఆఱధ్యాయము లని వ్రాయంబడియె.

ఇందు సంసారనివృత్తినిఁగోరువారికి సాధనమైన "బ్రహ్మాత్మైకత్వ విద్య" అను బ్రహ్మవిద్య చెప్పఁబడియున్నది.

అశ్వమేధయాగమునుగూర్చి దీనియం దేలచెప్పవలయు ననఁగా, అశ్వమేధయాగమునకంటె శ్రేష్ఠమైన బ్రహ్మవిద్యను బోధించుటకొఱకే, ఆయాగమందలికష్టమును, దానివలని అల్పఫలమును మొదటఁ జెప్పఁ బడినది. అనఁగా, సకలకర్మలకంటెను విశేషమైన అశ్వమేధయాగము

యొక్క ఫలమే సంసారకారణముగనున్నదనియును, బ్రహ్మజ్ఞానమొక్కటే శాశ్వతమోక్ష మనియును తెలియఁదగినది. మఱియు నిత్యకర్మములును సంసారమునే కలుగఁజేయుచున్నవి. కావున, కామాదిదోషకర్మబీజభూతమైనఅవిద్యానివృత్తినిమిత్తమైయీ బ్రహ్మవిద్యప్రారంభింపఁబడుచున్నది.

ఈయుపనిషత్ప్రారంభమునందు కర్మకాండసంబంధము చెప్పఁబడినది. సకలవేదములందును కర్మకాండము, జ్ఞానకాండము అను రెండు విషయములును గలవు. ఉపనిషత్తు వేదశిరస్సుగానున్నది. దీనికే వేదాంతమని పేరు. వేదములందు "ఇష్టవస్తుప్రాప్తి", "అనిష్టవస్తుపరిహారము" అను నీరెండువిషయములును ప్రధానములు. అయినను, ఆత్మయనునది యొకటికలదని తెలియనివారికిమాత్రమే వేదవేదాంతము లవశ్యములు. ఉపనిషత్తులందు ఆత్మకలదనియును, దానినెఱింగిన ముక్తికలదనియును బోధింపఁబడియున్నవి. కర్మకాండమునందు ఆత్మకలదనుట సిద్ధమనియును, అది ప్రత్యక్షముచేతను, లేక అనుమానముచేతను దెలియఁబడదనియును, ఆత్మయున్నదనినమ్మెడివారికి జన్మాంతరమందు "ఇష్టప్రాప్తి"యు, అనిష్టపరిహారము" ను కలదనియును బోధింపఁబడియున్నది.

అయినను, ఇష్టప్రాప్తికిని, అనిష్టపరిహారేచ్ఛకును కారణమును, కర్తృత్వ భోక్తృత్వ స్వరూపాభిమానలక్షణమును అగు అజ్ఞానమును, నివర్తించుటకు బ్రహ్మజ్ఞానమొకటి సాధనము ఎంతవఱకు బ్రహ్మజ్ఞానము కలుగకుండునో అంతవఱకును అజ్ఞాననివృత్తి కానేరదు. అనఁగా అజ్ఞానముచే కర్మఫలవిషయమువలనఁ గలుగురాగద్వేషాది స్వాభావికదోషములతోఁ గూడినవాఁడై, అశాస్త్రీయకర్మము లాచరించుచు, తత్ఫలమైన స్థావరాంతమైన అధోగతి నొందుచుండును.

మఱియు శాస్త్రోక్తకర్మలచే సంస్కరింపఁబడిన ధర్మకర్మములు రెండు విధములు. ఒకటి జ్ఞానసహితకర్మము; ఇంకొకటి కేవలకర్మము. కేవల (జ్ఞానరహిత) కర్మమునకు పితృలోకప్రాప్తికలదు. జ్ఞానసహితకర్మకు దేవలోకము మొదలు బ్రహ్మలోకమువఱకుఁ గలలోకములప్రాప్తి కలదు. ఇట్లు బ్రహ్మాదిస్థావరాంతమువఱకును గలసకలభూతములును అవిద్యాదోషముచే సంసారగతియగు నామరూపకర్మములను ఆచరించుచున్నారు.

ఈవ్యాకృత (విస్తార) మైన ప్రపంచము సృష్టికపూర్వము, అవ్యాకృత (సూక్ష్మ) మై యుండినది. ఈసంసారము బీజమునుండి అంకురము

వలె, అవిద్యచేఁ గలిగినది. అది ఆత్మయందు క్రియాకారకఫలలక్షణ ముగా ఆరోపింపఁబడియున్నది. అనాదిగను, అనంతముగను నుండు సంసారనివృత్తినిఁ గోరువారియొక్క అజ్ఞానమును పోఁగొట్టుటకై, దానికి విరోధమైన ఆత్మజ్ఞానమును ఈయుపనిషత్తు బోధించుచున్నది.

---

# 10. బృహదారణ్యకోపనిషత్తు.

## ప్రథమాధ్యాయము.

పూర్ణమద ఇతి శాన్తిః.

### ప్రథమబ్రాహ్మణము.

1-2. అశ్వమేధాశ్వమునకు ఉష (ఉషఃకాలము = తెల్లవాఱుజాము) శిరస్సు; సూర్యుఁడు నేత్రము; గాలి ప్రాణము; వైశ్వానరాగ్ని నోరు; సంవత్సరము దేహము; స్వర్గలోకము పిఱుఁదు; ఆకాశము కడుపు; పృథ్వి పాదముంచుచోటు; దిక్కులు పార్శ్వములు; విదిక్కులు ప్రక్కయెముకలు; ఋతువులు అంగములు; మాసములును పక్షములును గణువులు; అహోరాత్రములు ప్రతిష్ఠాపాదములు; నక్షత్రములు ఎముకలు; నభము(ఆకాశమందలి మేఘము)మాంసము; ఇసుక జీర్ణముకానియన్నము; నదులు గుదనాడులు; పర్వతములు యకృత్ క్లోమము లనుమాంస ఖండములు; వృక్షములు రోమములు; మధ్యాహ్నమువఱకుగలకాలము నాభికి మీఁదిభాగము; మధ్యాహ్నోత్తరము నాభికిక్రిందిపార్శ్వము; మెఱుము నోరుతెఱచుట; ఉఱుము ఆవులింత; వర్షము మూత్రము; వాక్కు (శబ్దము) ముఖము; పగలు పురోభాగమందలి స్వర్ణపాత్రము; రాత్రి వెనుకనుంచినవెండిపాత్రము; బంగారుపాత్రముంచుచోటు తూర్పుసముద్రము; వెండిపాత్రముంచుచోటు పడమటిసముద్రము; ఈరెండుపాత్రములును అశ్వమునకు మహిమనిచ్చునవి; ఈగుఱ్ఱము 'హయ' మనుపేరుగలదై దేవతలను ఎత్తుచున్నది; 'వాజి'యై గంధర్వులను, 'అర్వ'యై అసురులను, 'అశ్వ'యై మనుజులను ఎత్తుచున్నది; దీనికి బంధువు సము

ద్రము; దీనికి యోని (కారణము) పరమాత్మ; (ఈ అశ్వము ప్రజాపతి; ఎత్తుట అనఁగా ఉండునట్లు కావించుట.)

---

## ద్వితీయబ్రాహ్మణము.

1. ఇచ్చట(సంసారమండలమునందు,జగత్తునందు)సృష్టికి పూర్వము (నామరూపాదులు) ఏవియు లేకయుండెను. మృత్యువుచే నీప్రపంచము మఱఁగింపఁబడియుండినది.(తనలో నైక్యమైయుండెను.ఒకగొప్పవృక్షము కాఁదగినదానిసారమును ఒకవిత్తనమంఇమిడ్చికొనియుండునట్లు.)మృత్యు వనఁగా భక్షింప (అనుభవింప) ఇచ్ఛగలఆత్మ (హిరణ్యగర్భుఁ డను ప్రజా పతి, మాయయందు ప్రతిబింబించిన ఆత్మ, (సగుణబ్రహ్మము) ఆమృత్యువు (సృష్టింపఁదలంచి) మనస్సనెడి ఆత్మతోఁ జేసుటకు దలంచెను. (అనఁగా మనస్తత్త్వము మహత్తత్త్వమును సృష్టించెను.)

ఇది(మృత్యువనుప్రజాపతి)తన్నుదాను శ్లాఘించుకొనెను (అనఁగా అహంకారతత్త్వము కలిగెను). అందుండి (ఆకాశము, వాయువు, అగ్ని, వీనిమూలముగా) జలముకలిగెను. 'పూజ్యుఁడైననాకు జలముకలుగును గాక;' యనితలంచినమీఁద జలముకలిగెను. (జలమునకు కారణము పూజ్యమైన 'అర్క' మను అగ్ని కావున) ఆ 'అర్క' అగ్నికి (అశ్వమేధా గ్నికి) పూజ్యత్వము సిద్ధించెను. ఇట్లు ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వానికి జలము (సుఖము) లభించును.

2. ఆజలము పూజనీయమైనది; అది పాలమీఁగడవలెగట్టిదైయైనది; అదే పృథివియాయెను. అందు మృత్యువు శ్రమతీర్చికొనెను. ఆప్రజా పతి వలన తేజోరసమైన అగ్నికలిగెను. (ప్రజాపతి, విరాట్టు, ప్రథమ జుఁడు, శరీరి, అండాంతర్గతవిరాట్టు కలిగెను.)

3. అతఁడు (ఆవిరాట్టు, పుట్టినప్రజాపతి) తన్ను త్రివిధములుగాఁ గావించికొనెను. ఆదిత్యుఁడు, వాయువు, అగ్ని అని. అతఁడు సకలభూత ములయొక్కప్రాణము.

అతఁడు మూఁడుగావిభజింపఁబడినవాఁడు.(ఒకభాగము అగ్నిగాన, అశ్వమేధయాగాగ్ని పరిశుద్ధజన్మమైనదని తెలియుచున్నది). దానికి తూర్పుదిక్కు శిరస్సు;ఐశానమూలయు, అగ్నిమూలయును హస్తములు;

పశ్చిమము పుచ్ఛము (మోఁకాళ్ల భాగము); వాయువుమూలయు, నైరృ మూలయు పృష్ఠములు; దక్షిణమును, ఉత్తరమును పార్శ్వములు స్వర్గము పశ్చాద్భాగము; ఆకాశము ఉదరము; పృథివి ఱొమ్ము; ఇట్ల అగ్నియను ప్రజాపతి జలప్రతిష్ఠ చేయఁబడియున్నది. ఇట్లు తెలిసికొన్న వానికి ఎచ్చటికేఁగినను ప్రతిష్ఠకలదు.

4. ఆమృత్యువు 'నాకు రెండవఆత్మ (శరీరము) కలుగునుగాక అని తలంచెను. అట్లుతలంచి అనుభవింప నిచ్ఛగలఆత్మ యనెడిమృత్యువు పూర్వ ముత్పత్తిగైన మనస్సుతో (అనాదిగా నున్న) త్రయీవిద్య యనువేదవాక్కును మిథునముగాఁ జేసెను. (సృష్టినిగూర్చి వేదమంద చెప్పఁబడిన దానిని గూర్చి మనస్సుతో నాలోచించెను.) ఇట్లు తలం చఁగా రేతస్సు (ప్రథమపురుషునకు కారణమైన జ్ఞానకర్మరూపబీజము) కల గెను. అది ఒకసంవత్సరము గర్భములోనుండి, ఒకసంవత్సరమును నిర్మా కర్తగా, ప్రజాపతి (అనఁగా, ప్రథముఁడు, బ్రహ్మదేవుఁడు) గర్భమ నందుండెను. అంతకుమున్ను సంవత్సర మనునది లేదు. ఎంతకాలము గర్భవాసమో అంతకాలము సంవత్సరమనఁబడును. ఆసంవత్సరమునకు దర్వాత అండమునుజీల్చెను. మృత్యువు, పైనిచెప్పఁబడిన గర్భములో నుండి బ్రహ్మదేవుని సృష్టించెను. ఇట్లు పుట్టిన బ్రహ్మదేవుని నోరు తెఱువ మనఁగా, నతఁడు 'భాణ్'అని శబ్దించి నోఱుతెఱచెను. ఆశబ్దమే వా క్కయినది.

5. ఆమృత్యువు, తన కెప్పుడేని ఆఁకలియెత్తినపుడు, తనకుమారు డైన బ్రహ్మదేవుని భక్షింపవచ్చు నని తలంచెను. అయినను, వీనిని మా త్రముభుజించిన అన్నము కొంచెమగును; అన్నము చాలకాలముదాఁక కావలసియున్నది; బీజమైన వీనిని చంపి తినిన పైరు వృద్ధికాదు. కావున అన్నమును చాల వృద్ధిచేయవలయు నని తలంచి, పూర్వప్రకారము వేదములను పరిశీలించి, స్థావరజంగమాత్మకమైన యీప్రపంచమును, ఇంకను ఏవేవిగలవో వానినన్నిటిని, మూఁడువేదములను, ఛందస్సులను, యజ్ఞములను, ప్రజలను, పశువులను సృష్టించెను (వేదము లనాదిరైన నను కర్మలయందు వినియోగమగునట్లు విశదీకరించినాఁ డని భావము). తాను దేనిదేనిని సృష్టించెనో, దానియందంతయు ఆత్మగా నుండి అనుభ వింపఁదలంచెను, అన్నిటిని అనుభవింప (భుజింప) తలంచినవాఁడైనందున

'అదితి' యనఁబడుచున్నాఁడు. అతఁడు సర్వమును భక్షించువాఁడు. అతనికి సమస్తమును అన్నము. ఇట్లు తెలిసికొన్నవానికి సమస్తమును సిద్ధించును.

6. అతఁ డొకయజ్ఞమును మరల చేయుటకుఁ దలంచెను.(పూర్వకల్పమునందువలెనే ఈకల్పమునందును చేయుటకుఁ దలంచినందున మరల చేయుట కనిచెప్పఁబడినది,) శ్రమఁజెందెను; తపించెను. (తపస్సుచేసెను; లేక, ధ్యానము చేసెను; ఆలోచించెను.) అతనివలన యశస్సును, వీర్యమును గలిగెను. (ప్రాణములు నేత్రములు మొదలగునవి యశస్సనియును, బలము వీర్యమనియును దెలియునది.) ప్రాణములేనిచో నేదియు కలుగదుగదా? శరీరమునుండి ప్రాణముపోయినమీఁద, శరీరము అమేధ్యము (అపవిత్రము) అగును. అట్లు శరీరమునుండి ప్రాణముపోయినప్పటికిని, ఆ శరీరమునం దొకయభిమాన ముండినది. (ఆయభిమానము దిగువ వివరింపఁబడును.)

7. ఈనాశరీరము మేధార్హముగా (యజ్ఞోపయోగిగా) అగును గాక; శరీరవంతుఁ డగుదు ననితలంచెను. ఏకారణముచే ప్రాణముపోయిన యెడల శరీరము 'అశ్వత్' అగుచున్నదో (చెడిపోవుచున్నదో) ఆకారణముచే శరీరము 'అశ్వ' మనిపేరొందినది. ఎప్పు డది మేధార్హమైనదో అప్పుడు అది అశ్వమేధము అనుయాగముపేరైనది. ఇట్లు అశ్వమేధమును తెలియవలయును. అశ్వమేధాశ్వమును సృష్టించి కట్టకయే విడిచిపెట్టనెంచెను. ఒకసంవత్సరముదాఁక కట్టక వదలిపెట్టి, తర్వాత ఆలంబనము చేసికొనెను. (యాగోపయోగముచేసికొనెను.)తక్కినపశువులను దేవతల కొఱ కిచ్చెను. కావున, ఇప్పుడును యాగ మొనర్చువారు దేవతాసంబంధముగను, ప్రజాపతిసంబంధముగను మంత్రసంస్కృతపశువును యాగము చేసెదరు; ఎవఁడు తన తేజస్సుచే ప్రపంచమును తపింపఁజేయుచున్నాఁడో ఆసూర్యుఁడు అశ్వమేధమై (యజ్ఞఫలమై) యున్నాఁడు. అతనికి సంవత్సరము శరీరము; ఈపార్థివాగ్ని అర్కమైయున్నది. (అనఁగా సాధనభూతమై క్రతురూపమైయున్నది.) ఇతనికి త్రిలోకములును శరీరములు. ఈఅగ్నియు ఆదిత్యుఁడును అర్కాశ్వమేధములుగా(క్రతుఫలములుగా) ఉన్నారు. (క్రతువు, ఫలము,యజమానుఁడు.)అన్నియు ఒక్కదేవతయే. అనఁగా మృత్యువును ప్రజాపతియు నొక్కఁడే. ఇట్లు తెలిసికొన్నవాఁడు

మరణమునుండి విముక్తినొందుచున్నాఁడు. ఇతనిని మృత్యువు సమీపింపుటలేదు. మృత్యు రూపాత్మయగుచున్నాఁడు. ఈదేవతలలో నొకఁడగుచున్నాఁడు.

---

## తృతీయబ్రాహ్మణము

1. ప్రజాపతివలన ఇరుతెగలవారు గలిగిరి(అతనిప్రాణము వాక్కు మొదలగుతత్త్వములు), 1 దేవతలు, 2 అసురులు. (దేవతలు-శాస్త్రజన్యజ్ఞానమును, కర్మమును గైకొన్నవారు; అసురులు - స్వాభావిక ప్రత్యక్షజన్యజ్ఞానమును, కర్మమును గైకొన్నవారు) దేవతలు (సాత్త్వికులు) కొందఱే యున్నారు. అసురులు (అసాత్త్వికులు కావున) అధిక సంఖ్యాకు లున్నారు. వీరిర్వురును ఈలోకవిషయములయందు పరస్పరము విరోధము గలవారై యున్నారు. దేవతలు తమలోఁదాము చెప్పుకొనున దేమనఁగా—"యజ్ఞమునందు ఉద్గీథముచే అసురులను జయింపఁగలము" అని.

2. ఆదేవతలు (ఇట్లు నిశ్చయించికొని) తమ వాగభిమానదేవతను (వాక్కును) జూచి "మాకొఱకు ఉద్గీథమంత్రమును గానముచేయుఁడు" అనిరి. (ఎప్పుడును ఆత్మను దీపించుచు, మంచిమాటలను జెప్పుచుండవలయునని యర్థము.) అట్లే కానిమ్మని చెప్పి, వాక్కు ఉద్గీథమును గానము చేసెను. అట్లు చేసినందువలనఁ గలిగినభోగమును (జ్ఞానబలమును) దేవతల కొసంగెను. ఏది శోభనవాక్కుగాఁ జెప్పఁబడినదో దానిని(కర్మఫలమును) వాక్కు ఉంచికొనెను. అసురులు ఈవృత్తాంత మెఱింగి, దేవతలు ఉద్గీథముచే తమ్మును జయింతు రనియెంచి, ఆవాక్కును పాపముతోఁగొట్టిరి. పాపమనఁగా, వాక్కున కసుఃరూపమైనమాటలను జెప్పుట. (అనఁగా అసభ్యము, భయము, అనృతము మొదలగుమాటల నాడునట్లు వాక్కును అసాత్త్వికతత్త్వములు ప్రేరించెను.)

3. (పైని చెప్పినట్లు ఘ్రాణేంద్రియవిషయమునందు అసాత్త్వికతత్త్వములు కావించెను.)

4. (పైని చెప్పినయట్లే చక్షురింద్రియవిషయమునందును కావించెను.)

5. (శ్రోత్రేంద్రియవిషయమునందును మీఁదఁ జెప్పినచొప్పున కావించెను.)

6. (మనస్సువిషయమునందును పైనికనఁబఱచినట్లే కావించెను.)

7. మరల దేవతలు తమకొఱకై ఉద్గీథమును గానముచేయునట్లు ప్రాణమునుగోరిరి. అట్లే ప్రాణము గానముచేసెను. అసురులు ఆప్రాణమును పాపముచేఁ జెఱుప నిశ్చయించిరి. అయినను సాధ్యముకాకపోయెను. మట్టిపెల్ల బండను పగులఁగొట్టుటకుయత్నించిన, అది యెట్లు చెల్లాచెదరైపోవునో, అట్లు అసురులు అడ్డదిడ్డముగాఁ జెదరి నాశమైపోయిరి' కావున దేవతలు జయమొందిరి. ఇట్లు తెలిసికొన్నవాఁడు ప్రజాపతి స్వరూప మగుచున్నాఁడు. ఇతనివిరోధులు అవమానమొందుదురు.

8. ఆదేవతలు ఇట్టి(అసంగుఁడై యుండియు దేవత్వమును కలుగఁ జేయునట్టి) ప్రాణ మెచ్చటనున్నదని విచారించిరి. అది ముఖద్వారమునందు (శరీరమునందు) ఉన్నదని తెలిసికొనిరి. కావున ఆప్రాణము 'ఆయాస్యుఁడు' (వాగాదులను జేర్చిపట్టుకొనియుండువాఁడు) 'అంగిరస్సు' (అంగములకు సారమైయుండువాఁడు).

9. ఈ (శుద్ధమైన) ప్రాణదేవత 'దూ' అను పేరుగలది. ఈదేవతకు మృత్యువు దూరమైయుండుటవలన నాపేరు గల్గినది. ఇట్లెఱిఁగినవానికి మృత్యువు చాలదూరముననుండును.

10. ఈప్రాణదేవత వాగాదిదేవతల పాపరూపమైన మృత్యువును హింసించి దిగంతరములకుఁ బంపివైచెను. అచ్చటనుండు దుర్జనులయందు ఈపాపములుచేరునట్లు కావించెను. కాన, ఆజనులతోఁ జేరరాదు. పాపమైన మృత్యువు ఆశ్రయించు ననెడి భయముచేత ఆజను లుండుదిక్కునకుఁ బోఁదగదు.

11. వాగాది దేవతలపాపమనెడి మృత్యువును ఈప్రాణదేవత హింసించి ఆదేవతలయొక్క అగ్న్యాది దేవతాస్వరూపమును బొందునట్లు చేసెను.

12. ప్రధానమైన వాక్కును ప్రాణము వహించెను. ఆవాక్కు ఎప్పుడు మృత్యువును జయించెనో అప్పుడు అగ్నియైనది. (అగ్ని దేవతాస్వరూపమైనది, అనఁగా శుద్ధవాగగ్నిదేవత) మృత్యువును దాఁటి (జయించి) ఈయగ్ని శ్రేష్ఠముగాఁ బ్రకాశించుచున్నది.

13. (ఘ్రాణవిషయమునందును పైనిచెప్పినప్రకారము)ఘ్రాణము వాయుదేవతయై మృత్యువును జయించి శ్రేష్ఠమై ప్రకాశించుచున్నది.

14. (చక్షుర్విషయమునందును మీఁదఁ జెప్పినప్రకారము) చక్షువు ఆదిత్యదేవతయై మృత్యువును జయించి శ్రేష్ఠమై ప్రకాశించుచున్నది.

15. (శ్రోత్ర విషయమునందును పైనిచెప్పినప్రకారము) శ్రోత్రము దిగ్దేవతయై మృత్యువును జయించియున్నది.

16. (మనస్సువిషయమునందును పైనిచెప్పినప్రకారము) మనస్సు చంద్రదేవతయై మృత్యువును జయించి తేజరిల్లుచున్నది.

ఈరీతిగాఁ దెలిసికొని ప్రాణమును ఉపాసించువానిని ఈప్రాణదేవత అగ్న్యాదిదేవతాభావమున వహించుచున్నది. (ఆదేవతలగుచున్నాఁడు.)

17. తర్వాత, ఈప్రాణము అన్నాదులను భుజించుటకొఱకు తలంచెను. ఏదేదిభుజింపఁబడునదో, దానినంతయు ప్రాణము భుజించుచున్నది. అన్నమునందు ప్రాణముంపఁబడియున్నది. (అన్నములేనిచో ప్రాణము పోవును.)

18. వాగాదిదేవతలు ప్రాణమును జూచి యిట్లనిరి—"అన్నమునంతయు నీవే గ్రైకొనెదవు; మే మన్నములేక యుండలేము; మాకును అన్నమునందు భాగ మిమ్ము." (ప్రాణము) మీకు అన్నము కావలసియున్నచో నాతోఁ జేరుఁడు.

(అపుడు వాగాది దేవతలు) 'అట్లే కానిమ్ము' అనిపల్కి వాగాదిదేవతలు కూర్చుండిరి. కాఁబట్టి ఎవఁడు ప్రాణముకొఱకు (ప్రాణముండుటకై, బ్రతికియుండుటకై)అన్నమును భుజించుచున్నాఁడో, వాని వాగాదులు తృప్తినిఁజెందుచున్నవి. ఇట్లు ప్రాణమును దెలిసికొన్నవానినిబంధువులాశ్రయించెదరు. వారినిఁ గాపాడునట్టిపెద్దగుచున్నాఁడు. శ్రేష్ఠుఁడుగను, అందఱికంటె ముందు పోవునట్టివాఁడుగను, అన్నాదుఁడుగను, అధికారిగను అగుచున్నాఁడు. ఇట్లు తెలిసికొన్నవానిని విరోధింపనెంచువాఁడు, తమతోఁజేరినవారికి అసంతృప్తిని కలుగఁజేయును. ఎవఁ డిట్లు తెలిసికొన్నవానిని అనుసరించునో, వాఁడు తమతోఁజేరినవారిని సంతృప్తిబొందించుటకు శక్తిగల వాఁడగును.

19. అంగము లన్నిటికంటె సారమైనది ప్రాణము. ఏలన, ఒక అంగమునం దుండుప్రాణము పోయినయెడల ఆయంగము శోషించుచున్నది. కావున, ప్రాణమే అంగములకు సారము (రసము).

20. ఈప్రాణము 'బృహస్పతి' అనునది. 'బృహతీ' అనఁగా 'బృహతీఛందస్సు', ఋగ్వేదము, దానికిపతి; ఋగ్వేదాధిపతి; (ప్రాణము లేనిచో ఋగ్వేదమును జెప్పుటకు సాధ్యముకాదు.)

21. ఈప్రాణమే 'బ్రహ్మణస్పతి', 'బ్రహ్మము' అనఁగా యజుర్వేదము. దాని అధిపతి 'బ్రహ్మణస్పతి'.

22. ఈప్రాణము సామవేదము; వాక్కే సామవేదము. 'సా' స్త్రీలింగవాచ్యమైన సకలవస్తువిషయములును, 'అమః' పుంలింగవాచ్యమైన సకలవస్తువిషయములును జేరి 'వాక్' అయినది. ఈవాక్కే ప్రాణము. దానికి 'సామము' అని పేరుగల్గెను. వేఱువిధముగను దానికి సామత్వము కలిగియున్నది. సమముగాసుండుట సామము. ఎట్లన, ఆప్రాణము వెఱబొమ్మయందును, దోమయందును, ఏనుఁగునందును, త్రిలోకరూపమైన ప్రజాపతియందును, సకలప్రపంచమునందును సమమైయున్నది. కావున, ఇట్లు ప్రాణమైనసామమును దెలిసికొన్నవాఁడు ఆదేవతతోడి సాయుజ్యమును, సాలోక్యమును బొందుచున్నాఁడు.

23. ఈప్రాణము 'ఉద్గీథ' మనఁబడును. ప్రాణము 'ఉత్' అనఁబడును. అనఁగా అన్నిటిని పైకెత్తునట్టిది. వాక్కు 'గీథ' మనఁబడును. వాక్కుతోఁజేరినప్రాణము 'ఉద్గీథము' అనఁబడును.

24. ఈవిషయమై యొకకథకలదు. చికితాయనుని మనుమఁడైన బ్రహ్మదత్తుఁడనువాఁడు యజ్ఞమందు సోమపానమొనర్చి యొకశపథము చేసెను. ఎట్లన, వాక్కుతోఁగూడిన ప్రాణముతోఁగాక, ఇతరదేవతవలన నేను గానముచేసినయెడల, నేనుఅసత్యవాదినగుదును. అసత్యముపల్కుదునేని సోమలత నాశిరస్సును వ్రక్కలించును (చీల్చును) గాక! (అనఁగా, వాక్కుతోఁగూడినప్రాణమునకు ఇట్టిమహిమ కలదని తాత్పర్యము.)

25. ఇట్టిసామప్రాణముయొక్క అర్థమును (తాత్పర్యమును) తెలిసికొన్నవానికి అర్థము (ధనము) దొరకును. ఆప్రాణార్థమేమనఁగా, స్వరము. కావున ఋత్విక్కు మంచిస్వరము కావలయునని కోరుచున్నాఁడు.

మంచిస్వరముగలవాక్కుతో ఆర్త్విజ్యముచేయవలయును. ఎట్లు లోక మునందు ధనముగలవానిని సకలజనులును ఆశ్రయించెదరో, అట్లు మంచిస్వరముగలఋత్విక్కులను యజ్ఞమునందుఁ జూడఁగోరెదరు. ఇట్లు తెలిసికొన్నవానికి సంపదకలుగును.

26. స్వరము స్వర్ణముగా వర్ణింపఁబడుచున్నది. ఇట్లు తెలిసి కొన్నవానికి స్వర్ణము లభించును.

27. ఈసామప్రాణప్రతిష్ఠను దెలిసికొన్నవానికి మహిమకలదు. సామప్రతిష్ఠ వాక్కుగానున్నది. వాక్కునందు ప్రాణము ప్రతిష్ఠితమై యున్నది. ఏలన, వాక్కుచేతనే గానముచేయఁబడుచున్నది. కొందఱు అన్నము ప్రతిష్ఠయని చెప్పెదరు.

28. (ప్రాణవిజ్ఞానముగలవానికి జపకర్మము చెప్పఁబడుచున్నది.) పవమానస్తోత్రకాలమునందు (యజ్ఞమునందు) ప్రస్తోత తనకార్యమును ప్రారంభించుసమయమునందు దిగువనుదాహరించినమంత్రములను జపింప వలయును. (జపము) "అసతోమాసద్గమయ" (స్వాభావికకర్మవిజ్ఞానము నుండి శాస్త్రోక్తకర్మవిజ్ఞానమునందు నన్నుఁజేర్పుము.) "తమసోమాజ్యో తిర్గమయ" (అజ్ఞానమునుండి జ్ఞానమునందుఁజేర్పుము). "మృత్యోర్మాఽ మృతంగమయ" (మృత్యువునుండిజాతి అమృతభావమును బొందునట్లు చేయుము). ఈజపమునకు ఫలము, కోరినదంతయు సిద్ధించును.

---

## చతుర్థబ్రాహ్మణము

1. ఆదియం దీ జగత్తు ఆత్మమయమై (ఆత్మయందు లీనమై) యుం డినది. మొదట ప్రథమపురుషుఁడైనప్రజాపతి స్వయముగాఁగలిగినాఁడు. అప్పుడుతానొక్కఁడుతక్క వేఱే దేనినిజూడలేదు. 'అహమ్' నేను ముందే యున్నాఁడను. అనితలంచికొనెను. కావున ఆత్మకు 'అహమ్' అనుపేరు గల్గెను. నేఁటికిని ఎవనినేని పిలిచినయెడల, మొదట 'నేను' 'వాఁడు' అని చెప్పుచు, తర్వాత తనపేరిట్టిదనిచెప్పుచున్నాఁడు. ఈ ప్రజాపతిస్థితిని జ్ఞాన కర్మానుష్ఠానములచేఁ బొందుటకుఁ గోరినవారిసమూహమునుండియు అజ్ఞానలక్షణమైన సకలపాపములను మొదటఁ గలిగినప్రజాపతి దహించు

చున్నాఁడు. దీనిచే నతనికి 'పురుషుఁడు' అను పేరుగల్గెను. ఇట్లు తెలిసి కొన్నవాఁడు ప్రజాపతిస్థితినిఁ బొందుచున్నాఁడు.

2. ఆ ప్రథమపురుషుఁడైన ప్రజాపతి (నశించుశరీరముగలవాఁడై నందున) భయమొందెను. కాఁబట్టి లోకమునందు ఒంటరిగానుండువాఁడు భయపడుచున్నాఁడు. తర్వాత ఆ ప్రజాపతి "నేనుగాక వేఱెవ్వ రున్నారు? గాన నేనేలభయపడవలయును" అని యాలోచించినాఁడు గాన, భయములేక యుండినాఁడు. భయపడనేల యనఁగా, తనకంటె వేఱైనశరీరమును ప్రత్యేకమని భావించినందున భయము కలిగెను. (తానుగాక వేఱేదియులేదు; సర్వమును బ్రహ్మమనెడి ఏకత్వదర్శనముండిన చో భయముండదు.)

3. ఆ ప్రజాపతి యొక్కఁడై యున్నందున సంతోషమొందకయుండెను. కావున, లోకమునందు ఒక్కఁడై యుండినచో సంతోషముండదు. తనసంతోషముకొఱకు రెండవవస్తువును (స్త్రీని) గోరెను. ఇట్లు కోరిన వెంటనే స్త్రీపుంరూపములుగా రెండువిధములుగాఁ జేసికొనెను. అపుడు పతియనియును పత్నియనియును పేర్లుగలవారేర్పడిరి. కాఁబట్టి, ఈశరీరము ఆత్మకు అర్ధభాగము వికారమైనది. (ఆత్మ పురుషరూపము, శరీరము స్త్రీరూపము. ఆత్మ మాయారూపము. శరీరము, అదే స్త్రీవ్యక్తి) ఇట్లుయాజ్ఞవల్క్యుఁడు చెప్పెను. మొదట స్త్రీవస్తువు శూన్యమై యుండెను. అపుడు పురుషార్థాకాశము స్త్రీరూపముతోఁ జేరి పూర్ణమైనది. స్త్రీరూపముగా ప్రజాపతిచే సృష్టింపఁబడినది. దానికి శతరూపా అని పేరు. దానితో ప్రథముపురుషుఁడైనమనుప్రజాపతి చేరెను. అపుడు మనుష్యులు గలిగిరి.

4. ఆ స్త్రీ (శతరూప) తనచే సృష్టింపఁబడినహేతు రగునాతో రమింపఁగోరుచున్నాఁడుగదా యనితలంచి గోరూపముదాల్చెను. అపుడు పురుషార్థము వృషభరూపము దాల్చి గోవుతోసంగమింపఁగా పశువులు పుట్టెను. పిమ్మట అది గోడిగ (ఆఁడుగుఱ్ఱము) రూపముదాల్చెను. అతఁడు గుఱ్ఱమై సంగమించెను. గుఱ్ఱములు గలిగెను. పిదప ఆ స్త్రీ ఆఁడుగాడిద రూపమెత్తెను. ఇతఁడు మగగాడిదయైచేరెను. గాడిదలుగల్గెను. ఇట్లు ఒంటిగిట్టలజంతువులు పుట్టినవి. తర్వాత ఆమె ఆఁడుమేఁకయాయెను. ఇతఁడు మగ మేఁకయాయెను, ఇట్లు రెండుగిట్టలమృగములుగల్గెను. పిమ్మట

క్రమముగా ఉభయులును అనేకజంతుజాలములరూపములు దాల్చి క్రీడించిరి. ఇట్లు లోకమునందు చీమలు మొదలు మనుష్యులవఱకు గల సకల ప్రాణులును కలిగినవి.

5. ఇట్లు సృష్టించినవానిని ఆప్రజాపతి రక్షించెను. ఆరూపములు గనే తాను ప్రకాశించెను. "ఏకారణముచే సకలజగత్తును సృష్టించి నాఁడనో, ఆకారణముచేతనే నేనును 'అపసృష్టి' (హీనసృష్టి)గా నున్నాఁడను."అని తలంచినాఁడు గాన, అతనికి 'సృష్టి' అనుపేరుగలిగెను. ఇట్లు తెలిసికొన్నవాఁడు ప్రజాపతివలె సృష్టికర్మ చేయువాఁడగును.

6. తర్వాత, ఆప్రజాపతి చేతులతో ముఖమునందు అదిమెను. ఆయోనినుండి (కారణమువలన) అగ్నిని సృష్టించెను. కాఁబట్టియే ముఖమునందును చేతులయందును రోమములు లేవు. అందుచేతనే యోనిలోపలను వెండ్రుకలు లేవు. యాగమునందు "ఈదేవుని భజింపుము, ఈదేవుని భజింపుము" అని చెప్పఁబడునట్టిదేవత లందఱును ఆఒక్కదేవుఁడే (ప్రజాపతియే). తర్వాత చెమ్మగలసకలవస్తువులలోనున్న రసమువలన ఆత్మయందుండి చంద్రునిసృష్టించెను. ఈజగత్తునందుండునట్టిదంతయు అన్నమును అన్నాదమునై యున్నది. చంద్రుఁడు అన్నమును,అగ్ని అన్నాదమునై యున్నది. (అతిసృష్టి, అనఁగా ఉత్కృష్టసృష్టి చెప్పఁబడుచున్నది.) తన ఉత్కృష్టభావమునుండి దేవతలను సృష్టించెను. కావున ఇది బ్రహ్మయొక్క అతిసృష్టి అని చెప్పఁబడుచున్నది. ఇట్లు తెలిసికొన్నవాఁడు ఈఅతిసృష్టివిషయమునందు ప్రజాపతివంటివాఁడగును.

7. ఆ (అప్రత్యక్షాత్మయందంతర్భూతమైయున్న) ఈజగత్తు ఆదియందు అవ్యాకృతముగా (నామరూపవికారములు లేక) ఉండినది. ఇట్లు అవ్యాకృతమైనజగత్తు నామరూపవికారములనుబొంది పలువస్తువులుగా నేర్పడినది. ఈయీవస్తువున కీయీపేరని వికారమొందినది. అప్పుడు నట్లే వికారమొందియున్నది. అట్టి యీప్రపంచమునందు నామరూపవికారరహితమైన (నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమైన) ఆత్మప్రవేశించెను. ఖడ్గకోశమునందు (కత్తియొఱయందు) కత్తి యెట్లు వ్యాపించియున్నదో, ప్రానియందెట్లు అగ్ని వ్యాపించియున్నదో, అట్లు ఆత్మ నఖకచపర్యంతము సర్వత్ర వ్యాపించి (నిండి)యున్నది. సమస్తమైయుండి, ప్రాణము తన కార్యమును జేయునపుడు 'ప్రాణము' అని పేర్కొనఁబడుచున్నాఁడు;

పలుకునపుడు 'వాక్కు' అనియును, చూచునపుడు 'చక్షుస్సు' అనియును, వినునపుడు 'శ్రోత్రమ్' అనియును, తలంచునపుడు, 'మనస్సు' అనియును పేరొందుచున్నాఁడు. ఈసకలకర్మలును ఆత్మయందేయున్నవి. ఎవఁడు ఆత్మను, ప్రాణము చక్షుస్సు అని ప్రత్యేకప్రత్యేకముగఁగాని, వేర్వేఱుగ నున్నదనిగాని తలంచి యుపాసించునో, వాఁడు బ్రహ్మము నెఱింగినవాఁడుకాఁడు. ఏలన, అట్లు తలంచినచో ఆత్మ అసమస్తుఁడగుచున్నాఁడు ఒక్కొక్కటిగను, వేర్వేఱుగను (అనేకదేవతలుగా) అగుచున్నాఁడు.(ఇది సరికాదు).సర్వమును ఒకేఆత్మయని ఉపాసింపవలయును. అపుడు సమస్తము నొక్కటేయగుచున్నది. ఈ ప్రపంచమున కంతయు ఆ బ్రహ్మవస్తువొక్కటే ఆధారమును నిరాధారమునై యున్నది. ఈఆత్మ (జీవుఁడు) ఆత్మజ్ఞానముచేత ఈ (అనాత్మస్వరూపమైన) సకలజగత్తును దెలిసికొనుచున్నాఁడు (ఆత్మవస్తు విట్టిదని తెలిసికొన్న వానికి అనాత్మవస్తు విట్టిదని తెలియును). లోకమునందు దొంగిలిన ఆవులు మొదలగువానిని కాలియడుగులజాడను బట్టి యెట్లు తెలిసికొనుచున్నామో. అట్లు మనకుఁ దెలియక మఱుఁగై యుండు ఆత్మను జ్ఞానమనెడి జాడను (గుర్తును) బట్టి తెలిసికొనవలయును. ఇట్లు తెలిసికొన్నవాఁడు కీర్తిని (ఆత్మకుఁగల ఖ్యాతిని) శ్లోకమును (ప్రాణాదివర్గమును) బొందుచున్నాఁడు. (అనఁగా ఆత్మైక్యజ్ఞాన మనుకీర్తిని, ముక్తి యనుశ్లోకమును బొందుచున్నాఁడు).

౮. ఆత్మను ఎఱుంగవలయు ననుటకుఁ గారణ మేమనఁగా, ఆ ఆత్మవస్తువు మిక్కిలి ప్రియము సంపఁదగినది; పుత్త్రునికంటె ప్రియతరమైనది; ధనముకంటెను ప్రియతరమైనది; ఇంకను ఏయేవస్తువులు శ్రేష్ఠములైనవి గలవో, వానికంటె ప్రియతరమైనది; మఱియు మనసమీపమునందే మనలో నుండునట్టిది. పరబ్రహ్మవస్తువుసకంటె వేఱొకవస్తువు ప్రియమైనది గలదనిచెప్పెడివానినిఁజూచి-"నీవుప్రియమైనదనితలంచెడి పుత్త్రాదిక నశించునదిగదా" అని బ్రహ్మవేత్తప్రశ్నించునుగాక! అట్లడుగుటకు అతఁడు (బ్రహ్మవేత్త)సమర్థుఁడు. కావున, ఆత్మయే ప్రియవస్తువనితలంచి దానిని ఉపాసింపవలయును. ఇట్లు ఉపాసించువానికి ప్రియవస్తువులన్నియు నశింపకయుండును.

9. ఏ బ్రహ్మవస్తుజ్ఞానముచే సమస్తమును మనముగూడ మని మనుష్యులు తలంచెదరో, ఆవస్తువునే బ్రహ్మ మని పెద్దలు చెప్పుచున్నారు.

దేనిజ్ఞానముచే సకలము నగుచున్నదని చెప్పఁబడుచున్నదో ఆబ్రహ్మము ఎట్లు తెలియఁబడుచున్నది?

10. సృష్టికిపూర్వము ఈజగత్తు బ్రహ్మముగానుండెను.ఆబ్రహ్మము 'నేనే బ్రహ్మమైయున్నాను' అని తలంచెను (నాకంటె వేఱులేదు; నాయందుండియే సర్వమును కలుగవలయు ననితలంచెను). కాఁబట్టి అది సమస్తమునైనది. ఇట్లు దేవతలలో నెవ్వరుతలంచెదరో వారు బ్రహ్మమే యగుచున్నారు. అట్లే ఋషులలోను మనుష్యులలోను ఎవ్వరెవ్వరు తలంచెదరో వారందఱును బ్రహ్మమయ్యెదరు. ఇట్లు తెలిసి 'నేనే సూర్యుఁడను' అని వామదేవఋషి తెలిసికొనెను. ఇప్పుడును ఎవరు పైని చెప్పినచొప్పున 'నేనే బ్రహ్మమైయున్నాను అనితలంచెదరో వారు బ్రహ్మముగను సమస్తముగను అయ్యెదరు. వారు దేవతలకంటెను శ్రేష్ఠులు. ఈ దేవతలయొక్క ఆత్మయు నయ్యెదరు. ఎవఁడు తనఆత్మకంటె వేఱే దేవతయున్న దనియును, అదివేఱు, నేనేవే ఱనియును తలంచి, అన్య దేవతోపాసన చేయుచున్నాఁడో వాఁడు అవివేకి; మూఢుఁడు; పశుతుల్యుఁడు; దేవతలకు వాఁడు పశువై యున్నాఁడు. ఎట్లు ఒకమనుష్యుని అనేకపశువులు సహాయముచేసి ఆదరించుచున్నవో, అట్లు అనేకపశుస్థానీయుఁడైన ఒక్కొకమనుష్యుఁడును దేవతలను,పితరులను,యాగము, శ్రాద్ధము మొదలగు కర్మలచేత ఆదరించుచున్నాఁడు. ఒకపశువును వ్యాఘ్రాదిజంతువులు గైకొనిపోవుటచే కనఁబడకుండునపుడు, ఒకనికి (ఆపశువుయొక్క సొంతగానికి) మిక్కిలి దుఃఖముగలుగుచున్నది. అనేక పశువులు పోయినపుడు చెప్పవలసినదేమున్నది? కావున, మనుష్యులు వివేకులైనయెడల (బ్రహ్మజ్ఞానులై యాగాదికృత్యములను మానిన యెడల) దేవతలకు మిక్కిలి కష్టముగనుండునుగదా? కావున, మోక్షేచ్ఛ గలవారు మొదట దేవతల నుపాసింపవలయును. అట్లుపాసించినచో దేవతలయనుగ్రహము కలుగును. తమ కిష్టమైనవారిని అనుగ్రహింతురు. ఇష్టములేనివారిని బ్రహ్మజ్ఞానము కలుగనీకచేయుదురు (బ్రహ్మజ్ఞానము కలుగునంతదాఁక కర్మలను చేయుచుండవలయును).

11. ఈజగత్తు సృష్టికిమున్ను బ్రహ్మమయమైయుండెను.అదిఏకమై (రెండుగాక) యుండెను. (తర్వాత మున్ను చెప్పినట్లు అగ్న్యాదులను సృష్టించెను; బ్రాహ్మణులను సృష్టించెను; కర్మమునకు చాలదయ్యెను).

ప్రశస్తులైన క్షత్రియులను సృష్టించెను; దేవక్షత్రియులను, మనుష్య క్షత్రియులను సృష్టించెను. దేవక్షత్రియు లెవరనఁగా ఇంద్రుఁడు(దేవతలకు రాజు); వరుణుఁడు(జలజంతువులకు రాజు); చంద్రుఁడు(బ్రాహ్మణులకు రాజు); రుద్రుఁడు(పశువులకు రాజు); పర్జన్యుఁడు(మెఱుములకు రాజు); యముఁడు(పితరులకు రాజు); మృత్యువు (రోగములకు రాజు); ఈశానుఁడు (కాంతులకు రాజు); కావున క్షత్రియులకంటె శ్రేష్ఠులు లేరు. కావున రాజసూయ యాగమునందు బ్రాహ్మణులు దిగువనున్నారు; క్షత్రియులు మీఁదుగ నుండి ఉపాసించెదరు. క్షత్రియుఁడు యశస్సు నొందుచున్నాఁడు.(వానికి బ్రాహ్మణుఁడు కారణము. కావున రాజసూయయాగమునందు రాజుమహిమనొందుచున్నాఁడు. ఏక్షత్రియుఁడు తనకుఁ గారణమైన బ్రాహ్మణుని నీచముగఁ జూచుచున్నాఁడో, వాఁడు తనవంశమునునాశము చేయుచున్నాఁడు. లోకమునందు శ్రేష్ఠస్థానమును అవమానించినయెడల ఏరీతిగా పాపియగుచున్నాఁడో, ఆరీతిగా పాపియగుచున్నాఁడు.

12. క్షత్రమును చాలదయ్యెను; కర్మసాధనమైనధనమును సంపాదించుటకై వైశ్యనిసృష్టించెను. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, విశ్వేదేవతలు, మరుత్తులు వీరందఱును వైశ్య దేవగణములు.

13. వైశ్యదేవగణములు చాలవయ్యెను. పరిచర్యార్థమై శూద్రులను సృష్టించెను. సర్వమును పోషించుపృథ్విని సృష్టించెను.

14. ఇవియన్నియు కర్మపూర్తికి చాలవయ్యె. శ్రేయోరూపమైన ధర్మమును(విధిని)సృజించెను. అది క్షత్రమునకు క్షత్రము (క్షత్రియుని కూడ పాలించునట్టిది). కావున, ధర్మమునకంటె శ్రేష్ఠమైనది వేఱేదియు లేదు. కాఁబట్టి బలవంతుని దుర్బలుఁడు ధర్మముచేతజయించుచు న్నాఁడు ఎట్లన. రాజుతో పగబెట్టుకొన్న ఒకకుటుంబస్థునివలె నని తెలియునది. ధర్మమే సత్యము; సత్యము చెప్పువారిని ధర్మమును జెప్పుచున్నారనియును, ధర్మమును జెప్పువారిని సత్యమును జెప్పుచున్నారనియును లోకమునందుఁ జెప్పెదరు.

15. ఇట్లు ఆ బ్రహ్మవస్తువు (అవిద్యావిషయములగుకర్మలు చేయుటకై) బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర లనునాలుగువర్ణము లాయెను. ఆ బ్రహ్మము దేవతలలో అగ్నిరూపముగా బ్రాహ్మణుఁడాయెను. కావున, దేవతలలో అగ్నియందు కర్మ మొనర్చి తత్ఫలమున కనుగుణ మైనలోక

మును బొందుటకై కోరెదరు. మనుష్యులలో బ్రాహ్మణత్వలోకమును బొందుటకై కోరెదరు.ఈఅగ్నియే బ్రహ్మమును, బ్రాహ్మణరూపమునైనది. ఎవఁ డీసంసారప్రపంచమునుండి తనకు సొంతమైన ఆత్మ నెఱుంగక మృతి నొందుచున్నాఁడో వానిని ఆత్మ (పరబ్రహ్మము) రక్షింపదు. ఎట్లు అధ్యయనము చేయఁబడనివేదము, కర్మవిధానాదుల నెఱింగించుమూల ముగా రక్షింపదో, అట్లు రక్షింపదు. కావున, ఆత్మ నెఱుంగనివాఁ డెట్టిమహత్తరమైనపుణ్య మొనర్చియున్నప్పటికిని అది ఫలానుభోగాం తమునందు నశించిపోవును. కావున, ఆత్మను తన ప్రపంచము (లోకము) అని యుపాసింపవలయును. అట్లు ఉపాసనచేయువానికర్మము నశింపదు. (అనఁగా కర్మ మంటదు; సంసారము లేదు.) ఇట్టిఆత్మజ్ఞాని కోరినవాని నంతయు సృష్టించుకొనుశక్తిగలవాఁ డగును.

16. ఈఆత్మ (జీవుఁడు)సకలభూతములలో భోగ్యలోకము(స్థానము) గా ఉన్నాఁడు. ఎట్లన, హోమయాగములచే దేవతలకు లోకము; వేదాధ్యయనములచే ఋషులకు లోకము; శ్రాద్ధాదులచేతను, ప్రజా వృద్ధికర్మలచేతను పితరులకు లోకము; మనుష్యులకు స్థానమును, భోజ నాదుల నొసంగుటచేతను మనుష్యులకు లోకము; తృణజలాదుల నొసం గుటచేత పశువులకు లోకము ; గృహమందలి మృగపక్ష్యాదులకు ఆహార మొసంగుటచేత వానికిలోకము; ఎట్లులోకమునందొకఁడు తనవాస స్థానమునకుఁజెడుపునుగోరఁడో, అట్లు నైనికనఁబఱచినభూతములన్నియు తమభోగ్యస్థానమైన జీవాత్మకు నాశమునుగోరవు. ఇట్లు తెలియఁబడినది; యోజింపఁబడినది. (కర్మలుచేసినయెడల దేవతలు సంతుష్టినొంది జీవుని రక్షింతురు.)

17. ఆత్మ (జీవాత్మ) మొదట (సంసారసంబంధమునకుమునుపు) ఏకమైయుండెను. అతఁడు స్త్రీని, ప్రజను సృష్టించి, తద్వారాతకర్మము చేయ వలయునని తలంచెను. ఆశ ఈరూపముకదా? (దార పుత్ర విత్తకర్మము లైయున్నవికదా?ఆశింపకపోయినను మున్ను చెప్పినఫలముకంటెను అధిక ముగావొరకదు. కావున, ఈకాలమునందును లోకమునందు ఒంటరిగనుం డువాఁడుదారపుత్రకర్మాదులను గోరుచున్నాఁడు. వీనిలో నేదేనియొకటి కొఱవడెనేని తన్ను అసంపూర్ణుఁ డని తలంచుకొనుచున్నాఁడు. అపుడు వానికి అసంపూర్ణత్వ మేర్పడుచున్నది. వీనిమనస్సు ఆత్మ (కుటుంబపతి,

పురుషుఁడు) మనస్సు ప్రధానమైనందున వాక్కు జాయ (భార్య) అనఁబడును. మనస్సుప్రకారము వాక్కు వర్తించుటంబట్టి, ఆమనస్సును వాక్కునుజేరి ప్రాణ మను ప్రజ కలిగినది. చక్షుస్సు మానుషమైనవిత్తము; కావున లోకమునం దుండువానినంతయు జూచెదము. శ్రోత్రము దైవమై యుండువిత్తము; శ్రోత్రముచేత విజ్ఞానమును విని తెలిసికొనెదము. దేహము కర్మము; దేహముచేత కర్మముచేయవలయును. ఇదిపాంక్తమైన (ఐదింటిచే నెఱవేర్పఁబడిన) యజ్ఞము. ఇట్లు తెలిసికొన్నవానికి పశువు, పురుషుఁడు అన్నియు లభించును.

---

## పంచమబ్రాహ్మణము

**1-2.** పితయగుప్రజాపతి తనప్రజ్ఞచేతను తపస్సుచేతను సృష్టించిన సప్తవిధాన్నములు చెప్పఁబడుచున్నవి. వానిలో నొకటి సాధారణముగా లోకములోని సకలప్రాణులును భుజించునట్టి అన్నము; ఈయన్నమును ఉపాసించువాఁడు పాపమునుండి విడిపడఁడు. ఈఅన్నము మిశ్రముగా సకలమైనవారికిని సామాన్యముగా నున్నది. మఱియు రెండన్నములను దేవతలు పొందునట్లు చేసెను. అవి యేవియనఁగా,ఒకటి హుతము(అగ్నియందు హోమముచేయఁబడిన యన్నము); మఱొకటి ప్రహుతము(బలిగానర్పించుఅన్నము); ఈ రెండుఅన్నములును దేవతలకొఱకీయఁబడునవి. దర్శపూర్ణక్రియాసంబంధమైన యన్నమని కొంద రందురు. కావున, కామ్యేష్టితో సంబంధించినదికాదు; ఒక అన్నమును పశువులకిచ్చెను; ఆ యన్నమే పాలు; మనుష్యులును పశువులును మొదట పాలు త్రాగియే కదా జీవించెదరు. కాఁబట్టి పుట్టినబాలునకు మొదట తీఁ రవికారమైన నేతిని నాకించెదరు లేక చనుబాలుత్రాగునట్లొనర్చెదరు. పుట్టినదూడయు చాల దినములు పాలుత్రాగుచున్నది; అతర్వాతపచ్చికతినుచున్నది. ఈయన్నము (పాలు)నందు సకల ప్రపంచమును స్థాపింపఁబడియున్నది. ప్రాణముండునదియు, ప్రాణము లేనిదియు సమస్తమును స్థాపింపఁబడియున్నవి. ఎవ డొకసంవత్సరముదాఁక పాలతో యాగముచేయువాఁడు మృత్యువును జయించునని చెప్పఁబడియున్నదో, అది యట్లుకాదు; పాలతో ఒక్కపగలు హోమముచేసినచో మృత్యువును జయింపవచ్చును. కాఁబట్టి, దేవ

తలకొలఁకు అన్నాద్యముల నొసంగవలయును.ఇట్లు అన్నములు భుజింపఁ బడుచుండఁగా నేలకొలవడకయున్నదనఁగా, పురుషుఁడు కొలఁతలేని వాఁడు; వాఁడు తనబుద్ధిచేత సకలాన్నములను సృష్టించుచున్నాడు. ఎవ డిట్లు అక్షితి (కొలఁతలేని) భావమును తెలిసికొనుచున్నాఁడో, వాఁడు ముఖ్యముగా అన్నమును భుజించును; దేవత్వమును బొందును; జనన మరణవర్జితుఁ డగును.

3. తక్కిన మూఁడన్నములను తండ్రి ఆత్మయం దుండునట్లు కావించెను. ఒకటి మనస్సు (అంతఃకరణము), రెండు వాక్కు, మూఁడు ప్రాణము; మనస్సు ముఖ్యమైనది. ఎట్లన, మనస్సు తొలఁగియుండునేని సమీపమునం దుండు వానినిఁజూచుటకు సాధ్యము కాదు;సమీపమునందు చెప్పెడిదానిని వినుటకు సాధ్యముగాదు; మనస్సున్నచోఁజూడవచ్చును; విననగును. కామము, సంకల్పము,సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ,ధైర్యము, అధైర్యము, లజ్జ, బుద్ధి, భయము ఇవియన్నియు మనోరూపములు. మనస్సుచేతనే తెలిసికొనవలయును.శబ్దమే వాక్కు. ఈవాక్కు వాచక వస్తువుగను పూర్ణమైనదిగ నుండుదానిని అనుసరించికొనియున్నది. (అనఁగా, వాచకవస్తువును ప్రకాశింపఁజేయుచున్నది.) అయినను అది యట్లుకాదు (స్వయముగాఁ బ్రకాశింపఁదగినది). ప్రాణము అయిదువిధ ములు-ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అని కావున సర్వమును ప్రాణమయమైయున్నది. ఈఆత్మ వాఙ్మనఃప్రాణమ యములై (మూఁడై) యున్నది.

4-10. వాఙ్మనఃప్రాణమయవివరణములు ఈదిగువఁ జెప్పఁబడును.

i. లోకము:—వాక్కు - భూలోకము, మనస్సు-అంతరిక్షము, ప్రాణము - స్వర్గము.

ii. వేదము:—వాక్కు-ఋగ్వేదము, మనస్సు - యజుర్వేదము, ప్రాణము - సామవేదము.

iii. వాక్కు-దేవతలు, మనస్సు-పితరులు, ప్రాణము-మనుష్యులు.

iv. వాక్కు-పిత, మనస్సు - మాత, ప్రాణము - ప్రజ

v. వాక్కు-విజ్ఞాతము, మనస్సు-విజ్ఞానము ప్రాణము-అవిజ్ఞాతము.

విజ్ఞాతమనఁగా చక్కఁగాఁ దెలియఁబడినది; అది వాగ్రూపము. ఇట్లు తెలిసికొన్నవానిని వాక్కు కాపాడుచున్నది. విజ్ఞానమనఁగా చక్కఁగాఁ

తెలియనిదానిని తెలిసికొని సంశయనివృత్తి చేసికొనుట; ఇది మనో రూపము. ఇట్లెఱింగినవానిని మనస్సు కాపాడును. అవిజ్ఞాతమనఁగా తెలియనిది; ఇది ప్రాణరూపము. ఇట్లు తెలిసికొన్నవానిని ప్రాణము రక్షించును.

11. వాక్కనుఅన్నమునకు శరీరము (బాహ్యాధారము) పృథివి; దానిరూపము జ్యోతిర్మయము; అనఁగా అగ్ని. వాక్కుయొక్క పరిమాణమునకుఁ దగినట్లు పృథ్వియును అగ్నియును ఉన్నవి.

12. మన స్సనుఅన్నమునకు శరీరము స్వర్గలోకము; దానిరూపము జ్యోతిర్మయమైన సూర్యుఁడు; మనస్సునకుఁ దగినట్లు స్వర్గమును సూర్యుఁడును ఉండిరి. ఈ రెంటిచేరికవలన ప్రాణము కలిగెను. అదే ఇంద్రుఁడు (ఈశ్వరుఁడు;) అదే ఈజీవుఁడు; ఇతఁడు శత్రువులేనివాఁడు; ఇట్లు తెలిసికొన్నవానికి శత్రువులేఁడు.

13. ప్రాణ మనుఅన్నమునకు శరీరము జలము; దానిరూపము జ్యోతిర్మయమైన చంద్రుఁడు; ప్రాణమునకుఁ దగినట్లు జలమును చంద్రుఁడును ఉన్నారు. వాక్కు, మనస్సు, ప్రాణము అనునీమూఁడును సమానములైనవి. కావున, ఇవి అనంతములు (పారములేనివి.) ఇవి అంతమైనవని ఉపాసించువారికి అంతమైనలోకము సిద్ధించును. అనంతములని ఉపాసించువారికి అనంతములైనలోకములు సిద్ధించును.

14. ఆప్రజాపతి సంవత్సరాత్మ (కాలస్వరూపి, చంద్రాత్మ); పదునాఱుకలలు గలవాఁడు. అహోరాత్రములు, తిథులు పదునైదు కలలు; పదునాఱవకల నిత్యమైనది; శుక్లపక్షమునందు పదునైదు కలలలోనొక్కొకదానితోఁ జేరి వృద్ధినొందుచున్నది. కృష్ణపక్షమునందు తగ్గుచున్నది; నిత్యమైన పదునాఱవకల అమావాస్యరాత్రియందు సకలప్రాణులయందును ప్రవేశించి మఱునాఁడు మొదలు వృద్ధినొందుచున్నది. కాన, అమావాస్యరాత్రియందు ఏప్రాణులను హింసింపరాదు. చంద్రదేవతపూజార్థమై, అమంగళ మని తలంపఁబడి చంపఁబడుచుండు పాపాత్మయగు తొండనునైతము చంపఁగూడదు.

15. ఏఆత్మ, సంవత్సరము ప్రజాపతి షోడశకల అని చెప్పఁబడుచున్నాఁడో, అతఁడు పరోక్షముగా (కనఁబడక) ఉన్నాఁడని తలంపఁగూడదు. ఇదిగో ప్రత్యక్షముగా నున్నాఁడు. అట్లు కనఁబడువాఁ డేవఁ

డనఁగా, ఇట్లు తెలిసికొన్న పురుషుఁడే; వాఁడే జీవాత్మ. అతని సంపదయే పదునేను కలలు; ఆత్మయొక్క శరీరము పదునాఱవకల, నిత్యమైనకల; అతఁడు విత్తముచేత పూర్ణమును అపూర్ణమును పొందు చున్నాఁడు. శరీరమే నభ్యము (చక్రము మధ్యస్థానము;) విత్తము ఆచక్రపరివారములు, అరములు మొదలగునవి. సకలసంపదలు కోలుపడి నను ఒకఁడు శరీరముతో ప్రాణముతో నుండు నేని సంపదను మరల పొందఁగలఁడు.

16. మనుష్యలోకము, పితృలోకము, దేవలోకము అని మూఁడు లోకములు గలవు. మనుష్యలోకము పుత్త్రునిచేతనే జయింపఁదగినది. పితృలోకము కర్మముచేతనే జయింపఁదగినది. దేవలోకము బ్రహ్మవిద్య చేతనే జయింపఁదగినది. మూఁడవ (దేవ) లోకమే శ్రేష్ఠమైనది. కాఁబట్టియే బ్రహ్మవిద్య విశేషమైనదని ప్రశంసించుచున్నారు.

17. ఇఁక సంప్రత్తి (పుత్త్రున కప్పగించుట) చెప్పఁబడుచున్నది. ఎప్పు డాలాగు చేయవలఁయుననఁగా, తండ్రి యెప్పుడు మరణకాల మాసన్నమైన దని తెలిసికొనుచున్నాఁడో అప్పుడు పుత్త్రునిం బిలిచి వానితో "నీవు బ్రహ్మము, నీవు యజ్ఞము, నీవు లోకము" అని చెప్పవలయును. పుత్త్రుఁడు- "నేను బ్రహ్మము, నేను యజ్ఞము; నేను లోకము" అని చెప్ప వలయును. ఇట్లు గూఢముగాఁ జెప్పినదానితాత్పర్య మేమనఁగా, (వేదముచెప్పుచున్నది; తండ్రి చెప్పునట్లు) ఏయే బ్రహ్మము (వేదము) నాచే అధ్యయనము చేయవలసియుండియు, కొన్ని చేసియు, కొన్ని చేయకయు నున్నదో వానినన్నిటిని నీవు చేయవలయును. ఏయేయజ్ఞము నాచేఁ జేయవలసియుండియు, కొన్ని చేసియు, కొన్ని చేయకయు నున్నదో వానినన్నిటిని నీవు చేయవలయును. ఏయేలోకము (ఫలము) నాచే జయింపఁ బడవలసినదిగా నుండియు, ఇంతవఱకును కొన్ని జయింపఁబడియు, కొన్ని జయింపఁ బడకయు నున్నదో దానినంతయు నీవు జయింపవలయును; "ఒక గృహస్థుఁడు ఇంతమాత్రము చేయవలయును. ఇవియంతయు నాయొద్ద నుండి బయలువడి ఈలోకమునుండి నన్ను రక్షించునుగాక" ఇట్లు పుత్త్రుఁడు తండ్రి నిరక్షించునట్టి అనుశిష్టుఁడాయె నేని, అట్టిపుత్త్రుని "లోక్యుఁడు అని చెప్పుదురు. కావున, తండ్రి పుత్త్రునిఁ జూచి "వీఁడు లోక్యుఁడుగా నుండవలయును" అని శాసించుచున్నాఁడు (లోక్యుఁడనఁగా, తండ్రికి

లోకప్రాప్తిహేతుకర్తయని భావము). ఇట్లు తెలిసికొన్న తండ్రి ఈలోకమునుండి పోయినప్పటికిని మరల ఈవాక్కు, మనస్సు, ప్రాణము, వీనితోఁగూడ పుత్రునిఁజేరుచున్నాఁడు. తండ్రిచే చేయఁబడక మిగిలియుండువానినంతయు పుత్రుఁడు చేసి, తండ్రిని రక్షించుచున్నాఁడు. కావున, 'పుత్రుఁడు' అనఁబడుచున్నాఁడు. ఈలోకమునందు పుత్రునివలన తండ్రి ప్రతిష్ఠగలవాఁడగుచున్నాఁడు. ఇట్టిపుత్రుని దైవములును అమృతములు నైన ప్రాణములు (వాఙ్మనఃప్రాణములు) పొందుచున్నవి. ఎట్లన?

18. పృథివి, అగ్నిలక్షణముగల దైవియైనవాక్కు వీనియందు ప్రవేశించుచున్నది. అనఁగా, ఏదేది వాక్కుతోఁ జెప్పఁబడుచున్నదో అదియంతయు అమోఘముగా నున్నది.

19. స్వర్గము, ఆదిత్యలక్షణముగల దైవియైనమనస్సు వీనియందు ప్రవేశించుచున్నది. మనస్సునందు సుఖమున్నయెడల వానికి దుఃఖము లేదు. ఎల్లప్పుడును సంతుష్టిగలవాఁడై యుండును.

20. జలము, చంద్రలక్షణముగల దైవియైన ప్రాణము వీనియందు ప్రవేశించుచున్నది. అట్టిప్రాణము వీనియందు సంచరించుచును, సంచరింపకయు నుండియు కొఱవడుట లేదు; నశించుటయును లేదు. ఇట్లు తెలిసికొన్నవాఁడు సర్వభూతాంతరాత్మ (పరమాత్మ)యగుచున్నాఁడు. ఇట్లువాఁడు దేవతయగుచున్నాఁడు. ఎట్లు యాగాదికర్మములచే సకలభూతములును ఈదేవతను(ప్రజాపతిని)పూజించి రక్షించుచున్నవో, అట్లు ఈవిషయము నెఱింగినజ్ఞానిని సకలభూతములును రక్షించుచున్నవి. (ఇట్లు తెలిసికొన్నవాఁడు సర్వభూతాంతరాత్మ యగుచున్నాఁ డనఁగా, అందఱి దుఃఖమును వీనినిఁ జేరి బాధింపదా? అనుప్రశ్న వచ్చును. బ్రహ్మజ్ఞానిని దుఃఖము బాధింపదు.) ప్రజలదుఃఖము వారియందుండునేగాని, వీనిని (బ్రహ్మజ్ఞానిని) చేరదు. దేవతలను పాపముచేరునా? చేరదు.

21. (వాఙ్మనఃప్రాణముల) ఉపాసనాక్రమము చెప్పఁబడుచున్నది. వాగాదికరణములను కర్మార్థమై ప్రజాపతి సృష్టించెను. అవి 'నేను పెద్దను' 'నేను పెద్దను' అని పరస్పరము వివాదము చేసికొనెను. 'నేను మాటలాడుచున్నాను' (తక్కినకరణములచే సాధ్యమగునా?) అనివాక్కు చెప్పెను. అట్లే 'నేను చూచుచున్నాను' అని చక్షుస్సును, 'నేను వినుచున్నాను' అని శ్రోత్రమును, ఇట్లు ఆయాకరణములు తమతమప్రభావ

మును ముచ్చటించెను. వీరిని 'శ్రమము' అనుమృత్యువాశ్రయించెను. తమ తమకార్యములను చేయనీయక అడ్డగించెను. కావున, ఇప్పుడును అధికముగ మాటలాడినయెడల వాక్కు శ్రమమొందుచున్నది. అట్లే నేత్రమును, శ్రోత్రమును శ్రమమొందుచున్నవి. ఈశ్రమమనుమృత్యువు ప్రాణమును మాత్రము చేరలేదు. అట్టిప్రాణమును దెలిసికొనుటకు తక్కినకరణములు ప్రయత్నించెను. "ఈముఖ్యప్రాణము మనకంటె శ్రేష్ఠమైయున్నది. సంచరించియు, సంచరింపకయు, కొఱఁతలేకయు, నాశములేకయునున్నది. మనమందఱమును దానిఆత్మగా నున్నాము." అని కరణములు తలంచి, ఆప్రాణరూపమునే పొందినవి. కావున, వాగాదులు ప్రాణములని పేర్కొనఁబడుచున్నవి. ఇట్లు తెలిసికొన్నవాఁడు ఏకులమునందుఁ జేరినవాఁడో, ఆకులమును వీనిపేరుతో వ్యవహరింతురు. ఇట్లెఱింగినవానిపై ఎవ్వఁడు విరోధించినప్పటికిని వాఁడు (విరోధి) క్రమక్రమముగా శుష్కించి కడపట మృతినొందును. ఇది అధ్యాత్మము (ఆత్మసంబంధము).

2. ఇఁక అధిదైవతము చెప్పఁబడును. దేవతలు పరస్పరము విరోధమునొందిరి. ఎట్లన, 'నేను జ్వలించెదను' అని అగ్నియును, 'నేను తపించెదను' అని సూర్యుఁడును, 'నేను ప్రకాశించెదను' అని చంద్రుఁడును, తక్కినదేవతలును తమతమప్రభావమును ప్రశంసించిరి. వాగాదులలో ప్రాణ మెట్లు ముఖ్యదేవతయో, అట్లు అగ్న్యాదిదేవతలలో వాయువు ముఖ్యదేవతగ నున్నది. తక్కినదేవతలందఱును అస్తమయమునుబొందెదరు. వాయుదేవత అస్తమయ మొందుటలేదు. ఎల్లప్పుడును తనపనిని చేయుచున్నది.

23. ఈవిషయమునం దీమంత్రమున్నది. "ఎందుండి సూర్యుఁడు ఉదయమగుచున్నాఁడో, దేనియందు అస్తమయమును బొందుచున్నాఁడో, ఆవాయును, ప్రాణమును, దేవతలు ఉపాసించి వ్రతము ననుష్ఠించిరి. ఇప్పుడును చేయుచున్నారు. ఇంకను చేయుదురు."

కావున అందఱును ఈవ్రతము ననుష్ఠింపవలయును. అనఁగా 'ప్రాణనము' 'అపాననము' (అనఁగా) వాయువృత్తి (ఉచ్ఛ్వాసనిశ్వాస సంబంధమైనయోగము) చేయవలయును. అట్లు చేయనిచో మృత్యువు సమీపించునని భయమొంది చేయవలయును. అట్లు కావించినయెడల, ఆవాయువుప్రాణదేవతతోఁగూడసాయుజ్య, సాలోక్యపదవులుసిద్ధించును.

## షష్ఠబ్రాహ్మణము.

1. (ఇట్లు నానావికారములను బొందకమునుపు ఈజగత్తు ఎట్లుండినదనఁగా) ఈమూఁడువిధములుగ నుండెను. 1 నామము, 2 రూపము, 3 కర్మము. (ఈమూఁడును ఆత్మ కాదు; అనాత్మస్వరూపములే.) ఈనామములకు వాక్కు శబ్దసామాన్యమని చెప్పఁబడినది. ఈవాక్కు నామములయొక్క మూలమైయున్నది. ఎట్లన్న, సకలనామములును వాక్కునందుండి కలిగినవి. ఈవాక్కు సకలనామములకు సామాన్యము. ఏలన, ఇది సకలనామములతోఁగూడ సమమైయున్నది. ఈవాక్కు బ్రహ్మము (ఆత్మ, ఆత్మాలయము). ఏలన, ఇది సకలనామములను భరించుచున్నది.

2. చక్షుస్సు రూపములకు మూలము (ఆధారము) పూర్వోక్త ప్రకారముగా దీనికిఁదగినట్లు అర్థము చేసికొనునది.

3. కర్మములకు ఆత్మ(శరీరము) ఆధారము (మూలము). పూర్వమువలె అర్థమును గ్రహించుకొనునది.

ఈనామరూపకర్మములు మూఁడును సత్తుగా నేకమైయున్నవి. ఈశరీరము ఈమూఁటిలోను ఉన్నది. అది అమృతము. సత్యముచే నావరింపఁబడియున్నది. అమృతమనఁగా ప్రాణము. సత్యమనఁగా నామరూపములు. ఈ రెంటిచే ప్రాణము ఆవృతమై మఱేఁగింపఁబడియున్నది.

---

# ద్వితీయాధ్యాయము.

## ప్రథమబ్రాహ్మణము.

1. గర్వితుఁడును, వాక్పటుత్వముగలవాఁడును, గార్గ్యవంశోస్థుఁడును అగుగార్గి, లేక బాలాకి యనునతఁ డొకఁడుండెను. అతఁడు కాశిరాజైన అజాతశత్రువునుజూచి "నీకు బ్రహ్మవిద్య నుపదేశము చేసెదను" అనఁగా, ఆరాజు—"ఈమాటకు వేయిగోవులనిచ్చెదను; జనకుఁడు దాతయనియు శుశ్రూషు వనియు సందఱకును తెల్లము." అని అనెను.

2. గార్గి, లేక బాలాకి—"(బైట) ఆదిత్యునియందును,(లోపల) చక్షుస్సునందును ఒక్కపురుషుఁడై చక్షుర్ద్వారముగా హృదయము

నందు ప్రవేశించి, కర్తయనియు భోక్తయనియు పేరొంది యెవఁడు ప్రకాశించుచున్నాఁడో అతఁడే బ్రహ్మమని నేను ఉపాసించెదను; నీవును అతనినే ఉపాసింపుము."

అజాతశత్రువు—"అట్లనరాదు; అట్లనరాదు (ఇది బ్రహ్మముకాదు; నీవు చెప్పినదేవునకు గుణమున్నది). సకలభూతములకును శ్రేష్ఠమైనదై, శిరస్సై, రాజై యున్నాఁడనిగదా నీ వా దేవతనుతలంచి ఉపాసించునట్లు చెప్పెదవు (అది సగుణవస్తువు, దానిని ఉపాసించినయెడల దానికిఁ దగిన ఫలమే కలుగును). అట్లు ఉపాసించువాఁడు సకలభూతములకును శ్రేష్ఠుఁడై, ముఖ్యుఁడై, రాజై యుండెను. (ఇది నాకుఁ దెలిసిన విషయము; ఇంతకంటె శ్రేష్ఠమైనదానిని చెప్పుము.)

3. (ఇది మొదలు 14-వ మంత్రమువఱకును ఒక్కొక్క దేవతను గూర్చి 'ఇది బ్రహ్మము, ఇది బ్రహ్మము' అని బాలాకి అనుగార్గ్యి చెప్పఁగా, 'అది కాదు, అది కాదు' అని అజాతశత్రువుబదులు చెప్పుచున్నాఁడు. రెండవ మంత్రమునందుఁ జెప్పఁబడిన ప్రకారము ఇద్దఱకును సంవాదము, ఒక్కొకమంత్రమునకును దేవత, గుణము, ఫలము ఇవిమాత్రము వేర్వేరుగా చెప్పఁదగినది. దానిదానికిఁ దగినట్లు సంవాదమును యోజించుకొనవలయును). దేవత - చంద్రునియందును మనస్సునందు నుండుపురుషుఁడు. గుణము - గొప్పదగుశుక్లవస్త్రము గలవాఁడు; అప్సరీరి; సోమరాజు. ఫలము - సోమపానము (యజ్ఞము చేయఁబడును). వికారమైన అన్నములంతయు వృద్ధియగును. వానికి అన్నము కొఱఁత లేకయుండును.

4. దేవత - విద్యుత్తు (మెఱుపు) నందును, త్వక్ హృదయము నందు నుండుపురుషుఁడు; గుణము-తేజస్వి; ఫలము-వీఁడు తేజస్విగను, వీని ప్రజలు తేజస్వులుగను నుందురు.

5. దేవత - ఆకాశమునందును, హృదయాకాశమునందు నుండు పురుషుఁడు; గుణము-పూర్ణముగను, కొఱఁత లేకయు నుండునట్టిది; ఫలము-పుత్త్రులును పశువులును సమృద్ధిగనుండును. వాని ప్రజలు సంపూర్ణాయువుగలవారై యుందురు.

6. దేవత-వాయువునందును, ప్రాణమునందు నుండుపురుషుఁడు; గుణము-పరమేశ్వరుఁడు (శ్రేష్ఠుఁడు); మనుష్యులచే జయింపఁబడనివాఁడు; పరులచే జయింపనలవిగాని సేనలు (మరుద్గణములు) గలవాఁడు;

ఫలము-జయశీలుఁడు; శత్రువులను జయించువాఁడు; శత్రువులచే జయింపఁ గూడనివాఁడు.

7. దేవత-అగ్నియందును, చిత్ హృదయము (జ్ఞానము) నందు నుండుపురుషుఁడు; గుణము-శాంతము; ఫలము-వీఁడును వీని ప్రజలును శాంతముగలవారై యుందురు.

8. దేవత-జలమునందును, రేతస్సునందును నుండుపురుషుఁడు; గుణము - ప్రతిరూపమిచ్చునది; ఫలము - ప్రతిరూపమును బొందు చున్నాఁడు; తనకు ప్రతిరూపమైనప్రజలను గలుగఁ జేయుచున్నాఁడు.

9. దేవత-అద్దమునందును, శుద్ధహృదయమునందు నుండుపురుషుఁడు; గుణము-ప్రకాశము; ఫలము-వీఁడును వీనిప్రజలును ప్రకాశముగలవారై యుందురు. తనతోఁ జేరిన వారందఱికంటె శ్రేష్ఠుఁడై యుండును.

10. దేవత-గతమైనదానినిగూడ వెన్నంటినను దేదియో అది, ప్రాణము, జీవుఁడు; గుణము-జీవనకారణము; ఫలము-సంపూర్ణాయువు; అకాలమృత్యువు వీనిని ఆశ్రయింపదు.

11. దేవత-దిక్కునందును, శ్రోత్రమునందును గలపురుషుఁడు (అనఁగా అశ్విదేవతలు); గుణము మిథునము (జంట) గను, ఎడఁబాయకయు నుండుట; ఫలము-రెండవదిగలవాఁడై యుండును; ఇతనిసమూహము కొఱవడకయుండును.

12. దేవత-ఛాయాపురుషుఁడు, అజ్ఞానదేవత;గుణము-మృత్యువు; ఫలము-పూర్ణాయువు; అకాలమృత్యువు లేదు.

13. దేవత-ప్రజాపతి ఆత్మ, బుద్ధి ఆత్మ; గుణము-ఆత్మత్వము; ఫలము-వీఁడును, వీనిప్రజలును ఆత్మవంతులుగను, బాహుళ్యముగల వారునై యుందురు. అనిచెప్పి గార్గి మౌనముగనుండెను.

14. అజాతశత్రువు=ఇంక నేమియుఁ జెప్పవలసినదిలేదా ?

గార్గి-ఇంతకన్న నేమియులేదు.

అజాతశత్రువు-ఇప్పుడు చెప్పినదానివలనఁ దెలియఁదగినది తెలియఁబడదు.

గార్గి-ఇంతకంటె నేమియు నాకుఁ దెలయదు. ఇఁక నీవుచెప్పుము. నీకు నేను శిష్యుఁడనై వినఁగలను. నీవు నాకు గురుపవై యుండుము.

15. అజాతశత్రువు-గార్గ్యునిఁజూచి "నీవిట్లు చెప్పుట సరి కాదు; బ్రాహ్మణుఁడు క్షత్త్రియుని గురువుగావరించుట ధర్మము కాదు; నీవేనాకుగురుఁడ వైయుండుము; నేను నీకుఁ దెలియఁజేసికొనెదను." అని చెప్పి, గార్గ్యుని చేయిఁబట్టి యొకచోట నిద్రపోవుచుండువానికడకు తోడ్కొని చనెను. ఆనిద్రపోవుచుండువానింజూచి అజాతశత్రువు "ఓ బృహత్, పాండరవాస, సోమరాజ" అని పిలిచెను. అతఁడు లేవలేదు. తర్వాత చేతితో (శరీరమును) తట్టి లేపెను. అపుడు లేచెను.

16. అజాతశత్రువు "ఈవిజ్ఞానమయపురుషుఁడు తట్టిలేపకమునుపు ఎచ్చటనుండెను? నిద్రపోవువానివలెనుండినాఁడా; ఇపు డెచటనుండి వచ్చినాఁడు? లేక వచ్చినవానివలె కనఁబడినాఁడా? నీకుఁ దెలియునా?" అని గార్గ్యుని అడుగఁగా, నతఁడు 'నాకేమియుఁ దెలియదు' అనెను.

17. అజాతశత్రువిట్లనియె - ఈవిజ్ఞానమయపురుషుఁడు నిద్రలో నెచ్చటనుండినాఁ డనఁగా, స్వశక్తి (విజ్ఞానము) చేత వాగాదితత్త్వముల సామర్థ్యమును గ్రహించి తనస్థానమైన అంతరహృదయాకాశమునందు శయనించియున్నాఁడు. వానిని ఎప్పుడు గ్రహించుచున్నాఁడో, అపుడు 'నిద్రపోవుచున్నాఁడు' అని చెప్పబడును.అప్పుడు ప్రాణము (ఘ్రాణేంద్రియము) గ్రహింపఁబడుచున్నది; అట్లు వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, ఇవియు గ్రహింపఁబడుచున్నవి.

93. ఈపురుషుఁ డెప్పుడు స్వప్నవృత్తితో సంచరించుచున్నాఁడో, అప్పుడు ఈలోకములు వానికి స్థానములు; మహారాజువలెను, మహాబ్రాహ్మణునివలెను ఉన్నాఁడు. మఱియు మహాస్థితిని (దేవతాదిదశను), హీనదశను (తిర్యగాదిదశను) పొందుచున్నాఁడు. ఎట్లు మహారాజు తనపరిజనులతోఁ దనయిష్టప్రకారము సంచరించు(వర్తించు)చున్నాఁడో, అట్లు స్వప్న కాలమునందు ఈపురుషుఁడు పైనిచెప్పినతత్త్వములను గ్రహించికొని తనశరీరమునందు ఇష్టప్రకారము సంచరించుచున్నాఁడు.

19. ఏకాలమునందు దేనిని తెలిసికొనకయున్నాఁడో, అనఁగా కరణాదులచేష్టలు లేకయున్నాఁడో అప్పుడు సుప్తుఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శరీరమునందు హితము లనుపేర్లుగల డెబ్బదిరెండువేలనాడులున్నవి.పుండరీకాకారము గలదియును, హృదయమనుపేరుగలదియు నగు

మాంసపిండమునుండి ఆనాడులు శరీరమంతయు వ్యాపించి యున్నవి. (బుద్ధి యను అంతఃకరణస్థానమే హృదయము.) ఈబుద్ధియందు విజ్ఞానమయపురుషుఁ డున్నాఁడు. (అనఁగా బుద్ధిని వ్యాపించికొనియున్నాఁడు. జలమం దెట్లు చంద్రుఁడు ప్రతిఫలించుచున్నాఁడో అట్లు బుద్ధియందు ప్రతిబింబించుచు,ఆప్రతిబింబమూలముగా బుద్ధికి శక్తినొసంగుచు ప్రత్యేకమైయున్నాఁడు.) ఆబుద్ధిచేత తక్కిన శ్రోత్రాదికరణములు ప్రేరింపఁబడుచున్నవి. (జాగ్రత్కాలమునందు ఆనాడులమూలముగా చేపలవలె బుద్ధి వ్యాపించుచున్నది. అపుడు కరణములకు శక్తి కలుగుచున్నది. తప్తలోహమం దెట్లు అగ్ని సర్వత్ర వ్యాపించియున్నదో, అట్లు బుద్ధి శరీరమంతయు వ్యాపించియున్నది. అవల లాగఁబడుచున్నది. అప్పుడు సకలకరణములును వ్యాపారరహితమై, శక్తిలేనివై యుండును.) అపు డీపురుషుఁడు బాలునివలెను, మహారాజువలెను, మహాబ్రాహ్మణునివలెను విచారము లేక, మహాసంతోషము ననుభవించుచు సుఖముగనుండును. ఇదే నిద్రపోవుట యని చెప్పఁబడునని తెలియవలెను.

20. ఊర్ణనాభి యనుపట్టుపురుగు ఎట్లు తనయందుండియే నూలిని ప్రసరింపఁజేసి మరల నదియే ఆనూలును తనలోపలికి గ్రహించికొనుచున్నదో ఆరీతిగను, అగ్నియందుండి అల్పకణము లెట్లు ప్రసరించుచున్నవో అట్లును, ఈఆత్మయందుండి సకలతత్త్వములును, సకలలోకములును, సకలదేవతలును,సకలభూతములును కలిగెను.ఆత్మనుగూర్చిన ఉపనిషద్వాక్యము సత్యమునకంతయు సత్యమైయున్నది. ప్రాణము సత్యము; దానికంటె ఆత్మ సత్యము. (ఈప్రపంచమంతయు ఆత్మమయము; అనఁగా బ్రహ్మమయము. దానికంటె సత్యమైనది వేఱేదియు లేదు. ఆబ్రహ్మమే ఒక్కదశయందు సంసారియై (ప్రపంచమై) ఒక్కదశయందు అసంసారియై (నిష్ప్రపంచమై) అనఁగా నిర్గుణబ్రహ్మమై యున్నది.)

---

## ద్వితీయబ్రాహ్మణము.

1. ఎవఁడు శిశువును (మధ్యమప్రాణమును) సాధనముగను, సప్రత్యాఖ్యానముగను, సస్థూణముగను, సదామముగను తెలిసికొనుచున్నాఁడో, వాఁడు ఏడ్గురుశత్రులను జయించును. (అనఁగా కన్నులు రెండు, చెవులు రెండు, ముక్కుపుటములు రెండు, నోరు ఒకటి, అను

నీసత్తేంద్రియములచే గ్రహింపఁబడువిషయేచ్ఛలను జయించుచున్నాఁడు; అనఁగా నీయింద్రియములను స్వాధీనముచేసికొనుచున్నాఁడు. శిశువనఁగా మధ్యమప్రాణము, అనఁగా ఏప్రాణము శరీరమధ్యమునందుండి ఐదువిధము లగుశరీరములను వ్యాపించికొనియుండునో అది శిశు వనఁబడును. అది సాధనము—ఆధానముతోడను, ఈశరీరముతోడను గూడియున్నది. సప్రత్యాధానము—శరీరమునం దొక్కొక్కప్రదేశమునందును జేరి యున్నది. సస్థూణము—బలముగలదై యున్నది; సదాము—అన్నము గలదై యున్నది.)

2. ఆశిశువగుప్రాణమును అనుసరించి ఏడుఅక్షితులు(తఱుఁగనివి, ప్రాణమున్నంతవఱకుండునవి) కనులయందు ఉన్నవి. అవి యేవియన, నేత్రమందుండు రక్తధారలమూలముగా రుద్రదేవతయును, నేత్రజల మూలముగా పర్జన్య(వరుణ)దేవతయును, నేత్రబింబముఅండము(గ్రుడ్డు) మూలముగా ఆదిత్యదేవతయును, నల్లనిగ్రుడ్డుమూలముగా అగ్నిదేవ తయును, తెల్లనిగ్రుడ్డుమూలముగా ఇంద్రదేవతయును, దిగువఱెప్పమూల ముగా పృథివీదేవతయును, పైఱెప్పమూలముగా ఆకాశదేవతయును ఈప్రాణమును అనుసరించియున్నవి. ఇట్లు ప్రాణమును దెలిసికొన్నవానికి అన్నము సమృద్ధిగా నుండును.

3. ఈవిషయమై యొకమంత్ర మున్నది. ఎట్లన, శిరస్సు చమస్సు స్వరూపముగలది (యజ్ఞమం దుపయోగింపఁబడుపాత్రవిశేషము). అందు నానారూపములుగలయశస్సు (ప్రాణము) ఉంచఁబడియున్నది. దాని యందుసప్తఋషులున్నారు. సత్యపదార్థములు, ఇంద్రియములుఉన్నవి.) శబ్దరాశితోఁ గూడినవాక్కు ఎనిమిదవఋషియైయున్నది. (ఆయేడుగురు ఋషులనుగూర్చి ఇఁకఁ జెప్పఁబడును.)

4. కుడిచెవి గౌతముఁడు; ఎడమచెవి భారద్వాజుఁడు; కుడికన్ను విశ్వామిత్రుఁడు; ఎడమకన్ను జమదగ్ని, కుడిముక్కు వసిష్ఠుఁడు; ఎడమ ముక్కు కశ్యపుఁడు; వాక్కు అత్రి; వాక్కు (నోరు) తినుటంబట్టి అత్రి యనఁబడెను. ఇట్లు తెలిసినవానికి సర్వమును అన్నమైయుండును (అనఁగా సర్వమును భుజించును).

## తృతీయబ్రాహ్మణము.

1. బ్రహ్మమునకు రెండురూపములుగలవు.

(ఒకటి) మూర్తము (రూపముగలది). మర్త్యము (నాశముగలది). స్థితము (ఉండునట్టిది, కొలతకు లోఁబడినది). సత్తు (ప్రత్యక్షమైనది, కంటికిఁ దెలియునట్టిది).

(రెండు) అమూర్తము (రూపములేనిది). అమృతము (నాశరహితమైనది). యత్ (సదాగతిగలది. కొలతకు లోఁబడనిది). త్యత్ (అపరోక్షమైనది, కంటికి దెలియనిది).

2. పంచభూతములలో పృథివి, అప్పు, అగ్ని ఈమూఁడును మొదటితరగతిలోనిది (మూర్తములోనిది). వీనిలో సూర్యుఁడుసారము.

3. వాయువు, ఆకాశము అను నీరెండును రెండవతరగతిలోనిది (అమూర్తములోనిది). పైనిచెప్పిన సూర్యునియందలి పురుషుఁడు సారము. ఇది అధిదైవతవిషయము.

4. అధ్యాత్మవిషయము (చెప్పఁబడుచున్నది). శరీరములోని పంచభూతాంశములలో పృథివి,జలము, అగ్ని, ఈమూఁటియొక్క అంశములన్నియు మొదటితరగతిలోనివి. వీనిలో నేత్రము రసమైయున్నది.

5. శరీరములోనుండు ప్రాణవాయువును, ఆకాశమును రెండవతరగతిలోనివి. వీనిలోకుడికంటియందుండుపురుషుఁడురసమై యున్నాఁడు.

6. ఈపురుషుని రూపము (సూర్యమండలాంతర్గత పురుషుని యొక్క, అక్షిపురుషునియొక్క,లింగాత్మయొక్క, హిరణ్యగర్భునియొక్క, అవ్యాకృత పురుషునియొక్క, సగుణబ్రహ్మముయొక్క రూపము) ఏదనఁగా, వాసనారూపమైయున్నది. (అనాదియై, అకారణమైనదైయుండు స్వభావము వాసన యనఁబడును.) లోకమునందు వాసనారూపమునకు దృష్టాంతము లెవ్వియనఁగా, పసుపుదోవతి, నల్లకంబళి, పట్టుపురుగు, అగ్నికాంతి, తెల్లతామర, మెఱుము వీనివంటి స్వభావముగలది. (వీనియందలి వర్ణములును, కాంతులును స్వభావముఁగలవి; విచిత్రమైనవి; ఇట్లు పలువిధములుగను, విచిత్రములుగను, అనేకపదార్థముల ననుసరించినదియు నగు స్వభావగుణమే సగుణబ్రహ్మరూపము. నిర్గుణబ్రహ్మమే యిట్లు సగుణమైనది. రెండును ఒక్కటే, వేర్వేఱు కాదు; దశమాత్రమే

వేలు; దశకుఁ దగిన వేర్లును గలవు.) ఒక్కమాఱు మెఱుము మెఱసిన యెడల సర్వమును ప్రకాశముగాఁ దెలియుచున్నది; ఇట్టిస్వభావముగలది. ఆ బ్రహ్మము నిట్లు తెలిసికొన్నవానికి శ్రీ (ఖ్యాతి) కలదు. ఆ బ్రహ్మమునకు ఆదేశము (గుర్తు) ఏదనఁగా, "నేతి, నేతి" అనునది అనఁగా "అదికాదు, అదికాదు" అనునది. దీనికంటె వేఱే ఆదేశము లేదు. దాని పేరేమన, "సత్యస్యసత్యమ్" "సత్యమునకంతయు సత్యము" ప్రాణములు సత్యమై యున్నవి. వీనికంటెను 'బ్రహ్మము' సత్యమైయున్నది. (అనఁగా అత్యంత సత్యము; ప్రాణముకంటె శ్రేష్ఠమైనది.)

---

## చతుర్థబ్రాహ్మణము.

(సంసారము అవిద్యావిషయమైయున్నది. దానికి కర్మము అంగమై యున్నది. ప్రత్యగాత్మ (బ్రహ్మజ్ఞానము) విద్యావిషయమై యున్నది. దానికి సన్న్యాసము అంగమైయున్నది. (సన్న్యాసమనఁగా సర్వకర్మత్యాగము).ఆసన్న్యాసవిషయము కథారూపముగాఁ జెప్పఁబడుచున్నది.

1. యాజ్ఞవల్క్యుఁడు తనభార్యయగు మైత్రేయినిఁజూచి యిట్లనియె:—"మైత్రేయీ, వినుము. నే నీగృహస్థాశ్రమమునందుండి శ్రేష్ఠమైన ఆశ్రమమునకుఁ బోవుటకు నిశ్చయించితిని; కావున, నేను నిన్నును ఇంకొకభార్యయైన కాత్యాయనిని వేఱుగానుంచెదను (సాధనమును విభజించి యిచ్చెదను)" అనెను.

2. మైత్రేయి యిట్లనియె:—"స్వామీ, ధనముచే పూర్ణమైన యీభూమియంతయునాకున్నయెడల నేనుఅమృతమైయుందునా?(అనఁగా ధనముండిన యాగాదులొనర్చి అమృతత్వమును బొందవచ్చును. మీరు అమృతత్వమునుబొందుటకై ధనమును త్యజింపనెంచితిరి. అదేల?.)"

యాజ్ఞవల్క్యుఁడు:—"అట్లుకాదు; ఉపకరణములుగలవారుజీవనము చేయునట్లు, నీకు ధనమున్నయెడల నీవును సుఖముగా జీవనము చేయవచ్చునని చెప్పినాఁడను; ధనసాధనముచే నొకప్పుడును అమృతత్వము కలుగనేరదు."

3. మైత్రేయి:—"అమృతమునకు సాధనము కానట్టిధనము నాకేల? కాఁబట్టి నాకు ఆధనమువలదు. దేనిచే అమృతత్వము సిద్ధించునో దానినిఁ జెప్పుము."

4. యాజ్ఞవల్క్యుఁడు:—"ప్రేయసీ! నీవు మంచిమాట చెప్పితివి, కూర్చుండుము, నేను చెప్పెడిదానిని జాగ్రత్తతో వినుము."

5. ప్రేయసీ! భార్యయైనది, తనపతియొక్క ప్రయోజనము నిమిత్తమైమాత్రమా ప్రియమైయుండుట? కాదు. తనఆత్మప్రయోజనమై ప్రియముగానున్నది. అట్లే పతియైనవాఁడు తనపత్నియందును, తండ్రియైనవాఁడు కుమారునియందును, ఒకఁడు ధనమునందును, ఒకఁడు బ్రాహ్మణునియందును, ఒకఁడు క్షత్రియునియందును, ఒకఁడు లోకులయందును, ఒకఁడు దేవతలయందును, ఒకఁడు భూతములయందును, ఒకఁడు సమస్తమునందును ప్రీతినుంచుచున్నాఁడు. సర్వమును ఆత్మకొఱకేగాని వేఱుకాదు; ఆత్మయే చూడఁదగినది; వినఁదగినది; తలంపఁదగినది; ధ్యానింపఁదగినది. ఆత్మదర్శనముచేతను, శ్రవణముచేతను, స్మరణముచేతను, ధ్యానముచేతను సర్వమును బోధమగును.

6. (ఆత్మను దెలిసినయెడల సర్వమును దెలియును.) ఒక బ్రాహ్మణుని ఆత్మకంటె వేఱుగాఁ దలంచినయెడల(ఆ బ్రాహ్మణుఁడువీనిని)నిగ్రహించును (సహాయముచేయఁడు; తన్ను తెలిసికొనలేదని అనుగ్రహింపఁడు). అట్లే క్షత్రియుఁడును, లోకములును, దేవతలును, భూతములును, సమస్తమును తనఆత్మకంటె వేఱుగా నెఱింగినయెడల, పైనిచెప్పఁబడిన వన్నియు వీనిని లక్ష్యపెట్టక నిగ్రహింతురు. కావున సమస్తమును ఆత్మయని యెఱుంగఁదగును.

7. (సర్వము నాత్మయనుట యెట్లనఁగా) ఒకభేరీవాద్యశబ్ద మెట్లు ఇతరశబ్దముల నన్నిటిని వినఁబడక తనలో నైక్యముచేసికొనుచు, తాను మాత్రము (భేరీశబ్దము) వినఁబడునో, (అట్లు స్వప్నజాగ్రద్దశలందు ప్రజ్ఞానముకంటె వేఱెద్దియు లేదు. ఇది లేనియెడల ఏయింద్రియములకును, ఏఅవయవములకును వ్యాపారము లేదు. ఇదియే సమస్తమునై యున్నది.)

8. అట్లు శంఖవాద్యశబ్దమునందును ఇతరశబ్దములన్నియు అణఁగిపోవుచున్నవి.

9. ఇట్లు వీణావాద్యస్వరమును, తనకంటె లోఁబడిధ్వనించెడి సకలస్వరములను అణఁగించి కొనుచున్నది.

10. (అగ్నియందుండి మిణుఁగురులు, పొగ, నిప్పు, జ్వాల మొదలగునవి కలిగినప్పటికిని, అగ్నిమాత్రము ఒక్కటిగనే యున్నదో, అట్లు

ఏకమై, ప్రజ్ఞానఘనమైన బ్రహ్మమునందుండి నామరూపవికారమైన జగత్తు కలిగెనని చెప్పఁబడుచున్నది.)

చెమ్మగల కట్టెలచే మూయఁబడినఅగ్ని యందుండి యేప్రకారము పలువన్నెలపొగ వెడలుచున్నదో, అట్లు ఈమహాభూతమైనపరమాత్మ యందుండి శ్వాసమువలె (తనకుతానై వచ్చుచుండు ఊపిరివలె) నాలుగు వేదములును, ఇతిహాసములును, పురాణములును, విద్యలును, ఉపనిషత్తులును, శ్లోకములును, మంత్రములును, వ్యాఖ్యానములును వెలువడినవి. ఇవి పరమాత్మయొక్క శ్వాసములు.

11. (ఆప్రజ్ఞానఘనమైన పరబ్రహ్మముకంటె వేఱైనదేదియు లేదు; సమస్తప్రపంచమును బ్రహ్మమే; ప్రళయకాలమునందు మిగిలియుండునదియు బ్రహ్మమే.)

వాపీ, కూప, తటాక, నదీ, నద, జలమెల్లయు, నేప్రకారము సముద్రములోఁజేరి ఏకమగుచున్నదో (స్థానమైయున్నదో), సకలస్పర్శములకు త్వక్కును. సకలరసములకు జిహ్వయు, సకలగంధములకు నాసికయు, సకలరూపములకు నేత్రమును,సకలశబ్దములకు శ్రోత్రమును, సకలసంకల్పములకు మనస్సును, సకలవిద్యలకు హృదయమును, సకల కర్మములకు హస్తములును, సకలానందములకు ఉపస్థమును, సకలవిసర్గములకు పాయువును, సకలమార్గములకు పాదములును, సకలవేదములకు వాక్కును ఎట్లు స్థానములైయున్నవో (అట్లు సర్వప్రపంచమునకు ఆత్మయైన జగత్తు ప్రళయకాలమునందు ప్రజ్ఞానఘనమైన బ్రహ్మముతోఁజేరి ఏకమగుచున్నది; కాన. జగమునకు స్థానము బ్రహ్మమే).

12. ఎట్లు జలములో వేయఁబడిన ఉప్పుగడ్డ జలరూపమునేపొందుచున్నదో, దానిని మరల ఉప్పుగడ్డగా నెత్తుటకు వీలుకానేరదో, ఆజలమునందేయేచోటులందుండి జలమునెత్తి రుచిచూచినప్పటికిని అంతయు ఉప్పగనుండునో, అట్లు మహాభూతమై, అనంతమై, అపారమై, విజ్ఞానఘనమైన (దృష్టాంతమునందు జలస్థానీయమైన) బ్రహ్మమునందు (ఉప్పుగడ్డస్థానీయమైన) ఈజగత్తు లయమును బొందుచున్నది. మఱియు ఈసత్యవాచ్యములైన పంచభూతములయందుండి సమస్తమును గలిగి యందే లయమొందుచున్నవి; లయమైనమీఁద దానిదాని నామరూపములు నశించుచున్నవి. ఈప్రకారము యాజ్ఞవల్క్యుఁడు మైత్రేయికిఁ జెప్పెను.

13. మైత్రేయి యిట్లనియె:—ప్రజ్ఞానఘనమని యొకపేరుపెట్టి ఆ బ్రహ్మమును చెప్పితిరి; దానిని పొందినమీఁద నామరూపములు నశించు ననియుఁ జెప్పితిరి. ఈవిషయము నాకు స్పష్టముగ బోధము కాకున్నది. (పరస్పరము విరోధముగనున్నది.) నాకు దానిని స్పష్టముగ దెల్పవల యును.

యాజ్ఞవల్క్యుఁడు—నేను తెలియనిదానిని నీకుఁ జెప్పలేదు. నేను జెప్పినంతమాత్రము విజ్ఞానమునకుఁ జాలును కదా.

(నేనుజెప్పిన దేమనఁగా, అవిద్యాసంబంధ భేదము నశించినయెడల, దానితో సంబంధించిన నామరూపములు నశించిపోవును. జలోపాధిచేఁ గనంబడు చంద్రబింబము, ఆఉపాధి నివృత్తమైనమీఁద చంద్రబింబము నివృత్తమగును. అప్పుడు ప్రతిబింబముమాత్రము నశించి నిజచంద్రుఁడు మాత్ర ముండును. అట్లు అవిద్యోపాధిచేఁ గల్గిన ప్రపంచము నశించిన మీఁద ప్రజ్ఞానఘన మొక్కటిమాత్రమే శేషించును.)

14. ఏకారణముచే నొకనికిద్వైత (భేద) భావముకలుగుచున్నదో, ఆ కారణముచే (భేదభావముచే) ఇతరుఁడు(ఆత్మకంటె వేఱైనవాఁడు)ఇతర వస్తువును జూచుచున్నాఁడు; వినుచున్నాఁడు; మూర్కొనుచున్నాఁడు; మాటలాడుచున్నాఁడు; తలంచుచున్నాఁడు; తెలిసికొనుచున్నాఁడు; అని యేర్పడుచున్నది. వానికి సమస్తమును ఆత్మగాఁదోఁచి, అద్వైతజ్ఞానము కలిగినయెడల అప్పుడు 'ఎవఁడు, దేనిచే, దేనినిచూచుచున్నాఁడు; వినుచు న్నాఁడు; మూర్కొనుచున్నాఁడు; మాటలాడుచున్నాఁడు; తలంచుచు న్నాఁడు; తెలిసికొనుచున్నాఁడు?' అని తోఁచును (అనఁగాచూచువాఁడు వేఱే లేఁడు; చూడఁబడువస్తువును వేఱే లేదు; దేనిచేచూడఁబడుచున్నదో ఆకరణమును వేఱే లేదు; సర్వము నేకమైపోవుచున్నది. అప్పుడు నామ రూపములకు నాశముకలుగుచున్నది.)

ఏకరణముచే వీనినంతయు నెఱుంగుచున్నాఁడో, అది దేనిచే నెఱుఁ గుచున్నది? తెలిసికొనువానిని దేనిచేఁ దెలిసికొనుచున్నది? (దానిచేతనే చూడవలయును, వేఱేకరణముచేఁగాదు; అన్నియునొకటే)

—

## పంచమ బ్రాహ్మణము.

(అమృతత్వసాధనమేది? అని మైత్రేయి యడిగెను. అది సన్న్యాసాంగవిషయమైన ఆత్మజ్ఞాన మనియును, ఆత్మ తెలియఁబడినయెడల సమస్తమును దెలియఁబడుననియును, ఆత్మయే సకలవస్తువులకంటె ప్రియమైనదనియును, కావున ఆత్మయే చూడఁదగినదియు వినఁదగినదియు తెలియఁదగినదియు నని చెప్పఁబడినది.

ఈసర్వమును ఆత్మయందుండియే కలిగినది, దానివలననేయున్నది; దానియందే లయమగుచున్నది. అని. ఇది సరియా? అని సంశయము కలుగఁగా, అది యీ బ్రాహ్మణమువలన నివృత్తియగుచున్నది. దేనిచే పృథివ్యాదిజగద్వస్తువులు పరస్పరము ఉపకార్యోపకారకభూతములై యున్నవో, లోకమునందే దేది పరస్పరము ఉపకార్యోపకారకమై యున్నదో, అవి ఒక్కకారణమునుండియే కలిగి, ఒక్కకారణముతోనే యుండి, ఒక్కకారణమునందే లయమొందునట్లు కనఁబడుచున్నదో, ఆకారణముచే పృథివ్యాదిలక్షణమైనయీ ప్రపంచము ఆప్రకారముగనే యున్నది యని యీ బ్రాహ్మణమునందు చెప్పఁబడును.)

ఈపృథివి సకలభూతములకును (బ్రహ్మాది స్తంబపర్యంతము) మధువు (తేనె) వలె నున్నది; (ఎట్లు తేనెతెట్టె పెక్కుతేనెటీఁగలచే కావింపఁబడియున్నదో, అట్లేభూమి సకలభూతములచే కావింపఁబడి నిర్వహింపఁబడియున్నది.) అట్లే సకలభూతములును పృథివికి మధువైయున్నది. తేనెను ఈఁగలుభుజించునట్లు ఈభూమిని సకలభూతములుభుజించు (అనుభవించు) చున్నవి. (ఇంతియగాక) ఈపృథివియందు చిన్మాత్రప్రకాశుఁడును, అమృతమయుఁడునగు పురుషుఁడును (భూమియందంతర్యామియైయుండు ఆత్మ, అతఁడు లేనిచో వృక్షాదులు మొలువవు) అధ్యాత్మమై తేజోమయుఁడై అమృతమయుఁడైనపురుషుఁడును (శరీరములో నుండు జీవుఁడు, ఈజీవుఁడు లేనియెడల శరీరముజడమైపడిపోవును)సర్వభూతములకును మధువైయున్నారు. అట్లే సకలభూతములును పైనిచెప్పినపురుషులకు మధువైయున్నవి. (ఇట్లీవినాలుగును పరస్పరము ఉపకార్యోపకారకములై యునవి. ఈనాలుగును ఏకమై సర్వభూతకార్యమై యున్నవి. అన్నియు నొక్కకారణమునందుండియే కలిగినవి. బ్రహ్మము తక్క తక్కినవన్నియు నామమాత్రమేగాని సత్యముకాదు.) ఇది అమృ

తము, ఇది బ్రహ్మము, ఇది సర్వము, అని చెప్పఁబడు ఆత్మయే పైన చెప్పినవస్తువు.

(ఇకఁ జెప్పఁబడు మధువిషయమున కంతయు తాత్పర్యమును గ్రహించికొనవలయును. విశేషములుమాత్రము తెలుపఁబడును).

2. ఈజలము సకలభూతములకును మధువైయున్నది. అధ్యాత్మము, రేతోరూపముగా శరీరమునం దుండు ఆత్మ.

3. ఈ అగ్ని మధువుగనున్నది. అధ్యాత్మము, వాగ్రూపమై శరీరమునందుండు ఆత్మ.

4. ఈవాయువు మధువుగానున్నది. అధ్యాత్మము, ప్రాణరూపము.

5. ఈఆదిత్యుఁడు మధువు. అధ్యాత్మము, అక్షిపురుషుఁడు.

6. ఈచంద్రుఁడు మధువు. అధ్యాత్మము, మనోరూపపురుషుఁడు.

7. ఈదిక్కులు మధువు. అధ్యాత్మము, శ్రోత్రమందుండు పురుషుఁడు.

8. ఈవిద్యుత్తు (మెఱుపు) మధువు. అధ్యాత్మము, తేజస్సంబంధమైన త్వగ్రూపపురుషుఁడు.

9. ఈఉఱుము మధువు. అధ్యాత్మము, శబ్దసంబంధ ధ్వనిరూప పురుషుఁడు.

10. ఈఆకాశము మధువు. అధ్యాత్మము, హృదయాకాశరూప పురుషుఁడు.

11. ఈధర్మము మధువు. (ధర్మమనఁగా అదృష్టఫలరూపమైన కర్మము; అది రెండువిధములు—(1) పృథ్వ్యాదులను నడుపునట్టి స్వభావముగలది; (2) కార్యకారణసంఘాతమైన శరీరమునకు కర్తయై యుండునది.) అధ్యాత్మము, కార్యకారణసంఘాతకర్తయైన కర్మమునందుండు (కర్మఫలమిచ్చు) పురుషుఁడు.

12. ఈసత్యము మధువు. (దృష్టఫలరూపమైన కర్మము; ఇదియు రెండువిధములు—ధర్మమువలె నెఱుంగునది). అధ్యాత్మము, కార్యకారణసంఘాతకర్తయైన సత్యమునం దుండుపురుషుఁడు.

13. (ధర్మముతోను సత్యముతోను జేరిన) మనుష్యజాతి మధువు. అధ్యాత్మము, మనుష్యజాతియందుండుఆత్మ.

14. ఈఆత్మ మధువు. (కార్యకారణసంఘాతమై పరిణమించి యుండువాఁడును, మనుష్యాదిగానైనవాఁడును, ప్రత్యగాత్మయు, పరమాత్మయు, సర్వాత్మయు, అమూర్తబ్రహ్మము నై యుండువాఁడును మధువు.) అధ్యాత్మము, మనుష్యజాతియం దుండుఆత్మ.

15. ఆ ఆత్మయే ఈఆత్మ (జీవాత్మ); సకలభూతములకును అధిపతి, ఒకబండిచక్రము నాభి (నేమి) యందు అరము లెట్లుగ్రువ్వఁబడియున్నవో, అట్లు ఈయాత్మయందు సకలభూతములును గ్రువ్వఁబడియున్నవి.

16, 17. (ఇవి మధుబ్రాహ్మణమంత్రములు, వేదమందు ప్రవర్గ్య ప్రకరణమందుఁ జెప్పఁబడిన యొకకథతో సంబంధించినవి. అశ్వి దేవతలకు దధ్యఙ్ అనుఅథర్వుఁడు చెప్పినది).

ఈమధువిద్యను అథర్వాణదధీచి అశ్వినులకుఁ జెప్పెను. అశ్వినులు చేసిన (చెప్పఁబోవు) కార్యమునుజూచి వేద మిట్లు చెప్పుచున్నది. ఓజనులారా, మీ మేలుకొఱకు మీదుష్టకార్యములను మేఘమువృష్టిని వలె బయలుపఱచెదను. అశ్వముఖము దాల్చి అథర్వాణదధీచిచేఁ జెప్పఁబడిన మధువిద్య యిదే. వేదము మఱలఁజెప్పుచున్నది—ఓఅశ్వినులారా, మీరు అథర్వాణదధీచికి గుఱ్ఱపుతల నుంచితిరి. అతఁడు ఆదిత్యమధువును, మధువిద్యను జెప్పెను. ఇది మిక్కిలిరహస్యమై యుండవలయును.

18. ఆమధువు ఏదనఁగా, అశ్విదేవతలకు దధ్యఙ్ చెప్పినది; ఎట్లన, "ఏది ఆదియందు రెండుకాళ్లజీవులను నాలుగుకాళ్లజీవులను సృష్టించినదో, అదే పక్షియును లింగశరీరమునై అశరీరములందు ప్రవేశించినదో, అదే ఆత్మ; అదేపురుషుఁడు. (పురి-దేహమునందు, శయః-ఉన్నాఁడు.)ఇతనిచే లోపల నేదియుఁ బ్రవేశింపకుండలేదు; బయట నేదియు వ్యాపింపకయు నుండలేదు."

19. ఈమధువిద్యయును అదే; అశ్వినులకు దధ్యఙ్ చెప్పినది. ఎట్లన, "ఏది ఒక్కొక రూపమునందును ఆరూపముగనున్నదో ఈపరమాత్మరూపము అతనిని తెలిసికొనుటకై యేర్పడియున్నది. (అతఁడు నామరూపవికారములను బొందనియెడల, ప్రజ్ఞానఘనుఁ డైనయతని స్వరూప మెట్లు తెలియనగును?)

ఆపరమేశ్వరుఁడు తనమాయల (ప్రజ్ఞల) చేత అనేకరూపములను బొందుచున్నాఁడు. ఒకరథమునందు గుఱ్ఱములు కట్టఁబడియుండునట్లు

అతనియందనేకములైనయింద్రియములు చేర్పఁబడియున్నవి. ఈయింద్రియములైనగుఱ్ఱములును అతఁడే. (అనఁగా ఆపరమాత్మయే ఇంద్రియరూపములుగ నున్నాఁడు.) అతఁడే బ్రహ్మము, ఆదిలేనివాఁడు, అంతములేనివాఁడు, ఏమియు లేకయుండువాఁడు, అతనికంటె వేఱే యేదియును లేదు. అతఁడే ఆత్మ, సర్వాత్మయై సర్వము ననుభవించుచున్నాఁడు.

---

### షష్ఠబ్రాహ్మణము.

ఇందు మధుబ్రాహ్మణమును గూర్చిన గురుశిష్యవంశములు చెప్పఁబడును. కడపటిగురువు స్వాయంభు వనఁబడుహిరణ్యగర్భుఁడు, అతఁడే చతుర్ముఖబ్రహ్మ (సగుణబ్రహ్మము). దీనికిమీఁద వంశములేదు. అతనికి నమస్కారము.

---

# తృతీయాధ్యాయము.

## ప్రథమబ్రాహ్మణము.

1. విదేహదేశాధిపతి యైనజనకరాజు విశేషదక్షిణలు గలయాగము నొకదానిని కావించెను. ఆయాగమునకై కురుదేశమునుండియు, పాంచాలదేశమునుండియు పెద్దలైన బ్రాహ్మణు లనేకులువచ్చిరి. వీరిలో ఉత్తముఁడైనబ్రాహ్మణుఁ డెవఁ డని కనిపెట్టుటకై జనకుఁడు ప్రయత్నించెను. (అందులకై దిగువనుదాహరించిన యుపాయమునుపన్నెను.) వేయి పశువులకు ఒక్కొక్క పశువుయొక్క ఒక్కొక్క కొమ్మునకు ఐదుంకొల్లుపలముల బంగారమును గట్టి, యొకకొట్టమునం దుంచెను.

2. పిదప ఆబ్రాహ్మణులనుజూచి జనకుఁ డిట్లనియె-"ఓపెద్దలారా, మీలో ఎవరు బ్రహ్మనిష్ఠులో వారు ఈయావులను తోలికొనిపోవచ్చును." అనఁగా,ఎవరును నేను బ్రహ్మనిష్ఠుఁడనని ముందుపడ్రైరి. ఇట్లుండ యాజ్ఞవల్క్యుఁడు తనశిష్యుఁడైనఒక బ్రహ్మచారినిబిలిచి "ఈయావులను ఇంటికిఁ దోలికొనిపొమ్ము"అనెను. అట్లే ఆశిష్యుఁడు తోలికొనిపోయెను.అప్పుడు తక్కినబ్రాహ్మణులు "ఈ యాజ్ఞవల్క్యుఁడుమాత్రము బ్రహ్మనిష్ఠుఁడా

"యేమి?" అని పరస్పరము సంభాషించుచు క్రుద్ధులైరి. ఆయజ్ఞమునందు హోతగానున్న అశ్వలుఁడు యాజ్ఞవల్క్యునిఁజూచి, "నీవుమాత్రము బ్రహ్మనిష్ఠుఁడవా?" అనియడిగెను. యాజ్ఞవల్క్యుఁడు—"నేను బ్రహ్మనిష్ఠునకు నమస్కరింతును. మనమందఱము గోవులనుకోరెడివారమైయున్నారము (కావున బ్రహ్మనిష్ఠులము కాము). అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పఁగా, అశ్వలుఁడు, పరీక్షార్థమై యాజ్ఞవల్క్యునిం గాంచి యిట్లనియె.

3. అశ్వలుఁడు—ఓ యాజ్ఞవల్క్యుఁడా! ఈ యాగవస్తువులన్నియు మృత్యువుచేత (కర్మమృత్యువుచేత) ఆప్తమై, వశీకృతమైయున్నవి కదా! ఏసాధనముచేత (యజ్ఞకర్త) యజమానుం డామృత్యువును జయించుచున్నాఁడు?

యాజ్ఞవల్క్యుఁడు:—హోతయైన అగ్నిచేత, వాక్కుచేత; (అధిభౌతికయజ్ఞమునందు హోత అగ్ని; అధ్యాత్మయజ్ఞమునందు హోత వాక్కు; యజ్ఞమందు హోతను అగ్నిస్వరూపముగను, వాక్స్వరూపముగను భావించి యజ్ఞముచేసినయెడల మృత్యువును జయింపవచ్చును. వాక్కు హోతగను, అగ్నిగ నున్నది. అభేదముగ దెలియుటయే ముక్తి; అదియే మృత్యువును తరించునట్టి అతిముక్తి.

4. అశ్వలుఁడు-ఇవియంతయు రేలుంబవళ్లతోఁ గూడిన కాలము (కాలమృత్యువు)తో ఆప్తమై (లెక్కింపఁబడినదై), వశీకృతమైయున్నది. ఈకాలమును దేనిచే దాఁటవచ్చును?

యాజ్ఞవల్క్యుఁడు—అధ్వర్యుఁడను ఆదిత్యునిచేతను, నేత్రముచేతను (అధిభౌతికయజ్ఞమునందు ఆదిత్యుఁడు అధ్వర్యుఁడు; అధ్యాత్మమునందు నేత్రము అధ్వర్యుఁడు; ఈభావనచేత) కాలమృత్యువును దాఁటవచ్చును. ఇట్లు అభేదముగాఁ దెలిసికొనినయెడల అదియేముక్తి; అదే అతిముక్తి.

5. అశ్వలుఁడు—శుక్లపక్షకృష్ణపక్షము లనుకాలముచే ఆప్తమై వశీకృతమైయుండు కాలము నెట్లుదాఁటవచ్చును?

యాజ్ఞవల్క్యుఁడు—ఉద్గాతయను వాయువుచేతను ప్రాణముచేతను దాఁటవచ్చును. (అధిభౌతికయజ్ఞమునందు వాయువు ఉద్గాత; అధ్యాత్మమునందు ప్రాణము ఉద్గాత; ఈభావనచేత కాలమృత్యువును

దాఁటవచ్చును. ఇట్లు అభేదముగాఁ దెలిసికొన్నచో) అదియే ముక్తి; అదియే అతిముక్తి.

6. అశ్వలుఁడు—ఏపట్టుదలయు లేక అంతరిక్షముబయలుగనున్నది కదా? ఏమార్గముచేత యజమానుఁడు స్వర్గమున కేఁగుచున్నాఁడు ?

యాజ్ఞవల్క్యుఁడు—బ్రహ్మ, లేక ఋత్విక్కనఁబడు మనస్సుచేతను, చంద్రునిచేతను (ఈమార్గముచేత) స్వర్గమునకుఁ బోవుచున్నాఁడు. (ఆధిభౌతికయజ్ఞమునందు మనస్సు ఋత్విక్కు; అధ్యాత్మమునందు చంద్రుఁడు ఋత్విక్కు; ఇట్లు తెలిసికొన్నవాఁడు స్వర్గమునొందును. ఇట్లు అభేదముగఁ దెలిసికొన్నయెడల)అదియేముక్తి. అదేఅతిముక్తి. అదేఅతిమోక్షము. ఇఁక సంపత్తు చెప్పఁబడును.

7. అశ్వలుఁడు—ఈయజ్ఞమునందు హోత ఎన్నిఋక్కులచేత హోమముచేయును ?

యాజ్ఞవల్క్యుఁడు—మూఁటిచేత.

అశ్వలుఁడు—అవి యెవి ?

యాజ్ఞవల్క్యుఁడు—అనువాక్య, యాజ్య, శస్య.

అశ్వలుఁడు—వీనిచేత దేనిని జయించుచున్నాఁడు?

యాజ్ఞవల్క్యుఁడు—ఏదేది ప్రాణముగలవియో దానినంతయు జయించుచున్నాఁడు.

8. అశ్వలుఁడు—ఈయజ్ఞమునందు అధ్వర్యుఁడు ఎన్ని ఆహుతులను జేయుచున్నాఁడు ?

యాజ్ఞవల్క్యుఁడు—మూఁడు.

అశ్వలుఁడు—అవేవి ?

యాజ్ఞవల్క్యుఁడు—జ్వలించునది, చిట్లునది (ప్రేలునది), భూమికి దిగువపోవునది.

అశ్వలుఁడు—వీనిచే జయింపఁబడునదేది?

యాజ్ఞవల్క్యుఁడు—మొదటిదానిచే దేవలోకమును, రెండవదానిచే పితృలోకమును, మూఁడవదానిచే మనుష్యలోకమును జయించుచున్నాఁడు.

9. అశ్వలుఁడు—ఈ యజ్ఞమునందు బ్రహ్మ యను ఋత్విక్కు ఎందఱు దేవతలచే దక్షిణదిక్కునందుండి రక్షింపఁబడుచున్నాఁడు ?

యాజ్ఞవల్క్యుఁడు—ఒక్క దేవతచేత.

అశ్వలుఁడు—ఆ దేవత యెవరు ?

యాజ్ఞవల్క్యుఁడు—మనస్సు; మనస్సు అనంతము; పారము లేనిది, (మనోవృత్తులు అనంతములు) మనోభిమానిదేవతలును అనేకులు. ఆ మనస్సుచే లోకమును జయించుచున్నాఁడు.

10. అశ్వలుఁడు—ఈ యజ్ఞమునందు ఉద్గాత ఎన్నివచనములచేత స్తోత్రముచేయుచున్నాఁడు ?

యాజ్ఞవల్క్యుఁడు—మూఁడువచనములచేత.

అశ్వలుఁడు—అవియేవి ?

యాజ్ఞవల్క్యుఁడు—అనువాక్యా, యాజ్యా, శస్యలు.

అశ్వలుఁడు—అవి యెట్టివి ?

యాజ్ఞవల్క్యుడు— అధ్యాత్మ విషయమునందు మొదటిది ప్రాణము, రెండవది అపానవాయువు, మూఁడవది వ్యానవాయువు.

అశ్వలుఁడు—వీనిచే దేనిని జయించుచున్నాఁడు ?

యాజ్ఞవల్క్యుఁడు—మొదటిదానిచే పృథ్విని, రెండవదానిచే అంతరిక్షమును, మూఁడవదానిచే స్వర్గమును జయించుచున్నాఁడు.

ఇట్లు అడిగి తెలిసికొన్నతర్వాత అశ్వలుఁడు ఊరకుండెను.

---

## ద్వితీయబ్రాహ్మణము.

(స్వాభావికమైన అజ్ఞాన నివృత్తికి మృత్యువు ప్రతిబంధకమైయున్నది. అది గ్రహాతిగ్రహాలక్షణముగలదై యున్నది. గ్రహమనఁగా పట్టుకొను శక్తికలది; అతిగ్రహమనఁగా గ్రహమును పట్టుకొను శక్తి కలది. అట్టిమృత్యువునుండి విడివడవలసినది ఆవశ్యకమైయున్నయది.)

1. (అశ్వలునకుఁదర్వాత ఆర్తభాగుఁడను ఋత్విక్కు ప్రశ్నించుచున్నాఁడు.

ఆర్తభాగుఁడు—గ్రహము లెన్ని? అతిగ్రహము లెన్ని?

యాజ్ఞవల్క్యుఁడు—గ్రహము లెనిమిది. అతిగ్రహము లెనిమిది.

ఆర్తభాగుఁడు—అవియేవి? ఎట్టివి?

2. యాజ్ఞవల్క్యుఁడు-ప్రాణము (ఘ్రాణేంద్రియము) గ్రహము. అది అపానవాయువైన (అపానవాయుసాధకముచేఁ గలిగిన) గంధము చేత గ్రహింపఁబడునది. గంధముచే (గంధశక్తిచే) కదా ఒకఁడు సమస్తమును మూర్కొనుచున్నాఁడు.

(ఇట్లు తక్కిన ఏడు గ్రహములను, అతిగ్రహములను సంబంధము నెఱుంగఁదగినది.)

3-9. వాగింద్రియము గ్రహము; నామము (పేరు-వార్త) అతిగ్రహము. నాలుక (రసనేంద్రియము) గ్రహము; రసనా (రుచి) అతిగ్రహము. నేత్రము గ్రహము; రూపకము అతిగ్రహము. శ్రోత్రము గ్రహము;శబ్దము అతిగ్రహము. మనస్సు గ్రహము; ఇచ్ఛ అతిగ్రహము హస్తము గ్రహము; కర్మము (చేయుట) అతిగ్రహము. త్వక్కు గ్రహము; స్పర్శము అతిగ్రహము.

10. ఆర్తభాగుఁడు - ఇవియంతయు (కలిగి నశించునవి యన్నియు) మృత్యువునకు అన్నమై యున్నవికదా? ఈమృత్యువు దేనికి అన్నమై యున్నది? ఆదేవత యేది (మృత్యువునకు మృత్యువుకలదా)?

యాజ్ఞవల్క్యుఁడు—సర్వమునకు అగ్ని మృత్యువై యున్నది. అగ్ని సమస్తమును భస్మముచేయుచున్నది. దీనికి మృత్యువు జలమై యున్నది. జలము అగ్నిని ఆర్పుచున్నదగాన జలము అగ్నికి మృత్యువు. ఇట్లు మృత్యువునకు మృత్యువుకలదు. (ప్రయాసముచే మృత్యువైన వాగాదీంద్రియములను జయింపవచ్చును; అప్పుడు ముక్తికలుగును; అనఁగా మృత్యువును జయింపవచ్చును.)

11. ఆర్తభాగుఁడు—ఈ (బ్రహ్మవేత్త, ముక్తుఁడు)పురుషుఁడు ఎప్పుడు మృతినొందుచున్నాఁడో, అప్పుడు వానియొక్క వాగాదిప్రాణములు పైకిపోవుచున్నవా ? లేవా ?

యాజ్ఞవల్క్యుఁడు—లేదు. ఈశరీరమునందే (పరమాత్మయందే అలలు జలమునందు కలియునట్లు) లయమొందుచున్నవి. అప్పుడు మృతినొందినట్లు ఎట్లుచెప్పవచ్చుననఁగా, వాఁడు మృతుఁడు కాఁడు. తిత్తివలె బయటివాయువుచేత పూరింపఁబడినవాఁడై, ఉబ్బినవాఁడై, చేష్టలులేక శయనించియున్నాఁడు.

12. (ప్రాణములుమాత్రము కలిసిపోవుచున్నవా? వాని ప్రయోగ

ములును, ప్రేరించువిషయములును కలిసిపోవుచున్నవా? అనువిషయము చెప్పఁబడుచున్నది.)

ఆర్తభాగుఁడు—ఎప్పుడు బ్రహ్మవేత్తయగువాఁడు మృతినొందుచున్నాఁడో అపుడు వీనిని విడువక యుండునది యేది ?

యాజ్ఞవల్క్యుఁడు—నామనుమాత్రమే మిగులుచున్నది. తక్కినవన్నియు పోవుచున్నవి. నామము (పేరు) శాశ్వతమైనది; విశ్వేదేవతలును శాశ్వతమైయుండువారు; ఆముక్తుడు పైనిచెప్పిన దేవతాస్వరూపములుగా కలిసిపోయి, నామమాత్రముచే, అనంతమైన లోకమును జయించుచున్నాఁడు?

13. ఆర్తభాగుఁడు—అవిద్వాంసుఁడు (అజ్ఞాని) గతించినయెడల వానివాక్కు అగ్నిని, ప్రాణము వాయువును, నేత్రము ఆదిత్యుని, మనస్సు చంద్రుని, శ్రోత్రము దిక్కులను, శరీరము పృథ్వీని, ఆత్మ హృదయాకాశమును, శరీరరోమములు ఓషధులను, శిరోరోమములు వృక్షములను, రేతోరక్తములు జలమును, జేరిపోవుచున్నవిగదా! అపు డీపురుషుఁడెక్కడనున్నాఁడు? దేనిని ఆశ్రయించియున్నాఁడు? మరల నెట్లు కార్యకారణసంఘాతశరీరమును బొందుచున్నాఁడు ?

అని ఆర్తభాగుఁ డడుగఁగా, యాజ్ఞవల్క్యుఁడు-మన మీజనసంఘమునందు ఈగొప్పసందడిలో మాటలాడుటకు సాధ్యము కాదు; కాన ప్రత్యేకమైన ప్రదేశమునకుఁ బోయి మాటలాడుదమురమ్ము; అని యిట్లు ఇరువురును బల్కికొని ప్రత్యేకస్థలమునఁ గూర్చుండి ఆలోచించికొనిరి. ఇ ట్లిరువురును ఆలోచించి నిశ్చయించికొన్న దేమనఁగా—

కర్మము నాశ్రయించుకొని (జీవుఁడు) ఉన్నాఁడు. (అనఁగా వీని ప్రాణములన్నియు మున్ను చెప్పినయట్లు దానిదాని స్థానమునందు లయమగుచున్నవి. వీనికర్మము మాత్రము శేషించుచున్నది.) ఆకర్మమునకు దగినట్లు మరల శరీరమును దాల్చుచున్నాఁడు; పుణ్య (శాస్త్రోక్త) కర్మమునకుఁదగినట్లు పుణ్యశాలియై సుఖముల ననుభవించుచున్నాఁడు. పాపకర్మమును చేసినచో పాపియై దుఃఖముల ననుభవించుచున్నాఁడు. అని యి ట్లిరువురును యోజించి నిశ్చయించికొని, తాము నిశ్చయించికొన్న విషయములను ఎల్లవారికిని విశదముగఁ జెప్పిరి. పిమ్మట ఆర్తభాగుఁడు శాంతినొందెను.

## తృతీయ బ్రాహ్మణము.

[బంధనము గ్రహాతిగ్రహలక్షణమైయున్నది. అదే మృత్యువనం బడును. అందుండి విడివడుటయే మోక్షమనఁబడును. ముక్తుఁడు సర్వమును త్యజించినవాఁడై దీప మాఱునట్లు సర్వవ్యాపారములును నశించి బ్రహ్మమునందు లీనమగుచున్నాఁడు. ముక్తునియొక్కయు అముక్తుని యొక్కయు కార్యకరణములు సమానమైన స్వకారణమునందుఁ జేరి నప్పటికిని ముక్తునకు పునర్జన్మము లేదు. అముక్తునకు పునర్జన్మము కలదు. దేనిలోఁ జేరిన స్మరణముఁ గల్గునో అది కర్మమనఁబడును. ఆకర్మము పుణ్యమనియు పాపమనియు రెండువిధములు. పాపము చేసినయెడల దుఃఖబహుళమైన స్థావరజంగమములందును, నరకతిర్యక్ ప్రేతాదులయందును పడి దుఃఖము ననుభవించుచున్నాఁడు. పుణ్యకర్మము లెంత చేసి నప్పటికిని అంతటిసౌఖ్యములను మాత్రమే అనుభవించును. మఱియు అవి పురుషార్థసాధనమై యున్నవి. అయినను పుణ్యకర్మముచేత మోక్షము మాత్రము కలుగదు. బంధనాశముచేతనే మోక్షము సిద్ధించును. బంధమునకు అవిద్య; కర్మముచే (ఏకర్మచేతనైనప్పటికిని) బంధనాశము (అవిద్యానాశము) కలుగదు. ఉత్పత్త్యాదులు కర్మసామర్థ్యముచేఁ గలుగుచున్నవి. కావున, మోక్షము కర్మకార్యముకాదు. జ్ఞానకార్యము మోక్షమనుటయు ఉపచారమేగాని వాస్తవము కాదు. అజ్ఞాననివృత్తియే జ్ఞానము. అజ్ఞానము మఱుఁగువలెనున్నది. అది నివృత్తమైనచో జ్ఞానము ప్రకాశించును. జ్ఞానము ఎప్పుడు నుండునట్టిది. మోక్షమునకు మఱుఁగు అజ్ఞానమేగాని వేఱుకాదు. కర్మము అజ్ఞానమునకు విరోధికాదు. నిత్యకర్మము అజ్ఞానమును నివృత్తిచేయనేరదు. ఫలమును మోక్షమనఁగూడదు. ఫలమునకు క్షీణత కలదు. మోక్షమునకు క్షీణత (నాశము) లేదు. "ఇతరకర్మములకంటె నిత్యకర్మము వేఱుగాన, దానిఫలమును వేఱై (మోక్షప్రదమై) యుండదా?" అనఁగా అట్లు కాదు. నిత్యకర్మములు (విహితకర్మములు) చేయువానికి ఆత్మశుద్ధమై ఆత్మజ్ఞానసాధనమై యుండును. విహితకర్మములు చేయకయు, నిషిద్ధకర్మములు చేయువారికి నీచజన్మములు కలుగును. కావున. కర్మములకు మోక్షఫలము లేదు. కర్మఫలము సంసారము నొసంగును. అని యీ బ్రాహ్మణమునందు చెప్పఁబడుచున్నది.]

1. పిదప, భుజ్యువనెడి లాహ్యాయని యాజ్ఞవల్క్యునిఁ జూచి యిట్లనియె—"ఓయాజ్ఞవల్క్యుఁడా! మేము మద్రదేశమునకు అధ్యయనార్థముపోయి, ఆప్రాంతములను జూచుచు, కాప్యుఁ డనుపతంజలుని గృహమునకుఁ బోతిమి. ఆతనికొమార్త అచ్చట నుండెను. ఆమెను ఒక గంధర్వుఁడు కామించి యుండెను. మేమువానింజూచి-'నీవెవఁడవు?' అని యడిగితిమి. అతఁడు-'నేను ఆంగిరసుఁ డనుసుధన్వుఁడను' అనెను. మేము లోకములయొక్క సమాప్తిని గూర్చియు 'అశ్వమేధయాగము చేసిన వా రెచ్చటికేఁగెదరు?' అని యడిగితిమి. అతఁడు మాకు సంతృప్తికరముగ బదులు చెప్పెను. ఇప్పు డా ప్రశ్నమునే నిన్నడిగెదను. నీకుఁ దెలిసినదానినిఁ జెప్పుము"అనెను.

2. యాజ్ఞవల్క్యుఁడు—అశ్వమేధయాగము చేసినవా రెచ్చటికిఁ బోవుచున్నా రనువిషయమును ఆగంధర్వుఁడే చెప్పియున్నాఁడు; (అయినను నేను జెప్పెదను వినుము.) ఒకదినమునందు సూర్యునిరథము ఎంతదూరముపోవుచున్నదో దానికంటె ముప్పదిరెండింతలు విశాలమైనది యీలోకము. (విరాట్ శరీరముగలదియును, ప్రాణుల కర్మభోగముగలదియును అగు స్వర్గలోకము.) దానిని పైనిచెప్పినవిస్తీర్ణముకంటె రెండింతలు విశాలమైనభూమి ఆవరించికొనియున్నది. ఆభూమిని అంతకంటె రెండింతలు విశాలమైనసముద్రము పరివేష్టించికొనియున్నది. అచ్చట అండకపాలమునకునడుమ, కత్తివాదర, ఈఁగ రెక్క అనువీని వలె అతిసూక్ష్మమైనబయలున్నది. ఆమార్గముగా ఇంద్రుఁడు (యాగమందు తృప్తినొందినయీశ్వరుఁడు.) ఒకపక్షిరూపముతో ఈయాగము చేసినవారిని వాయుదేవతయొద్ద చేర్చుచున్నాఁడు. ఆగంధర్వుఁడు ఈ వాయుదేవతనే శ్లాఘించినాఁడు. వాయువు వ్యష్టిగను, సమష్టిగను ఉన్నాఁడు. ఇట్లు తెలిసికొన్నవాఁడు మృత్యువును జయించుచున్నాఁడు. ఇట్లు యాజ్ఞవల్క్యుఁడు చెప్పఁగా భుజ్యువు మిన్నక యుండెను.

(అశ్వమేధయాగము చేసినవారికి వాయులోకమేగతి; మోక్షము లేదు.)

## చతుర్థబ్రాహ్మణము

1. తర్వాత, ఉషస్తుఁడనుచాక్రాయణుఁడు యాజ్ఞవల్క్యుని ప్రశ్నింపఁదొడంగెను.—

ఓయాజ్ఞవల్క్యుఁడా, ఎది ప్రత్యక్షముగను, అప్రత్యక్షముగనున్నదో; ఎదిసర్వాంతర్యామియై యున్నదో; ఆయాత్మ యెవఁడు? ఎట్టివాఁడు? చెప్పుము.

యాజ్ఞవల్క్యుఁడు—ఏఆత్మ ప్రాణవాయువు (ఘ్రాణము) చేత శ్వాసమువిడుచునట్లుచేయుచున్నదో,అపాన వ్యాన ఉదానవాయువులచే దానిదానిచేష్టలను చేయునట్లు చేయుచున్నదో, అతఁడే సర్వాంతరాత్మ. (ఆయాయింద్రియవ్యాపారములను చేయునట్లు ప్రేరించుఆత్మ, జీవాత్మ, అదే పరమాత్మ.)

2. ఉషస్తుఁడు—ఇది పశువు, ఇది గుఱ్ఱము, అని నిరూపించునట్లు, ఆత్మను నిరూపించెదనని చెప్పితివి. ఇపుడు ప్రాణచేష్టాదిచిహ్నములనుమాత్రము కనఁబఱచుచున్నావు. ఆసర్వాంతరాత్మ యెట్టిది? స్పష్టముగఁ జెప్పుము.

యాజ్ఞవల్క్యుఁడు—(నేనుచక్కఁగానే నిరూపించితిని.) ఈలౌకికదృష్టిచేత ద్రష్టగానుండుదానిని (ఆత్మను) జూచుటకు సాధ్యముకాదు. లౌకికశ్రుతికి శ్రోతయైనవానిని (ఆత్మను) నీవు వినవు. అట్లే మతికి మంతయైనవానిని (ఆత్మను) నీవు తలంచుటకు సాధ్యముకాదు. విజ్ఞానమునకు విజ్ఞాత యైనవానిని (ఆత్మను) తెలిసికొనవు. ఇట్టివాఁడే సర్వాంతరాత్మ. ఇతనికంటె వేఱేవస్తువు (కార్యకారణాత్మయైనశరీరము) నాశమైనది. (బ్రహ్మమును ప్రత్యక్షముగా ఘటాదులవలె చేతితోఁబట్టి యిదియని చూపుటకుఁగాదు. మఱియు లౌకిక (బాహ్య) దృష్టికిఁ గనబడదు. అంతర (జ్ఞాన) దృష్టికి మాత్రము గనఁబడును. ఇట్లు చెప్పినమీఁద ఉషస్తి ప్రశాంతుఁడాయెను.



## పంచమబ్రాహ్మణము.

(సప్రయోజకమైన బంధ మిట్టిదని చెప్పబడెను. ఈ బ్రాహ్మణమునందు బంధవిముక్తికి సాధనము చెప్పఁబడుచున్నది.)

1. కౌషీతకేయుఁడను కహోళుఁడు యాజ్ఞవల్క్యునిఁ జూచి యిట్లనియె—పరోక్షముగను, అపరోక్షముగను నుండు బ్రహ్మమేది? సర్వాంతరాత్మ యేది? దానిని చక్కఁగాఁ జెప్పుము. (బంధవిముక్తి యెట్లుకలుగును?)

ఉషస్తుఁ డడిగినట్లే ఇతఁడు నడిగెను. మొదటఁ జెప్పినపుడు ఆత్మ బద్ధుఁడని చెప్పఁబడినది. ఇపుడు క్షుత్పిపాసలు లేనివాఁడని చెప్పఁబడు చున్నది. ఒక్కఆత్మనుగూర్చి రెండువిధములుగాఁ జెప్పవచ్చునా? అది యట్టిదా? అనఁగా—ఆత్మకు సంసారిత్వమును, నామరూపవికారములును భ్రాంతిమాత్రమైయున్నది. అది రజ్జుసర్పన్యాయమువంటిదేగాని వాస్తవము కాదు. వస్తువు వేర్వేఱుకాదు. అనఁగా ఆత్మ ఒక్కటే. అవిద్య యుండువఱకు భేదము (భ్రాంతి) ఉండును. లోకవ్యవహారము నిమిత్తము జీవాత్మ (బద్ధాత్మ) యనియు, పరమాత్మ యనియు వ్యవహరింపఁబడుచున్నది. అనఁగా ఉపాధియున్నంతవఱకు బద్ధుఁడనియు, ఉపాధిలేనప్పుడు పరమాత్మయనియు చెప్పఁబడుచున్నాఁడు.

యాజ్ఞవల్క్యుఁడు—నీయందుండు ఆత్మయే సర్వాంతర్యామి; అనఁగా సర్వాంతరాత్మ.

కహోళుఁడు—అతఁడెవఁడు? ఎట్టివాఁడు?

యాజ్ఞవల్క్యుఁడు— ఎవఁడు ఆఁకలి, దప్పి, శోకము (వ్యసనము) మోహము (తెలియమి), జర (ముదిమి), మరణము, అనువీనిని దాఁటియున్నాఁడో (ఇవి లేనివాఁడో) అతఁడే ఆత్మ; సర్వాంతర్యామి.

ఆయాత్మను బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానులు) తెలిసికొని పుత్రైషణము (వివాహేచ్ఛ), విత్తైషణము (యాగాదికర్మలకై ధనాశ), లోకైషణము (తత్ఫలమగు స్వర్గాదిలోకాభిలాష), అనువీనినివదలి, భిక్షాన్నమును భుజించుచు పోవుచున్నారు. (అనఁగా బ్రహ్మవిద్యను సంపాదించుటకై ప్రయత్నించెదరు). ఈ యీషణలు పరస్పరము ఒకదానినొకటి వృద్ధి చేయునవియై యున్నవి. అయినను లోకైషణము లేకపోయినను, తక్కిన రెండును గలవనియే చెప్పవచ్చును.

(ఈ యీషణలు అవిద్యావిషయములు కావున, ఇవి బ్రహ్మజ్ఞానమునకు ప్రతిబంధకములై యున్నవి. బ్రహ్మజ్ఞానము విద్యావిషయమైనది.

ఎప్పుడును చీకటియు వెలుతురు నొకచోట నుండదు. అట్లే అవిద్యయు విద్యయు నొకచోట నుండదు.)

కాఁబట్టి బ్రాహ్మణుఁడు పాండిత్యమును (ఆత్మజ్ఞానమును) బొంది బాలునివలె ఉండఁదలఁపవలయును. ఇట్లుండినయెడల వాఁడుముని (మనన శీలుఁడు) అగుచున్నాఁడు. తర్వాత అమౌనమును (ఆత్మజ్ఞానమును) మౌనమును (అనాత్మతిరస్కారమును) పొందుచున్నాఁడు. అపుడు వాఁడు బ్రాహ్మణుఁ డనఁబడును. తర్వాత వాఁడేవిధముగఁ నుండి నప్పటికిని వాఁడు బ్రాహ్మణుఁడే. ఇట్లు బ్రహ్మస్వరూపమైన బ్రహ్మవిద్య కంటెను వేఱైనదంతయు ఆర్తమును, నాశమునైనది. (ఆత్మ నిత్యమైనది.) దీనిని విన్నమీఁద కహోళుఁడు మౌనముగనుండెను.

---

## షష్ఠబ్రాహ్మణము.

(ఇదివఱకు సర్వాంతరాత్మనుగూర్చి చెప్పఁబడెను. ఇప్పుడు ఆ సర్వాంతరాత్మస్వరూపము చెప్పఁబడుచున్నది. పృథ్వ్యాదిపంచభూతములు బహిరంతర్భావముగా, స్థూలసూక్ష్మతారతమ్యముగా వ్యవస్థ చేయఁబడియున్నది. ఒక్కొకభూతమును దానికి పైఁబడినభూతముచే వ్యాపింపఁబడియున్నది. ఒక్కొకభూతమునకును దానికిపైఁబడినది కారణమైయున్నది. ఒక్కొకభూతమునకంటె దానికిపైఁబడినది సూక్ష్మమైయున్నది. అనఁగా ఒక్కొకభూతమును దానికితక్కువదైన భూతమునందు అంతర్యామియై వ్యాపించి, దానికి బయట ప్రత్యేకముగనున్నది. ఎట్లన, పృథివియందు జలముచేరి వ్యాపించియుండినప్పటికిని,సముద్రాదుల వలె భూమికి బయట ప్రత్యేకముగను ఉన్నదిగదా. ఇట్లు క్రమ క్రమముగా బ్రహ్మలోకముదనుక చెప్పఁదగును. దేనికిమీఁద నేదియు లేక, సర్వాంతర్గతవస్తు వొక్కటిమాత్రమే మిగులుచున్నదో అదే పరబ్రహ్మము. ఆపరబ్రహ్మము సకలభూతములందును బాహ్యాభ్యంతరములందును వసించియున్నది. దానికంటె వేఱేదియు లేదు. గౌణ, అముఖ్య, ఆత్మ యగుజీవుఁడు ఒక్కొకభూతమును నిగ్రహించుచుపోయి, అనఁగా సర్వసంసారనిర్ముక్తుఁడై పరబ్రహ్మవస్తువుతో నైక్యమగుట బోధింపఁబడుచున్నది.)

1. తర్వాత, వచక్నుని కూఁతురు గార్గి యాజ్ఞవల్క్యునిఁజూచి యిట్లనియె—పృథ్వీరూపమైన సమస్తమును జలమందు ఓతప్రోతమై యున్నదికదా? (వస్త్రమునందు పడుగును పేకయు కలిసియుండునట్లు భూమి జలమునందుఁ జేరియున్నదికదా?) జలము దేనియందు ఓతప్రోతమైయున్నది? (అనఁగా జలమునకుఁ గారణమేది?)

యాజ్ఞవల్క్యుఁడు—వాయువునందు ఓతప్రోతమైయున్నది.

(జలమునకుఁ దర్వాత అగ్నియని చెప్పనికారణ మేమనఁగా, అగ్నికి భూమి, జలము అనుపీనిసంబంధములేక స్థితిలేదు గాన, వానియందణఁగి యున్నదని తలంచి ప్రత్యేకముగఁ జెప్పలేదు.)

గార్గి—ఆవాయువు దేనియందు ఓతప్రోతమైయున్నది?

(ఇట్లు ఒక్కొకభూతమునుగూర్చి ప్రశ్నచేయంబడెను. అన్నిటికిని ఒక్కమాఁటే ఉత్తరము చెప్పఁబడుచున్నది.).

యాజ్ఞవల్క్యుఁడు—వాయువు అంతరిక్షలోకములందును, అంతరిక్షలోకములు గంధర్వలోకములందును, గంధర్వలోకములు ఆదిత్యలోకములందును, ఆదిత్యలోకములు చంద్రలోకములందును, చంద్రలోకములు నక్షత్రలోకములందును, నక్షత్రలోకములు దేవలోకములందును, దేవలోకములు ఇంద్రలోకములందును, ఇంద్రలోకములు ప్రజాపతి (విరాట్) లోకములందును, ప్రజాపతిలోకములు బ్రహ్మ (అండనిర్మాణకర్తయైనబ్రహ్మ) లోకములందును ఓతప్రోతమై యున్నది?

యాజ్ఞవల్క్యుఁడు—ఇఁక అడుగవలదు; అడిగితివేని నీతలపగిలిపోవును. (ఇంతవఱకును అడిగినది సరి. అనఁగా న్యాయ్యప్రశ్నము. దీనికి మీఁద బ్రహ్మవస్తువుమాత్రమేకలదు. కావున దానిని చెప్పుటకు సాధ్యముకాదు.) తర్వాత గార్గి శాంతినొందెను. (ఓతప్రోత మనఁగా—వస్త్రమునందు పడుగును పేకయు నుండునట్లు. పడుగును పేకయును లేక వస్త్రముకాదు.)

---

## సప్తమబ్రాహ్మణము.

1. ఉద్దాలకుఁడను ఆరుణి యాజ్ఞవల్క్యునిఁజూచి యిట్లడుగుచున్నాఁడు.—

మేము మద్రదేశములో యాగమునందు;వేదాధ్యయనము చేయుట కొఱకు,అచ్చట పతంజలి యనుకాప్యునిగృహమునందు వసించియుంటిమి. పతంజలునిభార్యను గంధర్వుఁ డొకఁడు కామించి యుండెను. ఆగంధర్వునింగాంచి "నీవెవఁడవు?" అనియడుగఁగా, నతఁడు, "నేను కబంధుఁ డనుఆథర్వుణుడను" అనెను. పిమ్మట ఆకబంధుఁడు—పతంజలుని, ఆతని శిష్యులను జూచి యిట్లడిగెను—ఏసూత్రముచేత ఈలోకమును (ఈజన్మమును), పరలోకమును (పునర్జన్మమును) సకలభూతములును గ్రుచ్చఁబడి కట్టబడియున్నవి? నీకుఁ దెలియునా? యనఁగా పతంజలుఁడు, "నాకుఁ దెలయదు" అనెను. ఎవఁడీలోకమును, పరలోకమును, సకల భూతములయందును వసించినడుపుచున్నాఁడో ఆఅంతర్యామి యెవఁడు? అని మరల పతంజలుని ఆగంధర్వుఁ డడుగఁగా, "నాకుఁదెలియదు" అని పతంజలుఁ డనెను. "ఆసూత్రమును, అంతర్యామిని యెవఁడు తెలిసికొను చున్నాఁడో; వాఁడే బ్రహ్మమును, లోకములను, దేవతలను, వేదములను, భూతములను, ఆత్మను, సర్వమును ఎఱింగినవాఁడు." అని మరలఁ జెప్పి నాఁడు. ఆతర్వాత మేము అతనిని ప్రార్థింపఁగా, గంధర్వుఁడు ఆసూత్ర మును, అంతర్యామినిగూర్చి బోధించెను. ఆవిషయమును నేనెఱుంగు దును. అది నీకుఁ దెలియునా? తెలియనియెడల, నీవు రాజొయొక్క వేయి గోవుల నెట్లు తోలికొనిపోవచ్చును? నీతల పగిలిపోవును. అనెను.

2. యాజ్ఞవల్క్యుఁడు—ఆసూత్రమును, అంతర్యామిని నే నెఱుంగుదును.

ఉద్దాలకుఁడు—ప్రాకృతపురుషుఁడు తనకుఁ "దెలియును, తెలియును" అనితన్ను పొగడుకొనుచుండును. నీకుఁ దెలిసియున్నచోఁ జెప్పుము.

యాజ్ఞవల్క్యుఁడు—ఆసూత్రము వాయుదేవుఁడే. వాయువు సర్వమును బంధించి పట్టుకొనియున్నాఁడు. ఒకదేహమునందుండి వాయువు బయటపోయినయెడల, వాఁడు ప్రేతమై పోయినాఁడనియు, వాని యంగములు శిథిలములైన వనియును జెప్పుచున్నారు.

ఉద్దాలకుఁడు—అది సరియే. అంతర్యామినిఁగూర్చి చెప్పుము.

3. యాజ్ఞవల్క్యుఁడు—ఎవఁడు భూమియందున్నాఁడో (పృథ్వి లోపలనున్నాఁడో), ఎవనిని పృథ్వీదేవత తెలిసికొనలేదో, ఎవనికి పృథ్వి గల శరీరమో (పృథ్వీమయమైయున్నదో) ఎవఁడు పృథ్విలోపలనుండి

దా నిని నియమించుచున్నాఁడో, వాఁడే నీలోను, నాలోను, అందఱి లోను ఉన్నాఁడు. వాఁడే అంతర్యామి మరణము లేనివాఁడు.

4-23. (పృథ్వీవిషయమునందు చెప్పినట్లే దిగువ నుదాహరించిన యిరువదివిషయములందును తాత్పర్యము నూహించికొనునది) అధిదైవత విషయములు—జలము, అగ్ని, అంతరిక్షము, వాయువు, స్వర్గము, ఆదిత్యుఁడు, దిక్కులు, చంద్రనక్షత్రములు, ఆకాశము, తమస్సు, తేజస్సు, అధిభూతము—సకలభూతములు ప్రాణులు; అధ్యాత్మము—ప్రాణము, వాక్, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, త్వక్కు, విజ్ఞానము, రేతస్సు.

(ఈ అంతర్యామి) చూడఁదగనివాఁడు, అయినను చూచువాఁడు. వినఁబడనివాఁడు, అయినను వినువాఁడు. తలంపఁబడనివాఁడు, అయినను తలంచువాఁడు. తెలియఁబడనివాఁడు, అయినను తెలియువాఁడు. ఇతని కంటె ద్రష్టయు, శ్రోతయు, మంతము వేఱొక్కఁడును లేఁడు. ఇతఁడే నీయందుండుఆత్మ,అంతర్యామి, అమృతుఁడు, ఇతనికంటె తక్కినదంతయు నశించునట్టిది! అనంతరము ఉద్దాలకుఁడు విరమించెను.

---

## అష్టమబ్రాహ్మణము

1. తర్వాత, వాచక్నవి యనుగార్గి అచ్చటనున్నబ్రాహ్మణులను జూచి యిట్లడిగెను—"ఓబ్రాహ్మణులారా, ఈయాజ్ఞవల్క్యుని రెండు ప్రశ్నలడుగఁబోయెదను. ఆరెండుప్రశ్నలకును ఉత్తరము చెప్పినయెడల బ్రహ్మమునుగూర్చి చెప్పెడి యితనిని మీలో నెవ్వరును జయింపలేరు అనెను.

అప్పు డచ్చటనున్న బ్రాహ్మణులు—"అడుగుము గార్గీ! అడుగుము." అనిరి.

2. వాచక్నవి యనుగార్గి—ఓయాజ్ఞవల్క్యుఁడా, నిన్ను రెండు ప్రశ్నము లడిగెదను; శూరుఁడైనకాశీరాజుగాని, లేక, విదేహరాజుగాని, తమధనుస్సులందు బాణములనుసంధించి ఏఁయుటకెట్లు సన్నద్ధులై యుందురో, అట్లు రెండుప్రశ్న లడుగఁబోయెదను. (జాగ్రత్తగా ఉత్తరము చెప్పుము.)

యాజ్ఞవల్క్యుఁడు—అడుగుము గార్గీ! అడుగుము.

3. గార్గి—ఆకాశమునకుమీఁద నేదికలదో, (అండకపాలాది) భూమికి దిగువనేదికలదో, ఈరెంటినడుమ నేదేదికలదో, ఇంకను ఉన్నట్టివియు ఉండఁబోవునట్టివియు నేవికలవో, అవియంతయు దేనియందు (ఏసూత్రాత్మయందు) ఓతప్రోతమై యున్నది ?

4. యాజ్ఞవల్క్యుఁడు—అవ్యాకృతమైన ఆకాశమునందు ఓతప్రోతమైయున్నది.

5. గార్గి—మొదటిప్రశ్నకు బదులుచెప్పితివి. ఇందులకు నీకు నమస్కారము; రెండవప్రశ్నమునకు జాగ్రత్తగా బదులుచెప్పుము.

యాజ్ఞవల్క్యుఁడు—గార్గీ! అడుగుము.

6 (గార్గి మొదటిప్రశ్నమునే దార్ఢ్యముకొఱకు రెండవపర్యాయమును అడిగెను.)

7. (యాజ్ఞవల్క్యుఁడు మొదటిప్రశ్నమునకుఁ జెప్పిన ఉత్తరమునే చెప్పెను.)

గార్గి—ఆ ఆకాశము దేనియందు ఓతప్రోతమై యున్నది? (అని రెండవప్రశ్నము.)

8. యాజ్ఞవల్క్యుఁడు—ఓగార్గీ! బ్రహ్మవేత్తలందఱును అక్షరమునందు (నాశరహితమైనదానియందు) ఓతప్రోతమై యున్నదని చెప్పెదరు. ఎట్లన, అది స్థూలమునుగాదు, (సూక్ష్మమునుగాదు) అణువునుగాదు, పొట్టియునుగాదు, పొడుగునుగాదు, ఎఱుపునుగాదు, చెమ్మయునుగాదు, వాయువునుగాదు, ఆకాశమునుగాదు, మిశ్రమమునుగాదు, రసముగలదియునుగాదు, గంధముగలదియునుగాదు, నేత్రముకలదియును గాదు, శ్రోత్రముకలదియునుగాదు, వాక్కుగలదియునుగాదు, మనస్సు గలదియునుగాదు, (లౌకిక) తేజస్సు గలదియునుగాదు, ప్రాణముగలదియును గాదు, ముఖము (ద్వారము) గలదియునుగాదు, గణింపఁగూడనిది, అంతరములేనిది, బాహ్యములేనిది, దేనిని భుజింపనిది, దేనిచేతను భుజింపఁబడనిది (అనఁగా ఏవిశేషణముచేతను చెప్పఁబడని వస్తువు).

9. (ఇట్టివస్తువు నేరీతిగాఁ దెలిసికొనవచ్చునో అది యిఁకఁ జెప్పఁబడును.)

యాజ్ఞవల్క్యుఁడు—ఈ అక్షరవస్తువుయొక్క ఆజ్ఞచేత సూర్య చంద్రులు తమతమపనులను నిర్వర్తించుచున్నారు. ఉదయాస్తమయము లును వృద్ధిక్షయములును నియతముగా జరగుచున్నవి! ఇదియొకగుఱుతు.

ఇతని యాజ్ఞచేత భూమియును ఆకాశమును స్థిరముగా నిలిచి యున్నవి. భూమి బోరగిలంబడకయు, ఆకాశము బ్రద్దలుగాకయు నిలిచి యున్నవి; ఇది యొకయడియాలము.

ఇతని యానతిచే కాలావయవములైన నిమిషము, ముహూ ర్తము, పగలు, రాత్రి, పక్షము, మాసము, ఋతువు, సంవత్సరము, అనునివి నియతమై క్రమముగా వచ్చుచున్నవి. ఆయాకాలములును దానిదానిలక్షణముతోనున్నవి; ఇదియు నొకచిహ్నము.

ఇతని ఉత్తరవుచేత నదీనదములు తమతమపర్వతములయందుండి ఆయాకాలములందు ప్రవహించుచున్నవి; ఇది యొకలక్షణము.

ఇతని యాజ్ఞప్తిచేత దానమిచ్చువారిని పొగడుచున్నారు. అట్లే యాగముచేయువారిని దేవతలు వెన్నంటెదరు; దర్విని పితరులు అనుక రించెదరు. (అనఁగా దానముచేయువారికిని, యాగముచేయువారికిని, హోమముచేయువారికిని సత్ఫలము కలుగును. దానముచేయువారిని మనుష్యులును, యాగముచేయువారిని దేవతలును, హోమముచేయు వారిని పితృదేవతలును పొగడుచున్నారు. ఇట్లుచేయువారికి ఈశ్వరుఁడు ఫలమిచ్చుచున్నాఁడు.)

10. (ఇందువలన అక్షరవస్తువొకటి కలదని సిద్ధించుచున్నది. అతని నెఱుంగనియెడల సంసారముకలదు; అతని నెఱింగినయెడల సంసా రము నివృత్తియగును.)

యాజ్ఞవల్క్యుఁడు—ఈ అక్షరవస్తువు నెఱుంగక యొకఁడు ఎంత కాలము ఈలోకమునుండి హోమమును, యాగమును, తపస్సును చేసి నప్పటికిని, (ఆయాకర్మఫలము నివర్తిగ్గాయెనమీఁద పునర్జన్మము కల్గును.) దానికి కాలపరిమాణము కల్గదు. ఎవఁడీ యక్షరవస్తువు నెఱుంగక యీ భూమినుండి వెడలిపోవుచున్నాఁడో, వాఁడు కృపణుఁడు. (వాఁడు బానిసవలె మాటిమాటికి జన్మము లెత్తుచుండును.) ఎవఁడీవస్తువు నెఱింగి మృతుఁడగునో వాఁడు బ్రాహ్మణుఁడు (బ్రహ్మజ్ఞాని) అనఁబడును. (అనఁగా వానికి పునర్జన్మము లేదు.)

11. (ఆయక్షరవస్తువు అచేతనము కాదని చెప్పఁబడుచున్నది.) ఆయక్షరవస్తువు చూడఁబడనిది, (అయినను) అదిచూచును. వినఁబడనిది, అది వినును. తలంపఁబడనిది, అది తలంచును. తెలియఁబడనిది, అది తెలియును. చూచువాఁడు మొదలగునది ఇతనికంటె వేఱులేదు (అనఁగా సర్వము నితఁడే). అట్టియీవస్తువునందు ఆకాశము ఓతప్రోతమైయున్నది.

12. గార్గి—ఓబ్రాహ్మణులారా, వినుఁడు! ఈయాజ్ఞవల్క్యునికి నమస్కరించెదను. అతనిని జయించుటకు మీలోనెవ్వరును తగినవారు లేరు. అనిచెప్పి విశ్రాంతినొందెను. (ఈ అంతర్యామి బ్రాహ్మణమునందు, ఆత్మ,చేతనాత్మకమై అంతర్యామిగా యున్నాఁడనియు, అన్నిటియందు నున్నాఁడనియుఁ జెప్పఁబడినది. ఇట్లనుటచే నేమేని విశేషముకలదా? లేక అన్నిటియందును సమమైయున్నదా? అనునీవిషయమునందు కొందఱు ఆ అక్షరవస్తువు ఈషత్ ప్రచలతావస్థా అంతర్యామి యనియును, కొందఱు అత్యంత ప్రచలతావస్థా జీవుఁ డనియును, కొందఱు పిండము జాతి విరాట్ సూత్రము దైవము అని యైదువిధములగు అవస్థలుగలది యనియును, కొందఱు ఈయైదిటితోఁగూడ అవ్యాకృతము సాక్షి క్షేత్రజ్ఞుఁడు అనుమూఁడునుజేరి ఎనిమిదవస్థలుగలది యనియును, కొందఱు ఇవన్నియు దానిశక్తులనియును జెప్పుచున్నారు. ఈకల్పన లన్నియు దానికిఁ దగదు. ఈభేదము లెట్లుఁకలిగినవనఁగా—ఉపాధి భేదముచేతనే కలిగినవి. ఉపాధిలేకుండునపుడు అది (ఆత్మ) పరబ్రహ్మ మని చెప్పఁబడుచున్నది. నిత్యనిరతిశయజ్ఞానశక్తి గలిగియుండునపుడు ఈశ్వరుఁడని చెప్పఁబడుచున్నది. అవిద్యాకామకర్మవిశిష్టకార్యకరణో పాధి గలిగినపుడు సంసారియనియు, జీవుఁడనియు చెప్పఁబడుచున్నది. ఇట్లు ఆయాత్మయే దేవతా జాతి పిండమనుష్య తిర్యక్ ప్రేతాదికార్య కరణోపాధులచేత ఆయాయీనామములను, ఆయాయీరూపములను బొందుచున్నది.)

## నవమబ్రాహ్మణము.

(పృథ్వ్యాదులకు ఒకదానికొకటి శ్రేష్ఠముగను సూక్ష్మతారతమ్య క్రమముగను ఓతప్రోతభావమును ; బ్రహ్మమునకు సర్వాంతర్యామిత్వ మును; ఆబ్రహ్మమునకు అవిద్యాకృతవిషయములందు సూత్రభేదము లందు నియంతృత్వమును చెప్పఁబడినది. వ్యాకృతవిషయమునందు గు ర్తు

చక్కఁగాఁ దెలియు ననుగానినిఁగూర్చి, ఆ బ్రహ్మోపనిషత్త్వము నియంతన్య దేవతాభేదము ద్వారముగాఁ దెలియఁబడుచున్నదని ఈశాకల్య బ్రాహ్మణమునందు చెప్పఁబడుచున్నది.)

1. తర్వాత విదగ్ధుఁ డనుశాకల్యుఁడు యాజ్ఞవల్క్యునిఁజూచి. "దేవతలెందఱు?" అనియడిగెను.

యాజ్ఞవల్క్యుఁడు—వైశ్వదేవయాగమంత్రములందు 'నివిత్' అనునొకమంత్రముకలదు. అందుచెప్పఁబడిన సంఖ్యగలవారు గలరు.

శాకల్యుఁడు—వారెందఱు చెప్పుము?

యాజ్ఞవల్క్యుఁడు—మూఁడు మూఁడు నూఱు; మూఁడు మూఁడు వేలు; ఇంకను సంఖ్యను తగ్గించి తగ్గించి యడుగఁగా-33-6-3-2-1½-1 దేవతలు.

శాకల్యుఁడు—303 ను, 3003 ను అని చెప్పితిరికదా! వారెవరు?

2. యాజ్ఞవల్క్యుఁడు—వీరు దేవతలు కారు; క్రమమైనసంఖ్య 33 దేవతలు. వీరివిభూతులు (మహిమలు) 303ను, 3003ను. 33 గురు దేవతలెవరనఁగా-8 వసువులు, 11 రుద్రులు, 12 ఆదిత్యులు, 1 ఇంద్రుఁడు, ప్రజాపతి; మొత్తము 33 దేవతలు.

3. వసువు లెనమండ్రు—అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుఁడు, స్వర్గము, చంద్రుఁడు, నక్షత్రములు అనునివి 8 వసువులు. ప్రాణులకర్మఫలమునకుఁదగినట్లు కార్యకరణసంఘాతరూపముగా (శరీరేంద్రియసముదాయాకారముగా) తామేపరిణమించి జగము నాశ్రయించి దానిని జీవించునట్లు చేయుటవలన వసువులనుపేరు గల్గెను.

4. రుద్రులు పదునొక్కరు—పంచజ్ఞానేంద్రియములును, పంచ కర్మేంద్రియములును, ఆత్మయను మనస్సు ఒకటియును జేరి 11 రుద్రులు. వీరు శరీరమును విడిచిపోవునపుడు, ఆశరీరమునకు సంబంధించినవారలను ఏడ్చునట్లు చేయుటంబట్టి రుద్రులనుపేరు గల్గెను.

5. ఆదిత్యులు పన్నిద్దఱు—ఒకసంవత్సరముయొక్క పండ్రెండునెలలును పన్నిద్దఱాదిత్యులు. వీరు అపుడపుడు పరివర్తనము చేసికొని ప్రాణుల ఆయుస్సును కర్మఫలమును గ్రహించికొనిపోవుటచే వీరికి ఆదిత్యులను పేరు గల్గెను.

6. ఇంద్రుఁడు—ఇంద్రుఁడనఁగా మేఘము, వజ్రము, వీర్యము, బలము. (అనఁగా ప్రాణులను భయపెట్టునది, లేక హింసించునది.)

ప్రజాపతి—అనఁగా యజ్ఞము (యజ్ఞపశువు) యజ్ఞము పశు సాధనత్వముగాన పశు వనఁబడెను.

7. ఆఱుగురు దేవతలు—అగ్ని, పృథివి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుఁడు, స్వర్గము, ఇవి. తక్కిన దేవతలందఱును ఈ ఆఱింటిలోపల అంతర్భావమై యున్నారు.

8. ముగ్గురు దేవతలు—భూలోకము, అంతరిక్షము, స్వర్గలోకము. పృథ్వియు అగ్నియుఁ జేరినది మొదటిది. అంతరిక్షమును వాయువును జేరినది రెండవది. స్వర్గమును ఆదిత్యుఁడును జేరి మూఁడవది. ఈమూఁటిలోపల సమస్తము నణఁగియున్నది.

ఇర్వురు దేవతలు—అన్నమును ప్రాణమును. ఈ రెంటిలో సర్వము నైక్యమైయున్నది. 1½ దేవత యొకఁడు-వాయువు.

9. వాయువు ఒకఁటిగానుండఁగా 1½ అనుటకుఁ గారణమేమనఁగా, ఈవాయువుచేత సమస్తమును వృద్ధినొందుచున్నది. కావున వాయువు (అధికముగా) ఒకటిన్నరయని చెప్పఁబడినది. ఒక దేవుఁ డనఁగా-ప్రాణము. దీనిని "త్యత్" అని చెప్పెదరు. ఇది సర్వదేవతాత్మకమైన బ్రహ్మము. ఇది ఒకటిగను, అనేకముగను ఉన్నది.

10. (ఆప్రాణమను బ్రహ్మము ఎనిమిదివిధములై యున్నది.) ఎవనికి పృథివి శరీరముగను, అగ్ని నేత్రముగను, జ్యోతిస్సు మనస్సుగనున్నదో ఆపురుషుఁడు సకలాత్మకును ఆశ్రయస్థానమైయున్నాఁడు. ఇట్లు తెలిసికొన్నవాఁడు పరమాత్మను తెలిసికొన్నవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

శాకల్యుఁడు—(ఓయాజ్ఞవల్క్యుఁడా! తెలియనిదానిని తెలిసినట్లు చెప్పెదవేమి?)ఎవఁడు సకలాత్మలకును పరాయణమని చెప్పెదవో, అతనిని నేనెఱుంగుదును; అంతమాత్రము చెప్పిన చాలదు. ఇఁక నెట్టివాఁడు? చెప్పుము.

యాజ్ఞవల్క్యుఁడు—ఆయన శారీరపురుషుఁడు. (పార్థివాంశ పురుషుఁడు.) ఇంకను ఏమి విశేషము నడుగఁ దలఁచితివో అడుగుము.

శాకల్యుఁడు—ఆశారీరదేవునకు శరీర మేది? (అనఁగా దేనినుండి అది కలిగెను? వ్యాపించెను?)

యాజ్ఞవల్క్యుఁడు—ఆదేవత అమృతము. (అనఁగా భుజింపఁ బడిన అన్నరసము; ఆరసముచే తల్లి శోణితము కలిగినది; అది త్వక్కు, మాంసము, రుధిరరూపమై యున్నది. ఆయన్నరసముచేత తండ్రియొక్క శుక్లము కలిగినది; అది అస్థి, మజ్జ, శుక్లరూపముగా నున్నది; అదే బీజము. ఈశుక్లశోణితముచేరి శిశువు కలుగుచున్నది; పార్థివాంశ ప్రాణము కలుగుచున్నది.)

11. (ఇఁక ఏడువిధములగు ప్రాణములనుగూర్చి మూలమునందు సంభాషణరూపముగ నున్నది. ఇచ్చట విశేషములుమాత్రము చెప్పఁబడుచున్నవి.)

కామము శరీరము, బుద్ధి దృష్టి, జ్యోతిస్సు మనస్సు, ఇది కామమయపురుషుఁడు; స్త్రీ దేవత.

(ఎనిమిదివిధములయందును జ్యోతిస్సు మనస్సని చెప్పఁబడినది గాన ప్రతిదానియందును యోజించుకొనునది.)

12. రూపములు (శ్వేతరక్తాదిసామాన్యరూపములు) శరీరము, చక్షుస్సు దృష్టి, ఇది ఆదిత్యపురుషుఁడు; సత్యము (చక్షుస్సు) దేవత.

13. ఆకాశము శరీరము, శ్రోత్రము దృష్టి, ఇది ప్రాతిశ్రుత్కపురుషుఁడు; (వినునప్పుడు చాలజాగ్రత్తతో వినుటకు ప్రాతిశ్రుత్కమని పేరు.) దిక్కు దేవత.

14. తమస్సు (చీకటి) శరీరము, హృదయము దృష్టి, ఇది ఛాయామయపురుషుఁడు; మృత్యువు దేవత.

15. రూపములు (ప్రకాశమైనరూపములు) శరీరము, చక్షుస్సు దృష్టి, ఇది ప్రతిబింబపురుషుఁడు; ప్రాణము దేవత.

16. జలము శరీరము, హృదయము దృష్టి, ఇది అప్పుపురుషుఁడు; వరుణుఁడు దేవత.

17. రేతస్సు శరీరము, హృదయము దృష్టి, ఇది పుత్రమయపురుషుఁడు; ప్రజాపతి (పిత) దేవత.

18. (ఇదివఱకు ప్రాణాదులు మూఁడువిధములుగా ఉపాసనార్థము చెప్పఁబడెను. ఇఁక ఐదువిధములుగా ఉపసంహారము చెప్పఁబడుచున్నది.)

యాజ్ఞవల్క్యుఁడు—ఓశాకల్యుఁడా! ఈబ్రాహ్మణులు అగ్ని చల్లాఱినస్థలమువలె నిన్నుఁ దలంచుచున్నారు. (వీరు నాచే నీవు జయింపఁబడితివని తలంచెదరు, అది నీవెఱుఁగకున్నావు.)

19. శాకల్యుఁడు—నీవు ఈబ్రాహ్మణులనుగూర్చి చాలప్రశంసించెదవు. నీవు ఏబ్రహ్మమును తెలిసికొని యిట్లు పల్కెదవు?

యాజ్ఞవల్క్యుఁడు—దేవతలతోను, దానిదాని ప్రతిష్ఠలతోను నుండుదిక్కులను నేను తెలిసికొనియున్నాను. (దిగ్విషయబ్రహ్మజ్ఞానము నాకుఁ దెలియును, నేనే ఆదిగ్బ్రహ్మమై యున్నాను.)

20. శాకల్యుఁడు—నీకుఁ దెలిసియుండిన చెప్పుము! తూర్పు దిక్కునం దే దేవతయున్నాఁడు?

యాజ్ఞవల్క్యుఁడు—ఆదిత్యదేవత.

శాకల్యుఁడు—ఆ ఆదిత్యదేవత దేనియందు ప్రతిష్ఠితుఁడై యున్నాఁడు?

యాజ్ఞవల్క్యుఁడు—అధ్యాత్మమైన నేత్రమునందు ఆదిత్యుఁడు పుట్టుచున్నాఁడు.

శాకల్యుఁడు—ఆనేత్రము దేనియందు ప్రతిష్ఠితమై యున్నది?

యాజ్ఞవల్క్యుఁడు—రూపములయందు; (చక్షుస్సు రూపాత్మకము.) నేత్రముచే రూపములను జూచుచున్నాఁడు.

శాకల్యుఁడు—రూపములు దేనియందు ప్రతిష్ఠితమై యున్నవి?

యాజ్ఞవల్క్యుఁడు—హృదయమునందు; (బుద్ధి మనస్సు వీనియందు.) బుద్ధిచేత రూపములను దెలిసికొనెదరు. బుద్ధిచేత రూపస్మరణము కలుగుచున్నది. (నేత్రముతో మనస్సు చేరనియెడల నేత్రము చూడ నేరదు.)

21. (ఇఁక చెప్పఁబోవు దిక్కులవిషయములందు విశేషములు మాత్రము వ్రాయఁబడును.)

దక్షిణదిక్కు—యముఁడు దేవత; యముఁడు యజ్ఞమునందు ప్రతిష్ఠితుఁడు. యజ్ఞము దక్షిణయందు ప్రతిష్ఠితము. (దక్షిణచేత యజ్ఞము పరిసమాప్త మగుచున్నది.) ఇది శ్రద్ధయందు (శ్రద్ధచేతనే దక్షిణ యీయఁబడుచున్నది.) ఇది హృదయమునందు ప్రతిష్ఠితము.

22. పశ్చిమదిక్కు—వరుణదేవత ; ఇది జలమునందును, జలము రేతస్సునందును, రేతస్సు హృదయమునందును ప్రతిష్ఠితములు.

23. ఉత్తరదిక్కు—సోమదేవత; (చంద్రుఁడును సోమలతయుఁ జేరినది.) ఇది దీక్షయందును (యాగదీక్షయందుండువాఁడే సోమలతకు అధికారి.) దీక్షావిషయమునందును, విషయము హృదయమునందును ప్రతిష్ఠితములు.

24. ధ్రువమునకు (మేరువునకు పైభాగమున సదాప్రకాశమై యుండుదిక్కు.)—అగ్ని దేవత; ఇది వాక్కునందును, వాక్కు హృదయమునందును ప్రతిష్ఠితములు.

శాకల్యుఁడు—హృదయము దేనియందు ప్రతిష్ఠితమైయున్నది?

25. హృదయము మనశరీరముకంటె వేఱుచోట ప్రతిష్ఠితమై యున్నదని నీవు తలంచితివేని నీశరీరమును కుక్కలును పక్షులును పెఱికి తినును. (అనఁగా, హృదయము శరీరమునందు ప్రతిష్ఠితము.)

26. శాకల్యుఁడు—నీశరీరమును, ఆత్మయు దేనియందు ప్రతిష్ఠితములై యున్నవి?

యాజ్ఞవల్క్యుఁడు—ప్రాణవాయువునందు; అది అపానవాయువునందు; అది వ్యానవాయువునందు; అది ఉదానవాయువునందు; అది సమానవాయువునందు, అదే బ్రహ్మము; నేతినేతి యని నిర్దేశింపఁబడి యుండువాఁడు; ఇంద్రియములచే గ్రహింపఁబడనివాఁడు ; అచ్యుతుఁడు; దేనితోను జేరనివాఁడు ; ఒక్కదానిచేతను కట్టువడనివాఁడు ; నాశములేనివాఁడు.

ఓశాకల్యుఁడా ! ఈ యెనిమిదిఆయతనములును (శరీరములును), ఎనిమిదిలోకములును, ఎనిమిది దేవతలును, ఎనమండుగురు పురుషులును గలరు. ఈపురుషులను ఎవఁడు తనఆత్మగానెఱింగి ఉపాధిధర్మములను దాఁటియున్నాఁడో, ఎవఁడు ఉపనిషత్ప్రతిపాద్యుఁడో, అట్టివానినిఁ గూర్చి నీవు చెప్పుము, చెప్పకుందువేని నీతల పగిలిపోవును !

శాకల్యుఁడు చెప్పలేదు; అతని తల పగిలిపోయెను. వెంటనే మృతి నొందెను. అతనిశిష్యులు దొంగలనలె అతనిని గైకొనిపోయి సంస్కారము చేసిరి.

27. యాజ్ఞవల్క్యుఁడు—ఓ మహాత్ములైన బ్రాహ్మణులారా! మీలోనొక్కరుగాని, అందఱునుగాని నన్నడుగవలసినదానిని అడుగ వచ్చును. లేక నన్నడుగునట్లు మీరందఱుగాని, ఒక్కరుగాని చెప్పిన యెడల నేనడిగెదను.

ఆబ్రాహ్మణు లెవ్వరును మఱుమాటాడక మిన్నకుండినందున యాజ్ఞవల్క్యుఁడే వారినిగూర్చి యడిగెను.

“లోకమునందు పురుషుఁడు వృక్షమునకుసమానమైనవాఁడనునది సత్యమైనవిషయము. ఎట్లన, వృక్షమునకు ఆకులు పురుషునిరోమములు; పట్ట పురుషునిచర్మము; పట్టయందుండి పాలు ప్రవహించునట్లు పురుషుని చర్మమునందుండి రక్తము ప్రవహించుచున్నది; తునుకలు మాంసపు ముద్దలు; పట్టలోపలి తెల్లపట్ట పురుషునిచర్మమునకు లోపలనుండు తెల్లని పొర; కట్టెలు ఎముకలు; కట్టెలోపలిచేవ మజ్జ; మ్రానిని నఱికినయెడల మరల చిగిరించుచున్నది; అట్లు పురుషునియందుఁ గనఁబడదు. కాఁబట్టి యిచట నొకప్రశ్నమున్నది—మృతినొందినపురుషుఁడు మరల నెట్లు కలుగుచున్నాఁడు? రేతస్సునుండి కలుగుచున్నాఁడని చెప్పఁగూడదు. ఏలన, జీవముగలపురుషునియందుమాత్రమే రేతస్సున్నది. వృక్షమునందుండి మరల చిగిరించుటమాత్రమేగాక, విత్తునుండియు కలుగుచున్నది. అయినను విత్తనములను, వేఱుతోడి వృక్షమును నాశముచేసినయెడల మాత్రము మరల మొలువదు. ఖండింపఁబడినమనుష్యుఁడు మరల నెచట నుండికలుగుచున్నాఁడు? తానై పుట్టుచున్నాఁడని చెప్పఁగూడదు. ఏలన, నశించి యెట్లు తానైపుట్టఁగలుగును? కావున వీనిని ఎవఁడు మరల కలుఁగ జేయుచున్నాఁడు?” (ఈప్రశ్నలకు ఆబ్రాహ్మణులుఉత్తరము చెప్పనందున, వారందఱును ఓడిపోయిరి. వెంటనే జనకరాజిచ్చినపశువులను యాజ్ఞ వల్క్యుఁడు తోలికొనిచనెను. ఇంతటితో ప్రశ్నములుపూర్తియాయెను.)

(పైనిచెప్పినప్రశ్నకు వేదమే ఉత్తరమిచ్చుచున్నది. ఎట్లన)

“విజ్ఞానమై, ఆనందమై, బ్రహ్మమై, కర్మిష్ఠునకును బ్రహ్మవేత్తకును పరాగతియైన ఆత్మయే మరల వీనినిఁ గలుగఁజేయుచున్నాఁడు. (పుట్టించు చున్నాఁడు.)

(ఆనందశబ్దము బ్రహ్మమునకు విశేషణముగా శ్రుతియందుఁ జెప్పఁ బడియున్నది. దీనికివిరోధశ్రుతులును పెక్కులుగలవు. “అంతయుఁనొక్కటి,

రెండవది లేదు" అను శ్రుతి యున్నదికదా? ఆరీతిగనుండు నెడల ఆనంద మును తెలిసికొనువాఁ డెవఁడు? ఆనందమేది? ఇప్పుడు రెండైనవి. ఇది ఏకత్వశ్రుతికి విరోధముకదా? మఱియు, "మోక్షమునందు తెలియంబడు సుఖము లేదు" అని కొందఱును, "తెలియంబడు నిరతిశయసుఖముకలదు" అనికొందఱును జెప్పెదరు. ఏకత్వవిషయమునందు విజ్ఞానమునకు(తెలివికి) ఉపపత్తి లేదనఁగూడదు. అగ్నికి శీతలగుణమును, జలమునకు ఉష్ణగుణ మును ఉన్నదని యొకవచన మున్నయెడల అది యథార్థవాక్యమగునా? కావున శబ్దప్రమాణముచాలదు. ప్రత్యక్షప్రమాణము గావలయును. దీనికిసమాధానము లేకపోలేదు. ప్రత్యక్షప్రమాణమున్నది. ఎట్లన, "నేను సుఖముగనున్నాఁడను." అని చెప్పుచున్నాఁడు. అనఁగా, తనసుఖమును తానే తెలిసికొనుచున్నాఁడు. కాఁబట్టి, బ్రహ్మవిజ్ఞానానందమును బ్రహ్మ వేత్త యెఱుంగుచున్నాఁడు. అనఁగాఁ దన్ను దా నెఱుంగుచున్నాఁడు.)

---

# చతుర్థాధ్యాయము

## ప్రథమబ్రాహ్మణము

1. ఒకనాఁడు విదేహరాజగు జనకమహారాజు సింహాసనారూ ఢుఁడై యుండునప్పుడు యాజ్ఞవల్క్యుఁడు పోయెను.

జనకుఁడు—మరల వచ్చిన పనియేమి? ఇంకను పశువులు కావల యునా? లేక, అతిసూక్ష్మములైన విషయములను నన్నడుగుటకా ?

యాజ్ఞవల్క్యుఁడు—రెంటికొఱకును వచ్చినాఁడను.

2. ఓజనకుఁడా, నీ కెవరేని ఆచార్యులేయేరహస్యవిషయములు చెప్పియున్నారో, వానిని నాకుఁ జెప్పుము.

జనకుఁడు—జిత్వా అనుశైలిని 'వాగ్వైబ్రహ్మ' అని నాకుఁ జెప్పెను.

యాజ్ఞవల్క్యుఁడు—ఉపనయనమువఱకు తల్లిచేత పోషింపఁబడి శాసింపఁబడియు, దానికిమీఁద సమావర్తనపర్యంతము తండ్రిచే శాసిం పఁబడియు, తర్వాత ఆచార్యునిచే బోధింపఁబడియు, ఇట్లు క్రమముగా జ్ఞానమును బొందినవాఁడు చెప్పెడివిధముగా ఆశైలిని నీకుఁ జెప్పెను, అది

క్రమమే; వాక్కులేనిమూగవాని కేమియున్నది? (మూగవానికి జ్ఞానములేదు.) ఆబ్రహ్మమునకు ఆయతనము (శరీరము) ఇట్టి దనియును, ప్రతిష్ఠ (త్రికాలములందును) ఇట్టిదనియును జెప్పలేదా?

జనకుఁడు—చెప్పలేదు.

యాజ్ఞవల్క్యుఁడు—కాఁబట్టి నీకు పాతికభాగమే బ్రహ్మమును గూర్చి చెప్పెను. (ఇఁక ముప్పాతికభాగము తెలియనిది ప్రయోజనము లేదు.)

జనకుఁడు—(ఆముప్పాతికభాగమును) నీకుఁ దెలిసియున్నచోఁ జెప్పుము.

యాజ్ఞవల్క్యుఁడు—వాక్కు శరీరము. ఆకాశము ప్రతిష్ఠ. దీనిని ప్రజ్ఞ యని ఉపాసింపవలయును. వాక్కుచే 'ఇతఁడుమనబంధు' వని తెలియఁబడుచున్నది. అట్లు నాలుగువేదములును, ఇతిహాసములును, పురాణములును, విద్యలు, ఉపనిషత్తులును, శ్లోకములును, మంత్రములును, సూత్రములును, వ్యాఖ్యానములును, ఇష్టమును, హుతమును, అశితమును, విస్పృష్టమును, ఈజన్మమును, పునర్జన్మమును, సకలభూతములును (వాక్కుచే) తెలియఁబడుచున్నవి. కావున వాక్కే బ్రహ్మము. బ్రహ్మవిద్య వాక్కును విడుచుటలేదు. ఇట్లు వాక్కును ఉపాసించువానిని సకలభూతములును రక్షించుచున్నవి. ఇట్టివాఁడు మరణానంతరము దేవుఁడై దేవత్వమును బొందుచున్నాఁడు.

జనకుఁడు—ఈవిద్య నాకు ఉపదేశించినందులకు ఏనుఁగులతో సమానమైన వేయివృషభముల నిచ్చితిని.

యాజ్ఞవల్క్యుఁడు—శిష్యుని కృతార్థునింజేయక వానియొద్ద నుండియేదియు గ్రహింపఁగూడదని నాతండ్రి నాకుఁ జెప్పెను. (కాఁబట్టి నాకేమియు వలదు.)

3. (ఇఁకఁ జెప్పఁబోవువిషయములు మూలమందు ప్రశ్నోత్తరరూపములై యున్నవి. ఇచ్చట వానివిశేషములుమాత్రము చెప్పఁబడుచున్నది.)

ప్రాణము (వాయుదేవత) బ్రహ్మము; దానికి ప్రాణవాయువు శరీరము; ఆకాశము ప్రతిష్ఠ. దీనిని ప్రియవస్తువుగా ఉపాసింపవలయును. ప్రాణరక్షణార్థమై ఏకార్యమునైనను జేయుచున్నాఁడు; అయాజ్యుని

యజింపించుచున్నాఁడు; పుచ్చుకొనఁగూడదనిదానిని పుచ్చుకొనుచున్నాఁడు; ప్రాణముపోవునని భయపడి వధాశంకను (సంశయమును) పొందుచున్నాఁడు. (తక్కినది మునుపటివలె. అనఁగా, జనకుఁడిచ్చుట, యాజ్ఞవల్క్యుఁ డిప్పుడు వలదనుట.)

4. (వార్ష్ణుఁడు) చక్షుస్సు (ఆదిత్యదేవత) బ్రహ్మము; నేత్రము శరీరము; ఆకాశము ప్రతిష్ఠ; సత్యవస్తువుగా ఉపాసింపవలయును. కంటితోఁ జూచుచున్నాఁడు; చూచుటయే నిశ్చయమనెదరు.

5. (భారద్వాజుఁడు) శ్రోత్రము (దిగ్దేవత) బ్రహ్మము; చెవి శరీరము; ఆకాశము ప్రతిష్ఠ ; అనంతమని ఉపాసింపవలయును; దిక్కులకు అంతములేదు; ఒకదిక్కునుగూర్చి పోఁగా పోఁగా పారములేక యుండును.

6. (సత్యకాముఁడు) మనస్సు (చంద్రదేవత) బ్రహ్మము; మనస్సు శరీరము; ఆకాశము ప్రతిష్ఠ; ఆనందమని ఉపాసింపవలయును. మనస్సుచేత ఒకస్త్రీని ప్రార్థించుచున్నాఁడు ; దానియందు అనురూపమైన కుమారుఁడు పుట్టుచున్నాఁడు; ఇదే ఆనందము.

7. (శాకల్యుఁడు) హృదయము (ప్రజాపతిదేవత) బ్రహ్మము; హృదయము శరీరము; ఆకాశము ప్రతిష్ఠ; స్థితి యని ఉపాసింపవలయును. హృదయమునందు సర్వమును ఐక్యము.

---

## ద్వితీయబ్రాహ్మణము.

1. జనకుఁడు సింహాసనమునందుండి లేచి, యాజ్ఞవల్క్యుని సమీపించి నమస్కరించి ఉపదేశముచేయవలసిన దని ప్రార్థించెను. యాజ్ఞవల్క్యుఁడు-(జనకునింజూచి) ఒకఁడు సుదూరదేశమునకు పోవుటకై స్థలమార్గముగా రథమునందుగాని, జలమార్గముగా ఓడయందుగాని ప్రయాణమై, తానుపోవలసిన ప్రదేశమునకుఁబోవుచున్నాఁడు. అట్లే నీవు ఉపనిషత్తుల నెఱింగినవాఁడవై సగుణబ్రహ్మమును దెలిసికొని సమాహితాత్ముఁడవై యున్నాఁడవు. వేదాధ్యయనముచేసిపూజ్యుఁడై, ధనికుఁడై, ఉపనిషత్తులను శ్రవణముచేసినవాఁడై ఉండినప్పటికిని కలు

గదు బ్రహ్మజ్ఞానములేనిగొడల కృతార్థత కలిగిట్టినీవు ఈదేహపాతా నంతరము ఎచ్చటికిఁబోదువు? నీకుఁ దెలియునా? (అని యడిగెను.)

జనకుఁడు - నాకుఁ దెలియదు.

యాజ్ఞవల్క్యుఁడు- నేను జెప్పెదను.

జనకుఁడు - చెప్పుము.

2. యాజ్ఞవల్క్యుఁడు - ఏఆత్మ కుడికంటియందు అంతర్గతపురుషుఁడై యున్నాఁడో, ఆదిత్యాంతర్గతపురుషుఁడో, అతనికి "ఇన్ధః" (ప్రకాశముగలవాఁడు) అనిపేరు. అతనిని ఇంద్రుఁడని పరోక్షముగాఁ జెప్పుదురు. దేవతలు ప్రత్యక్షనామగ్రహణము నంగీకరింపరు. (జాగ్రదవస్థయందు ఆత్మ, వైశ్వానరుఁడనుపేరుగలదై, కుడికంటియందు అంతర్గతమై యున్నది. నీవు దానిని తెలిసికొన్నవాఁడవై, అదియై యున్నాఁడవు.)

3. ఈయెడమకంటియందు పురుషరూపమైయుండువస్తువు వైశ్వానరునిపత్ని, విరాట్ స్వరూపము (అన్నము, భోజ్యవస్తువు). (అనఁగా వైశ్వానరుఁడు (అత్తా)ఇంద్రుఁడు; అతనిపత్ని విరాట్, అన్నము,ఇంద్రాణి. ఈరెండును స్వప్నావస్థయం దేకమైయుండును. అపు డీయాత్మకు "తైజసుఁడు" ప్రకాశస్వరూపుఁ డనిపేరు.) వీరిస్థాన మేదియనఁగా, అంతర్హృదయాకాశము. వీరికి అన్న మెద్దియన, అంతర్హృదయాకాశమునందలి రక్తపిండము. (అనఁగా భుజింపఁబడుఅన్నము రెండువిధములుగా పరిణమించుచున్నది. స్థూలాంశము దిగువపడిపోవుచున్నది. ఇంకొకభాగము అగ్నిచే పక్వమై రెండువిధములగుచున్నవి. మధ్యమరసము రక్తాదులై పాంచభౌతికశరీరమును పోషించుచున్నది. మఱొకసూక్ష్మాంశరసము మాంసపిండమగుచున్నది. ఇదే పైనచెప్పినవారికి అన్నము. అనఁగాహృదయమునందుండు ఇంద్రుఁడు ఇంద్రాణి యనుపేర్లుగలదానికిని, తైజసునకును, లింగాత్మ యగుజీవునకును స్థితిహేతువై యున్నది. వీరికి "ప్రావరణమ్" (తెఱ) ఏదనఁగా, అంతర్హృదయమునందు వలవలెనుండు అనేకనాడులే. వీరికి (జాగ్రత్స్వప్నకాలములందు సంచరించు) మార్గము లేవియనఁగా, హృదయమునుండి మీఁదికి (ఊర్ధ్వముగా) పోవునాడియే. ఎట్లు రోమము లనేకములును సూక్ష్మములునై యున్నవో, అట్లు హితా అనుపేరుగల నాడు లనేకము లతిసూక్ష్మములై హృదయమునుండి పైకి లేచియున్నవి. అందు ప్రతిష్ఠితములై యున్నవి. ఈనాడుల మార్గము.

అన్నము పోవుచున్నది; ఆత్మయు పోవుచున్నది. కావున, తైజసుఁడు వైశ్వానరునికంటెను సూక్ష్మానన్ద భుక్తుఁడై యున్నాఁడు.

4. తైజసుఁడు, సుషుప్త్యవస్థయందు కేవలము ప్రాణుఁడై మాత్రమున్నాఁడు. అనఁగా నిశ్చేష్టితుఁడై యున్నాఁడు. అపుడు వీనికి ప్రాజ్ఞుఁడని పేరు.)

అపుడు వీనికి తూర్పు దిక్కు, తూర్పుప్రాణములు; అట్లు ఒక్కొక దిక్కువిషయమునందును, అన్ని దిక్కులును అన్ని ప్రాణములై యున్నవి. (ఇట్లు బ్రహ్మవేత్తయైనవాఁడు, సర్వాత్మయై, ప్రాణాత్మకమైన ప్రజ్ఞాత్మత్వమునొంది, కడపట తురీయావస్థయందు ప్రత్యగాత్మయై) "నేతి, నేతి" యని నిశ్చయింపఁబడిన పరబ్రహ్మత్వమును బొందుచున్నాఁడు. అపుడు వాఁడు చెదరుటలేదు; ఒకదానితోఁ జేరుటలేదు; కష్టపడుటలేదు; నశించుటలేదు; అట్టి అభయవస్తువును (పరమాత్మను) నీవు పొందుదువు.

జనకుఁడు—ఏ అభయవస్తువును నేను పొందఁబోవునట్లు చెప్పితివో, దానిని నీవును పొందుదువుగాక. నీకు నమస్కారము. దీనికై నేను నీకు ఏమి యీయఁగలను? నావిదేహరాజ్యమున్నది; నేను దాసుఁడనై యున్నాఁడను. (ఏదికావలయునన్న గ్రహింపవచ్చుననియును, యథేష్టముగా నున్నదనియును తాత్పర్యము.)

---

## తృతీయబ్రాహ్మణము.

(ఈ బ్రాహ్మణమునందు ఆత్మప్రభావము వర్ణింపఁబడుచున్నది. అది యొకకథారూపముగాఁ జెప్పఁబడుచున్నది.)

1. ఒకకాలమునందు యాజ్ఞవల్క్యుఁడు జనకునియొద్దకుఁ బోయెను. అతని కేదియుఁ జెప్పఁగూడదనితలంచి(తనయోగక్షేమార్థమై) పోయియుండెను. (అటఁ డట్లుతలఁచికొనిపోయినప్పటికిని, అతఁడడుగఁగా, నితఁడు చెప్పవలసివచ్చినది.) మునుపు అగ్నిహోత్రవిషయమై యిర్వురకును సంవాదము జరగినకాలమునందు యాజ్ఞవల్క్యుఁడు జనకునకు వరమిచ్చియుండెను. ఆవరము ప్రశ్నల నడుగవచ్చుననెడివరము. ఆవరమును ఇప్పుఁడు (జనకుఁడు యాజ్ఞవల్క్యుని)ఉపయోగించుకొనెను.

2. జనకుఁడు—ఈపురుషుఁడు(జీవుఁడు)ఏజ్యోతిస్సై యున్నాఁడు. (ఏజ్యోతిస్సుచే వ్యవహారము చేయుచున్నాఁడు.)

యాజ్ఞవల్క్యుఁడు—ఆదిత్యజ్యోతిస్సు;ఈజ్యోతిస్సుసహాయము చేత జీవించియున్నాఁడు; సమస్తమును నేత్రముతోఁ జూచుచున్నాఁడు; వలయుస్థలముకుఁ బోవుచున్నాఁడు; కార్యములు చేయుచున్నాఁడు; మరల వచ్చుచున్నాఁడు.

3. జనకుఁడు—ఇదిసరియే.

అయినను, సూర్యుఁడ స్తమించినయెడల, అప్పు డీజీవునకు ఏజ్యోతిస్సు కలదు?

యాజ్ఞవల్క్యుఁడు—చంద్రజ్యోతిస్సు; ఆప్రకాశమువలన సర్వమును చేయుచున్నాఁడు.

4. జనకుఁడు—సూర్యచంద్రులిర్వురును అస్తమించినయెడలఏజ్యోతిస్సు కలదు?

యాజ్ఞవల్క్యుఁడు—అగ్నియగుదీపము మొదలగు జ్యోతిస్సుచే సర్వమును చేయుచున్నాఁడు. (సూర్యచంద్రాగ్నులు చక్షురింద్రియమునకు సహాయముచేయుటచే నవి తెలియునది.)

5. జనకుఁడు—పైనిచెప్పిన సూర్యచంద్రాగ్నిజ్యోతిస్సులు లేని యెడల అపు డీజీవునకు ఏజ్యోతిస్సు కలదు?

యాజ్ఞవల్క్యుఁడు—వాక్కు జ్యోతిస్సు; (అనఁగా శబ్దము. చీకటిగానుండునపుడు చక్షురింద్రియమునకువ్యాపారము లేదు. అపుడు శ్రోత్రమునకు వ్యాపారమున్నది) దానిచే వ్యవహారము జరగుచున్నది. (అట్లే గంధముచే ఘ్రాణేంద్రియమునకును, రసముచే రసనేంద్రియమునకును, స్పర్శముచే త్వగింద్రియమునకును, వ్యాపారము(కార్యము= క్రియ = పని) కలుగుచున్నది.)

6. జనకుఁడు - సకలజ్యోతిస్సులును లేకపోయినపుడు జీవునకు జ్యోతిస్సేది?

యాజ్ఞవల్క్యుఁడు-ఆత్మజ్యోతిస్సే. దీనిచే బ్రదికియున్నాఁడు; సకలవ్యవహారములను జేయుచున్నాఁడు.

(జాగ్రత్కాలమునందు చక్షుస్సు మొదలగు బహిర్ముఖములైన కిరణములు ఆదిత్యాది జ్యోతిస్సులసహాయముచే నీజీవునకువ్యవహారము

జరగుచున్నది. అనఁగా ఆ కాలమునందు తన అవయవములకు వేఱై నజ్యోతి స్సులచే కార్యము జరగుచున్నది. ఈజ్యోతిస్సు లన్నియు అస్తమించిన కాలమునందు అనఁగా స్వప్నసుషుప్తికాలములందును ఏదోయొకజ్యోతి స్సుచే కార్యముసిద్ధించుచున్నది. స్వప్నకాలమునం దెన్నియోవిషయము లనుజూచుచున్నాఁడు. సుషుప్తికాలమునం దేమియు తెలియకపోయినను, నిద్రనుండి లేచినమీఁద "నేను సుఖముగనిద్రపోతిని" అనుచున్నాఁడు. కావున, ఈకాలములందు నేదియో యొకజ్యోతిస్సు లేకున్నచో నివి యేవియు గోచరముకావుకదా? ఈజ్యోతిస్సే ఆత్మజ్యోతిస్సు.ఇట్టిస్వయం ప్రకాశమైన జ్యోతిస్సు శరీరమునం దుండవలయునని సిద్ధించుచున్నది కదా. దీనివలననే శరీరమునకు దర్శనాదిక్రియ కలుగుచున్నది. మఱియు జాగ్రత్కాలమందు జూచువస్తువులే స్వప్నమునందుఁ గనంబడుచున్నవని చెప్పఁగూడదు. జాగ్రత్కాలమందు చూడనివియు స్వప్నమునందుఁగన బడుచున్నవి. అంతియగాక, గ్రుడ్డివాఁడును స్వప్నమునందు అనేకవస్తువు లను జూచుచున్నాఁడు. కావున,స్వప్నమునం దెవఁడుతలంచుచున్నాఁడో వాఁడేచూచువాఁడునై యున్నాఁడు. అనఁగా ఆత్మ. దేహముచూచుట లేదు. తలంచువాఁడును చూచువాఁడు నొకఁడే. కన్నులుమూసికొని తలంచినచో మున్ను జూచిన వస్తువులను జూచుచున్నాఁడు. కన్నులకు మాత్రమే చూచునట్టిశక్తిలేదు; చూచువాఁడు నొక్కఁడుకలఁడు. మృతి జెందినశరీరమందలి నేత్రమునకుఁ జూచెడిశక్తి కలదా? లేదుకదా. కావున, దేహమునకు దర్శనాదిశక్తి లేదు. నేత్రాదులకును దర్శనాదిశక్తి లేదు. 'నేనుజూచితిని, నేను చూచుచున్నాను.' అనుచున్నాఁడు. తన కన్నుచూచి చెప్పుటలేదు. దీనివలనఁ జూచినకర్త వేఱని సిద్ధించు చున్నది. అయినను మనస్సు చూచిన దని చెప్పరాదాయనఁగా, అట్లు చెప్పఁదగదు. ఏలన, "నామనస్సు" అనుచున్నాఁడు. అనఁగా మనస్సును ఒకవిషయమైపోయినది. కావున, వీనికన్నిటికంటె విలక్షణమైన జ్యోతి స్సొకటి యుండవలయునని సిద్ధించుచున్నది.

కార్యకారణసంఘాతమునకు సమానజాతీయమైన జ్యోతిస్సున్న దని చెప్పుటయు సరికాదు. ఎట్లన, ఒకవస్తువునకు సమానమైనవస్తువే ఉప కారముచేయవలయు ననునియమము లేదు. అగ్ని పార్థివసంబంధమైన కట్టెలచేజ్వలించుచున్నది; మెఱుపును, జఠరాగ్నియునుజలముచేజ్వలించు

చున్నది; మనుష్యుఁడు అన్యజాతిదైన మృగాదులచేతను ఉపకృతుఁడగు చున్నాఁడు. కావున, ఆదిత్యాదులకంటె వ్యతిరిక్తమైన ఒకజ్యోతిస్సు (ఆత్మ) శరీరమునందున్నదని సిద్ధించుచున్నయది.)

7. జనకుఁడు—ఆ ఆత్మ యెవఁడు? (దేహేంద్రియమనస్సుల యందెచ్చట నున్నాఁడు?)

యాజ్ఞవల్క్యుఁడు—ఆయాత్మ ప్రాణములలో విజ్ఞానమయుఁడై, హృదయమునందు (బుద్ధియందు) అంతర్జ్యోతిస్స్వరూపుఁడై యుండు "పురుషుఁడు" అనఁబడువాఁడే ఆత్మ.

(ఒకమరకతమణిని పాలలో వేసినయెడల, ఆపాలంతయు ఆమణి చ్ఛాయగా నుండును. అట్లు ఆత్మ తనచ్ఛాయను బుద్ధియందు ప్రసరించు నట్లు చేయుచున్నాఁడు. ఆబుద్ధి, ఆత్మకు సమీపమునం దుండుటంబట్టి, ఆబుద్ధి ఆత్మజ్యోతియొక్క ప్రతిచ్ఛాయయై యున్నది. అందువలన ఆత్మాభి మానబుద్ధి, వివేకులకుఁగూడ శ్రేష్ఠమైయున్నది. తర్వాత మనస్సు, ఇంద్రియములు, దేహము, అను నిట్లు క్రమముగా ఒకదానికొకటి అవభాసములై యున్నవి.

పూర్ణమైయుండుటంబట్టి "పురుషుఁడు" అని వ్యవహరింపఁబడు చున్నాఁడు.

సర్వకరణములకును అనుగ్రాహకములైన ఆదిత్యాది బాహ్య జ్యోతిస్సులు అస్తమయము నొందినప్పుడు, బుద్ధిగుహాయందు జ్యోతీ రూపమైయుండు ఆత్మయగుపురుషుఁడు అంతఃకరణద్వారముగా కరణము లకు అనుగ్రాహకుఁడై యున్నాఁడు. ఈస్వయంజ్యోతిస్సు లేనియెడల కార్యకారణసంఘాతమునకు వ్యవహారమేర్పడదు. వ్యవహారమంతయు ఇచ్ఛామాత్రమై యున్నది. బుద్ధిచేత ఇచ్ఛకలుగుచున్నది. బుద్ధి ఆత్మ స్వరూపము. ఆత్మయైన అంతర్జ్యోతి లేనిచో నేవ్యవహారమునుండదు. జాగ్రత్కాలమునందు కార్యకారణ వ్యాపార సమూహముయొక్క వ్యాకులతచే ఆత్మగోచరించుటలేదు.)

యాజ్ఞవల్క్యుఁడు—(పైనిచెప్పినవిధముగా) ఆయాత్మ బుద్ధితో సంబంధించినదిగా (అనఁగా, బుద్ధిరూపముగా, బుద్ధితోఁ గూడినదిగా, బుద్ధిద్వారముగా, బుద్ధివలెఁగనఁబడినదిగా) నుండి, ఇహలోకమునందును, పరలోకమునందును సంచరించుచున్నాఁడు. (అనఁగా, సంచరించునట్లు

కనంబడుచున్నాఁడు.) తలంచువానివలెను, పోవువానివలెను గనంబడు చున్నాఁడు. (అనఁగా, యథార్థమునందు ఆత్మకు ఏవ్యవహారమును లేదని తాత్పర్యము.)

(లోకమునందు ఏదేది రంగుగల వెలుతురు (మతాబు మొదలగునవి) ఎఱుపు మొదలగు రంగుగలదిగా నుండినపుడు, ఆవెలుతురునందుఁ గనంబడు వస్తువు లన్నియు నదేరంగుగా నగపడుటయేగాక, తానును ఆరంగుగా నెట్లుకనంబడునో, అట్లు ఆత్మ, బుద్ధిని ప్రకాశింపఁజేయుచు తానును బుద్ధివలెఁ గనఁబడుచున్నది.)

(బుద్ధికంటె ఆత్మ వేఱుకాదని కొంద ఱనెదరు. అది సరికాదు. బుద్ధికి మార్పుకలుగుచున్నదిగాన, అది ఆత్మకానేరదు. ఆత్మ స్వచ్ఛమైనదై, బుద్ధికంటె వేఱైనదై యున్నది.)

౮. ఆత్మయను పురుషుఁడే శరీరమును బొంది, దానిచేఁ గలిగినవాఁడుగా, పాపముల కాశ్రయమైన కార్యకారణములతో సంబంధించి యున్నాఁడు. అతఁడే ఈదేహమును వదలి, పాపములకు ఆశ్రయములైన కార్యకారణములను త్యజించుచున్నాఁడు.

(ఈఆత్మ, శరీరములోనుండి జాగ్రత్స్వప్నకాలములందు పాపరూపములైన కార్యకారణములను అంగీకరించుచు, త్యజించుచు నున్నాఁడుకదా. అట్లే ఆపురుషుఁడు ఇహాపరలోకములందును జననమరణాదులను బొందుచు మోక్షపర్యంతము సంచరించుచున్నాఁడు.)

౯. (ఇహాపరలోకములవిషయమైనసంశయము నివృత్తిచేయఁబడుచున్నది.)

ఈపురుషునకు రెండేస్థానములుగలవు. ఒకటి ఇహాలోకము, రెండవది పరలోకము. ఇహాలోకమనఁగా—(ప్రత్యక్షముగా అనుభవింపఁబడునదియును, జన్మశరీరేంద్రియములచేవేదనపొందఁబడునట్టిదియునగుస్థానము.) పరలోకమనఁగా—(శరీరపాతానంతరము అనుభవింపఁబడుస్థానము.) ఈరెంటినడుమ సంధ్యమైనది స్వప్నస్థానము. ఇది మూఁడవస్థానము. ఆత్మ, ఈసంధిస్థానమునందుండి ఇహాపరలోకములను జూచుచున్నాఁడు.

(ఎట్లన, జాగ్రత్కాలమునం దనుభవింపఁబడిన విషయములను స్వప్నమునందుఁ జూచుచున్నాఁడు. దీనిచే నిహాలోకమును జూచు

చున్నాఁడని సిద్ధించినది. జాగ్రత్కాలమునందు అనుభవింపని విషయము లనుస్వప్నమునఁ జూచుచున్నాఁడు ఇందువలన ఇహలోకమునకంటె వేఱే లోకానుభవ మున్నదని యేర్పడుచున్నది. కాన, పరలోకమును జూచు చున్నాఁడని సిద్ధించుచున్నది.)

(స్వప్నమునం దేమాశ్రయముచేఁ జూచుచున్నాఁడో అది చెప్పఁబడుచున్నది.)

పరలోకప్రతిపత్తికి సాధనమై, విద్యాకర్మ పూర్వప్రజ్ఞాలక్షణముగలవియు నైన సాధనములలో దేనితోఁ గూడియున్నాఁడవఁగా, (పాపపుణ్యములుగఁదగిన) సాధనముల నాశ్రయించికొని, (పాపఫలము లైనదుఃఖములను, పుణ్యఫలములైన సుఖములను జూచుచున్నాఁడు.

ఆత్మ, స్వప్నదశనొందునపుడు సర్వమును రక్షించి యుంచికొన్న దియును, జాగ్రత్కాలమందు ఈలోకమునందుఁ గనంబడునట్టిదియును అగు అంశములతో సంబంధించినవాఁడై ఈదేహమును నేలం బడఁద్రోసి, వేఱొక స్వప్నశరీరమును గలుగఁజేసికొని తన (వాసనాత్మకమైన) జ్యోతిస్సుచే స్వప్నదశను బొందుచున్నాఁడు. అపుడు వాఁడు స్వయంజ్యోతీ రూపమైయున్నాఁడు.

10. (స్వప్నపదార్థములనుగూర్చిన సంశయము నివృత్తిచేయఁ బడుచున్నది.)

స్వప్నమునందు రథములును, గుఱ్ఱములును, మార్గములును లేవు. వీనినంతయు ఆత్మయే సృష్టించికొనుచున్నాఁడు. అట్లే సుఖములును లేవు. సంతోషములేదు. ఓడలును లేవు. సరస్సులును లేవు. నదులును లేవు. అంతయును ఆత్మయే సృష్టించి కొనుచున్నాఁడు. ఆత్మయే కర్తయై యున్నాఁడు. (యథార్థమునందు ఆత్మకర్త కాఁడు. బుద్ధివృత్తియే కర్తగానున్నది.)

11. ఆత్మ, స్వప్నభావముచే శరీరమును నిశ్చేష్టితముగా పడఁ ద్రోసి, అసుప్తుఁడై, సుప్తములైన సకలభావములను తన దృష్టిచేఁ జూచుచున్నాఁడు. తర్వాత కర్మచే జాగ్రత్ స్థానమును బొందు చున్నాఁడు. హిరణ్మయపురుషుఁడై (చైతన్యజ్యోతిస్స్వరూపుఁడై) ఏక హంసుఁడై యున్నాఁడు,

12. స్వప్నకాలమునందు నికృష్టమైనశరీరమును, ప్రాణము కాపాడుచుండునట్లు (శరీరమును రక్షించుచుండుటకు ప్రాణమున కాజ్ఞ చేసి) ఆశరీరమునుండి లేచి సంచరించుచు, అమృతుఁడై, హిరణ్మయ పురుషుఁడై, ఏకహంసుఁడై, తనయిష్టప్రకారము సంచరించుచున్నాఁడు.

13. స్వప్నమునం దీయాత్మ, ఉత్కృష్టమైన దేవత్వాదిభావమున నికృష్టమైన తిర్యగాదిభావమును, ఇంకను అనేకరూపములను ధరించుచున్నాఁడు. స్త్రీలతో గమించునట్లును, నవ్వునట్లును, భయంకరరూపములను జూచువానివలెను గనంబడుచున్నాఁడు.

14. (స్వప్నమందు) అందఱును,ఆత్మయొక్క క్రీడావనమైన గ్రామమును, స్త్రీని, అన్నాదులను, (అనేక) స్థలములను, వాసనిర్మితములైన వానినంతయుఁ జూచెదరు.ఆయాత్మనుమాత్ర మెవ్వరును జూచుట లేదు (ఇందువలన స్వయంజ్యోతి స్సొకటి యున్నదని నిశ్చయమగుచున్నది.)
నిద్రపోవువానిని శీఘ్రముగా(తొందరగా) లేపఁగూడదని లోకమునందు ప్రసిద్ధమైయున్నది. (ఏలన, నిద్రపోవునపుడు శరీరమును ప్రాణము రక్షించుచున్నది. ఆత్మ బయటపోయి యిష్టప్రకారము సంచరించుచున్నది ఆకాలమున ఇంద్రియవ్యాపారము లేదు.ఆత్మ శరీరమునందు ప్రవేశించిన పిమ్మటనే ఇంద్రియములకు వ్యాపారము గలుగుచున్నది. కావున మరల నిద్రపోవుచున్నాఁడు; లేచుటలేదు. ఇంద్రియములును స్వాధీనమగుట లేదు.)

ఆత్మ శరీరమునందు చేరనియెడల ఇంద్రియవ్యాపారములు లేవు. దీనికి ఏవైద్యమును లేదు.

జాగ్రత్కాలమునందుఁ గనంబడునదే స్వప్నకాలమునందును గనంబడుచున్నదని కొందఱును, అదికాదని కొందఱును జెప్పెదరు. (రెండు నొకటేయని కొందఱును జెప్పెదరు. ఇదిసరికాదు. ఇంద్రియ వ్యాపారములు లేనపుడుమాత్రమే స్వప్నముకల్గుచున్నది.) కావున,ఇంద్రియములకు వేఱైన స్వయంజ్యోతి స్సున్నదని సిద్ధించుచున్నది.) కావున, స్వప్నమునందు ప్రత్యేకమైన స్వయంజ్యోతి స్సున్నదనుట నిశ్చయము.

జనకుఁడు-ఈయుపదేశము నాకు చేసినందులకై నీకు వేయి గోవుల నిచ్చుచున్నాను. ఇంకను సంసారమునం దుండియే మోక్షము నొందుట కుపాయమును జెప్పుము.

15. ఆత్మ, స్వప్నకాలమునందు మిత్రబంధుజనదర్శనాదులచే సంతోషమును బొంది, స్వేచ్ఛానుసారముగ వర్తించి, అందువలన శ్రమ మొంది, పుణ్యపాపఫలమును అనుభవించువానివలెఁ గనఁబడి, తర్వాత సుషుప్తినొందుచున్నాఁడు. మరల సుషుప్తినుండి స్వప్నమునకుఁ బోవుచు న్నాఁడు.స్వప్నమునందు జూచినవస్తువులందు గాని,పుణ్యపాపఫలములందు గాని వీనికి సంబంధము లేదు. కాఁబట్టి ఆత్మ అసంగుఁ డనుట నిశ్చయము.\ (స్వప్నమునం దొకఁడు దుష్టకార్యము చేసినట్లు చెప్పినచో, వాని నెవ్వ రేని నిందించెదరా ? లేక, దండించెదరా? లేదుకదా కావున, స్వప్నమం దలికార్యములం దాత్మకు సంబంధము లేదు.)

జనకుఁడు-ఈయుపదేశమునకై నేను వేయిగోవులను నీకిచ్చినాఁ డను. మోక్షమునుగూర్చి చెప్పుము.

16.యాజ్ఞవల్క్యుఁడు-(ఆత్మకు స్వేచ్ఛాసంచారము కలదని మున్ను చెప్పఁబడెను. ఇపుడు అసంగుఁడని చెప్పఁబడెను. ఇది యొకదానికొకటి విరోధముగ నున్నది. ఇందువలన ఆత్మకు స్వేచ్ఛాసంచారముచే కర్తృ త్వమును, అసంగుఁ డనుటచే అకర్తృత్వమును స్థాపితమగుచున్నదికదా? ఈవిషయము చెప్పఁబడుచున్నది.)

సుషుప్తికి తర్వాత, స్వప్నమునకువచ్చిన ఆత్మ సంతోషముతో విహరించి శ్రమమొంది,పుణ్య పాపఫలముల ననుభవించువానివలెనుండి, మరలవచ్చినక్రమప్రకారము జాగ్రత్తునందు ప్రవేశించుచున్నాఁడు. స్వప్నపాపపుణ్యఫలముతో సంబంధించువాఁడు కాఁడు.

జనకుఁడు—ఈ యుపదేశమునకై నీకు వేయిగోవుల నిచ్చు చున్నాఁడను. ఇంక మోక్షమునుగూర్చి చెప్పుము.

17. యాజ్ఞవల్క్యుఁడు—(ఆత్మకు స్వప్నఫలములం దెట్లు సంబం ధము లేదో, అట్లు జాగ్రత్కాలకార్యములందును సంబంధము లేదు.)

ఇట్లు జాగ్రద్దశకు వచ్చినఆత్మ, సంతోషమునొంది, సంచరించి, శ్రమపడి,పుణ్యపాపఫలమును అనుభవించువానివలె నుండి,మరల వచ్చిన క్రమముగా స్వప్నావస్థకు పోవుచున్నాఁడు.

(స్వప్నమునందలి వన్నియు అప్రత్యక్షములుకదా! జాగ్రత్కాలము నందలి కార్యము లన్నియు ప్రత్యక్షములైయుండఁగా, ఆత్మ అపుడుఁ

డనియు, అకర్తయనియు నెట్లు చెప్పఁదగును? అనుదానికి సమాధానము చెప్పఁబడుచున్నది.

18. ఆత్మ, జాగ్రత్కాలమునందు అకర్తయే. అయినను ఎవరు చేయుచున్నారు? అనఁగా— ఆత్మ సన్నిధియందు, బుద్ధితత్త్వములు చేయుచున్నవి. అన్ని కార్యములును ఆత్మప్రకాశముచే గోచరమగుచున్నవి. అంతియకాని వేఱేమియు (కర్తృత్వము) లేదు. సూర్యప్రకాశమునందు ఇద్దరు జగడమాడిరేని, అది సూర్యునిదోషమగునా? అట్లు బుద్ధ్యాదులను ప్రకాశింపించు ఆత్మకు ఏదోషమును లేదు. కావున, జాగ్రత్కాలమునందు అకర్తయే; కర్త కాఁడు.)

ఎట్లు ఒకపెద్దచేప, జలవేగముచే కదలింపఁబడక, ఒకనదియందు ఈగట్టునుండి ఆగట్టునకును, ఆగట్టునుండి యీగట్టునకును పోవుచు వచ్చుచునున్నదో, అట్లు ఆత్మ దేనిచేతను చలింపఁబడక అసంగుఁడై స్వప్నమునందుండి జాగ్రత్తునకును, జాగ్రత్తునుండి స్వప్నమునకును పోవుచు వచ్చుచు నున్నాఁడు.

19. (ఆత్మ శరీరములో నుండినను కర్తృత్వముగలవాఁడు కాఁడని చెప్పఁబడినది. ఆత్మకు సంసారిత్వము ఉపాధినిమిత్తమేగాని వేఱకాదు. జాగ్రత్కాలమునందు ఆత్మ అవిద్యతోఁగూడి శరరముతో సంబంధించినవానివలె నున్నాఁడు. స్వప్నకాలమునందు కామముతోఁగూడి శరీరముతో సంబంధపడనివానివలె నున్నాఁడు. సుషుప్తికాలమునందు దేనితోడను సంబంధపడని అసంగునివలె నున్నాఁడు.)

ఎట్లు ఆకాశమునందు చాలదూరము సంచరించిన యొకపక్షి, శ్రమనొంది దానిచే తనఱెక్కలను ముడుచుకొని, శ్రమపరిహారముకొఱకు తనకులాయమును జొచ్చుచున్నదో, అట్లు ఆత్మ జాగ్రత్స్వప్నావస్థలయందు సంచరించిన శ్రమపరిహారమునకై, ఏయవస్థయందును, ఏయిచ్ఛయు లేక, ఏస్వప్నమును జూడక యుండెడి సుషుప్తిని ప్రవేశించుచున్నాఁడు. (అనఁగా, ఆత్మ, తన్ను తనచోటును జేరునట్లు చేసికొనుచున్నాఁడు.)

20. (ఆత్మకు సంసారధర్మము లేదు. సంసారధర్మమున్నట్లుగా అవిద్య (మోహము) చేఁ గనఁబడుచున్నది. ఈ అవిద్య స్వభావముగా నుండునట్టిదా? ఆగంతుకమా? అను వీనినిగూర్చియు, సకలానర్థబీజమైన అవిద్యాస్వభావమునుగూర్చియు వివరణము.)

ఈపురుషునకు, శరీరికి, 'హితా' అను అనేకనాడు లున్నవి. ఒక రోమమును వేయిభాగములుగాఁ జీల్చిన, నొకభాగము ఎంతటిసూక్ష్మమై యున్నదో అంతటిసూక్ష్మముగా ఆనాడియున్నది. ఆనాడులు తెలుపు, ఎఱుపు, నలుపు, పచ్చ, పసుపు రసములతో నిండియున్నవి.

(ఇట్టి సూక్ష్మనాడులలో, పదునేడవయవములుగల లింగశరీర మున్నది. సకలవాసనలును దానిని ఆశ్రయించికొని యున్నవి. అనఁగా లింగశరీరము వాసనలకు ఆశ్రయము. సకల సంసారధర్మములును ఈనాడులలోని రససంబంధముచె ప్రేరింపఁబడి ప్రకాశించుచున్నవి.)

స్వప్నమునందు తన్ను పరులు కొట్టినట్లును, పట్టుకొనినట్లును, ఏనుఁగు తఱుమునట్లును, గుంటలో పడినట్లును చూచుచున్నాఁడు. ఇం దేదియు నిజముకాదు.అంతయు అవిద్యావాసనచేఁగలిగిన భ్రాంతి.(నికృష్ట ధర్మముచేఁ గలిగిన అంతఃకరణవృత్తిగోచరము,) జాగ్రత్కాలమునందు ఏభయమును జూచుచున్నాఁడో, ఆ అవిద్యావాసనచే స్వప్నమునందు దానినే చూచునట్లు తలంచుచున్నాఁడు. (అవిద్యాప్రభావ మిట్లుచేయు చున్నది. యథార్థమునం దేమియు లేదు.)

(ఇపుడు విద్యావిషయము చెప్పఁబడుచున్నది.)

జాగ్రత్కాలమునందు తన్ను దేవునివలెను, రాజువలెను, అనఁగా సర్వమును తాననియును భావించుచున్నాఁడు; చూచుచున్నాఁడు. అట్లే వీఁడు స్వప్నమునందును జూచుచున్నాఁడు. ఇట్టి సర్వాత్మభావము వీనికిఁ గలిగినయెడల పరలోకమును బొందుచున్నాఁడు. (అనఁగా, పరమాత్మ యగుచున్నాఁడు.)

(ఇట్టి సర్వాత్మభావముకలుగక, "నేనువేఱు, అదివేఱు" అనెడి అల్పజ్ఞానము కలుగుటయే అవిద్యయనఁబడును. ఇందుచే అనాత్మభావము కలుగును. దానివలన అపరలోకము సిద్ధించును.అనఁగా జననమరణములు కలుగుచుండును. విద్యకలిగిన సర్వాత్మభావము కలుగును. అవిద్య నశించినచో భిన్నత్వము (భేదము) నశించును. అవిద్య యున్నంతదనుక అభేదము కలుగదు.

భేదముచే కామము కలుగుచున్నది. దానిచే కర్మము కలుగు చున్నది. దానిఫలము సంసారిత్వమే.ఇదంతయు అవిద్యాకార్యము లేగాని

ఆత్మ కార్యములు కావు. ఆత్మ కిట్టిస్వభావము లేదు. ఇది ఆత్మధర్మము కాదు. అవిద్యానివృత్తివలన విద్యకలుగును. విద్యవలన ముక్తికలుగును. సంశయము లేదు.)

21. (ఇపుడు మోక్షలక్షణము వివరింపఁబడును.)

సుషుప్తికాలమం దాత్మ యేరూపముతో నుండు ననఁగా—అతి స్వచ్ఛమును; కామము లేనిదియును, పాపము లేనిదియును, పాపహేతువునకుఁ గారణమైన ధర్మాధర్మరూపము లేనిదియును, అభయమైనదియును, భయహేతువైన అవిద్య లేనిదియును(స్వయంజ్యోతిస్స్వరూపమైనదియు)నై యుండును. (సుషుప్తికాలమునం దాత్మ, తన్నెఱుంగకయు, బాహ్యవస్తువుల నెఱుంగకయు నెట్లున్నాఁడో అది చెప్పఁబడుచున్నది.

ఎట్లు లోకమందు అత్యంతకామాసక్తు లగుస్త్రీపురుషులు పరస్పర మన్యోన్యానురాగముచే కౌఁగిలింపఁబడి యిర్వుర మనస్సు నేకమైయున్నపుడు, లోకమునుమాత్రమే గాక బాహ్యవస్తువులను అంతరవస్తువులను సమస్తమును మఱచియున్నారో, అట్లు ఈజీవుఁడు, సుషుప్తికాలమునందు తన నిజస్వరూపమైన పరంజ్యోతితోఁ గలిసి, ఏకమై, దేనిని యెఱుఁగకయున్నాఁడు.

(అనేకకోట్లజీవరాసు లుండుటంబట్టి అనేకకోట్లజీవాత్మ లుందురు కదా? అనఁగా, అట్లుకాదు. ఒక పెద్ద ఉప్పుగడ్డలోనుండి రాలిన చిన్నచిన్న తునుకలకుఁగూడ ఉప్పఁదనము స్వభావముగనున్నదో, అట్లు పరమాత్మయొక్క అంశములైన జీవులస్వభావము నొక్కటియే. మఱియు ఒక్క చంద్రుఁడే అనేకజలపాత్రములందు ప్రతిఫలించువిధముగా, ఒక్కఆత్మయే అనేకదేహములందు ప్రతిఫలించి అనేకాత్మలుగాఁ గనంబడుచున్నవి.

ఆత్మ నానాత్వమనుటకుఁ గారణము అవిద్యయే. అవిద్యపోయిన యెడల సమస్తము నొక్కటియైపోవును. అనఁగా సర్వాత్మభావము కలుగును. సుషుప్తికాలమం దాత్మస్వభావ మిట్టిదని నిరూపింపఁబడుచున్నది.)

(సుషుప్తకాలమునందు) ఆప్తకామము. అనఁగా సర్వకామమును ఆత్మయందుఁ జేరుచున్నది కావున ఆప్తకాముఁడు. అపుడు ఆత్మవస్తువు కంటె వేఱేయేదియు లేనందున (కామము లేనందున) ఆత్మకాముఁడగుచున్నాఁడు. అకామము. అనఁగా అపుడు కామ్యవిషయము

ఏదియు లేనందున కామము లేనివాఁడు ఏశోకమును లేనివాఁడు.

22. (ఆత్మ స్వయంజ్యోతిస్స్వరూపుఁడై, అవిద్యాకామకర్మవినిర్ముక్తుఁడై యున్నాఁడని చెప్పఁబడినది. ఇచట నొకసంశయము కలదు— సుషుప్తికాలమునందు జీవుఁడు పరమాత్మతో నేకీభవించుటంబట్టి, స్త్రీపురుషులవలె నేదియు నెఱుంగుట లేదని చెప్పఁబడినది; అప్పుడేకదా స్వయంజ్యోతిష్ట్వము కలుగుచున్నది. అది ఆగంతుక మనరాదా? ఈసంశయనివృత్తికొఱకే స్త్రీపురుషదృష్టాంతము చెప్పఁబడినది. దీనివలన స్వయంజ్యోతిష్ట్వము సదా యున్నది. అయినను అది స్పష్టముగా గ్రహింపఁబడుచున్నది. అపుడు ఏకర్మచేతను సంబంధపడనివాఁడై యున్నాఁడు. ఎట్లనఁగా-)

తండ్రి తండ్రి కాకపోవుచున్నాఁడు; తల్లి తల్లి కాకపోవుచున్నది. అట్లే కర్మచే జయింపఁబడినదియును, జయింపఁబడవలసినలోకములును, కర్మాంగభూతులైన దేవతలును, సాధ్యసాధనసంబంధవిధాయకమైన వేదములును అగు నివియన్నియును లేకపోవుచున్నవి.

దొంగ చోరకర్మమునందు సంబంధపడుట లేదు. శిశుహత్య చేసినవాఁడు చేయనివాఁడగుచున్నాఁడు. అట్లే చండాలుఁడు, పౌల్కసుఁడు, శ్రమణుఁడు, తాపసి అనువీరందఱును సుషుప్తికాలమునందు తమ తమ స్వజాతిధర్మము లేనివారగుచున్నారు. (సుషుప్తియందు) హృదయమునందుఁగల (బుద్ధిని ఆశ్రయించియుండు) సకలశోకములను (కామములను) దాఁటిన (లేని) వాఁడగుచున్నాఁడు. (అనఁగా కామము ఆత్మాశ్రయము కాదు.)

23. (స్త్రీపురుషుల ఐక్యభావసమయమునందువలె, ఆత్మ, సుషుప్తియందు దేనిని చూచుట లేదనియును, అది స్వయంజ్యోతిస్స్వరూపమనియును చెప్పఁబడినది. స్వయంజ్యోతిష్ట్వమనఁగా—చైతన్యాత్మస్వభావము. అనఁగా, అగ్నికి ఉష్ణస్వభావమువలె, ఆత్మకు స్వయంజ్యోతిస్సు స్వభావమై యున్నది. అపుడు ఆత్మ, ఏదియు నెఱుఁగదనుట విరుద్ధము కాదా? అనఁగా, విరుద్ధముకాదని చెప్పఁబడుచున్నది.)

సుషుప్తికాలమునందు ఆత్మ, చూచుచుండియు చూడక యున్నాఁడని తెలియఁదగినది.

(సుషుప్తికాలమునందు మనస్సు మొదలగుకరణములు లేకుండఁగా, ఎట్లు చూచుచున్నాఁ డనవచ్చును? అనఁగా-)

ద్రష్టయొక్క దృష్టికి నాశముకలుగదు. (ఆత్మ ద్రష్ట. కావున దృష్టి వదలిపోదు. ఆదిత్యాదు లెట్లు స్వభావమైన జ్యోతిస్స్వరూపముచే సమస్తమును ప్రకాశింపఁజేయుచున్నారో, అట్లు దృష్టికి ఒకప్పుడును నాశముకలుగదు. అనఁగా ఆత్మను వదలిపోదు. ఇందువలన ఆత్మ చూచు చున్నాఁడని చెప్పఁబడినది.)

(ఇదిసరియే. ఆత్మ చూచుట లేదని చెప్పఁబడినది విరోధముకాదా? అనఁగా-)

తన కన్యమైయుండుదానిని చూచుట లేదని భావము. (తనకంటె వేఱొక పదార్థము లేనందున దేనిని చూచుట లేదనిచెప్పుట యుక్తమై యున్నది.)

24-30. (దృష్టివిషయమునందు చెప్పఁబడినట్లు ఇఁకఁ జెప్పఁబోవు నేడువిషయములందును విషయముననుకుఁ దగినట్లు అర్థము నూహించి కొనునది.)

ఆత్మ మూర్కొనుట లేదు; రుచి నెఱుంగుట లేదు; మాటలాడుట లేదు; వినుట లేదు; తలంచుట లేదు; స్పృశించుట లేదు; తెలియుట లేదు.

(అగ్నికి ఔష్ణ్యము, ప్రకాశము, జ్వలనము, అను భేదము లుండు నట్లుగా, ఆత్మకు దృష్ట్యాది ధర్మభేదములు చెప్పఁబడినవికదా? అపుడు ఆత్మకు నానాత్వ మేర్పడ లేదా? అనఁగా, లేదు. సుషుప్తియందు ఆత్మకు చైతన్యజ్యోతిస్స్వభావము లేదనెడిసంశయమును బోఁగొట్టుటకై అట్టి భేదము లుండునట్లు చెప్పఁబడినదేగాని వేఱుకాదు.

జాగ్రత్స్వప్నములందు చక్షురాద్యుపాధు లుండుటవలన, వాని మూలముగా, ఆత్మ చైతన్యజ్యోతిస్స్వభావము గోచరించుచున్నది. ఆయుపాధులును వ్యాపారములును లేని సుషుప్తియందు పైనిచెప్పఁ బడిన స్వభావములు గోచరించుట లేనందున, ఉపాధు లున్నట్లుగా సుబో ధముకొఱకుచూపఁబడుచున్నది. సుషుప్తియందుదృష్ట్యాదిభేదధర్మములు లేవు. ఆత్మ, ఉప్పుగడ్డవలె ప్రజ్ఞానైకరసఘనుఁడనియు, విజ్ఞానము, ఆనందము, సత్యము, జ్ఞానము, ప్రజ్ఞానము అనియు, అనేక శ్రుతులందు చెప్పఁబడుచున్నాఁడు. దీనికి దృష్టాంత మేమనఁగా-స్వచ్ఛమైనస్ఫటికమణి

సమీపమునందుండు పసుపు, నీలము, ఎఱుపు మొదలగువర్ణములుగల ఉపాధులు ఆయావర్ణములుగా (అస్ఫటిక మాయావర్ణములవలె) కనఁబడునట్లు, ఆత్మయు ఆయాఉపాధులతోఁగూడి, ఉపాధులుగలవానివలెఁ గనఁబడుచున్నాఁడు. స్ఫటిక మెట్లు ఒక్కటియో, అట్లు ఆత్మయు నొక్కఁడే. ఆత్మకు ధర్మభేదములు కల్పితములేగాని వాస్తవములుకావు.)

31. (ఆత్మ జాగ్రత్స్వప్నములందువలెఁ గాక సుషుప్తియందు తనకంటె వేఱైనదానిని (విశేషములను) జూచుట లేదనికదా చెప్పఁబడినది. జాగ్రత్స్వప్నములందున్న స్వభావము సుషుప్తియందు లేకపోవుటకుఁ గారణమేమి? అనుసంశయము చెప్పఁబడుచున్నది.)

జాగ్రత్స్వప్నములందు ఆత్మకు అన్యమైనవస్తువు లున్నట్లు అవిద్యచే గోచరించుచున్నది. ఎట్లన, అన్యుఁడు అన్యవస్తువును చూచునట్లును, మూర్కొనునట్లును, రుచిచూచునట్లును, మాటలాడునట్లును, వినునట్లును, తలంచునట్లును, తాఁకునట్లును, తెలియునట్లును గోచరించుచున్నది. (ఇదంతయు ఆత్మస్వభావముకాదు.)

32. ఓజనకమహారాజా! వినుమని యాజ్ఞవల్క్యుఁ డిట్లనుచున్నాఁడు—(సుషుప్తికాలమునందు అవిద్యనశించి, జీవుఁడు స్వయంజ్యోతిః స్వభావమైన పరమాత్మతోఁ గలిసి) జలమువలె స్వచ్ఛమై, ఏకమై ద్రష్టయై, అద్వైతుఁడై యున్నాఁడు. అతఁడే బ్రహ్మలోకము. (అనఁగా, పరబ్రహ్మస్థానము) ఇదే జీవునికి (సుషుప్తియందు పరమాత్మతో నైక్యమగునట్లుండుట) ఉత్తమమైనగతి. ఇదే సకలసంపదలకంటెను శ్రేష్ఠము. ఇదే పరమానందము. ఈయానందమునం దొకయంశము నాధారముగాఁ జేసికొని సకలభూతములును జీవించియున్నవి.

33. (ఇపుడు ఆనందముల ప్రమాణములను జెప్పి, బ్రహ్మానంద మిట్టిదని నిరూపింపఁబడుచున్నది.)

మనుష్యులలో నెవఁడు సకలావయవములును చక్కఁగానుండునట్టి వాఁడో, సకలోపకరణములు సమృద్ధిగనుండునట్టివాఁడో (సొగుదల కలవాఁడో), మనుష్యుఁడనుభవింపఁగలభోగములలో నేదియు కొఱఁత లేకయుండునట్టివాఁడో, అందఱకును యజమానుఁడై యుండునట్టివాఁడో, అట్టివాని ఆనందమే మనుష్యులయొక్క పరమానంద మని చెప్పఁబడును. ఈ(మనుష్య)ఆనందమునకు నూఱంతలు పితరులయొక్క ఆనందము. దీనికి

నూఱింతలు గంధర్వుల ఆనందము. దీనికి నూఱింతలు కర్మదేవతల (యాగాదికర్మలచే దేవతలైనవారల (ఆనందము.దీనికి నూఱింతలు ఆజాన దేవతల (జన్మము చేతనే దేవతలైయుండువారల) ఆనందము. మఱియు ఎవఁడు వేదాధ్యయనము చేసినవాఁడును, పాపరహితుఁడును, కోరికలు లేనివాఁడునై యున్నాఁడో వాఁడు ఆజానదేవతలయొక్క ఆనందముతో సమానమైన ఆనందము గలవాఁడై యుండును. ఈ ఆనందమునకు నూఱింతలు ప్రజాపతి(విరాట్పురుషుని) ఆనందము. మఱియు మున్ను చెప్పబడిన శ్రోత్రియుఁడు, అకాముఁడై యుండువాఁడు విశేషనిష్ఠుఁడై యుండినచో వానిఆనందము ప్రజాపతి ఆనందముతో సమానమైయుండును.ఈ ఆనందముకంటె నూఱింతలు బ్రహ్మ(హిరణ్యగర్భుని)ఆనందము. మఱియు పైనిచెప్పిన శ్రోత్రియుఁడు ఇంకను విశేషనిష్ఠుఁడై యుండినయెడల వాని ఆనందము బ్రహ్మానందముతో సమమైయుండును. ఇదే పరమానందము. ఈ పరమానందమే బ్రహ్మలోకము. అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పఁగా, జనకుఁడు—మోక్షమునుగూర్చి చెప్పుమని యడిగెను.

ఇట్లు జనకుఁ డడుగఁగా, యాజ్ఞవల్క్యుఁడు భయమొందెను. ఏలన, మహావివేకియైన జనకరాజు, తాను (యాజ్ఞవల్క్యుఁడు)ఎన్నెన్నో విధములచే (ఆత్మస్థితిని దానిపరిణామమును, జీవునిమోక్షమును) మోక్షవిషయమును బోధించియున్నప్పటికిని, మరల నడుగుచున్నాఁడు కదా యని భయపడినవాఁడాయెను.

34. (ఇంతదనుక చెప్పినదానిసారాంశ మేమనఁగా-విజ్ఞానమయుఁడగుజీవాత్మ,జాగ్రత్స్వప్నములయందు అవిద్యతోఁ గూడియున్నాఁ డని యును, విద్యాకార్యము సర్వాత్మభావమనియును, అదే పరలోకమని యును, అదే ఆత్మస్వభావ మనియును, సుషుప్తియందు ఆత్మ స్వస్వరూప ముతో నుండుననియును జెప్పఁబడెను. బంధమోక్షములనుగూర్చి స్పష్ట ముగఁ జెప్పవలసియున్నది, జనకుఁడు మరల నడిగెనని తెలియనగు. ఈ జీవుఁడు సుషుప్తియందు మృత్యురూపములగు కార్యకారణములనువదలి, మరల వానిని జాగ్రత్స్వప్నములందు వహించి, మహామత్స్యమువలె సంచరించుచున్నాఁడు. ఇట్లు వాఁడు (ఆత్మ) పుట్టియు చచ్చియు మృత్యు రూపములతోఁ జేరి, చేరకయు, ఇహపరలోకములయందు సంచరించు

చున్నాఁడని మున్ను చెప్పఁబడినది. ఇప్పు డావిషయమును వివరముగాఁ జెప్పఁబడుచున్నది. సుషుప్తిస్థానము మోక్షమునకు దృష్టాంతము.)

35. (ఇఁక సంసారము వర్ణింపఁబడుచున్నది.)

లోకమునం దెట్లు, అధికభారముతోఁగూడినబండి, బండితోలు వానితోఁగూడినదై శబ్దముచేయుచు పోవుచున్నదో, అట్లు ఈశరీర మందలి ఆత్మ, (లింగశరీరము ఉపాధిగాఁగల ఆత్మ, లేక జీవాత్మ)స్వయం జ్యోతిస్స్వభావముగల పరమాత్మచే అధిష్ఠింపఁబడినవాఁడై ప్రకాశితుఁడై; జాగ్రత్స్వప్నములవలె ఇహపరలోకములయొక్క పాపసంసర్గ వియోగలక్షణము గల జననమరణములను బొందుచున్నాఁడు. పైని చెప్పఁబడినబండివలె కూయుచు పోవుచున్నాఁడు.

అనఁగా, చైతన్యాత్మ జ్యోతిస్సుచే ప్రకాశించునదియును, ప్రాణమును ప్రధానముగా నుంచికొనియుండునదియును అగు లింగశరీరము పోవునపుడు అది ఉపాధిగాఁగలిగిన ఆత్మయుపోయినట్లు తోఁచుచున్నది. ఆత్మ సర్వపరిపూర్ణవస్తువుగాన, అది పోవుచున్నదని చెప్పఁదగదు.।

ఎప్పుడు పోవుచున్నదనఁగా, ఉచ్ఛ్వాసము (ఎగయూపిరి) విడుచునపుడు పోవుచున్నాఁడు.

36. (ఎందులకై ఎగయూపిరి విడుచుచున్నాఁడో అది చెప్పఁబడుచున్నది.)

ఎట్లు మనుష్యుఁడు, ముదిమిచేఁగాని, వ్యాధిచేఁగాని దేహకార్శ్యమును పొందునపుడు, మామిడి, మేడి, రావి మొదలగువృక్షము లందలిపండ్లు దానిదాని పట్టువదలి కాడలలోనుండి రాలిపోవుచున్నవో, అట్లు చక్షురాద్యంగములలోనుండి విడివడి (సుషుప్తికాలమునందు శరీరరక్షణార్థమై ప్రాణమును నియమించి, ఆత్మసంచరించుటకుఁ బోవునట్లు గాక, మరణకాలమునందు ఇంద్రియములను వదలిపెట్టి, ప్రాణముతోఁ గూడ) వేఱొకశరీరమును బొందుటకై వచ్చినమార్గముగా వెడలిపోవుచున్నాఁడు. (కర్మఫలానుగుణమైన భోగముల ననుభవించుటకుఁ దగిన జన్మము నెత్తుచున్నాఁడు.)

37. (ఈశరీరమును వదలిపెట్టినవానికి దేహేంద్రియవియోగము సంభవించుటచే, వేఱేదేహమును గ్రహించుటకుఁ దగినశక్తి లేదు. ఒక

రాజునకు పనివారు గృహమును నిర్మించి సిద్ధముచేయునట్లు,ఇతనికి వేత్తే దేహమును నిర్మించియుంచుటకు వేఱెవ్వరును లేరు. ఇట్లుండఁగా వేత్తే శరీరమును పరిగ్రహించుట వివరింపఁబడుచున్నది.)

లోకమునం దొకరాజు తనరాజ్యములో నొకగ్రామమునకుఁబోవు నపుడు గ్రామస్థులును, పెత్తనదార్లును, అన్నపానాదులను వసతులను సిద్ధపఱచియుంచికొని, రాజు వచ్చుచున్నాఁడు, వచ్చుచున్నాఁడు అని యెదురుచూచుచుండునట్లు, ఈసంసారిని సకలభూతములును (శరీరమును నిర్మించుపంచభూతములును, కరణముల కనుగ్రహముచేయు సకలదేవతలును) వేఱొకశరీరమును నిర్మించియుంచికొని, ఈబ్రహ్మము (భోక్త) వచ్చుచున్నాఁడు, వచ్చుచున్నాఁడు అని యెదురుచూచుచున్నారు.

38. (ఈశరీరితోఁగూడ నెవ్వరెవ్వరు పోవుచున్నారనఁగా-) రాజు తనదేశములోనుండి వేఱొకచోటికిఁబోవుటకు సిద్ధముగానుండునపుడు, ఏప్రకారముగా అతని పరిజనము, రాజాజ్ఞ లేకయే సిద్ధముగా రాజు కంటె ముందుగాఁ బోవుదురో, అట్లు, మరణకాలమునందు ఈఆత్మతోఁ గూడ వాగాదిసకలప్రాణములును ముందుగాఁబోవుచున్నవి; అప్పుడే పైయూపిరికలుగుచున్నది. అనఁగా నిట్టూర్పుకలుగుచున్నది.

---

## చతుర్థబ్రాహ్మణము.

(సంసారము ఆత్మ ఇంద్రియములలోనుండి ఏకాలమునందు విడివడునో అదియుఁజెప్పఁబడును.)

1. ఈఆత్మ యెపుడు శరీరదౌర్బల్యమును పొంది, వివేకములేని వానివలె నున్నాఁడో, అపుడీప్రాణములు (వాగాదీంద్రియశక్తులు) ఆత్మను అనుకరించుచున్నవి. (ఆత్మ, అవయవములనుండి శుద్ధముగా వెలువడుచున్నది.) ఈఆత్మ, తేజోమాత్రములైన చక్షురాదికరణములను (కరణశక్తులను) శుద్ధముగా లాగికొని హృదయ (కమల) మును పొంది, అచ్చట అభివ్యక్తవిజ్ఞానమయుఁడై యున్నాఁడు. (అనఁగా అంతరజ్ఞానముమాత్ర ముండును; ఇంద్రియచలన ముండదు.) ఎప్పుడు చక్షుస్సంబంధియైనపురుషుఁడు (ఆదిత్యుఁడు) ఆచక్షుస్సునుండి మరలుచున్నాఁడో, అపుడు రూపమును జూచునట్టిశక్తి లేకపోవుచున్నది.

2. ఆచక్షుర్జ్యోతిస్సు ఆత్మతో నైక్యమొందుచున్నది. అందుచే మృతుఁడగువాఁడు చూచుటలేదని వానిబంధువులు చెప్పెదరు. అట్లే (ఘ్రాణేంద్రియాభిమానదేవత,ఆత్మజ్యోతిస్సునుండి వీడినతర్వాత) వాఁడు మూర్కొనుటలేదనెదరు. అట్లే జిహ్వ, వాక్కు, శ్రోత్రము,త్వక్కు ఇవి వీనివిషయములను తెలిసికొనుటలేదని చెప్పెదరు. హృదయాగ్రము మాత్రము కరణములయొక్క తేజోమాత్రములతోడను, ఆత్మజ్యోతిస్సుతోడను ప్రకాశించుచున్నది. ఇట్టిజ్యోతిస్సుతోఁగూడ, విజ్ఞానమయుఁడైన (లింగోపాధిగల) జీవుఁడు బయలువెడలి పోవుచున్నాఁడు.

(ఎట్లు పోవుచున్నాఁడనఁగా—ఆదిత్యలోకప్రాప్తికిఁ దగినజ్ఞానము, లేక కర్మము వీని కున్నయెడల) నేత్రముమూలముగా జీవుఁడు బోవుచున్నాఁడు.(బ్రహ్మలోకప్రాప్తియున్నయెడల) కపాలద్వారముగాఁ బోవుచున్నాఁడు. వాని జ్ఞానకర్మములకుఁ దగిన అవయవముల మూలముగాఁ బోవుచున్నాఁడు. ఆవిజ్ఞానాత్మను వెన్నంటి (రాజువెంట మంత్రిపోవునట్లు) ప్రాణమును బోవుచున్నది. ఆతర్వాత (పరిజనము పోవునట్లు) వాగాదికరణములు పోవుచున్నవి. అపుడు (మరణకాలమునందు వాని కర్మానుసారమునకుఁ దగిన, అంతఃకరణవృత్తి విశేషమును ఆశ్రయించి యుండు వాసనాత్మకమైన)విశేషవిజ్ఞానముగలవాఁడగుచున్నాఁడు. అట్టి విజ్ఞానముతోఁ బోవుచున్నాఁడు.

(మరణకాలమునందు సద్వాసనలు వచ్చునిమిత్తమే వేదాంతవిచారము, భక్తి, యోగము, పుణ్యకార్యములు మొదలగువానిని అభ్యసించుట విధియైయున్నది. మరణకాలమునందు వీనినంతయు సంపాదించుటకు సాధ్యముకాదు. కావున శరీరమునందు పటుత్వ ముండునపుడే సద్విషయములందు బుద్ధిని ప్రవేశింపఁజేయవలయును. అందుకొఱకే ఉపనిషత్తులు ప్రవర్తించియున్నవి.)

(ఆత్మశరీరమునందుండి వెడలిపోవునపుడు మార్గమునందు భుజించు అన్నమిట్టిదని చెప్పఁబడుచున్నది.)

ఈజీవుఁడు సంపాదించినజ్ఞానము, వీఁడుచేసినకర్మము, పూర్వప్రజ్ఞ (గతకర్మానుభవవాసన) అను నీమూఁటితోఁగూడ పోవుచున్నాఁడు. (ఈమూఁడును వీనికి మార్గభుక్తమైయున్నది. అనఁగా వీనికిఁదగినఫలభోగములను, శ్రమలను అనుభవించుచున్నాఁడు.)

(సకలజీవులకును వాసనలకుఁ దగిన సుఖదుఃఖములు కలుగుచున్నవి. వాసనలు లేనియెడల కర్మములు చేయుటకును, కర్మఫలముల ననుభవించుటకును సాధ్యముకాదు. పూర్వానుభవవాసనలతో ప్రవృద్ధమై యున్నందున ఇంద్రియముల కీజన్మమునందు అభ్యాససామర్థ్యము కల్గియున్నది. లేనిచో ఆసామర్థ్యముండదు. లోకమునందు అభ్యాసము లేకయే కొందఱు చిత్రించుటను జూచుచున్నాముకదా? అది పూర్వానుభవవాసనయేగాని వేఱుకాదు. కావున, పూర్వప్రజ్ఞ లేనియెడల ఎవనికిని కర్మముచేయుటయందును, కర్మఫలానుభవవిషయమునందును ప్రవృత్తి కలుగనేరదు. కాఁబట్టి జ్ఞానము,కర్మము, పూర్వప్రజ్ఞ, అను నీమూఁడును కర్మదేహాంతరప్రతిపత్తిరూపయోగసాధనమై యుండుటవలన, శుభమైన విద్యను అనఁగాజ్ఞానమును, కర్మను ఆచరింపవలయును. ఇట్లాచరించిన యెడల స్వేచ్ఛాశరీరమునొంది,ఇష్టానుసారమైనభోగములను అనుభవింపవచ్చును.)

3. జ్ఞానము, కర్మము, పూర్వప్రజ్ఞ అను నీమూఁటితోఁగూడి, ఒకపక్షి ఒకవృక్షమునుండి వేఱొకవృక్షమున కెగిరిపోవునట్లు ఆత్మ వేఱేశరీరమునకు పోవుచున్నది. అపుడు పూర్వదేహాకరణము లే నూతనదేహమునందుండి వ్యాపారము చేయుచున్నవా? లేక, ఒకఘటమునం దుంచఁబడిన దీపముయొక్క ప్రకాశము, ఆఘటమును తీసివేసినయెడల ఆప్రకాశమెచ్చటను వ్యాపించి, పిమ్మట తగ్గినటులు వేఱేశరీరమునందుఁ జొచ్చుచున్నవా? లేక మనోమాత్రముగా నున్నవా? అనువిషయము చెప్పబడుచున్నది.)ఎట్లు తృణజలూక, ఒకతృణమునుండి వేఱొకతృణమును పట్టుకొన్నపిదప మొదటితృణమును వదలుచున్నదో, అట్లు ఆత్మ, ఈశరీరమును విడిచి, అవిద్యను నివృత్తిచేసి (చేతనమాత్రమై) తన్ను ఇమిడ్చికొని (సూక్ష్మముగాఁజేసికొని) వేఱొకశరీరమునకుఁ బోవుచున్నది.

4. (నూతనశరీరనిర్మాణ మిట్టిదని నిరూపింపఁబడుచున్నది.) ఒక బంగారుపనివాఁడు ఒక పెద్దబంగారుగడ్డలోనుండి ఒక చిన్నముక్కను గైకొని, దానిచే నూతనమును విచిత్రము నైనఆభరణము నెట్లునిర్మించుచున్నాఁడో,అట్లు విస్తారమైనపంచభూతములలోనుండి ఒక్కయంశమును గైకొని, అవిద్యనునివృత్తిచేసి నూతనమును, విలక్షణము నైన వేఱేశరీరమును తానే నిర్మించుకొనుచున్నాఁడు. ఆదేహము పితృలోకభోగ్యము

నకుఁ దగినదిగనైనను, లేక గంధర్వ, దైవ, ప్రాజాపత్య, బ్రహ్మలోక భోగ్యమునకుఁ దగిన దేహముగనైనను ఉండును.

5. అట్టి ఆత్మయే పరమాత్మ (బ్రహ్మము); అజ్ఞానమయుఁడు (బుద్ధిమయుఁడు, జీవుఁడు); మనోమయుఁడు (మనస్సులందు తలంచువాఁడు); ప్రాణమయుఁడు (పంచవృత్తులుగలవాఁడు); చక్షుర్మయుఁడు (నేత్రమూలముగఁ జూచువాఁడు); శ్రోత్రమయుఁడు (చెవిమూలముగాఁ జూచువాఁడు); పృథ్వీమయుఁడు (పృథ్వ్యంశము అధికముగాఁగల వాఁడు); జలమయుఁడు (జలాంశ మధికముగాఁగలవాఁడు); వాయుమయుఁడు (వాయ్వంశ మధికముగాఁగలవాఁడు); ఆకాశమయుఁడు; తేజోమయుఁడు (దేవతలు); అతేజోమయుఁడు (ప్రేతాదిశరీరములు); కామమయుఁడు (ఇచ్ఛగలవాఁడు); అకామమయుఁడు(ఇచ్ఛలేనివాఁడు); కోపముగలవాఁడు; కోపములేనివాఁడు; ధర్మమయుఁడు; అధర్మమయుఁడు; సర్వమయుఁడు (సర్వమైయుండువాఁడు); ఇదంమయుఁడు (ప్రత్యక్షవస్తుమయుఁడు); అదమయుఁడు (అప్రత్యక్షమయుఁడు); స్వేచ్ఛానుసారుఁడు (ఇష్టప్రకారము చేయువాఁడు); సాధుకార్యము చేయువాఁడు సాధువైయుండును; పాపముచేయువాఁడు పాపియైయుండును; పుణ్యము చేయువాఁడు పుణ్యశాలి; పాపముఁజేయువాఁడు పాపి (అనఁగా ఆయా కార్యములకుఁ దగినఫలము ననుభవించును).

కాఁబట్టి, ఈపురుషుఁడు(జీవుఁడు) కామమయుఁడనియును (పుణ్యపాపములకుఁ దగినశరీరమును గ్రహించుటకు కారణమైనవాఁడుగానున్నాఁడనియును) చెప్పఁబడును. ఎప్పుడు కామముకలిగెనో, అపుడు ఒకనిశ్చయబుద్ధి కలుగుచున్నది. ఎపుడు నిశ్చయబుద్ధికలిగెనో, అపుడు కర్మముచేయ నారంభించుచున్నాఁడు. తర్వాత ఆకర్మఫలము ననుభవింపవలసియున్నది. (అనఁగా, కామము సంసారమునకు మూలమగుచున్నది.)

6. ఈజీవుఁడు ఆశచే కట్టువడినవాఁడై (కర్మఫలమునకు కట్టువడినవాఁడై) ఆకర్మముతోఁగూడిన లక్షణముగలవాఁ డగుచున్నాఁడు. (అనఁగా) దేనియందు వీనికోరిక నిశ్చయముగా నుంపఁబడియున్నదో ఆమనోలక్షణమును బొందుచున్నాఁడు. (కావున సంసారమునకు కామమేమూలమైయున్నది; కామముండినప్పటికిని, బ్రహ్మజ్ఞానులకు తత్ఫలానుభవము లేనందున సంసారము లేకున్నది.)

కామము లేనివానికి జన్మము లేదు; క్రియ లేదు; వాఁడు మోక్షమునొందుచున్నాఁడు; వాఁడు అకాముఁడు; వాఁ డెట్టివాఁడనగా- కామము లేనివాఁడు; నిష్కాముఁడు; ఆప్తకాముఁడు(సకలకామములను బొందినవాఁడు); ఆత్మకాముఁడు (ఆత్మకంటె వేఱేకోరిక లేనివాఁడు); అట్టివాని ప్రాణములు ఊర్ధ్వమార్గముగాఁ బోవుట లేదు; ఇచ్చటనే బ్రహ్మమై, బ్రహ్మమును బొందుచున్నాఁడు.

(ఎవనికి ఆత్మయే సర్వమునై యున్నదో, వాఁడు కోరవలసినదేమియు లేదు. అట్టివానికి ఇచ్ఛ లేనందున కామము లేదు. ఎవరు కర్మమును చేయనిచో, ప్రత్యవాయము కలుగునని యెంచి కర్మములు చేయుచున్నారో, వారిబుద్ధికి సర్వమునాత్మ యని తోఁచుట లేదు. వారు బ్రహ్మవేత్తలుగారు. ఆత్మకంటె ప్రత్యవాయము వేఱేయున్నదని తలంచుటచేత వారు బ్రహ్మవేత్తలు కారు. ఆత్మ నిత్యుఁడు, ప్రత్యవాయము లేనివాఁడు, అనితలంచువాఁడే బ్రహ్మవేత్త. కావున కామము లేనివాఁడు మోక్షమునొందును.)

7. (ఆత్మ బ్రహ్మమేగాన, బ్రహ్మమును పొందుచున్నాఁడని చెప్పుట ఉపచారమేగాని వేఱుకాదు. దేహములు వేఱైనప్పటికిని ఆత్మయొక్కటే యని తెలియఁదగినది.

మఱియు, నిదివఱకు సంసారమునకుఁ గారణము అవిద్య, కర్మము, పూర్వప్రజ్ఞ యని చెప్పఁబడినది . ఉపాధిభూతములును, కార్యకారణలక్షణములైన ఏభూతములచే నావరింపఁబడిసంసారిత్వమునుఅనుభవించుచున్నాఁడో, వానినిఁ గూర్చియుఁ జెప్పఁబడినది. వీని హేతువులైన ధర్మాధర్మములను వివరించి, కామమే కారణమని నిరూపింపఁబడినది. తర్వాత సర్వాత్మభావమైన మోక్షము చెప్పఁబడినది. మోక్షమునకుఁ గారణము ఆత్మజ్ఞానమనియు, దానికిఁ గారణము బ్రహ్మవిద్య యనియును, అవిద్యచే బంధనమనియు, మోక్షమును మోక్షసాధన మిట్టిదనియుఁ జెప్పఁబడినది. ఇపుడు మోక్షముయొక్క దార్ఢ్యముకొఱకుఁ జెప్పఁబడుచున్నది.)

ఎపు డీజీవునిహృదయమును ఆశ్రయించి యుండు (పుత్ర, విత్తాది) సకలేచ్ఛలును నశించిపోవుచున్నవో, అపుడు మర్త్యుఁడు అమర్త్యుఁడగుచున్నాఁడు. బ్రహ్మమును బొందుచున్నాఁడు. కావున, అట్టి విద్వాంసుని ప్రాణములు పైకిపోవుట లేదు. ఇచ్చటనే స్వకారణమైన పురుషుఁడగు బ్రహ్మమందు ఐక్యమగుచున్నవి.

(ఇట్లు ఐక్యమైనయెడల సర్వాత్మయై పునర్జన్మము నొందక యుండు ననఁగా-) పాము తనకుబుసమును వదలిపెట్టి పోవునపుడు, ఎట్లు ఆకుబుసము మృతమై పుట్టయొద్ద పడియున్నదో, అట్లే జీవునిచే వదలిపెట్టబడిన శరీరము మృతమై పడియుండును. పామెట్లు జీవించియే యుండునో, అట్లు ఆత్మ అమృతమయుఁడై బ్రహ్మ తేజస్సగుచున్నాఁడు.

జనకుఁడు—ఇట్లు నా కుపదేశించినందులకై ఇంకను వేయిగోవుల నిచ్చుచున్నాఁడను.

8. సూక్ష్మమును, విస్తారమును, పురాణమునై యుండునట్టి మార్గమునకు బ్రహ్మవిద్యయని పేరు. ఇది నాచేత పొందబడినదని వేదపురుషుఁడు చెప్పుచున్నాఁడు. ఋషియు నాచే ననుభవింపఁబడినది; అట్టిమార్గముచే బ్రహ్మవేత్తలు స్వర్గలోకమైన పరబ్రహ్మమును పొందుచున్నారు. ఈశరీర ముండునపుడే పొందుచున్నారు.

9. (ఈవిషయమునందలి మతభేదము ఎట్లన,) ఈమార్గము శుద్ధమైన తెలుపనికొందఱును, పసుపనికొందఱును, నలుపనికొందఱును, పచ్చయని కొందఱును ఎఱుపనికొందఱును, చెప్పెదరు. (అనఁగా సుషుమ్నానాడి అనేకవర్ణములుగలది యనియును, యోగమార్గముచేతనే మోక్షమును బొందవచ్చుననియును జెప్పెదరు. ఇవి మోక్షమార్గములు కావు. ఇవి సంసారమార్గములే. బ్రహ్మాదిలోకములకు ఈమార్గముగా పోవచ్చును; అయినను మరలిరావలసినదే. మోక్షమార్గమేదియనఁగా—) ఆత్మకామముచే ఆప్తకాముఁడై, సకలకామములను త్యజించి, ఆఱిన దీపమువలె, చక్షురాదీంద్రియవృత్తులు శాంతినొందియుండుటయే జ్ఞానమార్గము. ఈమార్గముమూలముగా బ్రహ్మవేత్త బ్రహ్మమును బొందుచున్నాఁడు. ఈబ్రహ్మవేత్తమాత్రమేగాక, మొదటపుణ్యమొనర్చి, తర్వాత ఈషణలనువదలి, పరమాత్మతేజస్సునందు తన ఆత్మను జేర్చినవాఁడును (యోగియును) పరబ్రహ్మముతో నైక్యమును బొందుచున్నాఁడు.

10. ఎవరు (సాధ్యసాధకలక్షణమైనకర్మను) అవిద్యను ఉపాసించెదరో, వారు తమస్సును (చీకటియైనసంసారమును) పొందుచున్నారు. అవిద్యకు ఉపయోగమైన వేదోక్తకర్మమునం దాసక్తికలవారు అంధతమసమును (మిక్కిలిచీకటిని) పొందుచున్నారు.

11. తమస్సు (చీకటి) తోఁ గూడిన లోకములను బొందువారు దుఃఖముల ననుభవించి, మరల జన్మమెత్తి సంసారమునం బడుదురు. వీరే అవిద్యావంతులు; బుద్ధిలేని ప్రాకృతజనులు.

12. ఏపురుషుఁడు తన్ను సర్వప్రాణిప్రత్యయసాక్షియు, నేతినేతి యని నిర్దేశింపఁబడువాఁడును, సర్వభూతస్థుఁడును, నిత్యుఁడును, శుద్ధుఁడును, బుద్ధుఁడును, ముక్తుఁడును పరమాత్మనుగా తెలియుచున్నాఁడో, వాఁడు దేనికిని తనశరీరమును కష్టపెట్ట వలసినది లేదు. (అనఁగా వానికి ఏ కామములును లేదు; కావున, వానికి ఏ కాయక్లేశమును అక్కఱ లేదు.)

13. ఎవఁడు (ఎవనియాత్మ) నేను బ్రహ్మముగానున్నాఁడ నని యనుభవము చెందునో, వాఁడే విశ్వకృత్తు. జగత్సృష్టి చేసినవాఁడు. సర్వమును సృష్టించినవాఁడు. సర్వమును వాని లోకము. గహనమైన ఈ దేహమునందు ప్రవేశించియున్నట్టి ఆత్మయు వాని లోకమే. (అనఁగా పరమాత్మయే.)

14. మన మీలోకమునందు చాలకాలముగ అజ్ఞాననిద్రామోహితులమైయుండి, ఎట్లో కష్టపడి బ్రహ్మత్వమును బొందినారము.(అనఁగా బ్రహ్మసాక్షాత్కారానుభవము కావలయు నని యేర్పడుచున్నది.) లేనియెడల (బ్రహ్మసాక్షాత్కారానుభవము నొందనియెడల) మహానష్టము కల్గును. (వలన,) బ్రహ్మవిద్యచే మోక్షముకల్గును. అది లేనిచో దుఃఖము (జనన మరణములు) కల్గును.

15. ఎప్పుడు [ఆచార్యుని అనుగ్రహమును బొంది] కలిగియుండునట్టియు, కలుగఁబోవునట్టియు, సర్వమున కధిపతియైన పరమాత్మను దర్శించుచున్నాఁడో, అప్పుడు వాఁడు దేనికిని భయపడవలసినది లేదు. (అనఁగా బ్రహ్మైక్యమునొందుటంబట్టి వాఁడును పరబ్రహ్మమే యగుచున్నాఁడని భావము.)

16. సంవత్సర మనెడికాలాత్మ, పరమాత్మకంటె తక్కువస్థితియందుండి, తన అవయవము లైనఅహోరాత్రములతోఁగూడియున్నది. ఇది జ్యోతిస్సులకంటె జ్యోతిస్సై యున్నది. (ఆదిత్యాదులను ప్రకాశింపఁజేయునది.) అదే అమృతము. ఆయుస్సు. ఇట్లు కాలాత్మను దేవతలు

ఉపాసించెదరు. కావున వారు మరణములేనివారై, దీర్ఘాయుష్మంతులై యున్నారు.

17. ఏ బ్రహ్మమునందు ఐదుజనులు (గంధర్వులు, పితరులు, దేవతలు, అసురులు, రాక్షసులు), ఆకాశమును ఉన్నవో, ఆయాత్మను అమృతమైన బ్రహ్మ మనితలంచెదను. అప్పుడు నేను విద్వాంసుఁడను, అమృతుఁడను నయ్యెదను.

18. ఎవరు ఆపర బ్రహ్మమును ప్రాణముకంటె ప్రాణముగను (ప్రాణవ్యాపారములను జేయునట్లు ప్రేరించుజ్యోతిస్సుగను), అట్లే నేత్రమునకు నేత్రముగను, శ్రోత్రమునకు శ్రోత్రముగను, మనస్సునకు మనస్సుగను ఉన్నదని తెలియుచున్నారో, వారు ఆ బ్రహ్మమును శ్రేష్ఠవస్తువనియును, పూర్వమే యున్నదనియును నిశ్చయముగా నెఱుంగుచున్నారు.

19. (బ్రహ్మదర్శనసాధనము చెప్పఁబడుచున్నది.)

గురూపదేశముచే సంస్కరింపఁబడిన పరమార్థజ్ఞానముచేత ఆ బ్రహ్మముఁ జూడఁదగును. ఇచ్చట నానాత్వముగ (అనేకములుగ) నేదియు లేదు. సర్వమును బ్రహ్మమే. ఎవఁడిచ్చట అనేకములుగఁ జూచుచున్నాఁడో వాఁడు మరణమునొందును. (అనఁగా సంసారముకలదు.)

20. ఈ బ్రహ్మమును ఏకముగాఁ జూడవలయును. అది అప్రమేయము, ధ్రువము, నిత్యము. ధర్మాధర్మాదిమలరహితము, అవ్యాకృతాకాశమునకంటె శ్రేష్ఠము. జన్మములేనిది.సర్వముకంటె శ్రేష్ఠము. నాశములేనిది. (అని తెలియవలయును.)

21. ఇట్టిఆత్మను బుద్ధిమంతుఁడగు బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని) ఎఱింగి పరమావధియైన ప్రజ్ఞను పొందునుగాక. బహుశబ్దములను ధ్యానము చేయఁగూడదు. (ఓంకారధ్యానమే చాలునని యభిప్రాయము). అధికశబ్దములు వాక్కునకు శ్రమమేగాని వేఱే ప్రయోజనము లేదు.)

22. ఇదివఱకుఁ బంధమోక్షములకు హేతువులను, మోక్షస్వరూపమును చెప్పితిమి. ఇప్పుడు ఆత్మవిషయమునందు సకలవేదములును (కామ్యకర్మవిషయముతప్ప తక్కినభాగమంతయు) ఉపయోగమగు నని చెప్పఁబడుచున్నది.

ఆయాత్మ మహాన్ (గొప్పవాఁడు,) అజుఁడు (పుట్టనివాఁడు,) ప్రాణవిజ్ఞానమయుఁడు, అంతర్హృదయాకాశమునందు బుద్ధివిజ్ఞానముతోఁ

గూడినవాఁడు, సకలమైనవారిని (బ్రహ్మేంద్రాదులను) స్వవశముచేసికొని యుండువాఁడు, సకలమైనవారిని పాలించువాఁడు, సకలమైనవారికిని అధిపతి, స్వతంత్రుఁడు, సాధుకర్మచే శ్రేష్ఠుఁడును, అసాధుకర్మచే కనిష్ఠుఁడు గానివాఁడు (అనఁగా అతఁడేకర్మతోను సంబంధింపనివాఁడు), సర్వేశ్వరుఁడు, సకలభూతాధిపతి, సకలభూతరక్షకుఁడు, పదునాలుగు లోకములను యథాస్థితియం దుంచి రక్షించునట్టి సేతువు, అనఁగా గట్టు.

ఇట్టి ఉపనిషత్ప్రతిపాద్యపురుషుని బ్రాహ్మణులు (జ్ఞానులు) వేదానుశాసనముచేత తెలిసికొనుట కిచ్ఛయించెదరు.

(వేదానుశాసనమనఁగా) - వేదోక్తనిత్యకర్మముల నాచరించుట; యజ్ఞదానతపస్సుల నొనర్చుట. వీనిచే విశుద్ధాత్ములై, పరమాత్మ నెఱింగి మునులనెడి యోగు లయ్యెదరు. ఈయాత్మ నే లోకముగాఁగోరువారు సకలకామములను త్యజించి పోవుచున్నారు. (ఏలన) పూర్వమునం దున్న బ్రహ్మజ్ఞానులు ప్రజలచే మన కేసుఖమును లే దనితలంచి ప్రజలను గోరుట లేదు. అట్టివారు మనకు ఆత్మయే లోకమని నిశ్చయించికొని, పుత్రేషణము, విత్తేషణము, లోకేషణము అను మూఁటిని త్యజించి భిక్షమెత్తికొని సంచరించుచున్నారు.

(ఆత్మలోకేచ్ఛ గలవారు కర్మమేల చేయరాదనఁగా—ఆత్మలోకమునకు కర్మములతో సంబంధము లేదు.) పరమాత్మ "నేతి నేతి" అని పేర్కొనఁబడువాఁడు, గ్రహింపఁబడనివాఁడు, కొఱతలేనివాఁడు, ఇట్టి వానిని పాపకర్మమొనర్చి పశ్చాత్తాప మొందుటవలనఁగాని, పుణ్యకర్మమొనర్చి సంతుష్టినొందుటవలనఁగాని, పొందుటకు వలనుకాదు. కావున, పాపపుణ్యములు సన్న్యాసియగు ఆత్మవేత్తకు నశించిపోవుచున్నవి. నిత్యకర్మములును, ఆత్మవేత్తకు ప్రయోజనము లేనివి. (ఆత్మవేత్త, ఆత్మవిద్య యను నగ్నిచేత సకలకర్మములను భస్మము చేయుచున్నాఁడు; కాఁబట్టి, బ్రహ్మవేత్తకు ఏకర్మముతోడను సంబంధమే లేదు.)

23. ఇట్టిఆత్మ, వేదఋక్కుచే స్పష్టముగాఁ జెప్పఁబడియున్నాఁడు. అతఁడు నిత్యుఁడు; బ్రహ్మవేత్తయొక్క మహిమయైయున్నాఁడు; పుణ్యకర్మచే వృద్ధిని పాపకర్మచే క్షీణతను బొందుటలేదు; అతనిమహిమ నెఱింగినవాఁడే పదవి త్తనఁబడును. ఆమహిమ నెఱింగినవాఁడు ధర్మాధర్మలక్షణము గల కర్మముతో సంబంధించుటలేదు. ఇట్టు లెఱింగినవాఁడే

శాంతుఁడు (బహిరింద్రియనిగ్రహుఁడు); దాంతుఁడు (అంతరింద్రియ నిగ్రహుఁడు); ఉపరతుఁడు (-ఈషణత్రయము లేనిసన్న్యాసి); తితిక్షువు (సుఖదుఃఖాది ద్వంద్వములను సహించికొని యుండువాఁడు); సమాహితుఁడు (సర్వేంద్రియ వ్యాపారరహితుఁడై, ఆత్మయం దేకాగ్రచిత్తముతో నుండువాఁడు); ఈ చెప్పఁబడిన లక్షణములతోఁ గూడినవాఁడై తనయందే ఆత్మను దర్శించుచున్నాఁడు. సర్వమును ఆత్మగాఁ జూచుచున్నాఁడు. ఇతనిని పుణ్యపాపము లంటుటలేదు. వీఁడు పుణ్యపాపములను దాఁటుచున్నాఁడు. వీనిని కృతాకృతకర్మములు బాధించుటలేదు. అట్టికర్మములను వీఁడు భస్మముచేయుచున్నాఁడు. వీఁడు పాపరహితుఁడై, ధర్మాధర్మములులేనివాఁడై, విరజుఁడై, ఇచ్ఛలేనివాఁడై, సంశయరహితుఁడై, బ్రాహ్మణుఁడై, బ్రహ్మమునెఱింగినవాఁడై యున్నాఁడు. ఇదే బ్రహ్మలోకము అని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

జనకుఁడు—యాజ్ఞవల్క్యునిఁజూచి, నీవు నాకీ యుపదేశము చేసినందులకై నారాజ్యము నొసంగితిని; నేనును దాసుఁడనైతిని. (అని చెప్పెను.)

24. ఈఆత్మ మహాత్మ, అజుఁడు, అన్నాదుఁడు (సకలభూతముల యొద్దనుండి అన్నమును భుజించువాఁడు), వసుదానుఁడు (ప్రాణులకు కర్మఫలము నొసంగువాఁడు); ఇట్టిపరమాత్మను ఎఱింగినవాఁడు వసువును (ధనమును, బలమును) పొందుచున్నాఁడు.

25. (ఇపుడు సకలారణ్యకముల భావార్థము చెప్పఁబడుచున్నది.) అట్టిఆత్మ మహాత్మ, అజుఁడు, అజరుఁడు, అమరుఁడు, అమృతుఁడు, అభయుఁడు, అభయమైయుండు బ్రహ్మము. అని యిట్లెఱుంగువాఁడు ఆ అభయబ్రహ్మ మగుచున్నాఁడు.

(ఇది సకలోపనిషదర్థమైయున్నది; నిర్వికారుఁడైన పరమాత్మకు ఉత్పత్తిస్థితి లయములును; క్రియా కారక ఫలములును లేకయుండఁగా, ఉన్నట్లు అధ్యారోపముద్వారముగాఁ జెప్పఁబడినది. పిమ్మట, "నేతి నేతి" మొదలగువాక్యములచేత ఆ యధ్యారోపమును నివృత్తిచేసి, తత్త్వము బోధింపఁబడినది. ఎట్లు అకారాద్యక్షరములు సంజ్ఞామాత్రములై యుండునో, అట్లు ఆత్మకు ఉత్పత్త్యాదులు ఆరోపితమేగాని, వేఱుకాదు.

అతనికి దేనియందును సంబంధము లేదు, అతఁడు పరిశుద్ధుఁ డని తెలియఁదగినది.)

## పంచమబ్రాహ్మణము.

(ఇప్పుడు ఆత్మవిషయమైన నిగమనము (తీర్మానము) కొఱకు ఈమైత్రేయీ బ్రాహ్మణము ప్రారంభింపఁబడుచున్నది.)

1. ఈ యాజ్ఞవల్క్యునకు ఇరువురుపత్నులుగలరు. మైత్రేయి యనియు, కాత్యాయని యనియు పేర్కొనంబడుదురు. మైత్రేయి బ్రహ్మజ్ఞానముగలది. కాత్యాయని ప్రజ్ఞగలది. (అనఁగా కుటుంబధర్మము మాత్ర మెఱింగినది). యాజ్ఞవల్క్యుఁడు గృహస్థాశ్రమమును వదలి సన్న్యాసాశ్రమమునకుఁ బోవలయునని నిశ్చయించి యిట్లనియె.

2-15. ఈమంత్రములయొక్క తాత్పర్యమంతయు ఈయుపనిషత్తుయొక్క ద్వితీయాధ్యాయము చతుర్థబ్రాహ్మణమునందుఁ గనందగును. ఇచ్చట నచ్చట నొకేవిషయము గాన, ఇచ్చట ప్రత్యేకముగ చెప్పలేదు.

(జీవితకాలపర్యంతము కర్మము నాచరింపవలయు నని శ్రుత్యుక్త విధిగానుండఁగా, తత్త్యాగమే మోక్షప్రద మనిచెప్పుట విరుద్ధముకదా యని శంక కలుగఁగా, శంకరాచార్యులు తమభాష్యమునందు ఆక్షేప సమాధానములతో విశదీకరించియుండిన వానియొక్క సారాంశము— వేదమునందు కర్మకాండమనియు, జ్ఞానకాండమనియు రెండుభాగములు కలవు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థము లను మూఁడాశ్రమములం దుండువారు కర్మకాండప్రకారము కర్మముల నాచరింపవలయును. సన్న్యాసాశ్రమమునం దుండువారు సకలకర్మలను త్యజించి (పరివ్రాట్కర్మను మాత్రము గ్రహించి) పరబ్రహ్మధ్యానకర్మను మాత్ర మాచరింపవలయును.

## షష్ఠబ్రాహ్మణము.

1-3. ఈ యాజ్ఞవల్క్యకాండముయొక్క ఋషులవంశము చెప్పఁబడియున్నది. కావున విరమింపఁబడియె.

# పంచమాధ్యాయము.

## ప్రథమ బ్రాహ్మణము

ఈ ఖిలకాండమునందును ముక్తికిసాధనములైన ఓంకారము, దమము, దానము, దయ అనువీనినిఁగూర్చి చెప్పఁబడుచున్నది.

1. హరిఃఓం. అది పూర్ణమైనవస్తువు (అది అనఁగా పరబ్రహ్మము). ఇదియు పూర్ణమైనవస్తువు (ఇది అనఁగా జీవుఁడు). ఆపూర్ణవస్తువువలన నీపూర్ణవస్తువు కలిగెను. ఈపూర్ణవస్తువునకు (జీవునకు) విద్యచేత పూర్ణత్వమును గ్రహించినయెడల పూర్ణవస్తువేయగును. (అనఁగా జీవుఁడు, తన్ను విద్యచేత పరమాత్మయే యని తెలిసికొని, అవిద్యచేఁ గలిగిననామరూపాదులను నివృత్తిచేసినయెడల పరబ్రహ్మమేయగుచున్నాఁడు.)

ఓం ఖం (ఆకాశము) బ్రహ్మమైయున్నది. (ఆయాకాశము) పురాణమై (నిరంతరమై) యుండుచిదాకాశము. (భూతాకాశము కాదు.) వాయువుసంబంధమైన ఆకాశమని కౌరవ్యాయణి యనుఋషి చెప్పెను. ఈఓంకారమును వేదమని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు. దీనిచేఁ దెలియఁదగినది తెలియఁబడుటచే వేదమని చెప్పవలయును. (ఓంకారము బ్రహ్మోపాసనకు సాధకమైయున్నది; ఇది బ్రహ్మమునకు రూపమును, నామమును, బ్రహ్మము నెఱుంగువారికి పట్టుకొమ్మయునై యున్నది. మఱియు జీవాత్మపరమాత్మలకు నామరూపములు నై యున్నది.)

---

## ద్వితీయబ్రాహ్మణము.

ఇపుడు దమాదిసాధనములు మూఁడును చెప్పఁబడుచున్నవి.

1. ప్రజాపతిపుత్త్రులు ముత్తెగలవారు. దేవతలు, మనుష్యులు, రాక్షసులు అని. వీరుముప్పురును (తమతండ్రిని గురువుగావరించి) అతని యొద్ద బ్రహ్మచర్యము ననుష్ఠించిరి.

దేవతలు—ఓగురూ, మా కేమి యుపదేశముచేసెదరు? (అని యడిగిరి.)

పిత—'ద' అనుఅక్షరము నుపదేశించెదను; దానిని మీరు తెలిసికొంటిరా? (అనెను.)

దేవతలు—తెలిసికొంటిమి. (అనిరి.)

పిత—దానిని తెలిసికొంటిరిగాన, అదేమో చెప్పుడు. (అనెను.)

దేవతలు—స్వభావముగనే మీరు (దేవతలు) దాముల్యలై యున్నారు. కావున, దాముల్యలై యుండుడని ఉపదేశించితిరికదా!

పిత—ఔను; సరియే. చక్కగా దెలిసికొంటిరి. (దమము=అంతరింద్రియనిగ్రహము. దాముల్యలు=దమముగలవారు.)

2. ఆతర్వాత, మనుష్యులు, పితనుజూచి—మాకేమి యుపదేశించెదరు? (అని యడిగిరి.)

పిత—మీరు 'ద' అను అక్షరమును దెలిసికొంటిరా? (అని యడిగెను)

మనుష్యులు—తెలిసికొంటిమి (అనిరి.)

పిత—అదేమి? (అని యడిగెను.)

మనుష్యులు—మీరు స్వభావముగ లుబ్ధులై, ఆశగలవారై యున్నారు. కావున, దానముచేయుడని ఉపదేశించితిరికదా? (అనిరి.)

పిత—ఔను; మీరు చక్కగా దెలిసికొంటిరి. (అనెను.)

3. ఆమీద అసురులు పితనుజూచి—మాకేమి యుపదేశము చేసెదరు? (అని యడిగిరి.)

పిత—మీరు 'ద' అను అక్షరమును దెలిసికొంటిరా? (అనెను.)

అసురులు—తెలిసికొంటిమి. (అనిరి.)

పిత—అదేమి? (అని యడిగెను.)

అసురులు—మీరు స్వభావముగ క్రూరులై యున్నారు. కాన, ప్రాణులయెడల దయగలిగి యుండుడని యుపదేశించితిరికదా? (అనిరి.)

పిత—ఔను; మీరు చక్కగా దెలిసికొంటిరి. (అనెను.)

అపుడు ఈయర్థమును దేవవాక్కుగూడ చెప్పినది; ఎట్లన, మేఘమునుండి ద, ద, ద అని ముమ్మారు వినబడినది. దీనివలన, దమము, దానము, దయ అను నీమూడు కావలయునని ఉపదేశము (చేయబడినది).

(ప్రజాపతిచే జెప్పబడిన దమము, దానము, దయ అను నీ మూటిని అందఱును అనుష్ఠింపవలసినది. 'ద' అనినంతనే తక్కిన అక్షరముల నెట్లూహించి రసగా-వారు తమయందుండు కొఱంతలను దెలిసికొని గ్రహించిరని తెలియవలయును. వారు చక్కగా దెలిసికొన్నవారుగాన

'ద' అని సంజ్ఞామాత్రముగఁ జెప్పినదానిని గ్రహించిరి. దేవతలకు దమమును, మనుష్యులకు దానమును, అసురులకు దయయును చెప్పఁబడినందున, వారువారు దానిదానిని తప్పక అనుష్ఠింపఁదగును. అయినను మనుష్యు లీమూఁటినిఁ దప్పక యనుష్ఠింపవలయును. ఈమూఁడునుగలవాఁడు ఆత్మోపాసనకు అధికారి యగుచున్నాఁడు.)

---

## తృతీయబ్రాహ్మణము

(ఇపుడు సోపాధికపరబ్రహ్మోపాసనా ప్రయోజనమును గూర్చి చెప్పఁబడుచున్నయది.)

1. ఏది హృదయమో (హృదయమందుండు బుద్ధియో) అదే ప్రజాపతి; అదే బ్రహ్మము; అదే సర్వమునైయున్నది. 'హృదయమ్' మూఁడక్షరములుగలది. 'హృ' మొదటి యక్షరము. ఈహృదయాత్మకొఱకు తనయింద్రియములును, దానిదానివిషయములును, తమతమబలమును (ఈఅక్షరముమూలముగా) ఇచ్చుచున్నవి. (హృదయము భోక్త యగు జీవునకు ఆరీతిగానే బల మిచ్చుచున్నది.) ఇట్లెఱింగినవానికి పైని చెప్పఁబడిన బలము సిద్ధించును.

'ద' రెండవ యక్షరము. ఇదియు హృదయాత్మకొఱకు తనయింద్రియములచేతను, విషయములచేతను, తమతమవీర్యము నిచ్చుచున్నది. (హృదయమును జీవునకు వీర్యము నిచ్చుచున్నది.) ఇట్లు తెలిసికొన్నవానికి మీఁదఁజెప్పిన ఫలముకలదు.

'యమ్' మూఁడవయక్షరము. ఇది స్వర్గమునకుఁ బోవునట్లు చేయుచున్నది. ఇట్లు తెలిసికొన్నవాఁడు స్వర్గమునకుఁ బోవుచున్నాఁడు.

---

## చతుర్థబ్రాహ్మణము

(ఇపుడు హృదయబ్రహ్మమును సత్య మని యుపాసింపవలయునని చెప్పుచున్నాఁడు.)

1. ఆహృదయబ్రహ్మము సత్యమైయుండునది. (సత్ = పృథివి, జలము, అగ్ని. త్యత్ = వాయువు, ఆకాశము. లేక సత్=మూర్తము. త్యత్=అమూర్తము.) ఇట్లు మహత్తుగను, పూజ్యమైనదిగను, పూర్వముండినట్టిదియునుఅగు బ్రహ్మమును సత్యమనియెఱింగి, ఉపాసించు

వాఁడు సకలలోకములను జయించును. అసత్య మని యెఱుంగువాఁడు శత్రునింబోలె సకలలోకములచేతను జయింపఁబడువాఁడగును.

---

## పంచమ బ్రాహ్మణము

(ఇపుడు సత్యబ్రహ్మస్తోత్రము చెప్పఁబడుచున్నది.)

1. ఆదియందు (అవ్యాకృతమును, బీజభూతమునుఅగు) జలములు (అగ్నిహోత్రాదులచేఁగలిగిన ద్రవరూపమైన జలము; అనఁగా తక్కిన భూతములతోఁగూడిన అవ్యాకృతపంచభూతములు) ఉండినవి. ఆజల ములుసత్యమును (వ్యాకృతపంచమహాభూతములను) సృష్టించినవి. సత్యమనఁగా బ్రహ్మము. (హిరణ్యగర్భుఁ డను సూత్రాత్మ.) ఆ సత్య బ్రహ్మము ప్రజాపతియగువిరాట్ శరీరమును, ప్రజాపతి దేవతలను సృష్టించెను. ఆదేవతలుఆబ్రహ్మమును సత్యమని ఉపాసించిరి. 'సత్యమ్'అనునది మూఁడక్షరములు. స—తి—యమ్. వీనిలో మొదటిఅక్షరమును, కడపటి అక్షరమును సత్యాక్షరములు; మధ్యమందలి 'త' అనృతాక్షరము. రెండు సత్యాక్షరముల నడుమ ఒక అసత్యాక్షర మున్నందున సత్యము బలము కలిగియున్నది. ఇ ట్లెఱింగినవానిని అనృతము బాధింపదు.

(అగ్నిహోత్రాదులవలనిజలములు, లేక ఫలము, జగత్ సృష్టియని సిద్ధించుచున్నదేగాని, ఆదిసృష్టినిగూర్చి చెప్పఁబడలేదని తోఁచుచున్నది.

2. (అపుడు సత్యబ్రహ్మస్థానములు చెప్పఁబడుచున్నవి.)

ఈ కనబడు ఆదిత్యునియం దుండుపురుషుఁడు ఆ బ్రహ్మమే; మనుష్యుల కుడికంటియం దుండుపురుషుఁడు ఆ బ్రహ్మమే; ఈ రెండును ఒకటి కొకటి ఉపకారోపకార్యములై యున్నవి. ఎట్లన, ఆదిత్యపురుషుఁడు తన కిరణముల ప్రకాశముచేత నేత్రమును అనుగ్రహించి అందు ప్రతిష్ఠితమై యున్నాఁడు. అక్షిపురుషుఁడు ఇంద్రియములచే ఆదిత్యుని ప్రకాశింపఁజేసి అనుగ్రహించి, అందు ప్రతిష్ఠితమైయున్నాఁడు.

ఎపుడు ప్రాణముపోవుకాలము సమీపించుచున్నదో, అపుడు ఆదిత్యుఁడు కిరణములులేక, అనఁగా శుద్ధముగా చంద్రునివలె ఉష్ణప్రకాశములేక, కనులకు తోఁచుచున్నది;కిరణములు మరల వీనిని చేరుటలేదు.

3. ఆ ఆదిత్యమండలపురుషునకు వ్యాహృతులు అవయవములై యున్నవి; ఎట్లన,

౧. భూః—ఒక అక్షరము; అది శిరస్సు.

౨. భువః—రెండక్షరములు; రెండు చేతులు.

3. సువః—రెండక్షరములు; రెండు కాళ్లు.

౪. అహః—(పగలు) ఇది బ్రహ్మమునకు రహస్యనామము. అంధకారమును గొట్టునది, లేక త్యజించునది గాన "అహః" అను పేరొందినది. ఇట్లెఱుంగువాఁడు సకలపాపములనుండి విడువబడుచున్నాఁడు.

4. అక్షిపురుషుని విషయమునందును వ్యాహృతులు పైని చెప్పిన చొప్పున అవయవములు. ఈ పురుషునకు "అహమ్" అనునది రహస్యనామము; దీనికిని పైని చెప్పినయట్లే యర్థమును ఫలమును గలదు.

---

## షష్ఠ బ్రాహ్మణము

1. (బ్రహ్మమునకు ఉపాధు లనేకములై యున్నందున, మనస్సు ఉపాధిగాఁగల బ్రహ్మోపాసనా ప్రకారము చెప్పఁబడుచున్నది.) ఈ పురుషుఁడు మనోమయుఁడు; మనస్సుచే నెఱుంగఁదగినవాఁడు. అంతర్హృదయమునందు యవము (వడ్లగింజ) వలె, సత్యవస్తువై ప్రకాశముతో నుండువాఁడు. సర్వమునకును ఈశానుఁడు. సమస్తమునకును అధిపతి. అన్నిటిని శాసించువాఁడు.

---

## సప్తమ బ్రాహ్మణము

1. (సత్యబ్రహ్మవిశిష్టఫలము చెప్పఁబడుచున్నది.)

ఆ బ్రహ్మమును "విద్యుత్" (మెఱుపు) అని చెప్పెదరు. "విదానాత్" మేఘాంధకారమును చీల్చుటచేత, పాపములను భేదించుటచేత నిట్లు చెప్పఁబడుచున్నది. ఇట్లు తెలిసికొన్నవాని పాపములు భేదింపఁబడుచున్నవి. బ్రహ్మము మెఱుపువంటిదికదా?

---

## అష్టమ బ్రాహ్మణము.

1. (వాక్కు బ్రహ్మ మని చెప్పఁబడుచున్నది.)

వాక్కును, వేదములను పిదికెడు గోవువలె ఉపాసింపవలయును. వాక్కను పశువునకు నాలుగు స్తనములు కలవు. ౧ స్వాహాకారము; ౨ వషట్కారము; 3 హన్తకారము; ౪ స్వధాకారము. మొదటి రెండు

స్తనములు (యాగముల) వలన దేవతలు జీవించుచున్నారు. మూఁడవ స్తనమువలన మనుష్యులును, నాలవ స్తనమువలన పితరులును జీవించుచున్నారు. ఆపశువునకు వృషభము ప్రాణము. (ప్రాణముచేత వాక్కు జనించుచున్నది.) మనస్సు దూడగా నున్నది. (మనస్సుచే వాక్కు పెరుఁగుచున్నది; అనఁగా మనస్సుచేత ఆలోచింపఁబడి వాక్కు బయలువడుచున్నది.

---

## నవమ బ్రాహ్మణము.

1. (జఠరాగ్ని బ్రహ్మమనఁబడుచున్నది.)

పురుషుని గర్భమందుండు వైశ్వానరుఁడను అగ్నిని ఉపాసింపవలయును. ఆయగ్ని భుజింపఁబడు అన్నమునంతయు పక్వము చేయుచున్నది. దాని ఘోషశబ్దము కలదు. రెండు చెవులను రెండు చేతులతో మూసికొని విన్నయెడల ఒకశబ్దము వినఁబడుచున్నది కదా? అదే ఆ శబ్దము. ప్రాణముపోవు సమయమునందు అట్టిశబ్దము వినఁబడదు.

---

## దశమ బ్రాహ్మణము.

1. ఎపుడు విద్వాంసుఁడు ఈలోకమును విడిచిపోవుచున్నాఁడో, అపుడు వాఁడు మొదట వాయుమండలమును చేరుచున్నాఁడు. అంతరిక్షమునకుఁ బోయి వాయువుచే చలింపఁబడక యుండును. ఆవాయువు తనలో లోకరథచక్రమందలి రంధ్రమంతటిచోటిచ్చుచున్నది. తద్ద్వారముగా మీఁదఁబోయి సూర్యమండలమును జేరుచున్నాఁడు. ఆసూర్యుఁడు బ్రహ్మలోకమునకుఁ బోవువారిని పోనీక అడ్డగించుచున్నాఁడు; అయినను విద్వాంసునకుమాత్రము తనయొద్దనుండు డంబరము (లంబరము) అను వాద్యమునందలి ద్వారప్రమాణము స్థలమిచ్చుచున్నాఁడు. తన్మార్గముగా మీఁదఁబోయి చంద్రమండలమును జేరుచున్నాఁడు. ఆచంద్రుఁడు తనయొద్దనుండు భేరీవాద్యమందలి రంధ్రమంతచోటిచ్చుచున్నాఁడు. తద్ద్వారము మీఁదఁబోయి ప్రజాపతిలోకమును ప్రవేశించుచున్నాఁడు. ఆ లోకము మనోదుఃఖవర్జితమును, శరీరదుఃఖవర్జితమును నైయున్నది. ఆ లోకమునందు బహుకాలము వసించుచున్నాఁడు.

## ఏకాదశబ్రాహ్మణము.

1. ఏపురుషుఁడు జరాదిదుఃఖములను సహించికొని, ఆదుఃఖములను(బాధలను) తానాచరింపవలసినమహాతపస్సని భావించియుండునో, అట్టిజ్ఞానముచేత వానిపాపము లన్నియు నశించి వానిని పరమలోకమును బొందునట్లు చేయుచున్నది. ఎవఁడు తానుగతించినమీఁద తనప్రేతమును శ్మశానమునకుఁ గొంపోయి అగ్నిసంస్కారముచేయఁబడునని తాను గతించుటకు పూర్వమే తలంచి మరణవిషయమునందు వ్యసనమొందక యుండునో వాఁడును పరమలోకమును బొందును.

---

## ద్వాదశబ్రాహ్మణము.

1. అన్నము బ్రహ్మమని కొందఱనెదరు; అట్లుకాదు. ఏలన, ప్రాణములేనియెడల అన్నముచెడిపోవును. ప్రాణమును బ్రహ్మమని కొందఱందురు; అదియు సరికాదు. అన్నములేనియెడల ప్రాణము కొఱవడిపోవును. అన్నమును ప్రాణమును జేరి మహిమగలది యగుచున్నది. దానిని బ్రహ్మమనఁదగును.

ప్రాతృదుఁ డనునతఁడు తనతండ్రినిఁజూచి యిట్లనియె—అన్నప్రాణములు రెండునుజేరి బ్రహ్మమని తెలిసికొన్నవాఁడే కృతకృత్యుఁడు. అట్టివానికి మేలుచేసినప్పటికిని వానికి మహిమగలుగనేరదు. కీడుచేసినప్పటికిని వానిని బాధింపదు.

తండ్రి—ఓప్రాతృదా! అట్లనవలదు. ఈరెంటినిఁజేరి యెవఁడు పరమగతినిఁ బొందియున్నాఁడు? ఎవఁడును లేఁడు. ఇట్లెలుంగుటవలనఁ బ్రయోజనమేమి? అనఁగా—అన్నమనునది “వి”. ఇందు సమస్తభూతములునున్నవి. మఱియు సమస్తభూతములును జీవించియున్నవి. ప్రాణమనునది“రమ్” దీనియందు సకలభూతములును రమించుచున్నవి. మఱియు తమతమవ్యాపారముల నొనర్చుచు ఆనందించుచున్నవి. ఇట్లు తెలిసికొను వానియందు సమస్తభూతములును సంతోషమొందుచున్నవి.

---

## త్రయోదశబ్రాహ్మణము.

1. ఉక్థమును (ఒకయాగమునందుఁ జెప్పఁబడు శస్త్రమనెడిమంత్రమును)ప్రాణముగా ఉపాసింపవలయును. ఏలన, అది సమస్తమును ఊర్ధ్వ

ముగాఁ బోవునట్లు చేయుచున్నది. ఇట్లు తెలిసికొనువానికి ధీరుఁడగు పుత్త్రుఁడు పుట్టును. ఇది ప్రత్యక్ష(దృష్ట)ఫలము. అదృష్టఫల మేదనఁగా, ఆఉక్థముయొక్క సాయుజ్యపదవియు సాలోక్యపదవియు సిద్ధించును.

2. యజుస్సును (యజుర్వేదమంత్రమును) ప్రాణముగా ఉపాసింపవలయును. ప్రాణమునందు సకల భూతములును జేరుచున్నవి. ప్రాణము లేనియెడల ఒక్కభూతము వేఱొక్కభూతముతోఁ జేగుటకు సామర్థ్యముండదు. ఇట్లు తెలిసికొన్న వాఁడు శ్రేష్ఠుఁడై యుండును. మఱియు యజుస్సుయొక్క సాయుజ్య, సాలోక్యపదవులను బొందును.

3. సామమును (సామవేదమంత్రమును) ప్రాణముగా ఉపాసింపవలయును. సామమనఁగా ప్రాణము; సకలభూతములను చేర్చియుంచుచున్నది. ఇట్లు తెలిసికొన్న వాఁడు శ్రేష్ఠుఁడగును. సామవేదముయొక్క సాయుజ్యసాలోక్యపదవులను బడయఁగలఁడు.

4. క్షత్త్రమును ప్రాణముగా ఉపాసింపవలయును. ఏలన, ప్రాణము, శరీరమునందలిగాయము మొదలగువానికి మాంసమును వృద్ధిచేసి రక్షించుచున్నది; కావున ఉపాసింపవలయును. ఇట్లు తెలిసికొన్న వాఁడు, వేఱే దేనిచేతను రక్షింపఁబడుటకు సాధ్యముకాని ప్రాణమును రక్షించికొనుటకుఁ దగినవాఁ డగుచున్నాఁడు. క్షత్త్రముయొక్క సాయుజ్యసాలోక్యమును పొందుచున్నాడు.

---

## చతుర్దశబ్రాహ్మణము.

1. (సకలఛందస్సులకును ఆత్మయు, ప్రాణమును, బ్రాహ్మణత్వము నొసఁగునదియు నగుగాయత్త్ర్యుపాసనము చెప్పఁబడుచున్నది.)

భూమి, అంతరిక్షమ్, ద్యౌః, అను నీయెనిమిది యక్షరములును గాయత్త్రియొక్క మొదటిపాదము; ఇది మూఁడులోకములకును ఆత్మగా నున్నది. ఇట్లెఱింగినవాఁడు మూఁడులోకములందుండు వానినంతయు జయించినవాఁడగును.

2. ఋచః, యజూంషి, సామాని, అను నీయెనిమిదక్షరములును గాయత్త్రియొక్క రెండవపాదము; ఇది వేదత్రయాత్మకమైయున్నది. ఇట్లు తెలిసికొన్న వాఁడు ఋగ్యజుస్సామములందలిసర్వమును తెలిసినవాఁ డగుచున్నాఁడు.

3. ప్రాణ, అపాన, వ్యాన అను నీయెనిమిదియక్షరములును గాయత్రియొక్క మూఁడవపాదము; ఇది పైనిచెప్పినమూఁటియొక్క ప్రాణాత్మకమైయున్నది. ఇట్లు తెలిసికొన్నవాఁడు మీఁదఁగనఁబడుచిన ప్రాణములు గల సకలజీవరాసులను జయించుచున్నాఁడు.

ఈ తపించుచుండు పరోరజస్సు గాయత్రియొక్క నాలవపాదము. ఇతఁడు ఆదిత్యమండలాంతర్గతుఁడగు పురుషుఁడు. రజోగుణముచేఁ గల్గిన సకలలోకములను తపింపఁజేయువాఁడు. ఇట్లు తెలిసికొనినవాఁడు సంపద చేతను, యశస్సుచేతను ప్రసిద్ధినొందును.

4. ఇట్టి త్రైలోక్య త్రైవిద్యప్రాణరక్షకమును, మూఁడుపాదములు గలదియునగు గాయత్రి, నాలవపాదమైన పరోరజస్సునందు ప్రతిష్ఠితమైయున్నది. ఇట్లు నాలుగుపాదములుగల గాయత్రి సత్యమునందు ప్రతిష్ఠితమైయున్నది. సత్యమనఁగా నేత్రము; ఎట్లన, ఒకానొక చోట నేదో జగడమాడుచుండిన విషయమునుగూర్చియిర్వురుపురుషులు మాటలాడుచుఁ బోవుచుండిరి. వారిలో నొకఁడు "నేనుజూచితిని" అనియు, వేఱొకఁడు "నేనువింటిని" అనియు పల్కుచు పోవునపుడు, మనము "చూచితిని" అనిచెప్పినవానిమాటయందే నమ్మక ముంచెదము. కాఁబట్టి నేత్రము సత్యము. ఆసత్యము ప్రాణమునందు, లేక బలమునందు ప్రతిష్ఠితమైయున్నది. కావున ప్రాణము సత్యముకంటె శ్రేష్ఠము. ఆప్రాణము ఆత్మయందు ప్రతిష్ఠితమైయున్నది. ఆగాయత్రి (గయ) ప్రాణములను రక్షించుచున్నది. అనఁగా వాగాదీంద్రియములు. ఇందువలన దీనికి గాయత్రి అని పేరు గలిగెను. అట్టి సవితృదేవతాత్మకమైన గాయత్రిని ఆచార్యుఁడు శిష్యున కుపదేశించుచున్నాఁడు. ఏశిష్యుఁడు గాయత్ర్యుపదేశము నొందినవాఁడో, వానిప్రాణములను ఆసాక్షాత్పాపిణుఁ డగుజగదాత్మ నరకాదులలోఁ బడనీక రక్షించుచున్నాఁడు.

5. ఈగాయత్రిని కొందఱు వాక్, సరస్వతి అని చెప్పెదరు. ఈగాయత్రినిఁ దెలిసికొన్నవాఁడు ఎంతదానమును గైకొన్నప్పటికిని, అది ఆగాయత్రియొక్క ఒక్కపాదమునకు సమానముకాదు (అనఁగా దానము పుచ్చుకొన్నవానికి దోషములేదని భావము.)

6. గాయత్రినిఁ దెలిసికొన్నవాఁడుమూఁడులోకములనుదానము పుచ్చుకొన్నచో అది ఒకపాదమునకు సమానమైయుండును. అనఁగా

మొదటిపాదముఫలము అనుభవింపఁబడినది; ప్రతిగ్రహదోషము లేద మూఁడు వేదములవిద్యను దానముపుచ్చుకొనవచ్చును. అది రెండ పాదముయొక్క ఫలము; ప్రతిగ్రహదోషము లేదు. సకలప్రాణులన దానముపుచ్చుకొనవచ్చును. అది మూఁడవపాదముయొక్క ఫలము ప్రతిగ్రహదోషము లేదు. నాలవపాదముయొక్క విషయమునంద నైకొన్న దానముచే నేదోషమును లేదు. గాయత్రి యిట్టిమహిమగలది

7. ఆగాయత్రి ఉపస్థానము చెప్పఁబడుచున్నది. ఓగాయత్రీ! నీవు ఒకటి, రెండు, మూఁడు, నాలుగు పదములుగలదానవై యున్నావు. (ఇది సోపాధికముగాఁ జెప్పఁబడినది). (నిరుపాధికమైనప్పుడు) ఏపదమును లేకయున్న దానవు. నీకు నమస్కారము చేయుచున్నాఁడను. నీనాలవ పాదమునకు నమస్కారము. నీకొఱకు నాశత్రువు కార్యసిద్ధినొందక యుండునుగాక. నాఅభీష్టముల నన్నిటిని ప్రసాదింపుము.

8. ఈవిషయమై జనకుఁడు బుడిలునిఁజూచి యిట్లనియె.—జనకుఁడు—నీవు గాయత్రిని తెలిసికొంటినని చెప్పుచున్నావుకదా? దానము పుచ్చుకొన్నదోషముచేత ఏనుఁగై కష్టమొందెదవు. బుడిలుఁడు—నేను గాయత్రీముఖము నెఱుంగలేదు. కావుననే కష్టపడుచున్నాఁడను.

జనకుఁడు—గాయత్రీముఖము అగ్ని; దానిని తెలిసికొన్నవాని పాపములన్నియు దహింపఁబడును; అట్లెఱింగినవాఁడు పరిశుద్ధుఁడును, అజరుఁడును, అమృతుఁడును అగుచున్నాఁడు.

---

## పంచదశ బ్రాహ్మణము.

1. మరణకాలమునందు జ్ఞాన కర్మములు అను నీరెంటిని అవలంబించుచుండువారు సూర్యుని ప్రార్థింపవలసినక్రమము.

ఓపూషన్! (పోషించువాఁడా!) జ్యోతిర్మయమండలముచే నావరింపఁబడినదియు సత్యమనెడిపేరుగలదియు నగు బ్రహ్మముయొక్క ముఖ్యస్వరూపమును జూచునిమిత్తమై, సత్యమేధర్మమనితలంచియుండు నాకొఱకు ఆవరణమును తొలఁగింపుము. ఓపూషన్! సర్వమునుగాంచెడిముఖ్యనేత్రమా! సమస్తమును నీలో నిమిడ్చికొనియుండువాఁడా! రసములను లెస్సఁగా గ్రహించువాఁడా! ప్రజాపతిపుత్త్రుఁడా! నీస్వరూపమును నేను జూచుకొఱకు నీకిరణములను గ్రహించికొనుము. తేజస్సును తక్కువ

చేసికొనుము. కల్యాణతమమగు నీరూపమును నేను జూచెదను. వ్యాహృతులను అవయవములుగాఁ గలిగినపురుషునివలె నేను నయ్యెదను. నామరణానంతరము నాప్రాణవాయువు బాహ్యవాయువుతోఁ గలిసి పోవునుగాక. అట్లే బయలువడిన దేవతలును ఆ యా దేవతలతోఁ గలిసి పోవునుగాక. ఈదేహము సంస్కరింపఁబడి భస్మమైపోయినమీఁద పృథ్వితోఁ గలిసిపోవునుగాక.

(మనస్సునందుండు సంకల్పభూతమైనఅగ్నిని దిగువ నుదహరించినప్రకారము ప్రార్థింపవలయును.)

ఓమ్, (ఓంకారశబ్దవాచ్యుఁడా!) మనోమయస్వరూపుఁడా! నాచేఁ జేయంబడిన కార్యములను ఆలోచించి చూడుము! యోజించి చూడుము! తలంచిచూడుము! మరణకాలమునందు నిన్నుస్మరించెదను. నీ వనుగ్రహింపుము. ఓఅగ్నీ! కర్మఫలమును బొందుటకై మమ్ము సన్మార్గమునందుఁ బ్రవేశింపఁజేయుము. సకలప్రాణులప్రజ్ఞల నెఱింగినదేవుఁడా! మాక్రూరపాపములను నశింపఁజేయుము. నీకు అనేక నమస్కారక్రియల చేత పరిచర్యచేసెదము.

---

# షష్ఠాధ్యాయము.

## ప్రథమబ్రాహ్మణము

1. ఓమ్. ఎవఁడు జ్యేష్ఠమును శ్రేష్ఠమునగువస్తువును తెలిసికొనుచున్నాఁడో, వాఁడు తనతోఁజేరినవారిలో జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడునై యుండును. అట్టివస్తువు ప్రాణము. (ప్రాణమును జ్యేష్ఠమనుటకుఁ గారణమేమనఁగా—చక్షురాదీంద్రియములకంటెను ప్రాణము మొదటిది; ఆదియందు ప్రాణము లేనియెడల శుక్లశోణితములకు పిండత్వము సిద్ధింపదు కావున ప్రాణమే మొదటిది.) జ్యేష్ఠత్వమును శ్రేష్ఠత్వమును కలుగవలయునని కోరి ప్రాణమును ఉపాసించువానికంటెను, అట్లెఱింగినవాఁడు శ్రేష్ఠుఁడు. (ఇందుచేత శ్రేష్ఠత్వమును సిద్ధించినది.)

2. ఎవఁడువసిష్ఠవస్తువును దెలిసికొనుచున్నాఁడో, వాఁడు తనతోఁ జేరినవారలలో వసిష్ఠుఁడై యుండును. వసిష్ఠమనఁగా వాక్కు. (వసిష్ఠుఁ

డనఁగా—తనతోఁ జేరిన వారిని వసించునట్లుచేయువాఁడు.) అట్లు కావలయుననికోరెడివారలలో వసిష్ఠుఁడై యుండును.

3. ప్రతిష్ఠాగుణముగలదానిని తెలిసికొన్నవాఁడు, ఎల్లచోటులందును, ఎల్లకాలమునందును సముఁడై యుండును. ప్రతిష్ఠయనఁగా చక్షుస్సు (నేత్రము). కంటితోనేగదా మంచిమార్గమును, చెడ్డమార్గమును తెలిసికొనుచున్నాము.

4. సంపద్గుణముగల వస్తువు నెఱింగినవాఁడు, కోరినదానినంతటినిఁ బొందుచున్నాఁడు. సంపదయనఁగా శ్రోత్రము. చెవులతోనే గదా వేదములను విని, అందుఁ జెప్పఁబడినకర్మముల నొనర్పవచ్చును. ఆకర్మములచే కోరినదానినంతయుఁ బొందుచున్నాఁడు.

5. ఆయతన (ఆశ్రయ) మును తెలిసికొనినవాఁడు, తనతోఁ జేరినవారికిని, ఇతరులకును ఆశ్రయమై యుండును. (అనఁగా అందఱను రక్షించు శక్తిగలవాఁడై యుండును.) ఆయతనమనఁగా మనస్సు. (మనస్సు సకలేంద్రియములకును, విషయములకు ఆశ్రయము. మనస్సు లేనిచో ఇంద్రియవృత్తి యుండదు.)

6. ప్రజాపతినిఁ దెలిసికొన్నవాఁడు ప్రజలచేతను, పశువులచేతను సమృద్ధిగలవాఁడై యుండును. ప్రజాపతి యనఁగా రేతస్సు (రేతస్సువలన ప్రజలు కలిగెదరు).

7. ఈప్రాణము లన్నియు (వాగాదీంద్రియములన్నియు) "నేను పెద్ద", "నేనుపెద్ద" అని వివదించి బ్రహ్మము (ప్రజాపతి) కడ కేఁగి తమలో వసిష్ఠుఁడు (శ్రేష్ఠుఁడు) ఎవఁడని యడిగిరి. అపుడు ప్రజాపతి— "మీలో ఎవఁ డీశరీరమును విడిచిపోయినయెడల శరీరము చెడిపోవునో వాఁడే పెద్ద" అనెను.

8. అంత వాగింద్రియము బయలుదేరిపోయి ఒకసంవత్సరముండి, తర్వాత వచ్చి, "మీరు నేనులేకఎటులు బ్రతికియుంటిరి?" అని తక్కినయింద్రియములఁజూచి యడిగెను. అవి—లోకమునం దెట్లు మూఁగవాఁడు వాక్కుతో సంభాషింపక యుండినప్పటికిని, నేత్రములతోఁజూచుచు, చెవులతోవినుచు, మనస్సుతోఁ దలంచుచు, రేతస్సుచే ప్రజలనుసృష్టించుచు, ప్రాణముతో బ్రదుకుచు నుండునో అట్లుంటిమి అనిచెప్పినవి. పిమ్మట వాక్కు శరీరమునందు ప్రవేశించెను.

9. తర్వాత చక్షుస్సు బయలువెడలిపోయెను. (తక్కినవన్నియు పైనిచెప్పినయట్లే) గ్రుడ్డివాఁడు బ్రదికియుండునట్లు.

10. శ్రోత్రము— (మీఁదఁజెప్పినట్లు) చెవిటివాఁడు జీవించి యుండునట్లు.

11. మనస్సు—(పై రీతిగానే) మూఢుఁడు జీవించియుండునట్లు.

12. రేతస్సు—(పై విధమున) నపుంసకుఁడు బ్రదికియుండునట్లు.

13. తర్వాత, సింధుదేశపు పెద్దగుఱ్ఱము మెట్టు కాళ్లకు కట్టియుండు దారములను మేకులతోఁగూడ పెకలించుకొని పసుగెత్తునో అట్లు ప్రాణము తక్కినయింద్రియములతోఁగూడ లాగికొనిపోవుటకు ప్రారంభింపఁగా, వాగాదీంద్రియములు ప్రాణమునుజూచి "అట్లుపోవద్దు; నీవు లేక మేము జీవించియుండ లేము" అనినవి.

ప్రాణము—అట్లయినచో శ్రేష్ఠుఁడైననాకు కానుక (బలి) నిప్పింపుఁడు.

వాగాదులు—అటులే యిచ్చెదము.

14. బలియిచ్చుటకై వాగాదు లిట్లనినవి.

వాక్కు—నావసిష్ఠత్వమును నీవు గైకొనుము.

చక్షుస్సు—నా ప్రతిష్ఠత్వమును నీవు గ్రహింపుము.

మనస్సు—నాఆయతనమును నీవు పుచ్చుకొనుము.

రేతస్సు—నా ప్రజాపతిత్వమును నీవు తీసికొనుము.

(మరలప్రాణము—)నాకు అన్న మేది? వాసస్థానమేది?

వాగాదులు—అశ్వాదులు, క్రిమికీటాదులు, పశుపక్ష్యాదులు, ఇంకను భూమియందుఁగల సకలప్రాణులును భుజించుఅన్న మేదేదిగలదో, అదియంతయు నీయొక్క అన్న మే; అనినవి.

వాగాదులు—జలము నీకు వాసస్థానము.

ఇట్లు ప్రాణమునకు అన్నమిది యని తెలిసికొన్నవాఁడు భక్షింపఁదగనివానిని భక్షింపఁగూడదు. మఱియు అట్టి అభక్ష్యవస్తువులను ప్రతిగ్రహించుటయుఁ గూడదు. కావున విద్వాంసులును శ్రోత్రియులు నగుబ్రాహ్మణులు భోజనమునకు ముందును, వెనుకను ఆచమనము చేసెదరు. (వేదోక్తాచమనమువలన) ప్రాణమునకు వస్త్రమొసంగెడిభావ

మగుచున్నది. (స్మృత్యుక్తాచమనముచలన దురన్నభక్షణాదోషపరిహార
మగుచున్నది. )

## ద్వితీయబ్రాహ్మణము.

ఇది ఖిలాధికారముగాన, మున్ను చెప్పఁబడనివి చెప్పఁబడుచున్నవి. జ్ఞానసహితకర్మము సద్గతినొసంగును అని మున్ను చెప్పఁబడినది. ఇదివఱకు కేవలకర్మముచే పితృలోకమును, జ్ఞానసహితకర్మముచే దేవలోకమును సిద్ధించుననియుఁ జెప్పఁబడి యుండినప్పటికిని, యిప్పుడు వాని వివరణము, హేతువు, ఫలము, చెప్పఁబడును.

1. విద్వాంసుఁడగు శ్వేతకేతు వను ఆరుణేయుఁడు పాంచాల దేశమందలి విద్వత్సభకుఁ బోయి యుండెను. (ఆవిద్వాంసులను జయించెను.) పిమ్మట ప్రవాహణుఁడను జైబలిరాజుకడకుఁ బోయి, ఆ సంస్థాన విద్వాంసులను జయింప నిచ్ఛయించెను. ఆరాజు (ఈతనివిద్యాదర్పమును మునుపే తెలిసికొన్నవాఁడై, ఇతనిని లోఁగదీయుతలంపుతో) కుమారా-రా-రా-అని దీర్ఘముగా సంబోధించెను. దానికి శ్వేతకేతువు,భో-ఓ-ఓ-ఓ-అని దీర్ఘముగా ప్రత్యుత్తరమొసంగెను.

జైబలిరాజు—తండ్రిచే పంపఁగా వచ్చినాఁడవా యేమి?

శ్వేతకేతువు—ఔను. సంశయముల నడుగవచ్చును.

2. రాజుప్రశ్నలు—

౧ గతించువారును, ఒక్క నాడీమార్గముగా పోవువారును అగు ఈప్రజలలో కొంద ఱొకమార్గముగను, కొందఱు మఱొకమార్గముగను, ఇట్లు వ్యత్యాసముగాఁ బోవుచున్నారు కదా? ఆవిషయము నీకుఁ దెలియునా?

శ్వేతకేతువు—తెలియదు.

౨. రాజు—అట్లు పోవువారు ఎట్లు మరల ఈలోకమునకువచ్చెదరని తెలియునా ?

శ్వేతకేతువు—తెలియదు.

3. ఇట్లప్పుడప్పుడు మరణమునొందెడి అనేకులచేత ఆలోకము (ఊర్ధ్వలోకము) పూర్తికాలేదని తెలియునా?

శ్వేతకేతువు—తెలియదు.

౪. రాజు—ఎన్ని అహుతులొనర్చినయెడల జలము పురుషాకృతినొంది మాటలాడునో తెలియునా?

శ్వేతకేతువు—తెలియదు.

౫. రాజు—మనుష్యులకు గతించినమీఁద దేవయానమనియు, పితృయానమనియు రెండుమార్గములుగల వనియును, ఆమార్గముల ద్వారముగా అన్నియు పోవుచున్నవనియును, ఆమార్గములు మాత యగు ఈభూమికిని, పితయగు స్వర్గమునకును నడుమ నున్నవనియును (అనఁగా, ఇవి అండకపాలమునకు లోపలనుండు మార్గములు; ఆత్యంతిక అమృతత్వమును ఇచ్చెడిమార్గములు కావనియును) వినియున్నావుకదా? ఆమార్గముల ప్రతిపదమును, (అనఁగా) ఆమార్గములను పొందుటకు సాధనమును, (అనఁగా) ఏకర్మ మొనర్చినచో నివి సిద్ధించునో తెలియునా?

శ్వేతకేతువు—నీవడిగిన ప్రశ్నలలో దేనికిని ప్రత్యుత్తరము నాకుఁ దెలియదు.

3. పిమ్మట రాజు, శ్వేతకేతువును 'ఉండుఁడు' అనిచెప్పి సత్కరించెను. శ్వేతకేతువు, ఆసత్కారమును నిర్లక్ష్యముచేసి తనతండ్రి కడకుఁ జని కోపముతో—"మాకు ముందిట్లే అందఱకును ఉపదేశించితిరా?" అని యడిగెను.

పిత—నీ వేల ఇట్లు చింతించుచు అడుగుచున్నావు?

శ్వేతకేతువు—ఆపాడు జైబలిరాజు నన్ను అయిదుప్రశ్నల నడిగెను; వానిలో నొక్కదానికైనను బదులుచెప్పుటకు నాకుఁ దెలియలేదు. (నీయుపదేశముచే నా కేమిప్రయోజనము?)

పిత—ఆప్రశ్నలను జెప్పుము.

శ్వేతకేతువు—ఆఅయిదు ప్రశ్నలను జెప్పెను.

4. పిత—కుమారా! నాకుఁ దెలిసినదంతయు నీకు బోధించినాఁడను. (ఈప్రశ్నలకు ఉత్తరము నాకుఁదెలియదు.) కావున, మన మిర్వురమును ఆరాజునొద్దకుఁబోయి, అడుగుదము.

శ్వేతకేతువు—నీవు పొమ్ము. (నే నతనిముఖమును జూడను.)

పిమ్మట శ్వేతకేతువుతండ్రియగు ఆరుణి యనుగౌతముఁడు రాజు కడకుం జనఁగా, రాజు మిక్కిలి గౌరవించి "ఇంకను వలసినదాని నడిగిన నిచ్చెదను" అనెను.

5. ఆరుణి—ఇచ్చెద నని చెప్పినావుకదా! మాట మరలింపఁ దగదు. నాకుమారుని అడిగిన అయిదుప్రశ్నలకును ఉత్తరము చెప్ప వలయును.

6. రాజు—ఇవి దేవసంబంధమైనవి; వీనినడుగవలదు. మనుష్య సంబంధమైనవాని నడుగుము.

7. ఆరుణి—నాకు బంగారము, పశువులు, గుఱ్ఱములు, దాసీజనము, పరివారము, ఇవి విశేషముగా నున్నవి. అవి నాకు అక్కఱలేదు. నేను వానికొఱకు రాలేదు. నే నడిగినదానిని చెప్పుము.

రాజు—అట్లయిన శాస్త్రప్రకారముగ (గురుశిష్యక్రమముగా) నన్ను అడుగవలసినది.

ఆరుణి—నీవు గురుఁడవు; నేను శిష్యుఁడను; ఉపదేశింపుము. అని చెప్పి, రాజును గోరెను (అడిగెను).

8. రాజు—ఓగౌతమ! కోపింపకుము! నాతాతలయెడల నీతాత యెట్టి ప్రీతినుంచియుండెనో, అట్టి ప్రీతిని నీవు నాయందుంచవలయును. ఇపుడు నీకు నేనుఉపదేశించువిద్యను పూర్వము ఏబ్రాహ్మణునకును జెప్ప లేదు. తెలియనే తెలియదు. ఇది క్షత్రియులకుమాత్రమే పరంపరగాఁ దెలియును. అట్టిదానిని నేను నీకుఁ జెప్పెదను. నీకుఁ జెప్పఁగూడదని యెవరుగాని చెప్పవచ్చునా!

9. రాజు—ఆలోకము (ద్యులోకము, స్వర్గలోకము, ఆకాశలోకము) అగ్ని. (ఆలోకమును అగ్నియని భావింపవలయును.) దానికి ఆదిత్యుఁడు సమిత్తు, దానికిరణములు పొగ, పగలు జ్వాల, దిక్కులు నిప్పు, విదిక్కులు విస్ఫులింగములు; ఇట్టి అగ్నియందు ఇంద్రాదిదేవతలు శ్రద్ధను(జలమును)హోమముచేసెదరు. అందుండి సోమరాజు (చంద్రుఁడు) కలుగుచున్నాఁడు.

(ఈలోకమునం దొకకల్పమునందు జనులుచేయునట్టి అగ్నిహోత్రాది కర్మములు దానిసాధనములతో సూక్ష్మరూపమై, అపూర్వము, అదృష్టము అనుపేరుగలదై ఆకల్పప్రళయకాలమునందు పరమైనఆత్మతోఁ జేరి

యున్నది. అట్టికర్మము మఱుకల్పముయొక్క సృష్ట్యారంభకాలమునందు ఆయాకర్మమునకుఁ దగినట్లు పరిణామమును బొందుచున్నది. కావున సకల ప్రపంచమును అగ్నిహోత్రాహుత్యపూర్వవిపరిణామాత్మకముగా నున్నదని ఆహుతులను స్తోత్రముచేయనెంచి, లోకప్రత్యుత్థాభిదములైన యీయా ఉపదార్థములు గూర్చి కర్మకాండమునందు విస్తరముగాఁ జెప్పఁబడియున్నవి. ఈజ్ఞానకాండమునందు కర్మచేసెడి కర్తయొక్క కర్మఫల విషయమునందు ఉత్తరమార్గమొందుటకు సాధనమైన ద్యులోకాగ్ని మొదలగుపంచాగ్నులదర్శనము (జ్ఞానము) చెప్పఁబడుచున్నది. దేవతలెవరనఁగా-మనఆత్మసంబంధమైన ప్రాణములే; ఈలోకమునందు వారే కర్మనుచేయువారుగను, హోతలుగను నున్నారు. వారే ఆలోకమునందు దేవత్వమునుబొంది ఇంద్రాదులైయున్నారు. వారే ద్యులోకాగ్నియందు ఫలానుభవముకొఱకు హోమాదులొనర్చువారు. వారే ఆఫలము ననుభవించుచున్నారు. హవిస్సు ఏదనఁగా—హోమము చేయునట్టి క్షీరాదిద్రవ్యము. అది అగ్నిచే భక్షింపఁబడి సూక్ష్మరూపమొంది యజమానుఁడగు కర్తతోఁ గూడ ఇచ్చటనుండి ధూమాదిక్రమముగా అంతరిక్షమునకుఁ బోవుచున్నది. ఆచటనుండి ద్యులోకమునకుఁ బోవుచున్నది. అది సూక్ష్మజలమైయున్నది. దానికి 'శ్రద్ధ' అనిపేరు. ఆసూక్ష్మజలము సోమమండలమును జేరి కర్తకు వేఱుశరీరమును గల్గుఁజేయుచున్నది. కావున, జలము కర్మకు ముఖ్యమైనది. అయినను, తక్కిన భూతములతో పనిలేదా? అనఁగా, జలము అధికముగా కావలసినందున అది ముఖ్యమని చెప్పఁబడెను. కర్మముచేత శరీరముకలుగుచున్నది. కర్మమునకు జల మావశ్యకమైనది. కావున జలము పురుషవాచకముగా వ్యపదేశింపఁబడినది.

ద్యులోకాగ్నియనఁగా—అగ్నిలక్షణ మిట్టిదని చెప్పుటకై "ఆదిత్యుఁడు—సమిత్" అను నీ మొదలగువానిచే వర్ణింపఁబడినది. ఇట్టి ద్యులోకాగ్నియందు దేవశబ్దవాచ్యములగు ప్రాణములు శ్రద్ధాశబ్దవాచ్యమైన కర్మాహుతియగు అపూర్వమనెడిపేరుగల సూక్ష్మకర్మమును హోమము చేయుచున్నాఁడు. (అనఁగా ప్రాణములుచేయుచున్నవని భావము.) ఈలోకమునందు వేదోక్తకర్మ మొనర్చినవాని ప్రాణములు శరీరపతనానంతరము, వాఁడొనర్చినకర్మముతో ద్యులోకమునకుఁ

బోవుచున్నవి. ఆకర్మమును ద్యులోకమునం దుంచుచున్నాఁడు; దానిచే ద్యులోకాగ్నియందు హోమము నొనర్చినట్లు చెప్పఁబడినది. మఱియు ప్రాణములు కర్మతోఁగూడి వేఱే శరీరమును బొందుటకై చంద్రలోక మునకుఁ బోవుచున్నవి. అనఁగా ఆమండలమగుచున్నవి. ఇందువలన సోమరాజు కలిగినాఁ డని చెప్పఁబడుచున్నది.)

10. పర్జన్యుఁడు (వర్షాభిమానిదేవతయగు ఇంద్రుఁడు) అగ్ని (ద్వితీయాగ్ని). దీనికి సంవత్సరము (కాలము)-సమిత్తు, మేఘములు-పొగ. మెఱుము-జ్వాల. ఉఱుము- నిప్పు. ఉఱుములు - విస్ఫులింగ ములు. ఈఅగ్నియందు దేవతలు (ప్రాణములు) సోమరాజును హోమము చేసెదరు. అందుండి వర్షము కలుగుచున్నది (చంద్రునియందుండు జలము, సూర్యకిరణములచే ఆకర్షింపఁబడి మేఘములై వానకురియుచున్నది. అనగా పైనిచెప్పినకర్మపరిపాకము, ప్రాణములతోఁగూడ వర్షించుచున్నది.)

11. ఈభూలోకము తృతీయాగ్ని. భూమి-సమిత్తు, పార్థివాగ్ని-ధూమము, రాత్రి జ్వాల, చంద్రుఁడు-నిప్పు, నక్షత్రములు-విస్ఫులింగ ములు, ఈఅగ్నియందు దేవతలు (ప్రాణములు) వర్షమును హోమము చేసెదరు. అందుండి అన్నము కలుగుచున్నది. (వర్షమువలన ధాన్యాదులు కలుగుటంబట్టి అన్నము లభించుచున్నది. పైనిచెప్పిన కర్మపరిపాకము ప్రాణముతో అన్నమగుచున్నది.)

12. పురుషుఁడు (మనుష్యుఁడు) చతుర్థాగ్ని. వాని తెఱవఁబడిన నోరు-సమిత్తు, ప్రాణము-ధూమము, మాటలు-జ్వాల, నేత్రములు-అగ్ని, శ్రోత్రములు-విస్ఫులింగములు; ఈయగ్నియందు దేవతలు (ప్రాణ ములు) అన్నమును హోమముచేయుచున్నారు. అందువలన రేతస్సు కలుగుచున్నది. (అనఁగా పైనిచెప్పినకర్మపరిపాకము ప్రాణముతోఁగూడ రేతస్సగుచున్నది.)

13. స్త్రీపంచమాగ్ని. ఉపస్థము-సమిత్తు, వెండ్రుకలు - ధూమము, యోని-జ్వాల, మైథునవ్యాపారము-నిప్పు, అందువలన గలుగుఆనందము-విస్ఫులింగములు; ఈయగ్నియందు దేవతలు (ప్రాణములు) రేతస్సును హోమముచేసెదరు. అందువలన పురుషుఁడు కలుగుచున్నాఁడు. ఇట్లు పుట్టినవాఁడు భూమియందు వాని ఆయుఃపర్యంతము జీవించియున్నాఁడు. వాఁడు గతించునప్పుడు జరుగునది యింకఁ జెప్పఁబడును.

14. (నాలుగు ప్రశ్నలకు ఉత్తరము చెప్పఁబడినది, అనఁగా, ఐదు ఆహుతులైనమీఁద జలము పురుషాకృతి నొందుచున్నదని చెప్పఁబడినది.) శరీరపతనానంతరము శవమును దహించుటకై కొనిపోయెదరు. [ఋత్విక్కులై పుత్త్రాదులు వానిని (శవమును) అగ్నియందు హోమము చేయుటకు శ్మశానమునకుఁ గొనిపోయెదరు.] ఆయగ్ని నిజాగ్నియే. (మున్ను చెప్పినట్లు కల్పితాగ్ని కాదు.) అట్లే ధూమము, జ్వాల, అంగారము, విస్ఫులింగము, ఇవి నిజమైనవి. నిజాగ్నియందే పురుషుని హోమము చేసెదరు. అందుండి పురుషుఁడు ప్రకాశముగలవాఁ డగుచున్నాఁడు.

15. (ఇపుడు మొదటి ప్రశ్నమునకు ప్రత్యుత్తరము చెప్పఁబడుచున్నది.) ఇట్లు పంచాగ్నివిద్యను తెలిసికొనినగృహస్థులును, శ్రద్ధతో సత్యమైన బ్రహ్మమును ఉపాసించువానప్రస్థులును, సన్న్యాసులును, గతించిన మీఁద అర్చిరభిమానదేవతను పొందెదరు, (అనఁగా జ్యోతిస్స్వరూపులయ్యెదరు.) పిమ్మట ఆయర్చిరభిమానదేవతచే వహింపఁబడి అహర్దేవతను పొందెదరు. ఆదేవతచే వహింపఁబడి క్రమముగా శుక్లపక్షము, ఉత్తరాయణము, దేవలోకము, ఆదిత్యమండలము, విద్యుత్తు అను నీదేవతలను వరుసగా పొందుచున్నారు. ఆమీఁద మనస్సుచే బ్రహ్మచే సృష్టింపఁబడిన ఒకపురుషునివలన బ్రహ్మలోకమునకుఁ గొంపోవఁబడెదరు. ఆబ్రహ్మలోకమందు ఉత్కృష్టులుగా చాలకాలము వసించెదరు వారికి పునరావృత్తి (పునర్జన్మము) లేదు. (కొందఱు కల్పాంతమందు పునరావృత్తికలదని చెప్పెదరు.)

16. ఎవరు యజ్ఞ దాన తపో వ్రతాదులచే లోకములను జయించుచున్నారో (కేవలకర్మఠులు) వారు, గతించినమీఁద ధూమదేవతను పొందుచున్నారు. అందుండి రాత్రిదేవతను, అందుండి కృష్ణపక్షమును, తర్వాత దక్షిణాయనము, పితృలోకమును, (చంద్రలోకమును వరుసగా పొందెదరు. ఈలోకమునందు యాగమునందు "ఆప్యాయస్వ" "అపక్షీయస్వ" అని ఋత్విక్కులుపఠించి భక్షించునట్లు, కేవలకర్ములను దేవతలు భక్షించెదరు. (యజమానులు సేవకులయొద్ద పనిపుచ్చుకొనునట్లు దేవతలు కర్ములచే పనిపుచ్చుకొనెదరు. వారివారిపనికి (కర్మకు) దగినఫలమొసంగెదరు.) వారివారికర్మఫలము ముగిసినమీఁద ఆకాశమును జేరెదరు. ఎట్లన, మున్ను చెప్పఁబడిన ద్యులోకాగ్నియందు హోమము చేయంబడిన శ్రద్ధ

యనుజలములు సోమాకారముగా పరిణమించి కర్ములకు కర్మఫలాను భవముకొఱకు జలమయశరీరమును కలుగఁజేయుచున్నవి. ఆజలములు, కర్మతోఁగూడినజీవులు, కర్మక్షయానంతరము సూక్ష్మాకాశభూతము లగుచున్నవి. పిమ్మట వాయువును, పిదప వర్షమును జేరి భూమియందు వర్షించుచున్నవి. భూమినుండి ధాన్యమై అన్నముగా పరిణమించు చున్నవి. ఆయన్నమును పురుషుఁడు భుజింపఁగా అందుండి రేతస్సు అగు చున్నది. ఆరేతస్సు స్త్రీగర్భము నందుఁ జేరి మరలపుట్టుచున్నాఁడు. ఇట్లుపుట్టి మరల లోకములను బొందుటకై కర్మలొనర్చుచున్నాఁడు. గతించినమీఁద ధూమాదిమార్గముగా చంద్రలోకమును బొందు చున్నాఁడు. ఇట్లు బావిరాట్నపు చక్రమువలె పుట్టుచు చచ్చుచు, పోవుచు వచ్చుచు తిరుగుచున్నాఁడు. (బ్రహ్మజ్ఞానము కలుగునంతద్వాఁక జననమరణములు కలుగుచుండును.) కేవలకర్ములు (ఆత్మజ్ఞానము లేనివారు) క్రిమికీటమశకపతఙ్గాదిజన్మముల నెత్తుచుందురు.

(ఇట్లు అయిదుప్రశ్నలను ఉత్తరము చెప్పఁబడినది. ఎట్లన, మొదటి దానికి ఉత్తరము—జ్ఞానులును కర్ములును అగ్నిసంస్కారమగు వఱకును ఒకేమార్గముగాఁబోయి, అచ్చటనుండి జ్ఞానులు ఉత్తరమార్గముగాఁ జనుటకొఱకు అర్చిస్సును, కర్ములు దక్షిణమార్గముగాఁబోవుటకు ధూమ మును బొందుచున్నారు. ఇట్లు మార్గములు వ్యత్యాసపడుచున్నవి.

రెండవదానికి ఉత్తరము—కర్ములు సోమలోకమందు ఫల మును భవించి, కర్మక్షయానంతరము సూక్ష్మభూతములై ఆకాశమును జేరి, అచ్చట నుండి వాయువు, వర్షము, అన్నము, రేతస్సు, అను నీక్రమముగా, (ఆరేతస్సు స్త్రీగర్భమునఁ జేరి) జన్మించెదరు.

మూఁడవదానికి ఉత్తరము—జ్ఞానులుగను, కర్ములుగను లేక (కేవలము పశుతుల్యులుగను) ఉండువారు గతించినమీఁద క్రిమికీటాది జన్మము లెత్తుటంబట్టి ఆలోకము మృతినొందినవారలచే పూర్తికాలేదు.

నాలవదానికి ఉత్తరము-1 ద్యులోకాగ్నియందు ఆహుతి; 2 పర్జ న్యాగ్నియందు ఆహుతి; 3 భూలోకాగ్నియందు ఆహుతి; 4 పురుషాగ్ని యందు ఆహుతి; 5 యోషాగ్నియందు ఆహుతి. ఇట్లు అయిదు ఆహుతులు చేసినమీఁద, జలము పురుషాకృతి నొందుచున్నది.

ఐదవదానికి ఉత్తరము—దేవయాన మగు ఉత్తరమార్గప్రతిపత్తి సాధనము—జ్ఞానసహితకర్మము. పితృయానమగు దక్షిణమార్గప్రతిపత్తిసాధనము—కేవల శాస్త్రోక్తకర్మము.)

---

## తృతీయబ్రాహ్మణము.

(కర్మప్రయోజనము చెప్పఁబడుచున్నది).

1. మహత్త్వమునుగోరువాఁడు మంథకర్మమును జేయవలయును. ఎట్లన, ఉత్తరాయణము శుక్లపక్షమునందొకపుణ్యదినంబునం దారంభించి, ఆదినము మొదలు పండ్రెండు దినములవఱకు ఉపసద్వ్రతముతో నుండి (ఉపసత్ =గోక్షీరముమాత్రము పుచ్చుకొనుట) మేడిమ్రానితోఁ జేయఁబడిన కంసము, లేక చమసు అనుయజ్ఞపాత్రమునందు సాధ్యమైనంత వఱకు మూలికలను, ఫలములను సేకరించి చక్కఁగాకడిగి, తర్వాత అగ్నిని ప్రజ్వలింపఁజేసి, దానిని దర్భతోఁజుట్టి, ఆజ్యమును శుద్ధిచేసి (కాచి వడియఁగట్టి), పురుషనక్షత్రదినమునందు "మంథ" మనెడి సర్వౌషధఫలేష్టిని చేయవలయును. (అనఁగా ఓషధులను ఫలములను మేడి (అత్తి) పాత్రమందుంచి నేయి, పెరుఁగు, పాలు మొదలగువానితోఁ దడిపి) "యావన్తో" అను నీమొదలగుమంత్రములచేత హోమముచేయవలసినది. (ఆమంత్రములయొక్క తాత్పర్యము. సకలాభీష్టముల నొసంగవలయునని, అగ్నిని ప్రార్థించుటయై యున్నది.)

2, 3. హోమక్రమము—ఆయా స్వాహాలనుజెప్పి హోమము చేసినతర్వాత, స్రుక్కునందు మిగిలియుండు నెయ్యి మొదలగు వానిని మంథము (మేడిమ్రానిపాత్రము) నందు విడువవలయును.

4. తర్వాత "భ్రమదసి" మొదలగు ఆ మంత్రములను పఠించి మంథమును తాఁకవలయును.

5. అనంతరము "ఆమంసి" మొదలగుమంత్రముల నుచ్చరించి ఆమంథమును మీఁదికెత్తవలయును.

6. తర్వాత మంథమునం దుండుదానిని నాలుగుమార్లు ఆచమనము చేయవలయును. (భుజించుక్రమ మెట్లనఁగా) "గాయత్రీ" మంత్రము మొదటిపాదమును, "మధుమతీ" మంత్రము మొదటిపాదమును జెప్పి

మొదటిఆచమనము చేయువలయును. ఇట్లేపైనిచెప్పినమంత్రములరెండవ పాదమునుజెప్పి రెండవ ఆచమనమును, ఇట్లు మూఁడవపాదమునుజెప్పి మూఁడవ ఆచమనమునుజేసి, గాయత్రియును, మధుమతియును మొదటి నుండి కడవఱకును పఠించినాలవ ఆచమనమును జేయవలయును. ఆపిమ్మట చేతులనుకడిగికొని అగ్నికి వెనుక, పూర్వాభిముఖముగా కూర్చుండవలసినది. మఱునాఁడుదయమున లేచి "దిశామ్" అనుమంత్రమును జెప్పి, ఆదిత్యో పస్థానము చేయవలయును. తర్వాత అగ్నికి వెనుకవై పునకూర్చుండివంశ మంత్రమును పఠింపవలసినది.

7-12. ఇట్టిమంథమును పుచ్చినకట్టెయందుంచినను అది లెస్సగా చిగిరించును. ఇట్లని ఉద్దాలకుఁడు వాజసనేయునకును, అతఁడు మధుకున కును, ఆయన చూలునకును, అతఁడు జనకునకును, ఆయన సత్యకాము నకును, అతఁడు తనశిష్యుల కనేకులకునుజెప్పెను. ఇట్లు గురుశిష్యక్రమ ముగాఁ జెప్పిరి. ఈ యుపదేశమును పుత్త్రుఁడు లేనివానికిని, శిష్యుఁడు లేనివానికినిఁ జెప్పఁగూడదు.

13. స్రవము, చమసము, ఇధ్మము, ఉపమన్థిని అను నీనాలుగు పాత్రములను మేడిమ్రానితోఁ జేయవలయును. అట్టిపాత్రలయందువడ్లు, యవలు, మినుములు, నువ్వులు, గోధుమలు, ఉలవలు, అనుములు, కొఱ్ఱలు, చిఱుసెనగలు, చిఱువడ్లు అను నీదశవిధధాన్యములను పిండి చేసి, దానిని తేనె, నేయి, పెరుఁగు వీనిని జేర్చి పిసికి, హోమముచేయ వలసినది. ఇట్లు చేసినవానికి కోరినకోర్కులన్నియు సిద్ధించును.

---

## చతుర్థబ్రాహ్మణము.

1. చరాచరములగు భూతములలో పృథ్వి సారమై యున్నది. దీనికంటె జలము సారము; జలముకంటె ఓషధులు సారము; వీనికంటె పుష్పములు సారము; వీనికంటె ఫలములు సారము; వీనికంటెపురుషుఁడు సారము; పురుషునికంటె రేతస్సు సారము.

2. ఈరేతస్సునకు ప్రతిష్ఠను కలుగఁజేయవలయునని ప్రజాపతి తలంచి స్త్రీని సృష్టించెను. ఆస్త్రీని క్రిందుగాఁ బరుండఁబెట్టినాఁడు. కావున, వీరారు స్త్రీని క్రిందుగ పరుండఁబెట్టుఁడు. తర్వాత ప్రజాపతి,

ఆస్త్రీ యోనియందు సోమలతనుదంచెడి ఱాతికిసమానమైన తనప్రజనేం ద్రియమునుుంచి నిండించెను. (సంయోగ మొనరించెను.)

3. (ఈమైథునక్రియ వాజపేయయాగముతో సమానము.ఎట్లన,) స్త్రీయొక్క ఉపస్థము యాగవేదిక, రోమములు దర్భలు, చర్మము సమిత్తు, వృషణములు యాగాధిష్ఠానఫలకములును, స్నానఫలకమును; ఇట్లెఱింగి మైథున మొనర్చువాఁడు వాజపేయయాగముచేయువాఁడుపోవునట్టిలోక మునకుఁబోవును.అతఁడుస్త్రీలయొక్క సుకృతములను అపహరించికొనును. ఇట్లెఱుంగకచేయునట్టి వారిసుకృతములను స్త్రీలు అపహరించికొనెదరు.

4,5. పైనిచెప్పినవిధముగాఉద్దాలకుఁడును, నాకుఁడును, కుమార హారీతుఁడును జెప్పియున్నారు. (ఎట్లన,)మీఁదఁజెప్పినప్రకారమెఱుంగక మైథునక్రియచేయువారు ఇంద్రియములు లేనివారును, సుకృతములేని వారును నై మరణించెదరు. (అనఁగా అట్టివారికి సద్గతిలేదనిభావము.)

(అధికకామముచే) జాగ్రత్కాలమునందుఁగాని, స్వప్నకాలము నందుఁగాని (స్త్రీభోగములేకయే) రేతస్సును విడుచువారు,ఆరేతస్సును తాఁకి, "యన్మే" అనుమంత్రమును జెప్పవలయును; తర్వాత "పునర్మా" అనుమంత్రమును జెప్పి బొటనవ్రేలితోను పవిత్రపువ్రేలితోను ఎత్తిరెండు నొసళ్లనడుమగాని, లేక స్తనములమధ్యగాని ఉంచవలయును.

(యన్మేమంత్రతాత్పర్యము—నాయొద్దనుండి బయలువడిన ఇంద్రి యము, దానికి మూలములగుపృథ్వి, ఓషధులు, జలము అనువీనితోఁ జేరునుగాక; మరల నన్నుఁబొందుగాక; దాని నిపుడు నేను చేతులతో నెత్తుచున్నాఁడను)

(పునర్మామంత్రతాత్పర్యము—మరలఇంద్రియమును, తేజస్సును, భాగ్యమును, అగ్నియు నన్నుఁ జేరునుగాక; యథాస్థానము ప్రవేశిం చునుగాక.)

6. జలమునందు తననీడనుజూచువాఁడు (తద్దోషనివృత్తికై) "మయితేజ" అనుమంత్రమును పఠింపవలయును. రజస్వలయైన మూఁడు రాత్రులకుఁదర్వాత, పుత్త్రోత్పత్తికొఱకు స్త్రీసంగమ మొనర్పవలయును.

7. కామమును దీర్చుకొనుటకు ఆస్త్రీయెడమీఁనిచో ఆభరణాదు లొసంగి జ్ఞాపకము చేయవలసినది. అప్పటికిని అది యొడమీఁయనిచో కొయ్యతోఁగాని, చేతితోఁగాని మెల్లఁగాఁగొట్టిసంయోగముచేయవలసి

వది. అట్టిది యశస్సులేనిది; దుష్టస్త్రీ; అపుడు "ఇంద్రియేణతే" అనుమంత్రమును చెప్పవలయును. (ఇది యశస్సులేకచేయునట్టి 7 వ మంత్రము.)

8. ఆస్త్రీ భర్తకు అనుకూలవతియై యుండినచో పైనిచెప్పినమంత్రమునకుఁదర్వాత నారంభింపఁబడు "ఇంద్రియేణ" అనుమంత్రమును పఠించుచు ప్రవేశింపవలయును. ఉభయులును యశస్సుగలవారైయుందురు. (ఇది 8 వ మంత్రము.)

9. భార్యకు భర్తయందు ప్రీతియున్నదని తెలిసినపుడు భర్తతన ప్రజనేంద్రియమునుంచి ముఖముతో ముఖముఁజేర్చి, దానియోనిని తాఁకి, "అంగాదంగాత్సంభవసి" అనుమంత్రమును పఠింపవలయును.

10. భార్య, గర్భవతికాఁగూడదనెడి కోరికగలపురుషుఁడుమున్ను చెప్పినచొప్పునకావించి "ఇంద్రియేణతే" (ఇది 7 వ మంత్రము.) అను మంత్రమును జెప్పవలయును. ఇట్లొనర్చినచో గర్భవతికాదు.

11. భార్య గర్భవతి కావలయునని కోరినయెడల మొదటచెప్పిన చొప్పున చేసి, 'ఇంద్రియేణ-రేత ఆదదామి' (ఇది 9 వ మంత్రము.) అను మంత్రమును పఠింపవలయును. ఇట్లు కావించినచో గర్భవతి యగును.

12. ఎవ్వనిభార్యకు జారపురుషు డుండునో, వానిని సొంతపురుషుఁడు చేయవలసిన దేమనఁగా—పచ్చి (కాల్పని) మట్టిపాత్రయందు అగ్నినుంచి దర్భ మొదలగువానిని తలక్రిందుగా వేయవలసినది. సమిత్తులను దర్భలను నేతిలోఁ దడిపి ఆయగ్నియందు "మమసమిద్ధే" అను మంత్రమునుజెప్పి హోమము చేయవలయును. ఇట్లు చేసినయెడల ఆ జారపురుషుఁడు నపుంసకుఁడై; సుకృతము లేనివాఁడై మృతినొందును. ఇట్లు కావించిన సొంతపురుషుని పరిహసింపఁ గూడదు. అట్లు పరిహసించినచో అతనికి శత్రువగును. (అనఁగా కీడు మూఁడును.)

13. ఋతుమైన స్త్రీమూఁడుదినములు దూరముగ నుండి కాంస్యపాత్రమందు అన్నమును జలమును గ్రహింపఁదగినది. దీనిని శూద్రుఁడు గాని, శూద్రస్త్రీగాని తాఁకగూడదు. మూఁడురాత్రులకుఁదర్వాత నాలవనాఁడు స్నానమొనర్చి, వడ్లు దంపవలయును.

14. తెల్లగను, ఒక్కవేదము నెఱింగినవాఁడుగను నుండు పుత్త్రునిం బడయఁ గోరిక యుండిన భార్యాభర్త లిరువురును క్షీరాన్నమును

వండి నేతితోఁ గలిపి భుజించి సంయోగము చేసినచో నట్టిపుత్త్రుఁడు పుట్టును.

14. కసుపుగను, రెండు వేదములు తెలిసినవాఁడుగను అగు పుత్త్రునిఁ గోరువారు పెరుఁగన్నము భుజింపవలయును.

16. నలుపుగను, మూఁడు వేదములు తెలిసినవాఁడుగను నుండు పుత్త్రుఁడు పుట్ట వలయునని కోరువారు జలముతోఁ గూడిన అన్నమును భుజింపవలయును.

17. విద్యావతియగు కొమార్తను గన నిచ్ఛయించువారు నువ్వుల పొడితోఁ గూడిన అన్నమును భుజింపవలయును.

18. పండితుఁడును, సభాపూజ్యుఁడును, సకలవేదముల నెఱింగిన వాఁడును అగు కుమారునిఁ బడయనెంచినవారు మాంసముతోఁ గూడిన అన్నమును భుజింపవలయును.

19. తర్వాత, ఇంతవఱకే దంచియున్న బియ్యముతో స్థాలీపాకము చేసి, ఆయన్నమును "అగ్నయేస్వాహా" అనుమంత్రముచే హోమము చేసి, మిగిలినఅన్నమునుభుజించి, పత్నికిని ఇప్పించవలయును. తర్వాత చేతులుకడిగికొని, ఉదకపాత్రమునందు జలమెత్తికొని, ఆజలముతో 'ఉత్తిష్ఠాతో' అనుమంత్రము చెప్పి, ముమ్మాఱు ప్రోక్షింపవలయును.

20. ఆదినము (నాలవదినము) రాత్రి వారివారికోరిక ప్రకారము క్షీరాన్నము మొదలగువానినిభుజించి "మోఽహంసామాహమస్మి" అను మంత్రమునుజెప్పి సంగమింపవలయును.

21. 22. తర్వాత, "విజిహీథామ్" అనుమంత్రమునుజెప్పి, దాని తొడలనువిప్పవలయును. తదనంతరము తనప్రజనేంద్రియమునుంచి ముఖ ముతో ముఖముఁ జేర్చి, ముఖమునుండికాళ్లవఱకు ముమ్మాఱుతాఁకి "విష్ణుర్యోనిమ్" అనుమంత్రము చెప్పుచు సంగమింపవలయును.(గర్భము కలుగును.)

23. పిమ్మట, ప్రసవకాలమునందు "సోష్యన్తీ" అనుమంత్రమును పఠింపవలయును. సుఖప్రసవమగును.

24. బిడ్డపుట్టినతర్వాత "జుహోత్యస్మిన్" అను మంత్రమునుజెప్పి హోమముచేసి జాతకర్మము చేయవలసినది.

25. పిదప, బిడ్డయొక్క కుడిచెవిలో తండ్రి తనముఖమునుండి "వాక్" అని మువ్మారుచెప్పవలయును. నేయి, తేనె, పెరుగు అను నీమూఁటిని కలిపి "భూ స్త్వేదధామి" అనుమంత్రమునుజెప్పి అన్నప్రాశనము చేయవలయును.

26. పిమ్మట, ఆశిశువునకు "నీకు వేదము అనిపేరు" అనిచెప్పి నామకరణము చేయవలయును. ఇది రహస్యనామము (అనఁగా బాహ్యనామముకాదు. బాహ్యనామము రామ, కృష్ణాదులు).

27. తర్వాత, శిశువును "య స్తే స్తనః" అనుమంత్రమును జెప్పి తల్లిచేతికిచ్చి స్తన్యమిమ్మని చెప్పవలయును.

28. అనంతరము ఆతల్లినిఁ దాఁకి "ఇలాసి" అనుమంత్రమును పఠింపవలయును.

(ఇట్లు చేసినచో పుట్టిన పుత్త్రుఁడు తండ్రికంటె విద్యా బుద్ధి కీర్తి బ్రహ్మవర్చసములతోఁ గూడినవాఁడై యుండును.)

---

పంచమబ్రాహ్మణము.

1-4. ఇందు వేదములనుజెప్పినబుషు లగు పౌతిమాషీపుత్రాదులును బ్రహ్మదేవునివఱకుఁ గలవారివంశములును చెప్పఁబడియున్నవి. అనావశ్యకమని వ్రాయక విరమింపఁబడెను.

ఓమ్ పూర్ణమద ఇతి శాన్తిః.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

బృహదారణ్యకోపనిషత్తు సమాప్తము.

---

# 11. శ్వేతాశ్వతరోపనిషత్తు.

సహనా వవ త్వితి శాన్తిః.

## ప్రథమాధ్యాయము.

ఓమ్. (మంగళము) బ్రహ్మవాదులందఱు నొక్కచోటఁ జేరి పరస్పరము ప్రశ్నించుకొనిరి. "ఈజగమునకుఁ గారణము బ్రహ్మమా? ఇట్లఁ జెప్పఁబోవు కాలాదులా? కారణమేలేదా. ఆకారణమెట్టిది? అది ఉపా

దానమా? నిమిత్తమా? (లేక రెండునా?) మన మెట్లు కలిగితిమి? దేని వలన బ్రతికియున్నాము? అంత్యమున దేనియందు ప్రవేశింతుము? సుఖ దుఃఖములలో దేనిచే నియమింపఁబడియున్నారము ? ఓ బ్రహ్మవేత్తలారా! చెప్పుఁడు" అని.

2. కాలమా? (ప్రళయకాలమా?) స్వభావమా? (అగ్నికిఉష్ణము వలెపదార్థస్థితియా?)నియతియా? (పుణ్యపాపలక్షణమైనకర్మమా?)యదృచ్ఛయా! విజ్ఞానమయుఁడైనజీవుఁడా? కారణమా? అని యోజించునెడల వీనిలో నేదియు కారణముకాదు. ఇవియన్నియుఁజేరి యైనకారణమును కాదు. జీవుఁడును అస్వతంత్రుఁడును సుఖదుఃఖములకు లోఁబడినవాఁడై నందున కారణము కాఁడు.

3. ఇట్లు ఆ బ్రహ్మవేత్తలు ధ్యానముచే ఆలోచించిచూచి, ఎవఁడు ఒక్కఁడైయుండి కాలాదికారణములన్నిటికిని ప్రధానకారణుఁ డై యున్నాఁడో, అట్టి పరమాత్మయొక్క శక్తియే (జగత్) కారణ మని తెలిసికొనిరి. ఆశక్తి (కార్యభూతము లైన పృథ్వ్యాదులచే) మఱుఁగింపఁబడియున్నది.

4. బ్రహ్మము ఒకచక్రముగా వర్ణింపఁబడియున్నది. —మాయ, ప్రకృతి, శక్తి, తమస్సు, అవిద్య, ఛాయ, అజ్ఞానము, అనృతము, అవ్యక్తము మొదలగువేర్లుగలదియు, సకలకారణమైనదియు ఆధారమైనదియు నగు పరమాత్మ శక్తియగు ఒకనేమికలదు. నేమియనఁగా, బండికల్లు నకువేయు చుట్టు ఇనుపకట్టు. సత్త్వరజస్తమములను ప్రకృతిగుణములచే ఆవరింపఁబడినది. (ఇది బండిచక్రమునకు నాభివంటిది.) పదియాఱుకళలు, లేక అంతముగలది. ఆపదియాఱును ఏదియనఁగా, పృథివ్యాదిపంచభూతములు, జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, మనస్సుఒకటి, ఇవి పదునాఱు. లేక ప్రశ్నోపనిషత్తునందుఁ జెప్పిన ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, తేజస్సు, ఉదకము, భూమి, ఇంద్రియము, మనస్సు, అన్నము, వీర్యము, తపస్సు, మంత్రములు, కర్మ, లోకములు, పేరు అనునీపదియాఱును అంతముగాఁగలది. అంతమనఁగా కారణావస్థకు సమష్టి కార్యభూతములైన విరాట్, సూత్రాత్మలిద్దఱు, వ్యష్టికార్యము లైన భూలోకాదులగు పదునాలుగులోకములు అను నీపదియాఱును అంతముగాఁ గలది.

ఏఁబదిఅరములు (బండిఆకులు) కలవి. అవి యేవియనఁగా— తమస్సు మొదలగునవి 5, శక్తిమొదలగునవి 28, తుష్టిమొదలగునవి 9, సిద్ధిమొదలైనవి 8. ఇవియన్నియుఁజేరి ఏఁబదిఅరములును విపర్యయము లనియు, లేక ప్రత్యయములనియు పేరొందును.

వీనిలో తమస్సు అయిదువిధములు. తమస్సు, మోహము, మహా మోహము, తామిస్రము, అంధతామిస్రము.

౧. తమస్సుయొక్క భేదములు ఎనిమిదివిధములు—అవ్యక్తాది అష్టప్రకృతులయందు ఆత్మజ్ఞాప్రతీతికలుగుట.

౨. మోహముయొక్క భేదములు ఎనిమిదివిధములు—అణిమా ద్యష్టైశ్వర్యములు కలుగవలయుననుట.

3. మహామోహము పదివిధములు—కనఁబడినది అయిదు, వినఁ బడినది అయిదు అను నీశబ్దాదివిషయములు పది.

౪. తామిస్రము పదునెనిమిదివిధములు—పైనిచెప్పిన శబ్దాది పదివిషయములందు అష్టైశ్వర్యములతో ప్రయత్నముచేసి కార్యసిద్ధి కానియెడల కలుగునట్టి కోపము.

౫. అంధతామిస్రము పదునెనిమిది విధములు — పైనిచెప్పిన ప్రయత్నము సిద్ధించినతర్వాత దానిని అనుభవించుసమయమునందు మర ణము సమీపించినపుడు కలుగు శోకము.

౨౮ శక్తులు—ఏకాదశేంద్రియములయొక్క శక్తులు పదునొకం డును, దశేంద్రియములకు మూకత్వ, బధిరత్వ, అంధత్వము మొదలగు బాహ్యశక్తులు తొమ్మిదియును, అంతఃకరణమునకు పురుషార్థయోగ్యత గల సిద్ధులయొక్క భేదములు ఎనిమిదియును గలిగియుండుట.

తుష్టి తొమ్మిదివిధములు—ప్రకృత్యాదులు నాలుగు, విషయో పరమములు అయిదు, మొత్తము తొమ్మిది. అవి—

౧. ప్రకృతిపరిజ్ఞానముఁగల్గి మనము కృతార్థులమైతి మనితలంచుట ప్రకృతితుష్టి.

౨. ఆశ్రమాదులనొంది సంతోషించుట ఉపాదానతుష్టి.

3. ఎప్పుడైనను తప్పక ముక్తిసిద్ధించు ననితలంచియుండుట కాలతుష్టి.

౪. ధనముచేతనే మోక్షముకూడ సిద్ధించు నని సంతోషించుట భాగ్యతుష్టి.

౫. విషయసంపాదన మొశక్యమనితలంచి దానిని నిగ్రహించుటయు నొకవిధమైనతుష్టి.

౬. మీఁదఁజెప్పినవి సిద్ధించినప్పటికిని వానిని కాపాడుట కష్టమని తలంచుటయు నొకరీతితుష్టి.

౭. మీఁదఁజెప్పిన వానియందు దోషము గలదని నిశ్చయించి శాంతి నొందుట యొకరీతితుష్టి.

౮. పైనిచెప్పినవి సిద్ధించినచో మఱిమఱి ఆశ హెచ్చును గాన, ఆసంగము వలదనుట యొకవిధమైనతుష్టి.

౯. మీఁదజెప్పినవానివలన పరహింసాదిదోషము సంభవించుటంబట్టి వానినుండి విరమించుటయు నొకవిధమగుతుష్టి.

సిద్ధులు ఎనిమిదివిధములు.—

౧. ఊహ—ఉపదేశములేక జన్మాంతర సంస్కార వశముచేత కలుగుజ్ఞానము.

౨. శబ్దము—శాస్త్రాధ్యయనము లేక శ్రవణ మాత్రముచేఁ గలుగుజ్ఞానము.

3. అధ్యయనము—శాస్త్రపరిశోధనమువలనఁ గల్గినజ్ఞానము.

౪. ఆధ్యాత్మికజ్ఞానము—అధ్యాత్మదుఃఖమును సహించుటవలనఁ గలిగినజ్ఞానము.

౫. ఆధిభౌతికజ్ఞానము—ఆధిభౌతికదుఃఖమును సహించుటవలన గల్గినజ్ఞానము.

౬. ఆధిదైవికజ్ఞానము—ఆధిదైవికదుఃఖమును సహించుటవలన గలిగినజ్ఞానము.

౭. సుహృత్ప్రాప్తి—గురువును ఆశ్రయించుటవలనఁ గలిగిన జ్ఞానము.

౮. దానము—ఆచార్యునకు వలయువస్తువు నొసంగుటవలనఁ గల్గినజ్ఞానము.

ఇట్లు ఏఁబదివిధములైన జ్ఞానభేదములు చెప్పఁబడినవి. మున్ను చెప్పిన అరములకు దశేంద్రియములును,దశేంద్రియవిషయములును అగు

నీయిరువదియును కీలకములు. అనఁగా మేకులు. (మేకు=ఆణి.) మఱియు,

(౧) పృథివ్యప్తేజోవాయ్వాకాశాదిపంచభూతములును, అవ్యక్తము, మహత్తు, అహంకారము అనుమూఁడును, మొత్తము ఎనిమిదియును ప్రకృత్యష్టక మనఁబడును.

(౨) త్వ, క్చర్మ, మాంస, రుధిర, మేధో, ఽస్థి, మజ్జా శుక్రములను నివి యెనిమిదియును ధాత్వష్టక మనఁబడును.

(3) అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అను నీయెనిమిదియు ఐశ్వర్యాష్టక మనఁబడును.

(౪) ధర్మ, జ్ఞాన, వైరాగ్య, ఐశ్వర్య, అధర్మ, అజ్ఞాన,అవైరాగ్య, అనైశ్వర్యము అని నీయెనిమిదియు భావాష్టక మనఁబడును.

(౫) బ్రహ్మ, ప్రజాపతి, దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, పితృ, పిశాచము లనునీయెనిమిదియు దేవాష్టక మనఁబడును.

(౬) సర్వభూతములయందు దయ, క్షాంతి, అనసూయ, శౌచము, అనాయాసము, శుభము, అకార్పణ్యము, అస్పృహ అను నీయెనిమిదియు ఆత్మగుణాష్టక మనఁబడును. ఇట్టి ఆఱు అష్టకములును జేరినట్టి ఒక్కటే కామ్యమనెడి త్రాడు (చుట్టుపట్ట) గలదియును; ధర్మము, అధర్మము, జ్ఞానము అనుమూఁడుమార్గములుగలదియును; పాపము, పుణ్యము అనునీ రెండునిమిత్తములు గలదియును; మోహమనెడి భ్రమణము (తిరుగుట) గలదియును అగు ఆత్మచక్రమును (బ్రహ్మచక్రమును) ధ్యానించుచున్నాము.

5. బ్రహ్మము ఒక్కనదిగా వర్ణింపఁబడియున్నది.—త్వక్చక్షు శ్రోత్రజిహ్వాఘ్రాణము లనుజ్ఞానేంద్రియములే జలముగాఁగలదియును; పృథివ్యప్తేజోవాయ్వాకాశాది పంచభూతములే ఉగ్రమును వక్రమును గాఁగలదియును; ప్రాణాపానవ్యానోదానసమానము లనుపంచప్రాణములే అలలుగాఁగలదియును; జ్ఞానేంద్రియములచేఁ బుట్టినజ్ఞానమునకు కారణమైనమనస్సే మూలముగాఁగలదియును; శబ్దస్పర్శరూపరసగంధము లను తన్మాత్రలే సుళ్లుగాఁగలదియును; గర్భ, జన్మ, జరా, వ్యాధి, మరణములను పంచదుఃఖములే ప్రవాహవేగముగాఁగలదియును; అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అను పంచక్లేశములే మధ్యభాగముగాఁగలదియును అగునదిని ధ్యానించుచున్నారము.

6. సర్వమునకు జీవస్థానమైనదియును, లయస్థానమైనదియును, గొప్పదియును అగు ఈ బ్రహ్మచక్రమునందు జీవుఁడు తాను వేఱనియును, ఈశ్వరుఁడు వేఱనియును భ్రమింపుచుండుటచేతను, అనాత్మయగు దేహాదులను తానని భావించుచుండుటచేతను, దేవమనుష్యతిర్యగాది నానా యోనులందు జన్మించుచు మృతినొందుచు తిరుగుచున్నాఁడు. పిమ్మట పరమాత్మ తానని తెలిసికొనుటచేత మోక్షము నొందుచున్నాఁడు.

7. బ్రహ్మము సప్రపంచముగాఁ జెప్పఁబడినది, దాని నెఱుంగుట వలన మోక్షముసిద్ధించునా? అని శంకకలుగఁగా, అట్లుకా దని నిరూపింపఁబడుచున్నది.—బ్రహ్మము అనేక శ్రుతులచే ఉపదేశింపఁబడిన శ్రేష్ఠమైనవస్తువు. అందు భోక్తృభోగ్యప్రేరకుఁడు, లేక విశ్వతైజసప్రాజ్ఞులను మువ్వురును ప్రతిష్ఠింపఁబడియున్నారు. ఆ బ్రహ్మము అక్షర (నాశరహిత) వస్తువు, బ్రహ్మవేత్తలు ఆవస్తువును దెలిసికొని దానియందే లీనమయ్యెదరు. దానినే ధ్యానించుచు సంసారమునుండి విముక్తులయ్యెదరు.

8. జీవేశ్వరులకు వాస్తవమునందు భేదములేదనియును, వ్యవహారదశయందు ఆరీతిగా తెలిసికొనుటవలన ముక్తి కలుగు ననియును నిరూపింపఁబడుచున్నది.—వ్యక్తము(వికారమైన కార్యము),అవ్యక్తము (కారణము),క్షరము (నాశమగునది), అక్షరము (నాశమొందనిది). ఇట్టి కార్యకారణసంబంధమైన నీప్రపంచమును ఈశ్వరుఁడును జీవుఁడును భరించుచున్నారు. అయినను, ఈజీవుఁడు అవిద్యాతత్కార్యభూత దేహేంద్రియాదులచేఁ గట్టువడియున్నాఁడు. (భోక్తృత్వభావముండుటవలన, తర్వాత ఉపాధిరహితబ్రహ్మమై యుండునట్లు తెలిసికొని సకలపాశములనుండి విడివడుచున్నాఁడు.)

9. ఇంకను భేదము చెప్పఁబడుచున్నది.—ఈశ్వరుఁడును జీవుఁడును జననమరణాదులులేనివారు. ఇంకొక్కతెయున్నది; దానిపేరు మాయ. అదియు జననమరణాదులు లేనిది. భోక్తృభోగ్యార్థములతోఁ జేరినది. ఈముగ్గురలో ఈశ్వరుఁడుమాత్రము అనంతుఁడై, దేశకాల వస్తుభేద పరిచ్ఛేదరహితుఁడై, విశ్వరూపుఁడై అకర్తయై యున్నాఁడు. ఈముగ్గుర నెఱింగినవాఁడు ముక్తినొందును.

10. మాయకును ఈశ్వరునకును గలభేదము చెప్పఁబడుచున్నది—నశించునట్టిది మాయ. అవిద్యాదులను నశింపఁజేయువాఁడు

ఈశ్వరుఁడు. ఈశ్వరుఁడు అద్వితీయుఁడై స్వయంప్రకాశుఁడై ప్రకృతి పురుషులను (మాయను, జీవుని) నియమించుచున్నాఁడు. అట్టి ఈశ్వరుని ధ్యానించుటవలనను, నేనే బ్రహ్మ మని పరమాత్మతో యోజించుట వలనను, మాటి మాటికి తత్త్వమును భావించుటవలనను, మాయా నివృత్తికల్గుచున్నది. అనఁగా మోక్షము సిద్ధించును.

11. ఆపరమాత్మనుఎఱింగినయెడల అవిద్యాదిపాశములు తొలఁగి పోవును. అవిద్యాదిక్లేశకార్యమైన జన్మాదిదుఃఖములునశించును. పర మేశ్వర (పరమాత్మ) ధ్యానముచేత దేహపాతానంతరము (అర్చిరాది మార్గముగా) విరాట్స్వరూప మొంది సకలైశ్వర్యముల ననుభవించి పూర్ణానందాద్వైతబ్రహ్మ మగుచున్నాఁడు.

12. దేనిచేతపరమపురుషార్థము కలుగుననఁగా—ఆపరమాత్మను తెలిసికొనవలయును. అది తనఆత్మయందే యున్నదనియును, దీనికంటె ఎఱుఁగఁదగినవస్తువు వేఱొక్కటియు లేదనియును తెలియఁదగినది. జీవుఁడు, జగత్తు, ఈశ్వరుఁడు అనునీమూఁటిని తెలిసికొనినయెడల బ్రహ్మము తెలియఁబడుననియును ఎఱుఁగవలయును.

13. అరణియందుండుఅగ్ని యెట్లు కనంబడకున్నదో, మథించిన తర్వాత ఎట్లు కనఁబడుచున్నదో, అట్లు మనదేహమందుండుఆత్మ మొదట కనఁబడదు. అయినను ధ్యానించినయెడల కనఁబడును.

14. ఎట్లు మథించుట యనఁగా—దేహమనెడి అధరారణి యందు ప్రణవమను ఉత్తరారణిచేత ధ్యానమనుకవ్వముతో మథించి కనఁబడక దాఁగియుండు ఆపరమాత్మను జూడవలయును.

15. ఎట్లనఁగా—తిలల (నువ్వుల)లో నూనెవలెను, పెరుఁగులో నేతివలెను, నదులయందు పల్లముత్రవ్వుటచే నీళ్లవలెను, కట్టెలను మథిం చుటచే నగ్నివలెను (శరీరమందుండుఆత్మను) నుండు ఆపరమాత్మను సత్యమార్గముచేతను, తపస్సుచేతను చూడవలయును.

16. పాలలో నేతివలె, సర్వవ్యాపకుఁడైనపరమాత్మను ఆత్మ జ్ఞానతపస్సులకుఁ గారణమును, ఉపనిషత్ప్రతిపాద్యశ్రేయోరూపపర బ్రహ్మమును (అగుఆత్మస్వరూపమును) చూచుచున్నాఁడు.

## ద్వితీయాధ్యాయము.

1 ధ్యానసాధనమైన యోగవిషయము చెప్పఁబడుచున్నది.— సూర్యుఁడు ధ్యానారంభకాలమునందు మనస్సును బ్రహ్మమునందు జేర్పించి, అగ్నిజ్యోతిని కనఁబఱచి ఈశరీరమునందలి బుద్ధ్యాదులను బాహ్యవిషయములయందుండి ఉపసంహరింపఁజేయునుగాక.

2. సూర్యానుగ్రహముచేత చంచలరహితమైన మనస్సువలన మనము బ్రహ్మప్రాప్తికి శక్తుల మగుదుముగాక.

3. సూర్యుఁడు, మనస్సును నిగ్రహించి మనస్సు మొదలగు కరణములను బ్రహ్మప్రాప్తికొఱకు దివ్యజ్యోతిర్దర్శనమును దర్శించు నట్టి సామర్థ్యమును ప్రసాదించునుగాక.

4. ఎవ్వరు మనస్సును, తక్కినకరణములను నిగ్రహించుచున్నారో ఆవిప్రులు వ్యాపకుఁడును, శ్రేష్ఠుఁడును, సర్వజ్ఞుఁడు నగు సూర్యునికృపను ప్రారంభమునందు ప్రథమమున సంపాదింపవలయును.

5. బ్రహ్మము మిమ్మనుసరించునుగాక. నమస్కారములచేత శ్లాఘనీయులగుదురుగాక. దివ్యస్థానములం దుండు సకలబ్రహ్మపుత్రులును దీనిని శ్రవణము చేయుదురుగాక.

6. దేనియం దగ్ని మథింపఁబడుచున్నదో, దేనియందు వాయువు నిరోధింపఁబడి అభివ్యక్తమైనశబ్దము చేయుచున్నదో, ఆయజ్ఞకర్మమునందు మనస్సు ప్రవర్తించుచున్నది (అనఁగా స్వర్గాదిభోగములకొఱకై మనస్సు మొదట ప్రవర్తించుచున్నది.)

7. సూర్యానుగ్రహమువలన శాశ్వతమైన బ్రహ్మమును సేవింపవలయును. ఆ బ్రహ్మమును ధ్యానము చేయవలయును. అట్లు కావించిన యెడల పూర్వకర్మములన్నియు నశించును.

8. వక్షము, కంఠము, శిరస్సు అను నీమూఁటిని ఉన్నతముగా నిల్పి (నిక్కికూర్చుండి), చక్షురాదీంద్రియములను మనస్సును హృదయముననిల్పి, ప్రణవమనెడి తెప్పచేత జననమరణప్రవాహమును విద్వాంసుఁడు దాఁటవలయును.

9. వివేకియైనవాఁడు ప్రాణవాయువులను నిరోధించవలయును. ప్రాణవాయువు తగ్గినపుడు ముక్కుపుటముచేతనిటూర్పుపుచ్చవలయును. దుష్టాశ్వములం బూన్చినరథమును సారథి యెట్లు జాగ్రత్తతో నడపించు

చున్నాఁడో, అట్లు బ్రహ్మస్వరూపమును దెలిసికొని ఏకాగ్రచిత్తుఁడై మనస్సును ధరింపవలయును.

10. సమభూమియందును; పరిశుద్ధప్రదేశములయందును; రాలు, ఇసుక, అగ్ని, శబ్దము, జలము, ఆశ్రయము ఇవి లేనిచోటునందును, మనస్సునకు రమ్యమును, నేత్రములకు పీడనము లేనిస్థలమునందును, ఏకాంతస్థలమునందును; గాలిలేని స్థలమునందును వసించి పరమాత్మ యందు చిత్తమును జేర్పవలయును.

11. ఇట్లు యోగాభ్యాసము చేయువానికి మంచు, పొగ, సూర్యుఁడు, వాయువు, అగ్ని, మిణుఁగురుబూచులు, మెఱుము, స్ఫటికము, చంద్రుఁడు అనునీస్వరూపములు బ్రహ్మమును గనఁబఱచు నట్లు మొదటఁ గనఁబడును.

12. పృథివ్యాదిపంచభూతమయ మైన యీశరీరమునకు, యోగాగ్నిమహిమవలన రోగజరామరణదుఃఖములు గలుగవు.

13. యోగాభ్యాసమునందు ప్రవర్తించినవానికి ప్రథమమునందు శరీరము చులకనై యుండును; ఆరోగ్యమైయుండును; ఆశలులేకుండును; శరీరము ప్రకాశమైయుండును; కంఠధ్వని స్పష్టముగానుండును; శరీర గంధము సువాసనగనుండును; మూత్రపురీషములు అల్పముగనుండును. అని యిట్లు పెద్దలు చెప్పుచున్నారు.

14. బంగారము, వెండి మొదలగువిగ్రహమును నిర్మించుటకు మొదట నేప్రకారముగ మన్ను మొదలగువానిచే పూయఁబడి మలినమై యుండి, పిదప అగ్ని మొదలగువానివలన నెట్లు తేజోమయమై ప్రకాశించుచున్నదో అట్లు ఆత్మతత్త్వమును దేహియైనవాఁడు చూచి, అద్వితీయుఁడును, ధన్యుఁడును, దుఃఖరహితుఁడును అగుచున్నాఁడు.

15. యోగియైనవాఁడు ఆత్మతత్త్వముచేత బ్రహ్మతత్త్వమును జూచుచున్నాఁడో, అనఁగా దీపముచేత దీపమును జూచునట్లు చూచు చున్నాఁడో, అప్పుడు నిత్యుఁడై, సర్వతత్త్వములచే విశుద్ధుఁడై యుండు పరమాత్మను తెలిసికొని సకలపాశములనుండి విడువంబడుచున్నాఁడు.

16. ఈపరమాత్మయే దిక్కులను విదిక్కులనుగూర్చి ప్రాచీనుఁ డును మొట్టమొదటివాఁడు నగు హిరణ్యగర్భుఁడై పుట్టినవాఁడు. ఆపర మాత్మయే గర్భమందుండువాఁడై, శిశువై పుట్టినవాఁడై, ఇఁకపుట్టఁ

బోవు వాఁడై సకలప్రాణులకు మొదటివాఁడైయున్నాఁడు. అయినను, సకలప్రాణులకును ప్రత్యేకమైనవాఁడైయున్నాఁడు.

17. ఏ దేవుఁడు అగ్నియందును, జలమందును, సమస్తలోకములందును, సకలౌషధులయందును, సకలవృక్షములయందును వసించుచున్నాఁడో ఆ దేవునకు నమస్కారము; నమస్కారము. (ఆదరార్థమై నమశ్శబ్ద మినుమాఱు ఉచ్చరింపఁబడినది.)

---

## తృతీయాధ్యాయము.

1. ఎవఁడు అద్వితీయుఁడై, మాయావియై, స్వశక్తిచేత ఈశ్వరత్వమును బొందియున్నాఁడో, ఎవఁడు ఒక్కఁడైయుండి సకలలోకములను ఉత్పత్తిచేయునపుడును, శక్తికలుగుకాలమునందును తనశక్తిచే నియమించుచున్నాఁడో, అట్టిపరమాత్మను దెలిసికొనువారు, మరణరహితులగుచున్నారు.

2. మాయావి యనుటకు కారణమేమి? అనఁగా, ఆ దేవుఁడు (రుద్రుఁడు) ఒక్కఁడే; జ్ఞానులు అతనికంటె వేఱొక్కరిని దెలియరైరి; ఎవఁడు తనశక్తులచేత సకలజనులను నియమించుచున్నాఁడో, ఎవఁడు జనులకంటె వేఱైనవాఁడో, ఎవఁడు సకలజనులను పుట్టించి రక్షించి ప్రళయకాలమునందు తనలో నైక్యము చేసికొనుచున్నాఁడో, అతనికంటె వేఱైనవస్తువును జ్ఞానులు చూడలేదు.

3. ఎచ్చటను నేత్రములును, ఎచ్చటను ముఖములును, ఎచ్చటను చేతులును, ఎచ్చటను పాదములును గల ఒకే దేవుఁడు, భూమిని, ఆకాశమును సృష్టించి మనుష్యులను చేతులతోఁగూడను, పక్షులను ఱెక్కలతోను సృజించెను. (అనఁగా, దానిదానికిఁ దగినశక్తినిఁ గలిగించినాఁడని తాత్పర్యము.)

4. ఎవఁడు దేవతలకు ఉత్పత్తికారణమును, విభూతియోగకారణమును, విశ్వపరిపాలకుఁడును, రుద్రుఁడును, సర్వజ్ఞుఁడును అయియుండి, ఆదియందు హిరణ్యగర్భునిసృజించినాఁడో, అట్టిభగవంతుఁడు మాకు సద్బుద్ధిని ప్రసాదించునుగాక.

5. ఓ రుద్రుఁడా! పర్వతమునందుండి సుఖమునిచ్చువాఁడా! నీయొక్క శుభకరమును, ఘోరములేనిదియును, పుణ్యకరమునైనది

యును, అత్యంతము మంగళప్రదమైనదియు నగు నీ నిజదేహముతో మమ్ము వీక్షింపుము.

6. గిరియందుండి మేలొసంగువాఁడా! పర్వతమునందుండి రక్షించువాఁడా! ప్రయోగించుటకొఱకు బాణమును హస్తమున ధరించిన వాఁడా! ఆబాణమును శుభకరముగా చేయుము. పురుషుని, ప్రపంచమును హింసింపకుండుము.

7. ప్రపంచముకంటెను ప్రజాపతికంటెను వేఱైనవాఁడును, అధిక వ్యాప్తికలవాఁడును, ప్రతిశరీరమునందును, సకలభూతములయందును గూఢమైయుండువాఁడును, ప్రపంచమునంతయు నావరించికొనియుండు వాఁడును నగు ఈశ్వరుని తెలిసికొని అమృతత్వమును బొందుచున్నారు.

8. ఆపురుషుని మహాత్మునిగను, ప్రకాశస్వరూపునిగను, అజ్ఞానముకంటె అవతలనుండువానిగను నే నెఱుఁగుచున్నాఁడను. అతని నెఱింగి మృత్యువును దాఁటుచున్నాఁడను. మోక్షమునకు వేఱు మార్గము లేదు.

9. దేనికంటె శ్రేష్ఠమును, వేఱైనదియును, గొప్పదియును, చిన్నదియును గానిదై యుండునో, ఎది వృక్షమువలె ఆకాశమునందు నిలుచున్నదో, ఆపురుషుఁడు సర్వత్ర వ్యాపించియున్నాఁడు.

10. కార్యరూపమైన ప్రపంచమునకును, తత్కారణరూపమైన ఈశ్వరునకును వేఱైనదియును, రూపరహితమైనదియును, తాపత్రయ రహితమైనదియును అగువస్తువును మరణధర్మము లేనివారు తెలిసికొనిరి. ఇతరులు తెలిసికొననందున దుఃఖసహితమైనసంసారమును పొందుచున్నారు.

11. ఆభగవంతుఁడు ప్రపంచమునందలి సకలప్రాణులయొక్క బుద్ధిగుహయందు శయనించియున్నాఁడు. మఱియు సకలముఖములును, సమస్తములైనశిరములును, సకలకంఠములును గలవాఁడై యున్నాఁడు. (భగవంతుఁడనగా—ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము, అను షడ్గుణైశ్వర్యములుగలవాఁడు.)

12. ఆపరమాత్ముఁడు మహాపురుషుఁడు (గొప్పవాఁడు); ప్రభువు; సృష్టిస్థితిసంహారకర్త; అంతఃకరణనియామకుఁడును, పరిశుద్ధమైన పరమపదము నొసంగువాఁడును, స్వయంప్రకాశుఁడును, నాశరహితుఁడునై యున్నాఁడు.

13. అంగుష్ఠప్రమాణముగలవాఁడు; (అంగుష్ఠప్రమాణముగల హృదయమునందు వసించువాఁడుగాన ఆప్రమాణము చెప్పఁబడినది.) పరిపూర్ణుఁడు; సకలప్రాణులహృదయమందుండి మనస్సుచే మఱఁగింపఁబడి యుండువాఁడు; జ్ఞానమునకు ప్రభువు; అని యిట్లెఱిఁగినవారు మరణ ధర్మము లేనివా రగుదురు.

14. ఆపూర్ణుఁడగుపురుషుఁడు అనేకములైనశిరస్సులును, అనం తములైననేత్రములును, లెక్కలేనిపాదములునుగలవాఁడు. పురుషుఁడు లోకమంతట లోపలను వెలుపలను వ్యాపించియున్నాఁడు. అతఁడు, దశాంగుల పరిమితిగల హృదయమునందు (నాభికి పదియంగుళములకు మీఁద) వసించుచున్నాఁడు.

15. ఎది అన్నముచేతనుండునో దానికిని, ఇదివఱకును గలిగినదాని కిని, ఇఁకఁ గలుగఁబోవుదానికిని, మరణధర్మములేనిదానికిని (అమృతత్వ మునకును) ఆపురుషుఁడే ప్రభువై యున్నాఁడు.

16. అతఁడు సర్వత్ర కాలుచేతులుగలవాఁడును, ఎచ్చటను కన్నులు, తలలు, ముఖములు, చెవులును గలవాఁడునునై సకలలోకము లందును వ్యాపించియున్నాఁడు.

17. ఆపరమాత్మ సకలేంద్రియములను ప్రకాశింపించువాఁడుగను, సకలేంద్రియవర్జితుఁడుగను, సమస్తమునకును ప్రభువుగను, ఈశ్వరుఁడు గను, సర్వమునకు ఉత్కృష్టస్థానముగను, సర్వకారణముగను ఉన్నాఁడు.

18. ఆదేవుఁడు నవద్వారములు (నోరు మొదలగుఏడుద్వారము లును, అధోభాగమునందలి రెండుద్వారములును చేరినది) గలశరీరమనెడి పట్టణమునందు జీవాత్మగను, స్థావరజంగమాత్మకముగను నుండు సకల ప్రపంచమును స్వాధీనముచేసికొని బయట సంచరించుచున్నాఁడు.

19. ఆపరమాత్మ కాళ్లులేకపోయినను వేగముగ సంచరింపఁ గలఁడు; చేతులులేకపోయినను శీఘ్రముగ గ్రహింపఁగలడు; కన్నులులేక పోయినను చూచువాఁడు; చెవులులేకపోయినను వినువాఁడు; తెలిసికొన వలసిన దానిని తెలిసికొనువాఁడు;అయినను ఇతనిని తెలిసికొనువారులేరు; ఇతఁడే మొదటగొప్పవాఁడగు పరిపూర్ణపురుషుఁ డై యున్నాఁడు.

20. ఆయాత్మ, అణువుకంటెను అణువై, మహత్తుకంటెను మహత్తై ప్రాణి హృదయమునం దున్నది. విషయభోగసంకల్పరహితుఁడును, వృద్ధిక్షయము లేనివాఁడునునగు ఈశ్వరునికృపచేత ఆయీశ్వరుని చూచుచున్నాఁడో వాఁడు దుఃఖరహితుఁ డగుచున్నాఁడు.

21. ఆపరమాత్మను బ్రహ్మజ్ఞానులైనవారు జన్మములేనివాఁడనియు, శాశ్వతుఁడనియు, జరారహితుండనియు, పురాణపురుషుఁడనియు, సర్వాత్మస్వరూపుఁడనియు, సర్వవ్యాపకుఁడనియు, సర్వగతుండనియును చెప్పుచున్నారు. అట్టిమహిమగలపరమాత్మను నేను తెలిసికొనుచున్నాను.

---

## చతుర్థాధ్యాయము.

1. ఎవఁడు అద్వితీయుఁడై, జాత్యాదులు లేనివాఁడై నానావిధములగు శక్తుల చేరికవలన అనేకజాతులను ప్రయోజనము లేక చేయుచున్నవాఁడై, ఎవనివద్ద నీప్రపంచము ఆదియందును మధ్యయందును అంతమునందును తనస్వాధీనమునం దుంచుకొనువాఁడై యుండునో, అట్టిపరమాత్మ మాకు శుభప్రదమైన బుద్ధిని అనుగ్రహించును గాక.

2. ఆపరమాత్మయే అగ్నియు, సూర్యుఁడును, వాయువును, చంద్రుఁడును, శుక్రుఁడును, బ్రహ్మమును, జలమును, ప్రజాపతియునై యున్నాఁడు.

3. నీవే స్త్రీవి, పురుషుఁడవు, కుమారుఁడవు, కుమారివి, వృద్ధుఁడవు, శిక్షచేత వంచించువాఁడవు, పుట్టినవాఁడవు, సర్వతోముఖుఁడవునై యున్నాఁడవు.

4. నీవే తుమ్మెదవు, చిలుకవు, మేఘమవు; నీవు ఋతువులుగను, సముద్రములుగను నున్నావు. మఱియు ఆదిలేనివాఁడవై సర్వవ్యాపకుఁడవై యున్నాఁడవు.

5. ఎఱుపు, తెలుపు, నలుపు (రజస్సత్త్వతమములు) అను వర్ణములు గలదియును, అనేకప్రజలను సృజించినదియును, తనకుసమానమైన స్వరూపము గలదియును, జనన మొందనిదియును అగు ఒకస్త్రీని (మాయను) జన్మింపనివాఁ డొకఁడు (జీవాత్మ) సేవించుచు(అజ్ఞాబద్ధుఁడై)

ఆశ్రయించుచు నున్నాఁడు. ఇంకొకఁడు జననము లేనివాఁడు (పర మాత్మ) భోగానుభవము చేసిన వీనిని (జీవాత్మను) త్యజించుచున్నాఁడు.

6. రెండుపక్షులు ఎడఁబాయనిస్నేహముగలవి. (అనఁగాజీవుఁడు, పరమాత్మ.) ఆరెండు ఒకేవృక్షమును (శరీరమును) ఆశ్రయించి యుండినవి. వానిలో నొకటి (జీవుఁడు) కర్మఫలమును రుచితోభుజించు చున్నది. వేఱొకటి (పరమాత్మ) భుజించక సర్వమును చూచుచున్నది.

7. ఒకేవృక్షమునందు (శరీరమునందు) భోక్తయగు పురుషుఁడు (జీవుఁడు) మునిఁగినవాఁడై (దేహము తానసెడి యభిమానమును పొంది నవాఁడై) మోహమొంది పీడింపఁబడుచున్నాఁడు. అట్టిజీవుఁ డెప్పుడు కష్టపడి పరమాత్మను, ఈజగత్తు ఆపరమాత్మచే సృష్టింపఁబడిన దనియును తెలిసికొనుచున్నాఁడో అప్పుడు దుఃఖరహితుఁ డగుచున్నాఁడు.

8. వేదములచేఁ దెలిసికొనఁబడువాఁడును, నాశనములేని వాఁడును, ఉత్తముఁడును, ఆకాశమువలె ఉపమ లేని వాఁడును అగు పరమాత్మను సకల దేవతలును, ఆశ్రయించియున్నారు. కావున అట్టిపర మాత్మను తెలిసికొనినవానికి వేదములతోఁ బ్రయోజనము లేదు; పర మాత్మ నెఱింగినవారు కృతార్థులయ్యెదరు.

9. దేనిని వేదములనియును, యజ్ఞములనియును, క్రతువులని యును, వ్రతములనియును, భూతభవిష్యద్వర్తమానము లిట్టివనియును చెప్పుచున్నవో, ఆపరమాత్మయే మాయాసహితుఁడైన ఈశ్వరుఁడని యును, అతఁడే ప్రపంచమును సృష్టించినవాఁడనియును తెలియఁదగినది. ఇంకొకఁడు (జీవుఁడు) ఆప్రపంచమునందు మాయకు లోఁబడినవాఁడై సంసారమునందు దగుల్కొనియున్నాఁడు.

10. ప్రకృతి యనునది మాయ యనియును, మాయగలవాఁడు ఈశ్వరుఁడనియును తెలియఁదగినది. ఆయీశ్వరునియొక్క అవయవ భూతము లగువస్తువులచే ఈజగత్తు వ్యాప్తమైయున్నది.

11. ఆయీశ్వరుఁడు ప్రకృతియగు మాయయందును, భిన్నభిన్న ప్రకృతిరైన యుండినట్టి మాయయందును వసించియున్నాఁడు. అతఁడు అద్వితీయుఁడు (ఒక్కఁడు). ఈప్రపంచమంతయు అతనియందే లయమగు చున్నది. అతఁడే ముక్తినొసంగువాఁడు, స్తుతింపఁబడువాఁడు; దేవుఁడు.

అట్టియీశ్వరుని చక్కఁగా విచారించి తెలిసికొనువారు ముక్తినొందుదురు.

12. ఎవఁడు దేవతలయొక్క సృష్టిస్థితులకుఁ గారణభూతుఁడో, ఎవఁడు విశ్వమును రక్షించుచున్నాఁడో, ఎవఁడు రుద్రుఁడో, ఎవఁడు సర్వజ్ఞుఁడో, ఎవఁడు పూర్వమునందు హిరణ్యగర్భుని సృజించినాఁడో, ఆ ఈశ్వరుఁడు మంగళకరమగు బుద్ధితో మమ్ముఁ బరము జేర్చునుగాక.

13. ఎవఁడు దేవతల కధిపతియో; ఎవనిని ప్రజ లాశ్రయించి యున్నారో; ఎవఁడు ద్విపాదజంతువులకును, చతుష్పాదజంతువులకును నియామకుఁడో, అట్టి దేవుని హవిస్సుచేత పూజించుచున్నారము.

14. మాయావృతమై ఏదియుఁ గనఁబడకయుండు ఈప్రపంచము నడుమ సూక్ష్ముకంటెసూక్ష్మమై యుండువాఁడును, ప్రపంచసృష్టికర్తయును, అనేకరూపములు గలవాఁడును, విశ్వమునంతయు నావరించికొని యుండువాఁడునుఅగు పరమశివుని నెఱింగినవాఁడు ముక్తినొందును.

15. ఆపరమాత్మయే ఏకాలమునందును లోకమును రక్షించు వాఁడును, విశ్వపరిపాలకుఁడును నై యున్నాఁడు ; సకలభూతములయందును గూఢముగ నుండువాఁడు; ఎవనిని ఋషులును, దేవతలును తదేకచిత్తముతో ధ్యానింతురో, అతని నెఱింగి మృత్యుపాశమును ఛేదించుచున్నారు.

16. ఘృతసారమువలె అతిసూక్ష్మమైనవాఁడును, సకలభూతములయందు గూఢమైయుండువాఁడును, విశ్వమును పరివేష్టించికొనియుండువాఁడును, శుభకరుండునగు ఈశ్వరుని తెలిసికొని సకలపాశములనుండి విడివడుచున్నాఁడు.

17. ఆపరమాత్మయే ప్రపంచమును సృష్టించినవాఁడు; మహాత్ముఁడు; ఎల్లపుడును మనుష్యులహృదయమునం దుండువాఁడు; మనస్సుచేతను, వివేకముగలబుద్ధిచేతను, జ్ఞానముచేతను తెలిసికొనఁదగినవాఁడు; ఇట్టి దేవుని తెలిసికొన్నవారు అమృతత్వము నొందుదురు.

18. ఎప్పుడు అజ్ఞానము నశించునో అపుడు పగలును రాత్రియు నుండదు. ఉన్నదనుటయు లేదనుటయు లేదు. శివుఁడుమాత్రమే యుండును. సూర్యునిచే పొగడఁదగినది. అదియే నిత్యమై అనాదిసిద్ధమై యుండుజ్ఞానము.

19. ఈపరమాత్మను మీఁదుగను, ప్రక్కను, నడుమను పట్టి కొనుటకుఁగాదు. ఇతనికి సమానమైనవస్తువు లేదు. ఇతనినామము మహాత్తయినకీర్తియే. (అనఁగా ఆపరమాత్మ 'మహద్యశుఁడు' అని చెప్పఁబడు చున్నాఁడు.)

20. ఇట్టిభగవంతుఁడు చక్షురాదీంద్రియములకు గోచరుఁడు కాఁడు; ఎవఁడును ఈపరమాత్మను నేత్రము మొదలగుఇంద్రియము లతోఁ దెలిసికొనఁడు ; హృదయగుహాయం దుండు ఈదేవుని శుద్ధబుద్ధి చేతను, విచారజ్ఞానముగలమనస్సుచేతను తెలిసికొనువారు అమృతము నొందెదరు. (ముక్తులయ్యెదరు.)

21. నీవు జననమరణములు లేనివాఁడవు. కావున సంసారభీతిగల వాఁడొకఁడు నిన్ను శరణొందుచున్నాఁడు. ఓరుద్రుఁడా! ఆహ్లాదకరమగు నీదక్షిణముఖముచేత నన్ను కటాక్షించి రక్షింపుము.

22. ఓరుద్రుఁడా! మాపుత్త్రులకును పౌత్త్రులకును దీర్ఘాయువు నిమ్ము. ఆయుస్సును వృద్ధిచేయుము. ఆవులను, గుఱ్ఱములను, వీరులగు సేవకులను కోపించి చంపకుము. మాయొక్క సదస్సునందు (యజ్ఞవాటిక యందు) నిన్నాహ్వానించి హవిస్సొసంగి పూజించెదము.

---

## పంచమాధ్యాయము.

1. నాశరహితమై, పరబ్రహ్మమై, అనంతమై, విద్యావిద్యలకు (జ్ఞానమునకును అజ్ఞానమునకును) నియామకుఁడై యుండువాఁడే పరమాత్మ. వాఁడు మోక్షహేతువగు విద్యకంటెను, సంసారహేతువగు అవిద్యకంటెను వేఱై (దేనినంటక ఆజ్ఞాధారకుఁడై) యున్నాఁడు.

2. ఆపరమాత్మ ప్రతిస్థానమునందును, సకలరూపములయందును, సర్వమును ఉత్పత్తియగుస్థలమునందును వసించుచున్నాఁడు. అతఁడు సర్వజ్ఞుఁడు. ఆదియందు తానుస్వయముగాఁ గల్గినవాఁడు. అతఁడే చతుర్ముఖబ్రహ్మను ఆదియందు జ్ఞానముగలవానినిగా సృష్టించెను.

3. మాయాత్మకమైన యీ ప్రపంచమునందు ఒక్కొక్కసృష్టిసముదాయమును నానావిధములుగా సృష్టించి, పిమ్మట సంహరించుచున్నాఁడు. మరల మరీచి మొదలగు (బ్రహ్మలను) వారిని సృజించి సర్వాధికారులనుగాఁ జేయుచున్నాఁడు.

4. సూర్యునివలె మీఁదుగను, క్రిందుగను, అడ్డముగను, సకల స్థలములందును ఎట్లు ప్రకాశించుచున్నాఁడో, అట్లు వరేణ్యుఁడును, అద్వితీయుఁడునుఅగు భగవంతుఁడైనపరమాత్మ, ఆత్మభూతమైయుండు సర్వమునందును నివసించుచున్నాఁడు.

5. ఎవఁడు దానిదానిస్వభావగుణమును పక్వము చేయు చున్నాఁడో, పక్వము కాఁగలదానిని వికాసమొందింపఁజేయు చున్నాఁడో, సత్త్వరజస్తమోగుణములను ఏర్పఱచుచున్నాఁడో, ఆ అద్వితీయుఁడగు పరమాత్మ ప్రపంచమును నియమించుచున్నాఁడు.

6. ఉపనిషత్తులయందు గూఢమైయుండుపరబ్రహ్మమును, ఏ ప్రజా పతియును, దేవతలును, ఋషులును తెలిసికొనిరో, వారందఱును తన్మ యులైరి. (పరమాత్మస్వరూపులైరి.)

7. (జీవాత్మ)కర్మమునకును కర్మఫలమునకును కర్తయైయున్నాఁడు; కర్మముచేసి దానిఫలము ననుభవించుచున్నాఁడు; మఱియు విశ్వ రూపుఁడు; త్రిగుణములు (సత్త్వరజస్తమములు) కలవాఁడు; మూఁడు మార్గములుకలవాఁడు (అనఁగా దేవయానము, పితృయానము, ధూమాదిమార్గము అనువానిని సంపాదించికొనుటకు శక్తిగలవాఁడు); పంచప్రాణములకు అధిపతి; తనస్వకర్మములతో సంచరించువాఁడు.

8. అంగుష్ఠమాత్రుఁడు; సూర్యునకు సముఁడు (తేజోరూపుఁడు); సంకల్పముతోడను, అహంకారముతోడను గూడినవాఁడు; బుద్ధిగుణ మైనమోహాదులతోడను, శరీరగుణమైన జరాదులతోడను గూడిన వాఁడు; ఈఁటెమొనయందు గ్రుచ్చఁబడిన సన్నపాటియినుపమేకువలె నుండినప్పటికిని వేఱుగాఁ గనఁబడుచున్నాఁడు. పరమాత్మకు తాను వేఱుగా జలసూర్యునివలెనున్నాఁడు. (అనఁగా జీవాత్మయు ఆపరమాత్మ స్వరూపమునకు అన్యముకాదు.)

9. ఒకరోమమును నూఱుభాగములుగాఁ జీల్చి, అందొక భాగమును నూఱుగాఁ జేసినయెడల ఎంతసూక్ష్మమో అంతసూక్ష్మముగా జీవుఁడున్నాఁడు; ఆజీవుఁడు నాశము లేనివాఁడుగ నున్నాఁడు.

10. జీవాత్మ స్త్రీయు, పురుషుఁడును, నపుంసకుఁడును కాఁడు. ఏయేదేహములయందు ప్రవేశించుచున్నాఁడో, ఆయాదేహములచేత రక్షింపఁబడుచున్నాఁడు.

11. సంకల్పముచేతను, త్వగింద్రియవ్యాపారముచేతను, చూపుచేతను, అభిలాషచేతను జీవుఁడు కర్మములను జేయుచున్నాఁడు, ఆయాకర్మానుగుణముగా దేవతిర్యఙ్మనుష్యాదిశరీరమును బొల్చుచున్నాఁడు. అన్నపానములచేతను, వర్షముచేతను శరీరాభివృద్ధి కల్గునట్లుగా (జీవుఁడు కర్మానుసారముగా ఫలమునొందుచున్నట్లు) పొందుచున్నాఁడు.

12. జీవాత్మ (దేహి) స్థూలసూక్ష్మములగు అనేకరూపములను తనగుణములచేత (విహిత, ప్రతిషిద్ధవిషయానుగుణములచేత) ఆవరించుచున్నాఁడు. ఆ క్రియకుఁ దగినగుణములచేతను, ఆత్మగుణములచేతను, ఆయారూపములకుఁ దగినవానిని చేర్చియుంచుటకుఁ గారణము నైయున్నాఁడు.

13. గహనమైన సంసారమధ్యమందు, ఆద్యంతములు లేనివాఁడును, ప్రపంచనిర్మాణకర్తయును, అనేకస్వరూపములు గలవాఁడును, ప్రపంచమునంతయు నావరించికొని యుండువాఁడునుఅగు పరమాత్మను (జీవుఁడు) తెలిసికొని, సకలపాశవినిర్ముక్తుఁడై ముక్తినొందుచున్నాఁడు.

14. ఆపరమాత్మ శుద్ధాంతఃకరణముచే నెఱుంగఁదగినవాఁడును, అశరీరి యని పేరుగలవాఁడును, భావాభావములను సృజించువాఁడును, శుభప్రదుఁడును, ప్రాణాది సకలకలలను సృష్టించువాఁడును నైయున్నాఁడు. అట్టిదేవు నెవ్వరు తెలిసికొందురో, వారు శరీరమును త్యజించుచున్నారు. అనఁగా శరీరాభిమానము లేనివారై జీవన్ముక్తులగుచున్నారు.

---

## షష్ఠాధ్యాయము.

1. ఈ బ్రహ్మచక్రమును (ప్రపంచమును) ఇట్టిదని తెలియక కొందఱు పండితులు, స్వభావమే కారణమనియును; మఱికొందఱు కాలమే కారణమనియును చెప్పుచున్నారు. వాస్తవముగా ఈ బ్రహ్మచక్రము, ప్రపంచమునందు ఈశ్వరునిమహిమచేతనే తిరుగుచున్నది. (బ్రహ్మచక్రమునుగూర్చి ప్రథమాధ్యాయము నాలవమంత్రమునఁ జూడనగును.)

2. ఆపరమాత్మ, ఈ ప్రపంచమునంతయు నియతముగా నావరించికొనియున్నాఁడు; సర్వమును దెలిసినవాఁడు; కాలమునకుఁ గర్తయైయున్నాఁడు; సకలసద్గుణములుగలవాఁడు; సర్వజ్ఞుఁడు; అతనిచేత నేసమస్త

మును నియమింపఁబడియున్నది. పృథివ్యాదిపంచభూతములును ఆపర మాత్మచేతనే ప్రవర్తించుచున్నవి.

3. ఇట్లాపరమాత్మ సర్వమును సృష్టించి, మరల ఆలోచించి ఆత్మ తత్త్వమును ప్రకృతితత్త్వముతోఁ జేర్చుచున్నాఁడు. అనఁగా సృష్ట్య నంతరము అద్వితీయమగుపరమాత్మస్వరూపముతోను, జీవేశ్వరస్వరూప ముతోను, సత్త్వరజస్తమోగుణములతోను, అవ్యక్తమహదహంకార పృథివ్యప్తేజోవాయ్వాకాశములతోను, కాలముతోను, సూక్ష్మములైన అంతఃకరణములతోను, గుణములతోను చేర్చుచున్నాఁడు.

4. గుణసహితకర్మముల నొనర్చి, వానివానికిఁ దగినస్థితులను కావించి, అవి నశించినపుడు ప్రకృతితత్త్వమునుండి వేఱైయుండునట్టి వాఁడే పరమాత్మ. ఆపరమాత్మయందు సర్వకర్మల నర్పించువాఁడు ఆబ్ర హ్మమునొంది ముక్తుఁడగుచున్నాఁడు.

5. అతఁడేఆదిపురుషుఁడు;సకలసంయోగములకు కారణభూతుఁడు; త్రికాలములచే బాధింపఁబడనివాఁడు; కాలమున కతీతమైనవాఁడు; సకలస్వరూపమైయుండువాఁడు; ప్రపంచమైయుండువాఁడు; తనబుద్ధియం దుండువాఁడు. అట్టిపురాణపురుషుని ధ్యానముచేసి, ఇట్లుధ్యానించు వాఁడు ముక్తుఁడగును.

6. అతఁడు సంసార (జగ) మునకును, కాలమునకును అవతల నుండువాఁడు; ఈప్రపంచమునంతయు నతఁడావరించియున్నాఁడు; ధర్మ మును వహించువాఁడు; అధర్మమును నాశముచేయువాఁడు; జగత్కర్త; ఆత్మయందు (అనఁగా బుద్ధిగుహయందు) ఉండువాఁడు; అమృతస్వరూ పుఁడు; సర్వమును భరించువాఁడు; అట్టిపరమేశుని తెలిసికొని, ఉపా సించువారు మోక్షమునొందుదురు.

7. వైవస్వతుఁడు మొదలగువారికంటె శ్రేష్ఠుఁడు కావున మహే శ్వరుఁ డనఁబడుచున్నాఁడు; ఇంద్రాదిదేవతలకంటె అధికుఁడు; ప్రజాపతి మొదలగువారికంటె శ్రేష్ఠుఁడు; సకలలోకములకును ప్రభువు; స్తుతింపఁ దగినవాఁడు; ఇట్టిపరమాత్మను తెలిసికొనుచున్నాము.

8. ఆపరమాత్మకు కార్యకారణములు లేవు; హెచ్చుతక్కువలు లేవు; అతనిశక్తి శ్రేష్ఠమైనదై అనేకవిధములైయున్నది. అతనిశక్తి స్వభావసిద్ధమైనది. ఆశక్తిజ్ఞానబలక్రియలతోఁ గూడినది.

9. అతనికి ప్రపంచమునందు అధికారి యెవఁడును లేఁడు; అతని రక్షించువాఁడు నెవడును లేఁడు; అతని కేకొలంతయును లేదు; అతఁడు సర్వకారణస్వరూపుఁడు; కారణపురుషులకెల్ల ప్రభువు; అతనిపుట్టించిన వాఁడును లేఁడు; అధిపతియును లేఁడు.

10. అతఁడు అద్వితీయుఁ డగుదేవుఁడు; సాలెపురుగు తనస్వభావముగాఁగలిగినదారముచే నెట్లు తన్ను పరివేష్టించికొనుచున్నదో అట్లు ప్రకృతివలన తన్నావరించికొనియుండువాఁడు; ఇట్టి భగవంతుఁడు మనకు నిత్యమైన బ్రహ్మపదము నొసఁగునుగాక.

11. ఒక్కఁడేయైనవాఁడు; సకలవస్తువులయందును గూఢమైయుండువాఁడు; సర్వవ్యాపి; సకలభూతాంతరాత్మగా నుండువాఁడు; సకలకర్మములకు ఫలమొసంగువాఁడు; సకలవస్తువులయందును వసించువాఁడు; సాక్షిపురుషుఁడు; జ్ఞానముగలవాఁడు; గుణరహితుఁడు.

12. జీవులను తనస్వాధీనమునం దుంచికొనియుండువాఁడు; అద్వితీయుఁడు; తానొక్కఁడే బీజరూపమైయుండి సర్వమునుసృష్టించువాఁడు; బుద్ధిగుహాయం దుండువాఁడు; అట్టిపరమాత్మను బుద్ధిమంతులు ప్రత్యక్షముగాఁ దెలిసికొని శాశ్వత బ్రహ్మానందమును బొందుచున్నారు.

13. నిత్యులకంటెనిత్యుఁడు; చేతనులకంటె చేతనుఁడు; తానొక్కఁడే అనేకులై నజీవులకు వారువారు కోరినవస్తువులను అనుగ్రహించుచున్నాఁడు; అట్టికారణపురుషుని సాంఖ్యయోగముచేతనే తెలిసినొనఁదగును.ఆపరమాత్మను దెలిసికొని సకలపాశములనుండివిడిపడుచున్నారు.

14. ఆ పరమాత్మయొద్ద సూర్యుఁడు ప్రకాశించుటలేదు; చంద్రుఁడును నక్షత్రములును ప్రకాశించుటలేదు; మెఱుపులును అగ్నియును జ్వలించుటలేదు; అతనివలననే సర్వమును ప్రకాశించుచున్నది. అతఁడు సర్వప్రకాశస్వరూపుఁడు.

15. అతఁడు ఈలోకమునందలి అజ్ఞానమును పోఁగొట్టువాఁడు; హంసస్వరూపుఁడు; అతఁడే జలమునందును అగ్నిరూపమైయుండువాఁడు (ప్రపంచమధ్యమం దుండువాఁడు); అంతఃకరణమునం దుండువాఁడు; ఇట్టిదేవుని ఎఱింగినవారుమాత్రమే మరణధర్మమునుండి ముక్తులయ్యెదరు (అనఁగా జననమరణములేని అమృతులయ్యెదరు).ముక్తినొందుటకు ఆత్మదర్శనముతప్ప వేఱే ఉపాయములేదు.

16. ఆపరమాత్మయే సర్వమును సృజించినవాఁడు; సర్వము నెఱింగినవాఁడు; జన్మరహితుఁడు; జ్ఞానవంతుఁడు; కాలాతీతుఁడు; సకలసద్గుణములు గలవాఁడు; సర్వజ్ఞుఁడు; ప్రకృతికిని, జీవులకును ప్రభువు; సంసారవిముక్తికిని, స్థితికిని, బంధమునకును హేతువైనవాఁడు.

17. తన్మయుఁడు; అమృతస్వరూపుఁడు; ఈశ్వరుఁడు; సర్వవ్యాపి; సర్వజ్ఞుఁడు; లోకపాలకుఁడు; శాశ్వతప్రభువు; అట్టిపరమాత్మ కంటె జగత్తును నియమించుటకు వేతెవ్వఁడును అధికారి లేఁడు.

18. ఎవఁడు ప్రపంచసృష్టికిముందు చతుర్ముఖబ్రహ్మను సృజియించి యతనికి వేదముల నొసంగినాఁడో, ఏపరమాత్ముఁడు ఆత్మజ్ఞానమును ప్రకాశింపచేయుచున్నాఁడో, ఆదేవుని మోక్షాపేక్షగల నేను శరణమొందుచున్నాఁడను.

19. అంశలు లేనివాఁడును, చేష్టలు లేనివాఁడును, శాంతుఁడును, నిరవద్యుఁడును, దూషింపఁబడనివాఁడును, నిర్మలుఁడును, సంసారసాగరమును తరించుటకు సేతువైనవాఁడును, దహింపఁబడినకట్టెలయందగ్నివలె నుండువాఁడును అగుపరమాత్మను మోక్షాపేక్షగల నేనుశరణమొందుచున్నాఁడను.

20. ఎపుడు మనుష్యులు ఆకాశమును చర్మమువలె చుట్టచుట్టుదురో, అపుడు ఆపరమాత్మ నెఱుంగక ఆధ్యాత్మికాదిదుఃఖములచే నాశమొందుదురు. (అనఁగా ఆకాశమును చాపచుట్టగా చుట్టుట మొదలగు సిద్ధులను సంపాదించుటచే జన్మసార్థకత కలుగ దనియును, పరమాత్మజ్ఞానముచేతనే కలుగు ననియును తాత్పర్యము.)

21. మిక్కిలి పరిశుద్ధమైనదియును, ఋషిగణములచే సేవింపఁదగినదియును, శ్రేష్ఠమైనదియును అగు బ్రహ్మవిద్యను, బ్రహ్మజ్ఞానియైన శ్వేతాశ్వతరుఁడను ఋషి, తపఃప్రభావమువలనను, శ్రుతులను అధ్యయనము చేసినందువలనను, ఈశ్వరానుగ్రహమువలనను మిక్కిలి పూజ్యులగు సన్న్యాసులకు బోధించెను.

22. వేదాంతమునందు పరమరహస్యమై యుండునదియును, పూర్వకల్పమునందు పరిశీలింపఁబడినదియును అగు పరబ్రహ్మవిద్యను శాంతచిత్తము లేనివానికిని, పుత్త్రుఁడు కానివానికిని, శిష్యుఁడు కానివానికిని ఉపదేశింపఁ దగదు.

23. ఎవనికి ఈశ్వరునియందు విశేషభక్తి గలదో, ఈశ్వరుని యందెట్లో అట్లే గురువునందు భక్తిగలదో, అట్టి ఉత్తమశిష్యునకు ఉపదేశింపఁబడినయర్థము లన్నియును, అనఁగా ఈ బ్రహ్మవిద్య చక్కఁగా ప్రకాశించును.

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

సహనావవతు ఇతి శాన్తిః.

శ్వేతాశ్వతరోపనిషత్తు సమాప్తము.

---

# 12. నృసింహతాపిన్యుపనిషత్తు.

భద్రం కర్ణేభి రితి శాన్తిః.

## ప్రథమోపనిషత్తు.

### 1. ఖండము.

1. మనము దేవతలమై (ప్రకాశము గలవారమై) యుండి శుభమును మనచెవులతో విందుముగాక; యజనశీలము గలవారమై యుండి మంగళమును కనులతోఁ జూతుముగాక; అంగములతోఁ గూడినమంత్రములచే దేవతలను స్తుతించి (సకలసుఖములను) పొందుదుముగాక; (నృసింహస్వామిని) స్తుతించుయోగ్యమైన ఆయువును బడయుదుముగాక; బృహస్పతివలన విని తెలిసికొనిన ఇంద్రుఁడు మనకు స్వస్తిని (శాశ్వతాయుస్సును) ఇచ్చునుగాక; సకలదేవతాస్వరూపసూర్యుఁడు మనకు స్వస్తిని (ఉపాసింపఁదగినయోగ్యతను) ఒసంగునుగాక; వజ్రాయుధముచేఁ గొట్టువడని గరుత్మంతుఁడు మనకు స్వస్తిని (పూజించుయోగ్యతను) ఇప్పించునుగాక; బృహస్పతి మనకు స్వస్తిని (శోభనమును) కృపచేయును గాక. ఓమ్శాన్తి శ్శాన్తి శ్శాన్తిః. (ఇఁక జెప్పఁబోవు విద్యానుష్ఠానమునకు విఘ్నము రాకయుండునిమిత్తము శాంతిచెప్పఁబడినది.)

2. (సృష్టికి పూర్వము) ఈ కనఁబడు పలువిధములగు జలములును ఒక్కటేయై యుండినది. ప్రజాపతి (చతుర్ముఖ బ్రహ్మ) తామరపుష్పము

నందుండి (మహావిష్ణునాభికమలమునందుండి) కలిగెను. ఆ బ్రహ్మకు ప్రపంచమును సృష్టింప నిచ్ఛగలిగెను.

ఏపురుషుఁడు దేనిని మనస్సునందు తలంచునో, దానిని వాక్కుచే జెప్పుచున్నాఁడు; దానిని కర్మతోఁ జేయుచున్నాఁడు; ఈవిషయము చెప్పఁబోవుమంత్రము (ఋక్కు) తెల్పుచున్నది.

"ఏకాలమునందు జలముండినట్లు చెప్పఁబడినదో ఆకాలమునందు బ్రహ్మకు అట్టియిచ్ఛకల్గెను; విద్వాంసులు నిశ్చయబుద్ధిచే తమహృదయమునందలి ప్రత్యగాత్మను తెలిసికొని, బ్రహ్మముయొక్క బంధువగు (బ్రహ్మమువలనఁ గలిగిన) చతుర్ముఖుని అసత్తునందు అవ్యాకృతవస్తువుగాఁ జూచెదరు (తెలిసికొనెదరు)." అని ఋక్కు.

ఇట్లు సృజింప నెంచిన ప్రజాపతివలన ప్రపంచము కలిగెను. అతఁడు తపస్సుచేసెను (మనస్సు ఇంద్రియములను ఒక్కచోటనే ఉండునట్లు చేసెను); ఇట్లుచేసి ముప్పదిరెండక్షరములుగల మంత్రరాజమైన నృసింహమంత్రమును జపించెను. అందువలన, ఈ కనంబడు సమస్తమును సృష్టించెను. కావున ఇవన్నియు అనుష్టుప్సంబంధమైనదని (పెద్దలు) చెప్పెదరు.

అనుష్టుప్నుండి ఈభూతములన్నియుఁ గలిగెను; అందుచే బ్రదికి యున్నవి; అందే లయమగుచున్నవి; ఈవిషయమునందు చెప్పఁబోవు మంత్రము కలదు.

"పైని చెప్పఁబడిన అనుష్టుప్ ప్రథానమైనదియును, శ్రేష్ఠమైనది యునై యున్నది; అనుష్టుప్ అనఁగా వాక్కు; సకలభూతములును వాక్కునం దణఁగియున్నవి; అందుండి కల్గినవి; వేదములకెల్ల ఉత్తమమైనది" అని ఋక్కు.

## 2. ఖండము.

ఆసామమంత్రముయొక్క మొదటిపాదము సముద్రములు, పర్వతములు, సప్తద్వీపములతోఁగూడిన భూమియనియును, రెండవపాదము యక్షులు, గంధర్వులు, అప్సరసలతోఁ గూడినఅంతరిక్షమనియును; మూఁడవపాదము వసువులు, రుద్రులు, ఆదిత్యులతోఁ గూడిన స్వర్గమని యును; నాలవపాదమునందు నిరంజనమై ప్రకాశమై హృదయాకాశము నందుండు బ్రహ్మస్వరూపమనియును తెలియఁదగినది. ఇట్లు తెలిసికొన్న వాఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు. మఱియు, అంగములతోను

శాఖలతోఁ గూడిన ఋక్కు, యజస్సు, సామము అథర్వము అనునివి నాలుగుపాదములై యున్నవి.

ఆమంత్రమునకు ధ్యానము ఎది? దైవము ఎది? అంగములు ఏవి? ఆయంగములదేవత లెవరు? ఛందస్సేది? ఋషి యెవఁడు? (వీనికి ఉత్తరము లిఁకఁ జెప్పఁబడును.)

3. ఖండము.

ఆ ప్రజాపతి చెప్పినదేమనఁగా:—సవితృ (సూర్య) సంబంధమైన ఎనిమిదక్షరములు గలదియును "శ్రీ" అను బీజాక్షరముతోఁ గూడిన మంత్రము పైనిచెప్పఁబడిన సామమంత్రముయొక్క ఒకఅంగము; ఇట్లె ఱింగినవాఁడు శ్రీతోఁజేరును; సకలవేదములకును ప్రణవము ప్రధానము; ఆ ప్రణవము ఆసామమున కొకఅంగము; దాని నెఱింగినవాఁడు త్రిలోకములను జయించును. ఇరువదినాల్గు అక్షరములుగల మహాలక్ష్మీమంత్రము యజుర్మంత్రము, ఇదియు ఆసామమున కొకఅంగము; దీని నెఱింగినవాఁడు ఆయుస్సు, కీర్తి, యశస్సు, జ్ఞానము, ఐశ్వర్యము, అనువీనిని పొందుచున్నాఁడు. కావున, ఈసామమును అంగములతోఁ గూడినదిగా తెలియవలయును. అట్లు తెలిసికొన్నవాఁడు అమృతత్వమును బొందును. ఈమంత్రములను స్త్రీలకును శూద్రులకును చెప్పరాదు. ముప్పది రెండక్షరములుగల సామమును తెలిసికొనవలయును. దాని నెఱింగినవాఁడు అమృతత్వమును బొందును. స్త్రీలును శూద్రులును సావిత్రి, లక్ష్మి, యజుస్సు, ప్రణవము, వీనిని జపించినయెడల గతించినమీఁద నరకమునకు బోదురు. కావున, వారికిఁ జెప్పఁగూడదు. చెప్పినవాఁడును నరకము నొందును.

4. ఖండము.

మఱియు ప్రజాపతి చెప్పునది యేమనఁగా:—సకలవేదములు, సకలభూతములు, ప్రాణములు, ఇంద్రియములు, పశువులు, అన్నము, అమృతము, సమ్రాట్టు, అనునివి యన్నియు అగ్నిగానున్నది. అట్టి అగ్ని సామముయొక్క మొదటిపాదమై యున్నది. (అనఁగా మొదటిపాదమునకును, దానిఅంగమైన ప్రణవమునకును, హృదయమంత్రమునకును అగ్ని దేవతగా నున్నది.)

ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము, అంతరాదిత్యుఁడు, హిరణ్మయపురుషుఁడు ఇవియన్నియు సూర్యుఁడై యున్నాఁడు. ఇట్లు

సూర్యుఁడు సామముయొక్క రెండవపాదమై యున్నది. (అనఁగా, రెం డవపాదమునకును, దానిఅంగమైన సవితృనకును, శిరోమంత్రము నకును దేవతగా నున్నది.

ఓషధులకును నక్షత్రములకును చంద్రుఁడు పతియై యున్నాఁడు. ఆచంద్రుఁడు సామముయొక్క మూఁడవ పాదము. (అనఁగా, సామము మూఁడవపాదమునకును, దాని అంగమైన లక్ష్మీమంత్రమునకును, శిఖా మంత్రమునకును దేవతగా నున్నాఁడు.)

బ్రహ్మ, శివుఁడు, విష్ణువు, ఇంద్రుఁడు, అగ్ని, అక్షరుఁడు, పర ముఁడు, స్వరాట్టు, ఇట్టి బ్రహ్మవస్తువు సామముయొక్క నాలవపాదమై యున్నది. (సామము నాలవపాదమునకును, దాని అంగమైన నృసింహ గాయత్రీమంత్రమునకును, కవచమంత్రమునకును, దేవతగా నున్నది.) ఇట్లెఱింగిన వాఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు.

ఆసామమంత్రముయొక్క మొదటిపాదము మొదటిశబ్దము ఉగ్రం.

| | | | |
|---|---|---|---|
| ,, | రెండవ | ,, | జ్వాలం. |
| ,, | మూఁడవ | ,, | నృసిం. |
| ,, | నాలవ | ,, | మృత్యుం. |

దీని నెఱింగినవాఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు. కావున ఈరహస్యమైన సామమును ఎవ్వరికిని జెప్పఁగూడదు. అట్లుపదేశించు నెడల శుశ్రూషచేయుపుత్రునకును, అట్టి శిష్యునకును ఉపదేశింప వలయును.

## ౬. ఖండము.

ఆసామమును క్షీరసాగరమున శయనించి యుండువాఁడును, నృసింహమూర్తియును, యోగులచే ధ్యానింపఁబడువాఁడును అగు పరమపదమని తెలియవలయును. అ ట్లెఱింగినవాఁడు అమృతత్వము నొందుచున్నాఁడు.

ఆసామమంత్రముయొక్క మొదటిపాదము అంతశ్శబ్దము వీరం.

| | | | |
|---|---|---|---|
| ,, | రెండవ | ,, | తంస. |
| ,, | మూఁడవ | ,, | హాంభీ. |
| ,, | నాలవ | ,, | మృత్యుం. |

ఇట్లు సామమును తెలిసికొనవలయును. ఇట్లెఱింగినవాఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు. కావున, సామమును వేయాచార్యునివలన వినినను వినినవాఁడు సంసారమునుండి తరించుచున్నాఁడు. ఇతరులకును ఉపదేశించుచున్నాఁడు. మోక్షమునొందుటకు అపేక్షగలవాఁడుగా నుండును. అప్పటిశరీరముతో దేవతను దర్శించుచున్నాఁడు. కాఁబట్టి ఈ మంత్రమే ఈకలియుగమునందు మోక్షమార్గమై యున్నది. కావున, ఈసామమును అంగములతోఁ దెలిసికొనవలయును. అట్లెఱుంగువాఁడు ముముక్షు వగుచున్నాఁడు. (సగుణబ్రహ్మోపాసనము మోక్షమునకు మార్గము.)

## 6. ఖండము.

ప్రాణమును ప్రణవస్వరూపముగను, ఋతముగను, సత్యముగను, పరబ్రహ్మముగను, పురుషుఁడుగను, నృసింహమూర్తిగను, కృష్ణపింగళవర్ణముగలవాఁడుగను, ఊర్ధ్వరేతస్కుఁడుగను, త్రినేత్రుఁడుగను, శంకరుఁడుగను, నీలలోహితుఁడుగను, ఉమాపతిగను;పశుపతిగను, పినాకపాణిగను, అమితకాంతియుతుఁడుగను, సర్వవిద్యేశ్వరుఁడుగను, సకలభూతనాథుఁడుగను, తపోనాయకుఁడుగను, బ్రహ్మాధిపతిగను, యజుర్వేదమునందు చెప్పఁబడిన బ్రహ్మముగను తెలిసికొనఁదగినది. ఇట్లెఱింగినవాఁడు అమృతత్వమును బొందును.

| | | | |
|---|---|---|---|
| ఆసామమంత్రముయొక్క | ప్రథమపాంతార్ధప్రథమశబ్దము | మహో. | |
| ,, | ద్వితీయ | ,, | గ్వతో. |
| ,, | తృతీయ | ,, | షణమ్. |
| ,, | చదుర్థ | ,, | నమా. |

అని తెలియఁదగినది.

ఇట్లు తెలిసికొన్నవాఁడు అమృతత్వమును బొందును. కావున, ఈసామమును సచ్చిదానందమయపరబ్రహ్మముగా నెఱుఁగఁదగినది. ఇట్లెఱింగినవాఁడు ఈలోకమునందు శ్రేష్ఠుఁడగును. కావున ఈసామమును సాంగముగా నెఱుంగఁదగును. ఇట్లు ఎఱింగినవాఁడు అమృతమును బొందును.

ప్రపంచమును సృష్టించినవారందఱును ఈసామమును తెలిసికొనియే సృష్టించిరి. కావున, దీనిని ఉపాసించువారు బ్రహ్మసాయుజ్యమును, సాలోక్యమును బొందుదురు. కాఁబట్టి ఈసామమును అంగములతోఁ దెలిసికొనవలయును. అట్లు తెలిసికొన్న వారు అమృతత్వమును బొందుదురు.

| ఆసామముయొక్క | ప్రథమపాదాంత్యశబ్దము | విష్ణుమ్. |
|---|---|---|
| ,, | ద్వితీయ ,, | ముఖమ్. |
| ,, | తృతీయ ,, | భద్రమ్. |
| ,, | చతుర్థ ,, | మ్యహమ్. |

అని తెలియఁదగినది.

నృసింహగాయత్రీమంత్రము.

శ్లో. ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం,
నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్.

ఇట్లు తెలిసికొన్నవాఁడు అమృతత్వమును బొందును. దీనిని ప్రజాపతి యెఱింగెను. బ్రహ్మస్వరూపియగు తనయందు ఈమంత్రము నెఱుంగవలయును. దీని నెఱింగినవాఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు. ఇట్లెఱింగిన స్త్రీలును, పురుషులును ఈలోకమునందుండుటకు ఇచ్ఛగలవారలను సకలైశ్వర్యములనొసంగుదురు. ఎచ్చట మృతినొందిన నప్పటికిని మరణకాలమునందు బ్రహ్మతారకమును ఉపదేశించుచున్నాఁడు. దీనివలన అమృతత్వము కల్గును. కావున సామవేదముమధ్యయందుండు ఈమంత్రమును జపింపవలయును. కాఁబట్టి ఈసామాంగమును ఎవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడే బ్రహ్మదేవుఁడు. ఇది మహోపనిషత్తు. దీనిని తెలిసికొన్న వాఁడును, ఈమంత్రమును పురశ్చరణ చేయువాఁడును, మహావిష్ణువగుచున్నాఁడు.

## ద్వితీయోపనిషత్తు.

---

### 1. ఖండము.

మృత్యువు, పాపము, సంసారము, వీనికి దేవతలు భయమొంది, బ్రహ్మయొద్దకు పరువిడి చనిరి. ఆదేవతలకు బ్రహ్మదేవుఁడు ఈముఖ్యమైన నృసింహ అనుష్టుప్ మంత్రమును ఉపదేశించెను. ఈమంత్రోపదేశము వలన దేవతలందఱును మృత్యువును,పాపమును,సంసారమునుజయించిరి. కాఁబట్టి (లోకమునందు) ఎవఁడు మృత్యువునకును, పాపమునకును, సంసారమునకును భయపడుచున్నాఁడో, వాఁడు (గురుముఖముగా) నృసింహమంత్రమును గ్రహింపవలయును. మీఁదఁజెప్పినవానిని జయించును.

(ఆమంత్రమునందలి బీజాక్షరమైన) ప్రణవమునకు, ప్రథమ మాత్ర—"అ" కారము. పృథివి, ఆకాశము, ఋగ్వేదము, బ్రహ్మ, వసువులు, గాయత్రీఛందస్సు, గార్హపత్యాగ్ని, ఇది మొదటిపాదము.

ద్వితీయమాత్ర—"ఉ" కారము. అంతరిక్షము, యజుర్వేదము, విష్ణువు, రుద్రులు, త్రిష్టుప్ఛందస్సు, దక్షిణాగ్ని, ఇది రెండవపాదము.

తృతీయమాత్ర—"మ" కారము. ద్యులోకము, సామవేదము, రుద్రుఁడు, ఆదిత్యులు, జగతీఛందస్సు, ఆహవనీయాగ్ని, ఇది మూఁడవ పాదము.

నాలవది అర్ధమాత్ర—"ఓం"కారము. చంద్రలోకము, అథర్వవేదము, ఏకఋషి (బ్రహ్మము), మరుత్తులు, సంవర్తకాగ్ని, విరాట్ ఛందస్సు, ఇది నాలవపాదము.

### 2. ఖండము.

ఒక్కొకపాదమునకును ఎనిమిదేసి అక్షరములు గలవు; ఇట్లు ఈ అనుష్టుప్ (శ్లోకము) ముప్పదిరెండక్షరములు గలది; ఈ అనుష్టుప్పుచేత సర్వమును సృజింపఁబడెను. సర్వమును దీనియందే లయమైపోయెను. దీనికి అయిదంగములు కలవు. నాలుగుపాదములును ప్రణవమును జేరి అయిదంగములు. ఓం హృదయాయనమః, ఓం శిరసేస్వాహా, ఓం శిఖాయైవషట్, ఓం కవచాయహుం, ఓం అస్త్రాయఫట్; అను నీయైదిటిలో ఒక్కొక్కటియు ఒక్కొకఅంగమునందుఁ జేరుచున్నది. ఈలోక

ములును ఒకదానికొకటి సంబంధము కల్గియున్నవి. "ఓం" అనునది సర్వమునై యున్నది. కావున, ఒక్కొకటక్షరమునకును ఇరుప్రక్కల ఓంకారము ఉంపఁబడియున్నది. ఇట్లు బ్రహ్మవేత్తలు అక్షరన్యాసములను జెప్పెదరు.

3. ఖండము.

మూలమంత్రమునకు 'ఉగ్రం' ప్రథమస్థానము, 'వీరం' ద్వితీయస్థానము, 'మహావిష్ణుం' తృతీయస్థానము, 'జ్వలంతం' చతుర్థస్థానము, 'సర్వతోముఖం' పంచమస్థానము, 'నృసింహం' షష్ఠస్థానము, 'భీషణం' సప్తమస్థానము, 'భద్రం' అష్టమస్థానము, 'మృత్యుమృత్యుం' నవమస్థానము. 'నమామి' దశమస్థానము, 'అహమ్' ఏకాదశస్థానము. ఇట్లు పదునొకండుస్థానములు. దీనినెఱింగినవాఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు. ఈప్రకారము అనుష్టుప్పువలన సర్వమును గలుగుచున్నది. నశించుచున్నది. కావున సర్వమును అనుష్టుప్పుగానే యున్నది. ఇట్లెఱింగినవాఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు.

దేవతలు ప్రజాపతినిఁజూచి యిట్లడిగిరి.

ఈమంత్రమునందు 'ఉగ్రం' అనుటకుఁ గారణమేమి? అనఁగా, ప్రజాపతి యిట్లనెను.

ఏకారణముచేత నృసింహమూర్తి తనమహిమచేత (మాయచేత) సకలలోకములను, దేవతలను, ఆత్మను, భూతములను పైకెత్తుచున్నాఁడో, ఎప్పుడును సృష్టించుచున్నాఁడో, వసించునట్లు చేయుచున్నాఁడో, గ్రహించుచున్నాఁడో, గ్రహింపఁబడునట్లు చేయుచున్నాఁడో, ఆకారణముచేత'ఉగ్ర'మని చెప్పఁబడుచున్నది. దీనికి శ్రుతియందుఁ జెప్పఁబడియుండున దేమనఁగా, "వినఁబడినదియు, గుహాయందుండునదియు,చక్రమునకు లోపలనుండునదియు, యౌవనముగలదియు, భయరహితమైనదియు, మృగరూపమై యుండునదియు, ఉగ్రమైనదియు నగుమూర్తినిస్తోత్రముచేయుము.ఓసింహమా! అట్లుస్తోత్రముచేయఁబడిన నీవు స్తోత్రము చేయువానిని సుఖింపఁజేయుము (నిన్ను స్తోత్రముచేయువారు సుఖింతురు). నీసేనలు మాశత్రువులను నాశముచేయును గాక!"

'వీరం' అనుటకుఁ గారణమేమి? బ్రహ్మ యిట్లనియె. ఏకారణముచే తనమహిమవలన సకలలోకములను, దేవతలను, ఆత్మలను, భూతముల

నుంచికొని క్రీడించుచున్నాఁడో,ఎడతెగక సృష్టించుచున్నాఁడో, త్యజించుచున్నాఁడో, వసించునట్లు చేయుచున్నాఁడో, ఆకారణముచేత చెప్పఁబడినది. దీనికి శ్రుతివీరుఁడుగను (శూరుఁడుగను, అనేకావతారములను ధరించుటవలన క్రీడించువాఁడుగను), (ఆయాయవతారములకుఁ దగిన) కర్మములను చేయువాఁడుగను, సోమయాగమునందు అధ్వర్యాద్యాది రూపుఁడుగను, బ్రహ్మాదిదేవతల కాజ్ఞాధారుఁడుగను అగుచున్నాఁడు.

'మహావిష్ణు' వనుటకుఁ గారణమేమి? ప్రజాపతి యిట్లనెను. ఏ కారణముచే సకలలోకములందును వ్యాపించియున్నాఁడో, వ్యాపించునట్లు చేయుచున్నాఁడో, మాంసపిండమునందు కలిసిన నూనెవలె సమస్తమునందును సంబంధము నొందియున్నాఁడో, ఎవనికంటె అన్యవస్తువు వేఱెద్దియు లేదో, సకలభూతములందును ప్రవేశించి యున్నాఁడో, ఆ కారణముచేత జెప్పఁబడినది. (దీనిబుఋక్కు) "ప్రజాపతి, ప్రజలతోఁగూడ మూఁడగ్నులను సేవించి పదునాఱవ తలయగు నిరాకారబ్రహ్మమాయెను."

'జ్వలంతం' అనుటకు హేతువేమి? బ్రహ్మమిట్లనియె.

ఏకారణముచేతనమహిమవలన సకలలోకములు మొదలగువానిని తనతేజస్సునుండి జ్వలింపఁజేయుచున్నాఁడో,ఆకారణముచేఁజెప్పఁబడినది. (దీనికి ఋక్కు) "సూర్యాకారుఁడుగను, సకల కర్మములకును అనుమతి నిచ్చువాఁడుగను, వ్యథ పెట్టనివాఁడుగను,ఇచ్ఛను కలిగించువాఁడుగను, శుభుఁడుగను, శోభనవంతుఁడుగను, మంగళకరుఁడుగను నున్నాఁడు."

'సర్వతోముఖమ్' అనుటకుఁ గారణమెయ్యది? ప్రజాపతి యిట్లనియెను.

ఏకారణముచే నిరింద్రియుఁడై యుండియు సమస్తమునుజూచుచు, సర్వమును వినుచు, ఎల్లయెడల పోవుచు, సర్వమును గ్రహించుచు, సర్వస్థలములయందు నున్నాఁడో, ఆకారణముచేఁ జెప్పఁబడుచున్నది. (దీనికిఋక్కు) "ఎవ్వఁడు ఒక్కఁడుగానేయుండి ఈజగత్తును సృష్టించినాఁడో, ఎవఁడు ఈభువనమునకు గోప్తయైన విష్ణువైనాఁడో, ఎవనియందు ప్రపంచమంతయు ప్రళయకాలమునందు లీనమగుచున్నదో అట్టి సర్వతోముఖునకు నమస్కారము చేయుచున్నాను."

'నృసింహమ్' అనఁగా నేమి? బ్రహ్మ యిట్లనియె.

ఏకారణముచే సకలభూతములయందు నరుఁడును, సింహమును వీర్యతమమై శ్రేష్ఠతమమైయున్నదో ఆకారణముచేఁ జెప్పఁబడుచున్నది. పరమేశ్వరుఁడు లోకహితార్థమై యీనృసింహరూపమును దాల్చెను. (దీనికి ఋక్కు) "విష్ణువు తనవీర్యముచేత సింహముగా స్తుతినిఁ బొందుచున్నాఁడు. భయములేనివాఁడు, ఎచ్చటను పోవువాఁడు, పర్వత గుహయందుండువాఁడు, తనయొక్క బ్రహ్మవిష్ణుమహేశ్వరులను త్రివిధ స్వరూపములయందుండి భువనములను వసించునట్లు చేయుచున్నాఁడు."

'భీషణమ్' అనుటకుఁ గారణ మేమి? ప్రజాపతి యిట్లనెను.

ఏకారణముచేత ఇతనిమహాప్రకాశముగల రూపమును జూచి సకలలోకములును, దేవతలును, భూతములును భయమొంది పరుగిడుచున్నవో, తాను దేనికిని భయపడక యున్నాడో, ఆకారణముచేత చెప్పఁబడుచున్నది. (దీనికి ఋక్కు) "ఇతనియొక్క భయముచేత వాయువు వీచుచున్నాఁడు; సూర్యుఁ డుదయించుచున్నాఁడు; అగ్ని చంద్రుఁడు మృత్యువు తమతమ కార్యములను జేయుచున్నారు."

'భద్రం' అని చెప్పవలసినదేమి? ప్రజాపతి యిట్లనిగెను.

ఏకారణముచేత తాను కల్యాణకరుఁడై యుండిఎల్లప్పుడును మంగళము నొసంగుచు, రోచనుఁడై, రోచమానుఁడై, శోభనుఁడై, శోభమానుఁడై, కల్యాణుఁడై యున్నాఁడో, ఆకారణముచేఁ జెప్పఁబడుచున్నాఁడు. (దీనికి ఋక్కు) దీనిశాంతిమంత్రము.

'మృత్యుమృత్యుం' అనఁగా నేమి? బ్రహ్మ యిట్లనిగెను.

ఏ కారణముచేత నీశ్వరుఁడు తనభక్తులచే స్మరింపఁబడినంతనే మృత్యువును, అపమృత్యువును నశింపఁజేయుచున్నాఁడో, ఆకారణముచేఁ జెప్పఁబడుచున్నది. (దీనికిఋక్కు) "ఎవఁడు దేవతలకు తమతమ స్వరూపమును నొసంగుచున్నాఁడో, సామర్థ్యమును నొసంగుచున్నాఁడో, ఎవ్వని మహాచక్రమును సకలదేవతలును ఉపాసించుచున్నారో, అతనికొఱకు హవిస్సు నిచ్చుచున్నాము."

'నమామి' అని యేలచెప్పవలయును? ప్రజాపతి యిట్లనియె.

ఏకారణముచేత అతనినిసకలదేవతలును, ముముక్షువులును, బ్రహ్మవాదులును, నమ్రులై స్తుతించెదరో, ఆకారణముచేతఁ జెప్పఁబడుచున్నది. (దీనికిఋక్కు) "బ్రహ్మణస్పతి యైనట్టిమంత్రమునకు దేవతలు

స్తుతించెదరు. ఆమంత్రమునందు ఇంద్రుఁడు మొదలగుదేవతలు ఉపాసన కొఱకు గ్రహములను సృష్టించుచున్నారు."

'అహమ్' అనుటకు హేతువేమి? అనఁగా బ్రహ్మ యిట్లనియె.

ఉపాసింపఁబడు ఈశ్వరుఁడు తానేయని భావింపవలయునుగాన, 'అహమ్'అని చెప్పఁబడెను. (దీనికి ఋక్కు) "నేను మొదట నున్నవాఁడను; మూర్తామూర్తమైన జగత్తునకు ముందుండినవాఁడను; ప్రాణుల నాభియందు అమృతమునకు స్థానము; నన్నెవ్వరు అన్నముగా స్వీకరించెదరో వారికి అన్న మొసంగుదును. నేను సకలభువనముగను, సూర్యజ్యోతీరూపముగను ఉన్నాను."

## తృతీయోపనిషత్తు.

"మంత్రరాజమైన అనుష్టుప్‌మంత్రముయొక్క బీజమును, శక్తిని, మాకుఁ జెప్పుము." అని దేవతలు ప్రజాపతిని అడిగిరి. దానికి ప్రజాపతి యిట్లనియె.—

ఈ నృసింహసంబంధమైన మాయ, పై మంత్రములయొక్క శక్తియైయున్నది. అది సర్వమును సృష్టించుచున్నది; రక్షించుచున్నది: సంహరించుచున్నది. కావున ఈ మాయయే శక్తి; ఇట్లు ఎఱింగినవాఁడు పాపమునుండి విడివడుచున్నాఁడు. మృత్యువును దాఁటుచున్నాఁడు. మహదైశ్వర్యసంపద నొందుచున్నాఁడు. బ్రహ్మవేత్తలు దిగువఁ జెప్పఁబడినట్లు విచారనిర్ణయము చేయుచున్నారు. ఈశక్తి హ్రస్వముగను, దీర్ఘముగను, ప్లుతముగను ఉన్నది. హ్రస్వముగా నుచ్చరించినయెడల పాపనివృత్తినొంది అమృతత్వమును పొందుచున్నాఁడు. దీర్ఘముగా నుచ్చరించినయెడల మహాసంపదను అమృతత్వమును బొందును. ప్లుతముగా నుచ్చరించినయెడల జ్ఞానవంతుఁడై అమృతము నొందుచున్నాఁడు.

దీనినిగూర్చి వేదమునం దీక్రిందివిధముగాఁ జెప్పఁబడియున్నది.

"ఎవఁడు ఋజుమార్గమునం దుండునో, సంసారసాగరమును దాఁటుటకు శక్తిగలవాఁడగునో, వాఁడు 'ఈ' శక్తిని కాపాడుచున్నాఁడు.విష్ణుశక్తి యగుశ్రీని, నరసింహశక్తి యగులక్ష్మిని,పరమేశ్వరశక్తియగు గౌరిని, బ్రహ్మశక్తియగు సరస్వతిని, సుబ్రహ్మణ్యశక్తి

యగు ఇంద్రసేనను, బ్రహ్మయోనియగు విద్యను ఆయుస్సుకొఱకు నేను శరణము నొందెదను.”

సకలభూతములకును ఆకాశము వాసస్థానము; ఏలన, ఇవి ఆకాశమునందుండి కలుగుచున్నవి; ఆకాశమువలన బ్రతికియున్నవి; కావున, ఆకాశవాచకమైన “హ” అను అక్షరము ఈమంత్రమునకు బీజము, (మూలకారణము); అని తెలియవలయును. ఇది నిదర్శనముగా వేదమునందుఁ జెప్పఁబడినది. “హంసః - పరమాత్మ, బుద్ధియందుండువాఁడు, దేవుఁడు, అంతరిక్షమునం దుండువాఁడు, యాగకర్త, యాగవేదికయందుండువాఁడు, చాఁటఁగూడని స్థలములయం దుండువాఁడు, మనుష్యునియొద్ద నుండువాఁడు, శ్లాఘ్యమైనస్థలములయం దుండువాఁడు, సత్యమునం దుండువాఁడు, హృదయాకాశమునం దుండువాఁడు, జలమునం దుపాసింపఁబడువాఁడు, వాక్కులందు ఉపాసింపఁబడువాఁడు, సత్యమునందుండి కల్గినవాఁడు, మేఘమునందుండి కల్గినవాఁడు, సత్యవస్తువు, మహత్తైనవస్తువు” అని చెప్పఁబడియున్నది.

---

## చతుర్థోపనిషత్తు.

### 1. ఖండము.

“ఓభగవంతుఁడా! మంత్రరాజమైన నృసింహానుష్టుప్‌మంత్రాంగమైన మంత్రములను మాకుఁ జెప్పుము” అని దేవతలు బ్రహ్మదేవుని అడుగఁగా, బ్రహ్మ యిట్లనిరెను.

‘ప్రణవము, సావిత్రిగాయత్రి, యజుర్లక్ష్మీగాయత్రి, నృసింహగాయత్రి, వీనిని అంగములుగాఁ దెలియఁదగినది.’ ఇట్లు తెలిసికొనినవాఁడు అమృతత్వమును బొందుచున్నాఁడు.

ఈకనంబడు సకలపదార్థములును “ఓం” అను అక్షరమై యున్నది. దానియర్థమును తెలిసికొనవలయును. ఇదివఱకు కలిగినది, ఇప్పుడుండునది, ఇఁక కలుగఁబోవునది, అంతయు “ఓం” కారమే. త్రికాలముల నతిక్రమించిన ప్రకృతియు “ఓం” కారమే. ఈజగమంతయు బ్రహ్మము. జీవాత్మయు బ్రహ్మము. ఈఆత్మ నాలుగుపాదములుగా నున్నది.

(ఒకటి) జాగ్రత్కాలమునందుండు వాఁడు; బాహ్యప్రజ్ఞ గల వాఁడు; ఏడుశక్తులు (అంగములు) గలవాఁడు; పందొమ్మిదిముఖములు గలవాఁడు; స్థూలపృథ్విని అనుభవించువాఁడు; వైశ్వానరుఁడు (అందఱ యొద్దనుండి వారిని నడుపువాఁడు) అను పేరుగలవాఁడు; ఇట్టి ఆత్మ మొదటిపాదము.

(రెండు) స్వప్నావస్థయం దుండువాఁడు; అంతరప్రజ్ఞగలవాఁడు; ఏడుసక్తులు (అంగములు)గలవాఁడు; పందొమ్మిదిముఖములు గలవాఁడు; ప్రత్యేకప్రత్యేకముగా అనుభవించువాఁడు; తైజసుఁ డనుపేరుగల వాఁడు; ఇట్టి ఆత్మ రెండవపాదము.

(మూఁడు) ఏమవస్థయందు దేనిని యిచ్ఛయించుట లేదో; ఒక స్వప్నమునైనను జూచుట లేదో; అట్టి అవస్థయగు సుషుప్తియం దుండు వాఁడు; ఏకమై యుండు వాఁడు; ప్రజ్ఞానఘనుఁడు; ఆనందమయుఁడు;ఆనం దానుభవుఁడు; చేతోముఖము గలవాఁడు; ప్రాజ్ఞుఁ డనుపేరుగలవాఁడు; ఇట్టి ఆత్మ మూఁడవపాదము. ఇతఁడే సర్వేశ్వరుఁడు, అంతర్యామి, సర్వ కారణుఁడు, భూతోత్పత్తిస్థానము, లయస్థానము.

(నాలుగు) బహిః ప్రజ్ఞము కాదు, అంతః ప్రజ్ఞము కాదు; ప్రజ్ఞము కాదు, అప్రజ్ఞము కాదు, ప్రజ్ఞానఘనము కాదు, చూఁడబడనిది; వ్యవహ రింపఁదగినది, గ్రహింపఁబడినది, చిహ్నము లేనిది, చింతింపఁగూడనిది, వ్యప దేశింపఁదగినది, ఏకాత్మప్రత్యయసారమైనది, ప్రపంచోపశమస్థానము, మంగళకరము, అద్వైతము ఇట్టివస్తువు నాలవపాదము, ఈయాత్మను తెలిసికొనవలయును.

(దీనివలన ప్రణవమహిమ చెప్పఁబడినది, ప్రణవమనఁగా ఓంకా రము. 'అ' కారము మొదటిపాదము, విశ్వాత్మ. 'ఉ' కారము రెండవ పాదము, తైజసాత్మ. 'మ' కారముమూఁడవపాదము, ప్రాజ్ఞాత్మ. ఈమూఁ డును జేరి నాలవపాదము, పరబ్రహ్మము. కావున ప్రణవము బ్రహ్మస్వ రూపము.)

## 2. ఖండము.

ఇప్పుడు సవితృసంబంధమైనమంత్రము చెప్పఁబడుచున్నది. దీనికి సావిత్రి యనిపేరు. అది గాయత్రీఛందస్సు; యజుర్వేదమందు చెప్పఁ బడినది. దానివలన సమస్తమును వ్యాపింపఁబడియున్నది.

ఆమంత్రము—'ఘృణిసూరియఆదిత్యఓమ్' అనునది. 'ఘృణి' రెండక్షరములు, 'సూరియ' మూఁడక్షరములు, 'ఆదిత్య' మూఁడక్షరములు, మొత్తము ఎనిమిదక్షరములు. ఈమంత్రము 'శ్రీం'అనుబీజాక్షరముతోఁ జేరియున్నది. దీనినెఱింగినవాఁడు మహాసంపద గలవాఁడగును. దీనికి ఋక్కు దిగువఁజెప్పబడుచున్నది.

"సఖింపఁబడనిదియు, శ్రేష్ఠమైనదియు నగు దహరాకాశమునందు వసించు ఏవస్తువును సకల దేవతలును, సకల వేదములును స్తుతించునో, దానిని తెలిసికొన్నవారికి వేదముతోఁ బ్రయోజనమేమి? దీని నెఱింగిన వాఁడు సౌఖ్యమొందును. ఈసావిత్రీమంత్రము నెఱింగినవానికి ఋగ్యజుస్సామములతోఁ బనిలేదు." (అనఁగా ఈమంత్రము విశేషమైనది.)

మహాలక్ష్మీమంత్రము ఇరువదినాల్గు అక్షరములు గలది. సత్తామాత్రమై, బ్రహ్మముయొక్క సాక్షాత్సకలశక్తియై, బ్రహ్మయొక్క కారణమాత్రశక్తియై, బ్రహ్మముయొక్క స్వస్వరూపశక్తియైయున్నది. ఆమహాశక్తి మమ్ము ప్రేరించునుగాక! ఈగాయత్రియే సర్వమునైయున్నది. దీని నెఱింగినవాఁడు సర్వకారణుండగును.

3. ఖండము.

"ఏమంత్రముచే నృసింహస్వామినిస్తుతించినచోఁ ప్రత్యక్షమగునో, ఆమంత్రమును మాకుఁజెప్పుము" అని దేవతలు బ్రహ్మదేవుని అడుగఁగా నతం డిట్లనియె.

"ఏనృసింహస్వామి బ్రహ్మస్వరూపుఁడై యున్నాఁడో, అతనికి నమస్కారము." ఇట్లు ముప్పదిరెండుమంత్రములు గలవు. ఆమంత్రము సంస్కృతమూలమగు ఉపనిషత్తునం దిట్లున్నది.

"యోహవై నృసింహో దేవో భగవాన్ యశ్చ బ్రహ్మా భూర్భువ స్సువ స్తస్మై వై నమోనమః" అని.

'యశ్చబ్రహ్మా' అనుస్థలమునందు మాత్రము దిగువ నుదహరించు శబ్దములను చేర్చికొనుచుండుట. తక్కినమంత్రము స్థిరముగ పఠించుకొనఁదగును. 1 యశ్చవిష్ణుః, 2 యశ్చమహేశ్వరః, 3 యశ్చపురుషః, 4 యశ్చేశ్వరః, 5 యాసరస్వతీ, 6 యాశ్రీః, 7 యాగౌరీ, 8 యాప్రకృతిః, 9 యావిద్యా, 10 యశ్చోంకారః, 11యాశ్చతస్రోర్ధ్వమాత్రాః, 12యేవేదా స్సాంగాస్సశాఖాః సేతిహాసాః, 13 యేచపంచాగ్నయః, 14 యాస్సప్తమహావ్యా

వ్యాతయః, 15 యేచాష్టౌలోకపాలకాః, 16 యేచాష్టౌవసవః, 17 యేచైకాదశరుద్రాః, 18 యేచద్వాదశాదిత్యాః, 19 యేచాష్టౌగ్రహాః, 20 యానిపంచమహాభూతాని, 21 యశ్చకాలః, 22 యశ్చమనుః, 23 యశ్చమృత్యుః, 24 యశ్చయమః, 25 యశ్చాంతకః, 26 యశ్చప్రాణః, 27 యశ్చసూర్యః, 28 యశ్చసోమః, 29 యశ్చవిరాట్పురుషః, 30 యశ్చ జీవః, 31 యచ్చసర్వం. మొదట చెప్పఁబడిన మంత్రముతోఁ గూడా ముప్పదిరెండు మంత్రములు.

ఈముప్పదిరెండుమంత్రములచే నృసింహస్వామిని స్తుతింపఁగా నతఁడు ప్రీతినొంది ప్రత్యక్షమయ్యెను. కావున, ఎవఁడు ప్రతినిత్యమును ఈమంత్రములచే స్వామిని స్తుతించినయెడల ఆస్వామి వానినిపొందును. అమృతత్వమును సిద్ధించును.



## పంచమోపనిషత్తు.

1. తర్వాత ప్రజాపతిని దిగువఁ జెప్పినట్లు అడిగిరి.

“సకలకామముల నొసంగునట్టిది యనియును, మోక్షద్వారమైనది యనియును, దేనిని యోగులు చెప్పెదరో, ఆమహాచక్ర మను దానిని మాకుఁ జెప్పుము” అని.

ఇట్లడిగిన దేవతలకు బ్రహ్మ యిట్లనియె.

ఈమహాచక్రము ఆఱు అరములును ఆఱుఆకులును గలది. దీనికి సుదర్శనమనిపేరు. ఆఱు ఋతువులును ఆఱుఆకులై యున్నవి. నడుమ నాభియున్నది. ఆనాభియం దీయారరములు గ్రువ్వఁబడియున్నవి. మాయ, ఆత్మను స్పృశించుటలేదు. కావున, ఈజగత్తు మాయచే నావరింపఁబడి యున్నది.

ఆచక్రము ఎనిమిది అరములును, ఎనిమిది ఆకులును గలదియై యున్నది. గాయత్రి ఎనిమిదక్షరములు గలది. దానితోఁ జేరియున్నది. కావున, బయలందు మాయచే సర్వమును ఆవరింపఁబడియున్నది. ఈ మాయ సర్వత్ర ప్రవేశించుచున్నది.

ఈచక్రము పండ్రెండుఅరములును పండ్రెండు ఆకులును గలదై యున్నది. పురుషుఁడు పదునొకండుకళలు గలవాఁడు. ఇదంతయు పురు

షుఁడే. పురుషునితోఁ జేరియున్నది. బయట మాయచే నావృతమై యున్నది.

ఈచక్రము ముప్పదిరెం డరములును ముప్పదిరెం డాకులును గలదై యున్నది. అనుష్టుప్‌మంత్రము ముప్పదిరెం డక్షరములు గలది. దానితోఁ గూడియున్నది. బయట మాయచే నాచ్ఛాదింపఁబడియున్నది.

ఈసుదర్శనచక్రము అరములచే స్థితిగల్గినది. దేవతలే అరములు. ఈచక్రము ఆకులతోఁ జేరియున్నది. ఆకులనఁగా ఛందస్సు.

2. ఇది సుదర్శనమను మహాచక్రము. దానినడుమ నాభియందు తారకము (ప్రణవము)ఉన్నది. నృసింహమను ఏకాక్షరమే అది. ఆచక్రమునం దాఱుపత్త్రములం దాఱక్షరములుగల సుదర్శనమంత్రమున్నది. ఎనిమిదాకులయందు నెనిమిదక్షరములుగల నారాయణమంత్ర మున్నది. పండ్రెండుపత్త్రములయందు పండ్రెండక్షరములుగల వాసుదేవమంత్రమున్నది. పదునాఱుపత్త్రములందు పదునాఱక్షరములు బిందుసహితమైన మాతృకాక్షరములనెడి పదునాఱుకళలున్నవి. ముప్పదిరెండుపత్త్రములందు ముప్పదిరెండు అక్షరములుగల మంత్రరాజమైన నరసింహ అనుష్టుప్ మంత్రమున్నది. ఇది సర్వాభీష్టముల నొసంగునదియును, మోక్షద్వారమైనదియును, ఋగ్యజుస్సామాథర్వములను వేదమయమైనది యును అగుసుదర్శనమహాచక్రము. దీనికి ముందుభాగమున వసువులును, వెనుక భాగమున ఆదిత్యులును, ఎడమప్రక్కను విశ్వేదేవతలును, మధ్యభాగమున బ్రహ్మవిష్ణుమహేశ్వరులును ఉన్నారు. నాభికి ఇరుప్రక్కలందును సూర్యచంద్రు లున్నారు.

ఈమహాచక్రమును తెలిసికొనెడి బాలుఁడుగాని;యౌవనస్థుఁడు గాని; మహాత్ముఁడుగను, గురువుగను, సకలమంత్రముల నుపదేశించు వాఁడుగను అగుచున్నాఁడు. ఈ అనుష్టుప్ మంత్రముచేత హోమము చేయవలయును. ఇది రాక్షసులను నాశముచేయును; మృత్యువును దాఁటునట్టి శక్తి నొసంగును. గురూపదేశమువలన గ్రహించిన ఈచక్రమును కంఠము, బాహువులు, శిఖ, అనునీస్థానమునందు ధరింపవలయును. దీనికి సప్తద్వీపములందుఁ గలభూమియే దక్షిణ. కావున దీనికై ఎంతయిచ్చినను అది దక్షిణయగును.

ఈమంత్రముయొక్కఫల మేమని యడిగిన దేవతలకు ప్రజాపతి యిట్లనియె.

3. ఈమంత్రమును ప్రతిదినమును అధ్యయనము చేయువాఁడు అగ్ని, వాయువు, బ్రహ్మ, విష్ణువు, రుద్రుఁడు, ఆదిత్యుఁడు, సోముఁడు, సత్యము, లోకము, దేవుఁడుఅగు వీరివలన పరిశుద్ధుఁ డగుచున్నాఁడు.

4. ఈమంత్రమును నిత్యమును అధ్యయనము చేయువాఁడు పాపము, మృత్యువు, గర్భహత్య, బ్రహ్మహత్య, సర్వహత్య, సంసారము, సర్వమునుండి తరించుచున్నాఁడు.

5. అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు, సోముఁడు, ఉదకము, సకల దేవతలు, సకలగ్రహములు, విషము అనువీనినన్నిటిని స్తంభనముచేయఁ గలఁడు.

6. భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము, మహాలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము అనులోకములను తక్కుంగల అతలాదిలోకములను జయించుచున్నాఁడు.

7. మనుష్యులు, దేవతలు, నరులు, గ్రహములు, యక్షులు మొదలగువారును వశులగుదురు.

8. అగ్నిష్టోమాదియాగములు చేసినంతఫలము సిద్ధించును.

9. ఋగాదివేదములను, ప్రణవమును అధ్యయనము చేసినవాఁ డగును.

10. నూఱుగుర్రు అబ్రహ్మచారులకు ఒక బ్రహ్మచారిసమము.నూఱుగురు బ్రహ్మచారులకు ఒకగృహస్థుఁడుసమము. నూఱుగురుగృహస్థులకు ఒకవానప్రస్థుఁడు సమము. నూఱుగురువానప్రస్థులకు ఒకయతి సమము నూఱుగురు యతులకు ఒకరుద్రజపము చేయువాఁడు సమము. నూఱుగురు రుద్రజపము చేయువారలకు ఒక అథర్వశిఖామంత్రము జపించువాఁడు సమము. నూఱుగురు అథర్వశిఖామంత్రమును జపించువారలకు ఒక ఈనృసింహామంత్రరాజమును జపించువాఁడు సమము. ఇట్లు ఈనారసింహమంత్రము శ్రేష్ఠమైనది. ఈమంత్రమును జపించువానికి పరమపదము కలుగును. ఆపద మెట్టిదనఁగా-ఎచ్చట సూర్యుఁడు వెలుఁగఁడో, వాయువు వీవఁడో, చంద్రుఁడు ప్రకాశింపఁడో, నక్షత్రములు ప్రకాశింపవో, అగ్నిదహింపఁడో, మృత్యువు ప్రవేశింపదో,

దుఃఖము సంభవింపదో అట్టి స్థానము. మఱియు అది సదానందమై, పరమానందమై, శాశ్వతమై, శాంతమై, సదాశివమై, బ్రహ్మాదిదేవతలచే నుతింపఁబడినదై, యోగిజనధ్యేయమై, దేనియందు యోగులు ప్రవేశించి మరలిరారో అట్టిదై యుండుస్థానము.

దీనికి ఋక్కుమంత్రము—"విష్ణు పరమపదమును ఉపాసకులు నిరంతరమును దర్శించెదరు. ఆపదము, ఆకాశమునందు విస్తారముగా నుంచఁబడిన సూర్యమండలమువలె నున్నది. ఇట్టిపగమును మేధావంతులును, జాగ్రదాద్యవస్థలు లేనివారును, బ్రాహ్మణులు నగు ఉపాసకులు సంపూర్ణముగా పొందెదఱు. నిష్కాములకే యీపదము కల్గును."

ఓమ్ శాన్తి శ్శాన్తి శ్శాన్తిః.

భద్రం కర్ణేభి రితి శాన్తిః.

నృసింహతాపిన్యుపనిషత్తు సంపూర్ణము.



([illegible] శ్రీశంకరాచార్యులు భాష్యము రచింపలేదు. మఱియు దానిసారము ఈపూర్వతాపినియందే యిమిడియున్నది.)

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారి
వావిళ్లప్రెస్సున ముద్రితము.—1950.